శ్రీ నన్నమాల సుందరరామిరెడ్డి జ్ఞాపకార్థం.

# అంకితము

★

గీ. శాంతవీరులఁ దత్త్వవిశ్రాంతమతులఁ
ద్యాగభోగధురీణుల ధర్మపరుల
ధీరచిత్తులఁ గన్నట్టి తెలుఁగుపుడమి
పసల కంకిత మీ వీరభాగవతము.

# పీఠిక

ఆంధ్రదేశచరిత్రలో పదకొండవ శతాబ్ది యుత్తరభాగము నుండి పండ్రెండవ శతాబ్ది తుదివరకును రాజకీయముగా చెడ్డకాలము. ఈ కాలమున అనగా చాళుక్యరాజ్యము దుర్బలమైనది మొదలు కాకతీయసామ్రాజ్య మవతరించి స్థిరపడువరకును అవ్యవస్థిత రాజకీయ పరిస్థితులు ఏర్పడి దేశము బహుసంక్షోభములకు ఆకరమైనది. దీనికి ప్రధానకారణములు రెండు: మొదటినుండియు తూర్పుచాళుక్యులను, పశ్చిమ చాళుక్యులకును వేంగీదేశాధిపత్యమునకై తరుచుగ జరుగు యుద్ధములు, రాజనరేంద్రుని యనంతరము నిత్యవ్యవహారమయ్యెను. రాజనరేంద్రుని కాలమునను అటుపిమ్మటను ఏకొలది కాలముపాటో యుద్ధములకు విరామము కలిగినను అది యింకొకయుద్ధమునకు నాంది మాత్రముగనే యుపచరించుచుండెను. ఆ కాలమున వెలనాడు పల్నాడు పాకనాడు కమ్మనాడు మొదలగు మండలములుగ బహుధా విభక్తమైన వేంగీదేశము, తూర్పు చాళుక్య పశ్చిమచాళుక్య యుద్ధముల ఫలితముగ క్రీడారంగమున బంతివలె అటుఇటు చేతులు మారుచు నిరంతరము రక్తసిక్తమైయుండెడిది. ఒక యుద్ధమున ప్రవహించిన నెత్తురు తడియారకముందే చక్రవర్తులు ఇంకొక యుద్ధమునకు ఆయత్తపడుచుండిరి. ఈ యుద్ధములందు ఎవరి సామంతులు వారికి ఒకప్రక్క తోడ్పడుచు, ఇంకొక ప్రక్క సమయము చిక్కినపుడు తమ ప్రభువులను సైతము త్రోసిరాజనుచు బలవంతులు తమ స్వతంత్రతను ప్రకటించుకొనుటయేగాక, ఇరుగుపొరుగు మండలములను కబళించుటకు తమలో తాము పోరాడుకొనుచుండిరి.

చక్రవర్తులకు జరిగెడి మహాసంగ్రామము లోకపంకను, మండలికులకు జరిగెడి చిన్న యుద్ధము లింకొకవంకను విజృంభించి, వేంగీదేశము ఎప్పటికప్పుడు శాంతి భద్రతలు లేక ఉపప్లవములకు ఆటపట్టయి యుండెడిది. ఇట్టి సంక్షుభిత రాజకీయ వాతావరణములో వేంగీదేశమున సంభవించిన అనేక యుద్ధములలో పల్నాటియుద్ధ మొకటి. కాని, ఇది వేంగీదేశాధిపత్యమునకై తూర్పు చాళుక్య – పశ్చిమ చాళుక్య వంశజులకు జరిగిన యుద్ధముమాత్రము కాదు. కేవల మది అనాడు పలనాటిని పాలించుచుండిన హైహాయ వంశీకులకు దాయభాగమునకై పొడమిన కుటుంబకలహము. అయిననేమి, బంధుత్వమునుబట్టియో, స్నేహధర్మమును పురస్కరించుకొనియో ఈ యుద్ధములో కళ్యాణకళచురి రాజులు, వెలనాటి దుర్జయులు, కోటరాజులు, పొలయిసలబల్లాళులు, గుడిమెట్ట చాగివారు, కాకతీయులు మున్నగు మండలాధిపతులు పాల్గొనిరి. ఈ యుద్ధకారణములను, ఇందు పోరాడిన వీరులపరాక్రమమును వర్ణించు ద్విపదకావ్యమే పల్నాటి వీరచరిత్ర. ఈ కావ్యమునుబట్టి ఆ చరిత్ర ఈ విధముగానున్నది.

ఉత్తర హిందూదేశమున పొలమాచాపురి అను పట్టణము కలదు. దానిని కార్తవీర్యార్జునవంశజుడైన అనుగురాజు పరిపాలించుచుండెను. అతడొకనాడు పురాకృత పాపములను పరిహరించుకొనవలెనను తలంపుతో, కొలువుదీర్చి విప్రులకు భూరిదానములు చేయదొడగెను. అతడిట్లు దానము చేయుచుండగ, వారి కులువేల్పయిన కనకాద్రి చెన్నకేశవు డొక వృద్ధబ్రాహ్మణ రూపమున నచ్చటకు వచ్చి, మున్ను కార్తవీర్యార్జునుడు జమదగ్నిని సంహరించిన బ్రహ్మహత్యాదోషము, దానములవలన తొలగిపోదనియు, దానిని బాపుకొనుటకు అనుగురాజు నీలికోకలు ధరించి పుణ్యతీర్థముల స్నానమాడుచు దివ్యక్షేత్రములను సేవింపవలెననియు, అతడు ధరించిన నీలికోకలు ఏ తీర్థస్నానమువలన ఎప్పుడు తెల్లబడునో అప్పుడు అక్కడ బ్రహ్మహత్యాదోషము తొలగిపోయినట్లు భావింపవలెననియు చెప్పెను.

అనుగురాజు సకుటుంబ పరివారముగా పాలమాచాపురిని వదలిపెట్టి తీర్థయాత్రలను సేవింపుచు ఆంధ్రదేశమునకు విచ్చేసి మోటుపల్లెవద్ద సముద్రస్నానము చేయగా, అతడు ధరించిన నీలి కోకలుతెల్లబడి బ్రహ్మహత్యాదోషము తొలగిపోయెను. సంతోష భరితుడైన అనుగురాజు అచ్చట దండువిడిసియుండ ఒక కారణము వలన ఊరకోటరాజగు పేరమరాజునకును అతనికిని యుద్ధము తట స్థించెను. అనుగురాజు సేనాధిపతియగు లెప్పలి నాయుడు, యుద్ధ మున పేరమరాజు నోడించి "భూమండలము నందలి రాజులందరును స్త్రీలవంటివారనియు, అనుగురాజొక్కడే రాజనామార్హుడనియు నొక బిరుదు శాసనము వ్రాయించి ఊరకోటయందు ప్రతిష్ఠించెను. ఆ వృత్తాంతము చెవిని పడినతోడనే, చందవోలురాజు అనుగురాజుపై యుద్ధము ప్రకటించెను. అనుగురాజు, మంత్రి కుమారులగు పెద్దన్న పేర్నీడులు, చందవోలురాజును ఓడించి అతనిని బందిగా గొనిరి. యుద్ధమున పరాజితుడైన చందవోలురాజు సంధిచేసుకొని, అనుగు రాజునకు తన కూతురు మైలమాదేవినిచ్చి పెండ్లిచేసి పల్నాటిసీమను ఆమెకు అరణమిచ్చెను. ఇట్లు అనుగురాజు పల్నాటిమండలమునకు ప్రభువయ్యెను.

అనుగురాజునకు మైలమ గాక విద్యలదేవి, భూరమాదేవి అను మరి యిర్వురు భార్యలుండిరి. వారిలో విద్యలదేవికి పెదమల్ల పినమల్ల బాలమలిదేవులును, భూరమాదేవికి కామరాజు, నరసింగరాజు, ఝట్టి రాజు, పెరుమాళ్ళరాజును, మైలమాదేవికి నలగాముడును జన్మించిరి. ఈ ఎనమండుగురు కొడుకులలోను నలగాముడందరికంటె పెద్ద వాడు. పెదమల్లదేవాదులు పిన్నవారు.

ఒకనాడు అనుగురాజు వేటకుపోయి మరలివచ్చుచుండగా నాగమ్మ అను నొక వనిత, తన జెట్టగామాలపాడు గ్రామమునందు అతనికి విందుచేసి మెప్పించి, తాను పల్నాటి ప్రభువుల చెంత ఏడు గడియలకాలము మంత్రిత్వము చేయునట్లొక వరమును పొందెను. ఆమె నాటినుండియు గురజాలకువచ్చి పోవుచు అక్కడి జాడల నర

యుచు నాయకులందరును తనకు విధేయులై మసలుకొనునట్లు తంత్రము నెరపుచుండెను. అనుగురాజుమంత్రి దొడ్డనాయుని కుమారుడగు బ్రహ్మన మాత్రము ఆమెను లెక్కచేయకుండుటచే ఇరువురికిని పగ వృద్ధిపొందెను.

ఇట్లు బ్రహ్మనాయునకును, నాగమ్మకును మనస్పర్ధలు పెరుగుచుండగా, కొన్నాళ్ళకు అనుగురాజు మరణించెను. మరణవేళ అతడు తన కుమారులను బ్రహ్మనాయునికి అప్పగించి వారందరు నైకమత్యమున మసలుకొనునట్లుగా అరయుచు నలగామునకు పల్నాటిపట్టము కట్టి బ్రహ్మన మంత్రిత్వము చేయవలెనని కోరెను.

అనుగురాజు కోరిక ననుసరించి బ్రహ్మన, నలగాముని పట్టాభిషిక్తునిచేసి, తాను ప్రధానియై అతనిచే పల్నాటిరాజ్యమును చక్కగా నేలింపుచుండెను. అదను వేచియున్న నాగమ్మ ఒకనాడు నలగాముని కొలువు చొచ్చి మున్ను అతనితండ్రి తన కిచ్చిన వరము చెల్లింపుమని నలగామునికోరెను. నలగాముడు నాగమ్మకు మంత్రిత్వమిచ్చి తండ్రిమాటను చెల్లించెను.

నాగమ్మ మంత్రిపదవిని స్వీకరించి నాయకురాలను బిరుదు వహించి, రహస్యముగా రాజభటులను పంపి బ్రహ్మన స్నేహితుల యిండ్లను కొల్లగొట్టించి రాజభటులు దోచి తెచ్చిన ధనరాసులను నలగామునకు చూపించి ప్రభుత్వ కోశాగారమునకు చేరవలసిన ఆ ధనము బ్రహ్మన అపహరించి తన చెలికాండ్ర యిండ్లకు తరలించెనని అతనిపై కొండెములు చెప్పి నలగాముని మనస్సు విరిచెను. నలగాముడామె మాటలు నమ్మి, బ్రహ్మనను ఎడసేయుచు వచ్చెను. నాయకురాలు తన పాచిక పారెనని మురియుచు బ్రహ్మన నలగాముల స్పర్థను మరింత పెంచుచు 'పట్టమహిషి' విజ్జలదేవి పుత్రుడైన మలిదేవునకు రాజ్యము కట్టబెట్టుటకై బ్రహ్మన తంత్రము పన్నుచుండెనని నలగామునకు చెప్పి మలిదేవుని అతని తమ్ములను చెరసాలలో వేయించెను.

బ్రహ్మన, మలిదేవాదులను చెరసాలనుండి విడిపించి పల్నాటి రాజ్యమును నలగామ మలిదేవులకు పంచి మలిదేవాదులతో గురజాల విడిచిపెట్టి, మాచర్ల పట్టణము కట్టించి మలిదేవుడు బాలుడైనందున అచ్చట తాను ఆ రాజ్యము పాలింపదొడగెను.

కొంతకాలము గడచినపిమ్మట, బ్రహ్మన మలిదేవునొక యింటి వానిని చేయుతలంపుతో కల్యాణ పురాధీశుడైన వీరసోముని కడకేగి, అతని పుత్రికయగు సిరాదేవిని, మలిదేవునకిమ్మని అడిగెను. వీర సోముడు శైవుడుకనుక, వైష్ణవమతస్థులతో వియ్యమున కంగీకరింపక బ్రహ్మన కోరికను త్రోసిపుచ్చెను. కాని కొన్నాళ్ళకు ఒక యుద్ధమున బ్రహ్మన వీరసోమునకు సాయపడి గెలిపించెను. వీరసోముడు తన పుత్రికను మలిదేవునకిచ్చి పెండ్లిచేసెను.

అనంతరము బ్రహ్మన మాచెర్లకు తరలివచ్చి మలిదేవునకు పట్టముకట్టి, మలిదేవుని పెండ్లికి నలగాముడు రానందుకు విచార పడి ఎట్లైనను దాయాదులకు పొత్తు కుదుర్చవలెననెడి ఆతురతతో గురజాలకు పయనమై వెళ్ళెను. అది గ్రహించి నాయకురాలు నల గాముని చేరి బలమైన మాచెర్ల రాజ్యము పొరుగున నున్నచో గుర జాలకు భద్రతలేదనియు, పల్నాటి సీమనంతయు నలగాముడొక్కడే పాలించు మార్గము తానాలోచించితిననియు, కోడిపందెములయెడ బ్రహ్మనకు అతి కుతూహలము కనుక ఆ మిషతో ఆతని నోడించి మాచెర్ల భాగమును చేపట్టవచ్చుననియు అతనికి బోధించెను. నలగా ముడందుల కంగీకరింపకపోయినను ఆమె సాహసించి రెండు కోడి పుంజులను తెప్పించి, బ్రహ్మన్న చూచుచుండగా అతని విడిది కెదు రుగ గరిడిలో విడిపించి పోరాడించి అందు వెనుదిరిగి పారిపోయెడి పుంజును బ్రహ్మన పుంజు అనుచు గేలిచేసెను. బ్రహ్మన, చెన్నకేశ వుని ప్రార్థింపగా, పారిపోయెడి ఆ కోడి తిరిగి గరిడిలోనికిపోయి ఆ రెండవ కోడిని చంపివేసెను. నాయకురాలది చూచి పందెము లేని వట్టి పోరుగాక ఓడిపోయిన వారు గెల్చిన వారికి తమ రాజ్యము విడిచిపెట్టి ఏడేండ్లు అరణ్యవాసముచేసి పిమ్మట తిరిగి తమ రాజ్యము

చేకొనవచ్చునని సమయమేర్పరచి కయ్యమునకు కాలుదువ్వెను. బ్రహ్మన ఆ పందెము అంగీకరించి మాచెర్లకుపోయి మలిదేవుని అనుమతిపొంది తన కోడిపుంజుతో గురజాలకు తిరిగివచ్చెను. తొలి పందెమున బ్రహ్మనపుంజు గెలిచెను. నాయకురాలు, ఆ మరునాడు మారు పందెమున బ్రహ్మన పుంజును కట్టుబోతులచేత రహస్యముగా మంత్రాక్షతలు చల్లించి చంపించెను. పందెమున బ్రహ్మన ఓడిపోయెను. నియమము ప్రకారము మలిదేవాదులు మాచెర్లను విడిచిపెట్టి మండాదికి వలస పోయిరి. నాయకురాలు చెంచుమూకలను ప్రేరేచి, మలిదేవుని ఆలమందలను కొడిపించెను. వారు అటనుండి తరలి మేడపిచేరి, ఏడ్టేలకు సమయపరిపాలనము చేసిరి.

అనంతరము తమ రాజ్యభాగ మడుగుటకు వీరసోముని మనుమడును నలగామునిఅల్లుడునునైన అలరాజును బ్రహ్మన రాయబారమంపెను. నాయకురాలు, రాయబారమును విఫలము చేయుటయే కాక, అలరాజును చంపించెను.

ఇక యుద్ధమునకాని, తమ రాజ్యము తమకు లభింపదని మలిదేవాదులు నిశ్చయించుకొని ముహూర్తము పెట్టించి దళముల నాయత్తపరచికొని కార్యమపూడి కదనరంగమున దండు విడిసిరి. నలగాముడును యుద్ధసన్నద్ధుడై, తనకు తోడైవచ్చిన వివిధ మండలాధిపతుల సైన్యములతో సమరరంగమున మోహరించి నిలిచెను. అప్పుడు నాయకురాలునకు సంధిచేసికొనవలెననెడి తహతహ పొచ్చెను. ఆమె, అన్నమరాజు, కోట కేతరాజు మున్నగు ఆప్తులను, బ్రహ్మన కడకు రాయబారమంపెను. కాని బ్రహ్మన కొడుకు బాలచంద్రుడు రాయబారమును భగ్నము చేయుటచే యుద్ధము తప్పదయ్యెను. కార్యమపూడికదనరంగమున ఇరుపక్షముల వారికిని ఘోరసంగ్రామము జరిగెను. వీరనాయకులందరును మరణించిరి. యుద్ధమున బ్రహ్మన జయించెను. జయాపజయము లెటులున్నను అనుగురాజువంశము పేర ఒక్క నలగాముడు మాత్రము మిగిలెను.

ఈ కావ్యేతివృత్తములో అనేక కల్పిత చారిత్రక విషయములు పడుగుపేకవలె అల్లుకొనియున్నవి. అందుచే ఈ కథ

యింతయు యథార్థమని నమ్ముటకు తగిన యాధారము కనుపింపదు. అందు ముఖ్యముగ అనుగురాజు, పాపపరిహారార్థము ఉత్తరదేశము నుండి తరలివచ్చి ఆంధ్రదేశమున స్థిరపడినాడనుట విమర్శసహము కాని చారిత్రకాంశము. అనగా ఉత్తరదేశమునుండి ఈ దేశమునకు తరలివచ్చిన ప్రథమ హైహయరాజు అతడే అని కవి స్ఫురింపజేయుట చారిత్రక సత్యముకాదు. అట్లే అనుగురాజు ఉత్తరదేశమున పరిపాలనచేయుచున్నప్పుడే అతని కొలువున దొడ్డనాయుడు, పెద్దన, బ్రహ్మనాయుడు, పేర్నీడు, సూర్నీడు, తెప్పలినీడు, కన్నమనీడు మున్నగు తెలుగువారుండిరని కవి తన కావ్యమున పేర్కొనుట కేవలము అసంగతము. దొడ్డనాయుడు, పెద్దన, బ్రహ్మనాయుడు, పేర్నీడు సూర్నీడు తెప్పలినీడు కన్నమనీడు మున్నగు పేర్లు అచ్చముగ తెలుగు వారివి. అంతియేకాక, అనుగురాజు అతని భార్యలైన విద్యలదేవి భూరమాదేవి, మైలమ్మ, కూతురు పేరమ్మ, కొడుకులు నలగామరాజు, నరసింగరాజు, పెరుమాళ్ళరాజు, మలిదేవుడు మున్నగువారి పేర్లుకూడ తెలుగుపేర్లే. అనగా అనుగురాజునకు పూర్వమే అతని వంశీకులు ఉత్తరదేశమునుండి ఇచ్చటకువచ్చి క్రమముగ తెలుగువారిలో కలిసి పోయిరన్నమాట. వారు ఎన్నితరములుగనో ఈ దేశమునకువచ్చి స్థిరపడియుండకపోయినచో ఇటువంటి శుద్ధదేశీయవ్యపదేశములు కుదరవు; కనుక ఈ సందర్భమున కవి చెప్పిన విషయము కొంతవరకు అనగా అనుగురాజు పలనాడును పరిపాలించుటయు అతనివద్ద దొడ్డనాయుడు, బ్రహ్మనాయుడు మున్నగువారు రాజకీయోద్యోగులుగ వ్యవహరించుటయు నిజము. మిగిలిన పూర్వోక్తభాగము కేవలము కట్టుకథ.

అనుగురాజు పూర్వీకులు తమ దేశమునుండి ఈ దేశమునకు ఎప్పుడు వచ్చిరో పలనాటను వారిపరిపాలన యెప్పుడు ప్రారంభమయ్యెనో స్పష్టముగ తెలియదు. చరిత్రకారులు ఇంతవరకును లభించిన శాసనములనుబట్టి హైహయులను గురించి తేల్చిన సారాంశమిది: హైహయవంశజులు తాము కార్తవీర్యార్జుని సంతతివారమని తమ శాసనములందు చెప్పుకొనిరి. మొదట వీరిరాజధాని పాల

మాచాపురి. దీనికింకొక పేరు జంభనాపురి. ఇది ఇప్పటి మధ్యప్రదేశ్ నందలి జబ్బల్పూరు కావచ్చును. జబ్బల్పూరును అనుకొని నాగపూర్ వరకును విస్తరించియున్న ప్రాంతమునకు చేదిదేశమని పేరు. వీరు చేదిదేశమునకు మాత్రమేకాక చాళుక్యులకాలమున కొంకణదేశమున పరిపాలన నెరపుచుండిరి. కాని కొంతకాలమునకు పరరాజుల దండయాత్రలకు నిలబడజాలక కాబోలును వీరు ఉత్తరదేశమునుండి ఆంధ్రదేశమునకు తరలివచ్చి పశ్చిమ చాళుక్యులకు సామంతులుగ కోనసీమయందును, పలనాడు నందును స్థిరపడిరి. కోన హైహయులు క్రీస్తుశకము 1128 నుండి 1209 వరకును కోనసీమను పరిపాలించినట్లు శాసనప్రమాణములుగలవు. కాని పలనాటి హైహయుల పరిపాలనా కాల ప్రారంభమునుగూర్చి అంత నిశ్చితముగా చెప్పుటకు తగిన యాధారములులేవు.

హైహయవంశజుడైన బిరుదాంకరుద్రుడను నామాంతరముగల చాగి బేతరాజు క్రీస్తుశకము 1129 వ సంవత్సరమున గురజాల త్రిమూర్తి దేవాలయమున నొక శాసనము వేయించెను. బిరుదాంకరుద్రుడను నామాంతరములేని ఇంకొక బేతరాజు పంద్రెండవ శతాబ్ది ప్రారంభమున మాచెర్ల ఆదిత్యేశ్వర దేవాలయమునకు భూదానము చేసినట్లు ఇంకొక శాసనమున్నది. ఇతడు వీరకాముని పుత్రుడు. వీరకాముడు, బేతరాజు కుమారుడు. క్రీస్తుశకము 1147 వ ప్రాంతమున కామరాజను హైహయుడొకడు పలనాడు పరిపాలించెను. ఇతనికి అనుంగు కామరాజనియు, మైలలదేవి కామరాజనియు, నామాంతరములు. విజ్జలదేవి కుమారుడు మలిదేవరాజును మైలలదేవి కుమారుడు నలగాముడును పలనాడును పరిపాలించినట్లు శాసనములున్నవి, కాని ఈ శాసనము లెప్పటివో తెలియవు.

చరిత్రకారులు వెల్లడించిన, పై యంశములనుబట్టి పలనాటి హైహయుల వంశక్రమమును మనమీవిధముగ సమన్వయించుకొనవచ్చును. పలనాడును పరిపాలించిన హైహయరాజులు ఆరుగురు. వారు చాగిబేతరాజు, వీరకాముడు, బిరుదాంక రుద్రుడను నామాంతరముగల బేతరాజు, కామరాజనియు మైలలదేవి కామరాజనియు

పేర్లుగల అనుంగుకామరాజు, నలగాముడు, మలిదేవరాజులు. వీరిలో ఇద్దరు బేతరాజులున్నారు. ఈ ఇరువురిలో ఎవరితరువాత ఎవరు పరిపాలించిరో నిర్ణయించుట అవసరము.

పలనాటి హైహయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులు. పశ్చిమ చాళుక్యనృపతి త్రిభువన మల్ల విక్రమాదిత్యుని పరిపాలనా కాలము క్రీస్తుశకము 1076–1126; ఇతడు వేంగీ దేశముపై దండెత్తి వెడలినపుడు పలనాటి హైహయరాజు తోడ్పడినట్లు చరిత్ర పేర్కొనుచున్నది. విక్రమాదిత్యుడు వేంగీ దేశముపై దండెత్తి వచ్చిన సంవత్సరము క్రీస్తుశకము 1118 అప్పుడు పలనాడును పరిపాలించుచున్న రాజు, బిరుదాంకరుద్రుడను నామాంతరముగల బేతరాజు కాడు. అతడు క్రీస్తుశకము 1129 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చెను. కనుక పండ్రెండవ శతాబ్ది ప్రారంభమున పలనాట శాసనము వేయించిన, బిరుదాంక రుద్రుడను నామాంతరము లేని బేతరాజు, పశ్చిమ చాళుక్యనృపతి విక్రమాదిత్యునకు సామంతుడనియు సమకాలికుడనియు వేంగీ దండయాత్రలో ఆతనికి తోడ్పడెననియు కాగా, ఇతడే మొదటి బేతరాజనియు, క్రీస్తుశకము 1129 వ ప్రాంతమున రాజ్యమునకు వచ్చిన బిరుదాంకరుద్రుడు, రెండవ బేతరాజనియు చెప్పవచ్చును. ఇక క్రీస్తుశకము 1147 వ ప్రాంతమున పరిపాలించిన కామరాజనియు మైలలదేవి కామరాజనియు నామాంతరములుగల అనుంగు కామరాజును, రెండవ బేతరాజును సమీపకాలస్థులగుటచే, వీరిద్దరు తండ్రి కొడుకులు కావచ్చును. అనగా అనుంగు కామరాజు, వీరికాముని మనుమడు. కాబట్టి అనుంగు కామరాజు రెండవ బేతరాజునకు కొడుకని చెప్పుటకు మరింత అవకాశము గలదు. శాసనమందు ఉదాహృతమైన ఇతని పేర్లు మూడింటిలో, అనుంగు కామరాజను పేరు, రాజ్య వ్యవహారమున ప్రాచుర్యము వహించి, క్రమముగ వాడుకలో అనుగురాజుగా మారి, అదియే స్థిరపడియుండవచ్చును. అయినచో ఇతనికి మైలలదేవి కామరాజు అను నామాంతరమున్నది కదా, ఆ మాటకు అర్థము, మైలలదేవి కొడుకైన కామరాజు, (అనగా నలగాముడు) అనికదా, కనుక ఈ

పేరు అనుగురాజునకు ఎట్లన్వయించును అను ప్రశ్న యుదయించును. అవును; ఆ పదమునకు ఈ అర్థముతప్ప వేరొక అర్థము లేనిచో అది పై సిద్ధాంతమునకు బాధకమే. కాని దానికి మైలలదేవి భర్తయగు కామరాజను మరియొక అర్థము చెప్పుకొనవచ్చును; ఇది రాధాకృష్ణుడు, సీతారాముడు మున్నగు నామధేయములవంటిది. కాబట్టి ఇతడు మైలలదేవి భర్తయగు అనుంగు కామరాజు కాని ఆమె కొడుకు నలగాముడు మాత్రము కాడని భావింపవచ్చును. అట్లుకాక ఈ అనుంగు కామరాజు నలగాముడే ఐనచో, నలగాముని తండ్రి వేరొక అనుంగురాజో లేక అనుగురాజో అయి యుండవలెనన్న మాట. కాని ఈ హైహయులవంశమున అట్టి పేరులుగల రాజు ఇంకొకడున్నట్లు కనుపింపదు. మొదటి బేతరాజు, వీరకాముడు రెండవబేతరాజులలో ఎవరికిని ఇట్టి నామాంతరములు లేవు. పోనిండు, మాటవరుసకు ఈ వేరొక అనుగురాజు మొదటి బేతరాజునకు తండ్రియో, అన్నయో కావచ్చునని ఊహించుటకైనను అవకాశములేదు. కారణమేమనగా, అనుగురాజునకు పిమ్మట రాజ్యమునకు వచ్చినవాడు అతని కొడుకు నలగాముడు కాని మొదటి బేతరాజుకాడు. కనుక అనుంగు కామరాజనువాడు ఒకడే కలడనియు, అతడు నలగాముని తండ్రియగు అనుగురాజు తప్ప వేరొకడు కాడనియు స్పష్టపడుచున్నది. క్రీస్తుశకము 1147 వ ప్రాంతమున శాసనమందు పేర్కొనబడిన అనుంగు కామరాజు అనుగురాజుకాక, అతని కొడుకైన నలగామరాజే అయినచో, ఈ శాసన సంవత్సరము అనుగురాజు గతించిన పిమ్మట నలగాముడు రాజ్యపరిపాలనము చేయుచున్న కాలములోనిది కావలెను. అనుగురాజు మరణము, నలగాముని సింహాసనాధిరోహణము, ఈ శాసన కాలమునకు సుమారు రెండు మూడు సంవత్సరములు పూర్వమైయుండు ననుకొందము. అనగా, అది 1145 కావచ్చును. అప్పటికి యుక్తవయస్కుడై పట్టాభిషేకార్హుడై యున్న నలగామునికి ఇరువది సంవత్సరముల వయస్సుండుట అసంభావ్యముకాదు. అనగా అతడు 1125 వ ప్రాంతమున పుట్టియుండవలెను. అతని జననమునకు రెండుసంవత్సరముల

పూర్వము అనుగురాజు మైలలదేవిని వివాహమాడి యుండవలెను. అనుగురాజు, పలనాటి సంపాదనము 1123వ ప్రాంతమున జరిగి యుండవలెను. అనగా 1120 ప్రాంతములనుండి పలనాడు అనుగు రాజు చేతిక్రిందనేయుండి యుండవలెనన్నమాట. కాని చారిత్రకులు పేర్కొన్న 1129 లో బేతరాజు పలనాటి రాజుగా వేయించిన శాసనము, అప్పటికి అనుగురాజు పలనాటిరాజు కాడని ఘంటాపథముగా చాటుచున్నది. కాగా 1147 శాసనమునందు ఉదాహృతుడైన అనుగు కామరాజు అనుగు రాజే అనియు, మైలల కాముడని అతనిని పిలుచుటకు కారణము, పలనాడు, మైలలదేవికి అరణముగావచ్చిన రాజ్యము కనుక, రాజ్యాధికారమున ఆమెకుగలహక్కును సూచించుటకై అనుగురాజుపేరు మైలల కాముడని పేర్కొనబడెననియు భావించుటలో పెద్ద దోసగులేదు. అసలు ఈ వంశమున తరముల నుండి కామరాజు అనునది, పురుషులకు సాధారణ నామముగా వ్యవహృతమగుచుండెననియు, అనుగు కామరాజు, నలగామరాజు, వీరకామరాజు మొదలగు పేర్లలో కానవచ్చు అనుగు, నల, వీర మున్నగు ఉపనామక శబ్దములు, ప్రత్యేకవ్యక్తి సూచకములనియు నా అభిప్రాయము. నిజము దేవుని కెరుక.

పలనాటి వీరచరిత్రయందు ప్రధానమైన చారిత్రక ఘట్టములు మూడు కలవు. అవి : (అ) అనుగురాజుయొక్క పలనాటి సంపాదనము (ఆ) మలిదేవుడు, కల్యాణరాజు కుమార్తెను వివాహామాడుట, (ఇ) కార్యమపూడి యుద్ధము. వీటిలో మొదటి దానివల్ల, వెలనాటి చోళులకును, పలనాటి హైహయులకును, పూర్వవైరము సమసిపోయినది; రెండవదానివల్ల కల్యాణరాజులకును, హైహయులకును బంధుత్వమేర్పడినది. భారత కథయందు కౌరవ పాండవులలో పాండవులు పాంచాలరాజు కుమార్తెను పెండ్లియాడుట యెట్టిదో, పలనాటి వీర చరిత్రలో, మలిదేవుడు కల్యాణరాజు కుమార్తెను వివాహమాడుట అట్టిది. కౌరవులకును పాండవులకును చాలవరకు భారత యుద్ధమునకు పూర్వమునుండియు వైరమున్నది. కురువంశములో పాండవ శాఖ, పాంచాలశాఖతో బాంధవ్యము నెరపుటవల్ల, నిరాధారులయిన

పాండవులకు బలము చేకూరినది. కౌరవులకు భయము పుట్టినది. అట్లే వెలనాటి దుర్జయులతో పూర్వవైరమున్న కల్యాణరాజులు మలిదేవునకు పిల్లనిచ్చుటవల్ల, దుర్జయుల మనుమడైన నలగామునిపక్షమునకు భయమును, వానిచే నపకృతిపొందిన మలిదేవుని పక్షమునకు బలమును కలిగినవి. కనుక కల్యాణరాజులు పలనాటి యుద్ధమున పోరాడుట, పాంచాలులు భారతయుద్ధమున పోరాడుటవంటిది. రాజనీతిధురంధరుడైన బ్రహ్మన, యీ సంబంధమును చాల దూరదృష్టితో కలిపెను. ఇందు మూడవ ఘట్టమైన పల్నాటియుద్ధమున గురజాల, మాచెర్ల హైహయశాఖలు, ప్రతిపక్షులుకాగా, బంధుత్వమును పురస్కరించుకొని గురజాల పక్షమున వెలనాటి చోళులును, మాచర్ల పక్షమున కల్యాణరాజులును పోరాడిరి. వారేకాక, అప్పటి రాజులలో కాకతీయులు, కోటవారు, హొయిసలులు; కొందరు మండలాధిపతులు కూడ పాల్గొనిరి. ఇట్లు ఈ మూడు ఘట్టములు ఇందు ప్రధానమైనవి కనుక ఇవి ఏ యే కాలములందు జరిగినవో నిర్ణయింప యత్నింతము.

ఈ చర్చను రెండు విధములుగా, అనగా, అనుగురాజు పెండ్లితోనైనను, లేదా యుద్ధ కాలనిర్ణయముతోనైనను ఉపక్రమింపవచ్చును. అనుగురాజునకు పిల్లనిచ్చిన వెలనాటి రాజు పృథ్వీశ్వరుడని, మన కావ్యమున కలదు. కాని ఆ పృథ్వీశ్వరుడెవడో నిశ్చితమైన జ్ఞానము, ఈ కావ్యమునుండి మనకు కలుగదు. ఏమనగా వెలనాటి చోళులలో పృథ్వీశ్వరుడను పేరుగలరాజు ఒక్కడేకలడు. పదమూడవ శతాబ్ది ఆదిలో ఆ వంశము అతనితోడనే అస్తమించెను. అతడు పల్నాటి యుద్ధమున పాల్గొన్న కాకతీయులకు కాని, లేదా, కోటరాజులకుకాని, సమకాలికుడునుకాడు; పూర్వుడునుకాడు. అందువల్ల కేవలము ఈ కావ్యమునగల ఆధారములనుబట్టి, అనుగురాజు వివాహము ఎప్పుడు జరిగెనో, నిశ్చయజ్ఞానము కుదుర్చుకొనుటకు వీలులేదు. అట్లే మలిదేవునకు పిల్లనిచ్చిన కల్యాణ సోమేశ్వరుడెవరో నిశ్చయముగ చెప్పుటకు అవకాశములేదు. కల్యాణపురమును పరిపాలించిన సోమేశ్వరులు అయిదుగురున్నారు. వారిలో, ఏ సోమేశ్వ

రుడు మలిదేవునకు తన కుమార్తెనిచ్చెనో చెప్పుటకు తగిన ఆధారములు ఈ కావ్యమున కనుపింపవు. కనుక యుద్ధములో పాల్గొన్న రాజుల కాలమునుబట్టి యుద్ధకాలమును నిర్ణయించుట సులభము. యుద్ధ కాలమునుండి వెనుకకు వెళ్ళి, హైహాయులకు దుర్జయుల తోను, కల్యాణపుర రాజులతోను ఎప్పుడు చుట్టరికము కలసినదో నిర్ధారింపవచ్చును.

ఈ యుద్ధమున నలగాముడు తనకు సాయమురమ్మని "ధరణి కోట పురికి దక్షుడైనట్టి, భీమదేవుండను పృథ్వీశునకును, వీరప్రతాపుడౌ వీరసేనునకును "లేఖలు వ్రాయగా" కదియ తొమ్మిదివేల కాలరిబలట్ల, నమ్మదగినయట్టి నాయక చయము, ఒక వేయి అశ్వాల నొనర ప్రతాప రుద్రుడు పంపించెను. యుద్ధను నివారించుటకు నలగాముని పక్షమున కోట కేతన్న, బ్రహ్మనతో రాయబారము నెరపెను. కనుక ఈ యుద్ధములో నలగామునకు తోడ్పడిన ప్రధాన చారిత్రక పురుషులు ముగ్గురు. వారు, కాకతీయ ప్రతాపరుద్రుడు, ధరణికోట భీమదేవుడు, కోట కేతన్న. వీరిలో భీమరాజును కేతన్నయును తండ్రి కొడుకులు. కాకతీయులలో ఇద్దరు ప్రతాపరుద్రులు కలరు. వీరిలో మొదటి ప్రతాపరుద్రుడు రెండవ ప్రోలరాజునకు కొడుకు. ఇతని అసలు పేరు రుద్రదేవ మహారాజు. ఇతని పరిపాలనా కాలము క్రీస్తుశకము 1158-1196; రెండవ ప్రతాపరుద్రుడు ఇతనికి సరిగా నూరుసంవత్సరముల పిమ్మట రాజ్యమునకు వచ్చి క్రీస్తుశకము 1323 వరకును పరిపాలించెను. అతడు రుద్రమదేవికి దౌహిత్రుడు. ఈ ఇద్దరిలో ఏ ప్రతాప రుద్రుడైనను, నలగామునకు యుద్ధమున తోడ్పడి యుండవచ్చును. అగుచో, ఆ ప్రతాపరుద్రుడెవడో నిర్ణయించుట ఎట్లు? పల్నాటి యుద్ధమున నలగామునికి బాసటగా నిలిచిన ధరణికోట భీమరాజునకు, ఏ ప్రతాపరుద్రుడు సమకాలికుడగునో, అతడే ఇతడు కావలయును. కనుక ధరణికోట రాజుల చరిత్ర కొంత విచారింతము. ధరణికోట వంశమునకు కోటవంశమనిపేరు. కోట వంశములో ఇద్దరు భీమ రాజులు, ఇద్దరు కేతరాజులుగలరు మొదటి భీమరాజు కొడుకు మొదటి కేతరాజు. మొదటి కేతరాజుకొడుకు రెండవభీమరాజు. రెండవ భీమ

రాజు కొడుకు రెండవ కేతరాజు. అనగా భీమరాజు, కేతరాజు పేర్లతో తండ్రి కొడుకుల జంటలు రెండు కల వన్నమాట. ఈ రెండుజంటలలో ఏ జంటకు పల్నాటి యుద్ధముతో, ప్రమేయమున్నదో పరిశీలింప వలెను. మొదటిజంటలో మొదటి కేతరాజు, తన తండ్రి మొదటి కేతరాజు అనంతరము రాజ్యమునకు వచ్చి క్రీస్తుశకము 1153 వ సంవత్సరమున అస్తమించెను. కనుక అతడు క్రీ. శ. 1159 లో రాజ్యమునకు వచ్చిన మొదటి ప్రతాపరుద్రునకు సమకాలికుడు కాడు. ఈ కోట కేతరాజు కుమారుడు రెండవ భీమరాజు తండ్రి అనంతరము క్రీ. శ. 1153లో రాజ్యమునకువచ్చి 1182 వరకును పరిపాలించెను. ఆసంవత్సరమే అతనికొడుకు రెండవ కేతరాజు పట్టాభిషిక్తుడయ్యెను. కాని ఈ తండ్రికొడుకులు మొదటిప్రతాపరుద్రునకు సమకాలికులు కనుక మొదటి ప్రతాపరుద్రుడే, నలగామునకు తోడ్పడిన కాకతీయ చక్రవర్తి.

ఈ మొదటి ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1182 వ సంవత్సరమున దిగ్విజయ యాత్రలుచేయుచు ధరణికోట రాజ్యమును వశపరుచుకొని రెండవ కేతరాజును సామంతునిగ చేసుకొని, పట్టాభిషిక్తుని కావించెను. రెండవ కేతరాజు క్రీ. శ. 1182 న ధరణికోటకు ప్రభువయ్యెను. కనుక అంతవరకును అతనితండ్రి రాజ్యమును పరిపాలించుచుండెను. అనగా అతని పరిపాలనా కాలము క్రీ. శ. 1153–1182; ఈ కాలములోనే పల్నాటి యుద్ధము జరిగినది. ఈ యుద్ధము. క్రీ. శ. 1153–1182 ల మధ్య ఎప్పుడోకాక, క్రీ. శ. 1181–82 ల మధ్య జరిగెనని నిశ్చయముగ చెప్పవచ్చును. యుద్ధకాలము నాటికి ఈ భీమరాజు ధరణి కోటను పరిపాలించు చుండెను. కనుకనే, కవి "ధరణికోట పురికి దక్షుడైనట్టి, భీమదేవుం డను పృథ్వీశునకు" అని పేర్కొనెను. నలగాముడు, యుద్ధమున తనకు సాయమురమ్మని ఆతనికి లేఖ వ్రాసెను. అందుచేత, ఈ భీమరాజు, ధరణికోటకు రాజుగా నున్నప్పుడే పల్నాటి యుద్ధము జరిగెనను టు స్పష్టము. ఇతడు క్రీ. శ. 1182 వ సంవత్సరము నాటికి ధరణి కోటకు రాజుకాడు. నాటికి రాజ్యమునకు వచ్చినవాడు ఇతని కొడుకు

రెండవ కేతరాజు. కనుక పల్నాటి యుద్ధము, క్రీ. శ. 1182 పూర్వమే జరిగియుండవలెను. అయినచో ఇది ఎంతకు పూర్వమని ప్రశ్న. మొదటి ప్రతాపరుద్రుడు క్రీ శ. 1182 లో ధరణి కోటపై దండెత్తి, రెండవ కేతరాజు నోడించి, తనకు సామంతునిగా సింహాసనమున నిలిపెనుకదా! మరి అది, రెండవ కేతరాజు తండ్రి భీమరాజు చనిపోయిన పిమ్మటనే తటస్థించెనని భావించుట పొరపాటు కాదు భీమరాజు పల్నాటియుద్ధమున పాల్గొనెను కనుక అతడు ఆ యుద్ధముననే మరణించుటయు, పిమ్మట అతని కొడుకునకు పట్టాభిషేకము జరుగుటయు సంభావ్యము. తండ్రి మరణించుట, కొడుకు పట్టాభిషిక్తుడైన క్రీ. శ. 1182 లో, కావచ్చును, లేదా అంతకు పూర్వము అనగా క్రీ. శ. 1181 లో, కావచ్చును. కనుక పల్నాటి యుద్ధము క్రీ. శ. 1181–1182 ల మధ్యకాలమున జరిగియుండునని ఊహించుట అసమంజసముకాదు. యుక్తులు వేరైనను శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారును యుద్ధకాలమును ఇట్లే నిర్ణయించిరి. శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మగార్ల అభిప్రాయమును ఇదియే.

ఈ యుద్ధమునకు పూర్వము కొన్నేండ్ల క్రిందట మలిదేవునకు వివాహము జరిగినది. అతనికి పిల్లనిచ్చిన మామగారు, కల్యాణపురాధీశ్వరుడైన వీరసోమేశ్వరుడెవరో నిర్ధారింపవలెను. కల్యాణపురమును పరిపాలించిన రాజులలో, చాళుక్య వంశజులైన సోమేశ్వరులు నలుగురున్నారు. ఆ నల్గురిలో, మూడవవాని అనంతరము, ఆ రాజ్యమును కలచురి వంశజుడైన బిజ్జలుడు ఆక్రమించుకొనెను. బిజ్జలునకు పిమ్మట, అతని కొడుకు సోమేశ్వరుడు రాజ్యమునకువచ్చి కొన్నేండ్లు పరిపాలించెను. ఈ సోమేశ్వరునకు నిశ్శంకమల్ల సంకమ, వీర నారాయణ ఆహవమల్లు, సింహుడు, వజ్రుడు అను నల్గురన్నదమ్ములుండిరి. వీరిలో మూడవవాడును, కలచుర్యరాజులలో కడపటివాడును అగు సింహుని క్రీ. శ. 1183 లో ఓడించి, చాళుక్యవంశజుడైన నాల్గవ సోమేశ్వరుడు తన తండ్రినాటి రాజ్యమును మరల సంపాదించెను. ఇతనితో పశ్చిమ చాళుక్యరాజ్యమంతరించింది. దీనినిబట్టి కల్యాణపురమును

అయిదుగురు సోమేశ్వరులు పరిపాలించిరి. వీరిలో మొదటి ముగ్గురును కట్టకడపటి వాడును చాళుక్య వంశజులు. మిగిలిన సోమేశ్వరుడు కల చురవంశస్థుడు. ఈ అయిదుగురిలో ఆఖరువాడు క్రీ.శ. 1183లో రాజ్యమునకువచ్చుటచే, అతనికి పల్నాటియుద్ధముతోగాని, లేదా మలిదేవుని పెండ్లితోగాని ప్రసక్తియేలేదు. ఇక మిగిలిన నల్గురిలో, మొదటి ముగ్గురిలో మూడవ సోమేశ్వరుడు క్రీ. శ. 1126–39 ల మధ్య కాలమున రాజ్యము చేసెను. కావ్యమునుబట్టి మలిదేవుని పెండ్లియును కోళ్ళపందెమును ఒక సంవత్సరముననె జరిగినట్లు తెలియుచున్నది. పందెమున ఓడిపోయిన మలిదేవాదులు ఏడేండ్లగడువు చెల్లించి పిమ్మట ఏడునెలలకు తమరాజ్యము తమకిమ్మని అల రాజును నలగామునికడకు రాయబార మంపిరి. కనుక మలిదేవుని పెండ్లి, యుద్ధమునకు పూర్వము ఎనిమిది యేండ్లనాడు అనగా క్రీ. శ. 1173–74 ల మధ్య, మూడవ సోమేశ్వరుని పరిపాలనానంతరము ముప్పది ఆరేండ్లకు జరిగినది ఆ కాలమున కల్యాణ రాజ్యమును పరిపాలించుచున్న రాజు, కలచుర్య సోమేశ్వరుడు. అతని పరిపాలనా కాలము క్రీ. శ. 1167–1177 కనుక అతడే మలిదేవునకు తన, కూతునిచ్చిన మామ. అతనికి నల్గురు తమ్ములున్నట్లు ఈ కావ్యమును చరిత్రయును పేర్కొనుటబట్టి ఇతడే అతడని మరింత దృఢముగా అనుకొనవచ్చును.

ఇక అనుగురాజునకు పిల్లనిచ్చిన చందవోలు పృథ్వీశ్వరుడెవరో పరిశీలింతము. చందవోలుపృథ్వీశ్వరుడనగా చందవోలును పరిపాలించిన రాజు, లేదా పృథ్వీశ్వరుడను పేరుగల చందవోలు రాజు. చందవోలు, ఇప్పటి గుంటూరు జిల్లా, బాపట్లతాలూకాలోని గ్రామము. దీని పూర్వనామము ధనదుపురము. ఈ రాజ్యమునకు వెలనాడని పేరు. దీనిని క్రీ. శ. 1080—1203 ల మధ్యకాలములో దుర్జయవంశజులు పరిపాలించిరి. వీరు తూర్పుచాళుక్యచోళులకు సామంతులు. చాళుక్యచోళులకు సామంతులుగా, వెలనాటిని పరిపాలించిరి కనుక వీరికి వెలనాటిచోళులని పేరు. వెలనాటిచోళరాజ్య

మునకు మూలపురుషుడు మొదటి గొంకయ. కాబట్టి వీరిని గొంకరాజులని కూడ చరిత్రకారులు పేర్కొనిరి.

ఈ వెలనాటి చోళులలో పృథ్వీశ్వరుడను పేరుగలరాజు ఒకడున్నాడు. అతడు క్రీ. శ. 1203 వ సంవత్సరమున, నెల్లూరు మనుమసిద్ధి కుమారుడు తిక్కరాజు చేతిలో మరణించుటతో, వెలనాటి చోళరాజ్య మంతరించినది. అనగా ఇది పల్నాటి యుద్ధమునకు పిమ్మట ఇరువదేండ్లకు పైమాట కనుక ఇతనికిని, అనుగురాజునకును సంబంధమేలేదు. పలనాటి హైహయులతో చుట్టరికము కలుపుకొన్న వెలనాటి చోళరాజు ఎవడైనను, అతడు, అనుగురాజునకు సమకాలికుడు కావలెను. కాని అనుగురాజు కాలమిది అని స్పష్టముగా తెలియదు; కనుక అతనికి పిల్లనిచ్చిన వెలనాటి రాజు ఎవరో కనుగొనుటకు పరోక్షమార్గము తప్ప, వేరు ఆధారము లేదు. అనుగురాజు భార్య మైలమాదేవి వెలనాటి చోళుల ఆడుపడుచు. నలగాముడు ఆమె కొడుకు. మలిదేవుడు అతని సవతితల్లి కుమారుడు; తమ్ముడు; మలిదేవుని పట్టాభిషేకమును, వివాహమును ఒక సంవత్సరముననే జరిగినవని కావ్యమున కలదు. అనగా అది క్రీ, శ. 1173–1174 ల మధ్యకాలము. అప్పటికి మలిదేవునకు ఇరువదేండ్లున్న వనుకొన్నచో, అతడు క్రీ. శ. 1153–54 ల మధ్యకాలమున పుట్టియుండవలెను. మలిదేవుని పట్టాభిషేకమునకు పూర్వమే అతని అన్న నలగాముడు, తండ్రి అనుగురాజు మరణానంతరము రాజ్యమునకు వచ్చి కొంతకాలము పరిపాలించెను.

అతడు రాజ్యమునకు వచ్చునాటికి తనకు తానై పరిపాలించగల ప్రౌఢవయస్కుడైయుండెనని కావ్యమునుబట్టి గ్రహింపవచ్చును. అగుచో, అతనికి అప్పటికి అథమపక్షము పాతికేండ్లున్నవని అనుకొన్నచో అతడు, క్రీస్తుశకము 1148–49 ల మధ్యకాలమున జన్మించియుండును. కనుక అనుగురాజు మైలమాదేవుల వివాహము, అంతకు పూర్వము రెండు మూడేండ్లక్రితము అనగా, క్రీ. శ. 1146–47 ల మధ్య ప్రాంతమున జరిగియుండవలెను. ఆ కాలమున చందవోలును పరిపాలించుచున్న వెలనాటిచోళుడు రెండవ గొంకయ. అతని

పరిపాలనాకాలము క్రీ శ. 1126-1161; కాగా ఈ వెలనాటి రెండవ గొంకయే, అనుగురాజునకు తన కూతురు మైలమాదేవినిచ్చి పెండ్లిచేసెను. ఈ రెండవ గొంకయ క్రీస్తుశకము 1147 వ నాటి శాసనమున ఉదాహృతమైన అనుంగుకామరాజనియు, కామరాజనియు నామాంతరములుగల మైలలదేవి కామరాజునకు సమకాలికుడని, దీనిని బట్టి స్థిరపడుచున్నది. కనుక ఆ అనుంగు కామరాజును ఈ అనుంగు కామరాజును ఒక్కడే అనియు శాసనమున పేర్కొనబడిన మైలల దేవి కామరాజు అను పదమునకు మైలమాదేవి భర్తయగు కామ రాజని అర్థమనియు మరింత స్పష్టముగా చెప్పవచ్చును. కాగా ఈ పల్నాటి వీరచరిత్ర ముప్పదియారు సంవత్సరముల కాలము. రెండు తరముల మధ్య వర్తించిన కథావృత్తాంతము.

మరి, పలనాడును, అనుగురాజునకు పూర్వీకులైన హైహ యులు పరిపాలించియుండగా దానిని రెండవగొంకయ, దానిని అనుగురాజునకు స్త్రీ ధనముగా ఇచ్చెననుట అసంగతము కాదా అని ప్రశ్నింపవచ్చును. దానికి నా యూహ ఇది: పలనాటి హైహయులు పశ్చిమ చాళుక్యులకును, వెలనాటిచోళులు తూర్పు చాళుక్యులకును సామంతులు. ఈ ఇరుశాఖలవారును, వేంగీదేశ ఆధిపత్యమునకై, నిరంతరము పెనగులాడుచునే యుండిరి. ఈ యుద్ధములలో ఎవరి సామంతులు వారికి బాసటగా నిల్చి తోడ్పడుచుండిరి. కనుక పశ్చిమ చాళుక్యులకు తోడ్పడినందుకో, మరి యే కారణముననో వెలనాటి హైహయులు తమ రాజ్యమును కోల్పోయియుందురు. క్రీస్తుశకము 1135 వ సంవత్సరమున గోదావరీ తీరమున తూర్పు చాళుక్యులకును, పశ్చిమ చాళుక్యులకును జరిగిన సంగ్రామమున, పశ్చిమ చాళుక్యు లకు పలనాటి హైహయులును కోనసీమ హైహయులును తోడ్ప డగా, రెండవ గొంకయ తూర్పు చాళుక్యులకు బాసటగా నిల్చి, సైన్యమునకు నాయకత్వము వహించి, పశ్చిమ చాళుక్యుల వేంగీ దేశాధిపత్యమును అంతరింపచేసెను. దీనికి సంతసించి తూర్పు చాళుక్యుడైన ఇమ్మడి కులోత్తుంగ చోడుడు, మహేంద్రగిరి శ్రీశైల మధ్యప్రాంతమునకుగూడ రెండవ గొంకయను అధిపతిని కావించెను.

ఇది కన్నె[ర్రగానున్న మండలాధిపతులు అతని అధికారమును ఎడనెడ ధిక్కరించుచు తిరుగుబాటులు చేయుచునేయుండిరి. ఆ తిరుగుబాటులను అణచి రెండవ గొంకయ, తన రాచరికమును పట్టుదిట్టము చేసికొనుటకు ఇరుగుపొరుగుననున్న ధరణికోట వారితోడను, పలనాటి హైహయులతోడను చుట్టరికములు కలుపుకొనెను. ఇట్టి రాజకీయ వైవాహికబాంధవ్యములు ఆకాలమున పెక్కు జరిగెను.

ఆంధ్రదేశములో పూర్వరాజ్యములను సామ్రాజ్యములను నాశముచేసి కొత్తరాజ్యములను క్రొత్తసామ్రాజ్యములను సృష్టించిన మహాయుద్ధములు అనేకము జరిగినవి. వాటివల్ల ప్రజలకు ఏమి యిక్కట్లు మూడెనో, ఎవరు ఎట్టి క్షోభ అనుభవించిరో, అప్పుడు సజీవులై యున్నవారికి తప్ప, ఇటీవలి వారికి ఏమియు తెలియదు. అసలు చాల యుద్ధములు మనకు జ్ఞప్తిలోనే లేవు. చరిత్రకారులు, పరిశోధనలు చేసి "ఈ రాజ్యము ఈ విధముగా వెలసెను; ఈ విధముగా అస్తమించెను" అని చెప్పిననేతప్ప, మనకు ఆ కథలపట్ల ఆస్థయే కల్గదు. చారిత్రక రంగమునుండి, ఆ యుద్ధముల ఆ రాజ్య పతనముల వృత్తాంతము సారస్వతరంగమునకు అవతరించి కావ్యగతములైనప్పుడు వాటిపట్ల మనకు అంతకంటె నెక్కుడు ఆసక్తి కలుగును. మనకు కాబట్టని వస్తువునెడ ఆస్థకలిగించెడి శక్తియే కావ్యమునకుగల ఇంద్రజాల మహిమ. అది ఇష్టములేని పదార్థముమీదనైనను రుచి కలిగించెడి ఔషధశక్తివంటిది. కావ్య సామాన్య లక్షణమైన ఈ గుణమునకే రసమని పేరు.

కావ్యకళకు రసానందమనెడి పరనిర్వృతి పరమ ప్రయోజనమనుట సత్యమేగాని, ఈ కళకు అవాంతర ప్రయోజనములు లేకపోలేదు. "కావ్యం సద్యఃపరనిర్వృతయే" అనెడి సిద్ధాంతముతోపాటు "ఉపదేశయుజే" అనెడి లక్షణముకూడ, నిర్దేశింపబడినది. కనుక కావ్యము ప్రజలకు సదుపదేశముచేయు బాధ్యతనుగూడ నిర్వర్తించునని చాలకాలము క్రితమే ఆలంకారికులు నిర్వచించిరి. కావ్యోపదేశమనగా, సదసద్వివేచన, ధర్మాధర్మవివేకము, పుణ్యపాప విభేదము మొదలగువాటినిగురించి జ్ఞానమునుకలిగించి మంచియెడ ఆదరముపుట్టు

నట్లు చేయుట. అట్టిది, వ్యక్తికి సంఘమునకు గూడ ఆవశ్యకమే. అట్టి ఉపదేశమునకు తోడు, 'ఇది మా జాతి, ఇది మా మతము, ఇది మా దేశము' అనెడి స్వాభిమానమును పెంపొందించి తమ జాతికి, తమ మతమునకు, తమ దేశమునకు ప్రాణప్రతిష్ఠ చేసి దానికి క్షయము రాకుండ కాపాడి పోషించిన దేశీయుల చరిత్రను నిరంతరము స్మరణకు తెచ్చుచు అన్ని కాలములవారిని పురుష కార్యోన్ముఖులనుగా జేయుటకూడ, కావ్యోపదేశములో ఒక భాగము. ఈ యుపదేశము వాచ్యమై రామణీయకభంజకమైనచో, తిరస్కార్యమేకాని, అట్లుగాక వ్యంగ్యముగా కళామర్యాదానురూపముగా ఉన్నపుడు శిరోధార్యమే యగును. అనగా ఈ కావ్యోపదేశప్రక్రియ, ఉపన్యాసము వలె సాగకూడదు. మొదట కావ్యమునకు కావ్యత్వము సిద్ధించిన తరువాతనే ఉపదేశము ఆనుషంగికముగా జరుగవలెను. అట్లు కాక ఉపదేశమే ప్రధానమై కావ్యత్వమే గౌణమైనచో, అది కావ్యమే అనిపించుకొనదు.

కావ్యోపదేశము ఆచరణయోగ్యము కావలెనన్నచో, ఆయా దక్షమునకై కావ్యమునందు చిత్రింపబడిన ఆలంబన విభావము (పాత్రలు) మానవసంఘమునకు అతీతమూర్తులుగా ఉండరాదు. లోకాతీతులైనవారి చరిత్రలకు దూరమునుండి నమస్కరింతుమేగాని, అనుకరించుటకు ప్రయత్నింపము. కావుననే, ఆచరణయోగ్యమైన సదుపదేశమునకు సాంఘిక చారిత్రక కథలు ఎక్కువగా ఉపకరించును. ఏ దేశమందైనను, ఏ కాలమందైనను తలచినమాత్రమున 'ఓహో' యని తల లూపింపజాలు సాంఘిక చారిత్రక వృత్తాంతములెన్నో జరుగుచుండును. మనలోగూడ పుణ్యాత్ములగు కొందరు కవులు అట్టి గాథలను కొన్నిటిని కావ్యములుగా రచించి, ఆంధ్ర సాహిత్య కేదారమున పంటలు పండించిరి. ఆ కావ్యములను ఒకరు చదువగా వినుటగాని, లేదా మనమే చదువుకొనుటగాని కాకుండ, తంబుర శ్రుతితో కంఠమును మేళవించి, డక్కీని లయబద్ధముగా ప్రయోగించుచు, పాటగా పాడునపుడు విన్నచో హృదయావర్జనమనెడి

కావ్యగుణము ఇమ్మడిముమ్మడిగా పెంపొందును. ఈ పాడదగిన కావ్యమునకు పదమని పేరు.

పఠనయోగ్యమైన ప్రౌఢకావ్యము విద్యావంతులైనవారినే ఆకర్షింపగా, గానయోగ్యమైన పదకావ్యము ఆబాలగోపాల ప్రజను ఆకర్షించి, ఆకట్టి గుంపులు గుంపులుగా మందవేసి నిలిపెట్టును. శ్రీకృష్ణుడు మురళి ప్రయోగించుచుండగా, నోటితో పరక త్రుంచుట మాని, రిక్కించిన చెవులతో, కన్నులప్పగించి, నిశ్చేష్టములై నిలిచిన ఆలమందలు; బుసలుకొట్టుటమాని, పడగెత్తుటమరచి, పడగలువిప్పి, పరవశములైన పాములగుంపులు; ఇంటిపనులను, చేతినీటికడవలను విస్మరించి, ఆనంద బాష్పములు రాల్చుచు బొమ్మలవలె నిలబడి పోయిన గొల్లపడుచులు; ఏగాన రస ప్రభావమునకు లోపడిపోయిరో అట్టివానితో సమప్రభావముగల యీ గేయ కావ్యరసప్రభావమునకు, జనులు, ఆవిధముగా, లోబడిపోదురు. ఈ రహస్యమును ఎరిగియున్న మనపూర్వులు ప్రజాబాహుళ్యములో ప్రచారము కావలసిన జాతీయ గాథలను చారిత్రక వృత్తాంతములను పాడదగిన పదకావ్యములుగా రచించి జాతిసదోద్ధితముగా నుండునట్లు కాపాడిరి. సహజశక్తి సంపన్నులైన కవులు, జాత్యభిమానోపదేశప్రయోజనముతో రచించిన ఇట్టి కావ్యములు మన సారస్వతమున చారిత్రకపదకవిత్వ శాఖగా వర్ధిల్లినవి. ఈ శాఖలో, పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ, సర్వాయి పాపనికథ, దేశింగురాజు కథ, బొబ్బిలి కథ, మున్న గునవి పెక్కు కలవు. ఈ పదకవిత్వము నాగరలోకమున స్థానము లభింపమి, పల్లెలలో అచ్చటచ్చట గ్రామ్య జీవనము గడుపుకొనుచు ముద్రణ యంత్రములు వచ్చిన తరువాత కొంతవరకు అచ్చుపడి గ్రంథ రూపమున నిలిచినవి. కాని ఇప్పుడు గ్రామములలో సైతము ఆ పదములను పాడెడువారు లేరు. వినువారును లేరు.

అసలు, ఆంధ్ర సారసత్వము ప్రాయికముగా సంస్కృతాను కరణమనియు, తెలుగు కవులు, సంస్కృతభాషలోనున్న ఉద్గ్రంథము లన్నిటిని తెనిగించి కొంతకాలమును, వాటి ననుసరించి, అట్టి పోలి కలుగల, కావ్యములను నిర్మించి మరికొంత కాలమును గడపిరనియు

సంస్కృతానుకరణములేని స్వతంత్ర కావ్యమనునది, మన భాషలో పొడకట్టదనియు కొందరి అభిప్రాయము. కాని యిందు, సంపూర్ణ మైన సత్యములేదు. ఏమనగా, తెలుగున సాంస్కృతిక వాఙ్మయ మెంతయున్నదో, దేశీయమైన వాఙ్మయముకూడ, అంతియే యున్నది. రచయితలు వ్రాసియుంచిన కావ్యములను కాపాడుకొన వలసిన భారముగల భాషాభిమానులు దేశీయ వాఙ్మయము, ప్రౌఢి యందు సాంస్కృతిక వాఙ్మయమునకు సరితూగక పోవుటచే, దానిని కొంతవరకు విస్మరించిరి. కాగా, అది చాలవరకు మరుగు పడిపోయినది. ముద్రణ సౌకర్యములేని ఆరోజులలో, గ్రంథ ములకు ప్రతులు వ్రాయించుకొని, పుస్తకభాండారములను పెం పొందించుకొన్న సంపన్నులు, లేదా భాషాభిమానులు, సాంస్కృ తికమైన తెలుగు కావ్యములకు మాత్రమే ప్రతులు వ్రాయించుకొని తదితరములైన దేశీయ కావ్యములకు ప్రతులు వ్రాయించుకొనుట మానుకొనిరి. అవి ఉత్తమ కావ్యములుకావని అప్రౌఢములని వాటిని సేకరించి కాపాడుట కొరమాలిన పని అని వారి ఉద్దేశము కానోపు. ఐనను, ఆ కావ్యములు పండిత పఠితలకొరకుగాక, పామర సహృదయులకొరకు రచింపబడినవగుటచే, అచ్చటచ్చట కొన్ని పల్లెలలో ఆ పామరులే వాటిని పాడుకొనుచు కాపాడిరి. వారిలో కొంచెము చదువునేర్చిన సరసులెవరైన ఉన్నపుడు వారు కొన్నిటిని వ్రాసి, గ్రంథరూపమునగూడ భద్రపరచుట తటస్థించినది. మరి గ్రంథస్థముకాని అనేక పదములు గాలిలోనేపుట్టి, గాలిలోనే కలిసి పోయినవి. ఇట్లుపోయినవిపోగా మిగిలినవైనను, కేవలము ప్రజల జిహ్వాగ్రమున తావుచేసికొని బ్రతుకవలసి వచ్చుటచే, తమస్వరూప మును నిలబెట్టుకొనజాలక, క్రమక్రమముగా, రూపాంతరస్థితిని పొందినవి. వాటిలో కొన్ని పదములు, మన అదృష్టవశమున, ఆంధ్ర పద కవితా మాధుర్యమునకు ముగ్ధుడైన, సి. పి. బ్రౌనువంటి ఏ మహానుభావుడో, పుణ్యము కట్టుకొనుటవలన, వ్రాతప్రతుల రూపము దాల్చి, భాండారములచేరి, తల దాచుకొనగల్గినవి. అందు ముఖ్యముగ చెల్లరమల్లరగా చెదరిపోయిన పల్నాటి వీరకథను, నీలైనంతవరకును

సంతరించి దాచియుంచిన యశము అన్యదేశీయుడైన ఆ ఆంధ్రభాషాభిమాని సి. పి. బ్రౌనుకే దక్కినది.

ఇక పదమననేమియో, పదకవిత్వా విర్భావ మెట్టిదో, పరిశీలింతము. ఏవాఙ్మయమునందైనను, ఈ పద కవిత్వమే, పద్య కవిత్వము కంటె ముందు పుట్టి పెరుగుననుట బహుజనాంగీకృతమైన సిద్ధాంతము. చిత్రవిచిత్ర కార్య కమనీయ పర్వతారణ్యమయమైన ప్రకృతిలో పుట్టి పెరిగిన ప్రాకృత జీవియగు ప్రాక్తన మానవుని హృదయమున సంతోషమయమో, దుఃఖమయమో యగు ఒకానొక భావము జనించి,పరవశుని చేయగా, ఆతని నోటివెంట, అప్రతర్కితముగా, ఒకపాట, వ్యక్తమై యుండుననియు, ఆవేశపూరితుడై, ఆతడా పాటను, చిందులు త్రొక్కుచు పాడియుండుననియు, ఆడుచు, పాడిన ఆపాటకు 'ఆట — పాట' లేక 'నృత్తగీతము' (Ballad-dance) అని పేరు పెట్టవచ్చుననియు అదియే కవిత్వమునకు శ్రీకారమనియు, ఈసిద్ధాంతము యొక్క సారాంశము.

ఇప్పటికిని లోకములో ఒక "పదమాడు అన్నా!" అని ఒక జానపదుడు ఇంకొక జానపదుని అడుగుటకలదు. కొంచెము విద్యాసంస్కారమున్న మనబోటి నాగరికులము "పదము పాడుఅన్నా!" అని అడుగుటకు బదులు "పదము ఆడుఅన్నా!" అని ఆతడడిగెనని ఆసంబోధన కర్థము చెప్పుకొని ఆడుట అను శబ్దము 'పాడుట' అను దానికి గ్రామ్యరూపమని భావింతుము. కాని ఆఅడిగినవాని ఉద్దేశమేమైనను ఆ సంబోధనములో మాత్రము, ఆడుచు పాడుము అనెడి అర్థమే యిమిడి యున్నది. ఇది అతి ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న జాత్యము. అర్థము మారినను దాని సత్యము అందే గర్భితమై యున్నది.

అసలు ఒక వ్యక్తి, పరవశ స్థితియందు చేసెడిప్రసంగముకాని, పాడెడు పాటగాని, శరీరావయవవిక్షేపముతోకూడి, అభినయ పూర్వకముగానే, వ్యక్తమగుచుండును. భావోద్వేగమనునది, ఒక్క హృదయమును మాత్రమే కదలించి ఊరుకొనదు. అది శరీరమునంతటిని, ఊగించివేయును. పట్టరానికోపముతో మనముఎదుటివానినితిట్టునపుడు

అది ఘుంటమాత్రముతోడనే చల్లారదు. కళ్ళెఱ్ఱజేయుట, పండ్లు పటపట కొరుకుట, చేయి ఎత్తుట, కాలు ముందుకు వేయుట అనునవి, నోటితో పల్కిన ఆ కోపపు మాటకు అభినయ మనిపించుకొను శరీరావయవ చేష్టలు. ఏ భావోద్వేగమైనను తదనుగుణముగ బహురూపముల వ్యక్తమైన పిదపగాని ఉపశమింపదు. కాబట్టి ఆదికాలమున భావపరవశుడై పాటపాడిన ఆ ప్రాక్తనకవి, ఆడుచునే పాడెననుట శాస్త్రీయముగా నమ్మదగిన విషయము. దానికే 'ఆట–పాట' లేక 'నృత్తగీతము' అని పేరు.

ఈ "ఆట–పాట" లో మూడు భిన్న కళాంశములు కలవు: అడుగువేయుట, రాగముతీయుట, మాటపలుకుట. శాస్త్ర పరిభాషలో ఈ మూడింటికి నృత్తము, గీతము, శబ్దము అని పేరు. ఈ మూడు అంశములును మూడుశాఖలుగా కాలక్రమమున నాట్యము,సంగీతము పద్యముఅనెడి కళలుగా పరిణమించి దేనిరాజ్యమును అది యేలుకొనసాగెను. కాని ఈ మూడిటికిని జన్మస్థానమొకటియే;అవి స్వతంత్రతానిరూపణార్థము; ఎంతవిడిపోయినను పరిణత సంపూర్ణస్వరూపములో మరల ఏకీభవించుచుండును. కవిత్వము, గీతముతోడి సంబంధమును విడనాడజాలదు. అట్లే సంగీతము, శబ్దముతోడి పొత్తును విడిచిపెట్టదు. మరల నాట్యము, సంగీతముతోడి చెలిమి చేయుచునే యుండును. పద్యము తొలినాటి కవిత్వమునకు సాహచర్యము నెరపిన నృత్త గీతములలో నృత్తమును పూర్తిగ విడిచిపుచ్చగలిగినను, గీతిని మాత్రము పూర్తిగ కాదనలేకపోయెను. పద్య కవితారాజ్యములో నృత్తమునకు ప్రవేశము లేకపోయినను, గీతికి మాత్రము అప్రత్యక్షమైన అధికారము కొంత కలదు. గీతిగతమైన ఏ లయ నిబద్ధతకలదో అదియే పద్యగతమైన ఛందస్సు. కనుక ఈ మూడు కళలకు, తక్కిన రెండిటిలో ఏదో ఒకదాని సాహచర్యము విడరాని బంధముగా ఉండుచునేయుండును. కాని తక్కిన రెంటి పొత్తును విసర్జించి, తనకుతానై స్వతంత్రముగా వర్తించగలనని చూపుటకే వాఙ్మయమున వచనకవిత్వమును, సంగీతమున జంత్రవాద్యమును, నాట్యమున మూకాభినయమును వెలసినవి. ఈ మూడును తమ రాజ్యమున

త్రామే సర్వాధికారము నెరపుటకై అవి చేయు కృషి ఎంత దూరము పోవునో చూపుటకుమాత్రమే ఈ విషయమును స్మరించి విడిచితిని.

ఏ గీతమునకైనను ప్రధాన లక్షణము లయ నిబద్ధత. ఊరక రాగముతీయుటగీతముకాదు. రాగతాళయుక్తముగా పాడినదేగీతము పాట ఎప్పుడును, లయబద్ధముగానే యుండును. కావుననే గీతికి లయనిబద్ధత ప్రధానలక్షణమైనది. గీతిగతమైన లయనుబట్టి, ఛందస్సు ఏర్పడినది. ఈ ఛందస్సు కతముననే పద్యపఠనవేళ మధురమైన ఒక గీతి విశేషము, వచనపఠనముకంటె భిన్నమైనది వ్యక్తమగుచుండును. ఇది పద్యకవిత్వముతో గీతికిగల అప్రత్యక్ష సంబంధము. అట్లుగాక, గీతికి ప్రత్యక్షాధికారమే యిచ్చిన కవిత్వము పదకవిత్వము. పద్య జాతికిని, పదజాతికిని ముఖ్యమైన భేదమిదియే.

ఈ పదకవిత్వమున, శబ్దమునకెంత ప్రాధాన్యమున్నదో, గీతికిని అంతే ప్రాధాన్యమున్నది. అనగా ఇందు సుందర శబ్ద రచనతో పాటు, మధురమైన పాటయును కలిసియుండును. ఈ జాతిలో ఒక శాఖ, కవిత్వముకంటె, గానమునకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చి గేయ కవిత్వ మనిపించుకొనెను ఆ గేయ కవిత్వములో శాస్త్ర నిర్దిష్టమైన రాగ, తాళ, స్వరప్రస్తారాద్యంగముల ప్రాధాన్యముతో ఒక అంత శ్శాఖ గానకళాకోవిదుల విద్యగా వెలసినది. అదియే సంగీతము. త్యాగరాజకృతులు మున్నగునవి ఈ శాఖలోనివి. ఇంకొక గేయ కవిత్వశాఖ, ఈ కృతులవలె శాస్త్రీయసంగీతముతో పాడుటకు అనువైనదైనప్పటికి, అభినయార్థ ముద్దేశింపబడి, నర్తనపాత్రముల పశమైనది. జావళీలు, పదములు మొదలైన శృంగారాత్మక రచనలు ఈ శాఖలోనివి. మరియొక గేయకవిత్వశాఖ, సంగీతవిద్యానైపుణ్యమును, అభినయవిద్యానైపుణ్యమునులేని సామాన్యులు సైతము, కొంచెము కంఠమాధుర్యమున్నచో పాడుకొని ఆనందించుటకు వీలుగా పాటలుగా వర్ధిల్లిన్నది. మన ముత్తైదువులు పాడు పెండ్లిపాటలు, మంగళహారతులు ఈ జాతిలోనివి. వీటిని పోలినవే భజనకీర్తనలు కూడ.

ఈ పదకవిత్వమున ఒక శాఖ గీతిని అంగీకరించియు, గేయ కవిత్వమని అనిపించుకొనక, కవిత్వాంశకే యెక్కువ ప్రాధాన్యమిచ్చి, జాతివాచకమైన పదకవిత్వము పేరనే నిలిచియున్నది పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ మున్నగు కావ్యములు ఈ శాఖలోనివి. ఈ కావ్యశాఖావర్తనము భావనాప్రధానమైన సారస్వతలోకమునసే కాని, రాగ తాళ ప్రధానమైన సంగీత కళాజగత్తునకాదు; అభినయ ప్రధానమైన నాట్యజగత్తున అంతకంటె కాదు. కాబట్టి, పద కవిత్వములో నానావిధములైన గేయశాఖలను విడిచిపెట్టగా, మిగిలిన భాగమంతయు సారస్వత లోకమునకే చెందును. ఈ పదములలో చిన్నమ్మ కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మున్నగునవి సాంఘికములు; బొబ్బిలి కథ, కాటమరాజు కథ, దేశింగురాజు కథ, పలనాటి కథ మొదలగునవి చారిత్రకములు.

నిసర్గమధురమును, నిరాడంబరమును అయిన ఈ పదకవిత్వము శుద్ధ దేశివాఙ్మయము.

దేశిశబ్ద వాచ్యమైన వాఙ్మయమునకు ప్రధాన లక్షణములు మూడు: ఇతివృత్తము; భాష; ఛందస్సు మూడును దేశీయములై యుండుట, ఇతివృత్తము ఎక్కడనుండియో ఎరువు లెచ్చుకొన్నది కాక, కేవలము దేశీయ వృత్తాంతము కావలెను. భాషయు; జాను తెనుగు అనిపించుకొన తగిన, సజీవ వ్యావహారిక భాష కావలయును. ఒకవేళ ఈ భాషలో కొంత సంస్కృత పదజాలము కలిసినను, అది తెనుగుతనము దాల్చి సుబోధమైన తత్సమపదజాలమే కావలెకాని నిఘంటు సహాయ మపేక్షించెడి సంస్కృత శబ్దజాలము కాకూడదు. ఛందస్సుకూడ దేశీయచ్ఛందమే అయియుండవలెను.

మార్గకవిత్వమును నిరసించి దేశికవిత్వమునకై కంకణము కట్టుకొన్న పాల్కురికి సోమనాథుడుసైతము ఈ మూడులక్షణములను సర్వత్ర సాధింపలేకపోయెను. బసవపురాణములోని ఇతివృత్తము ఆంధ్రదేశములోనిది కాదు. అతని భాషలో దేశీయపదజాల మెంత యున్నదో సంస్కృత పదజాలమును అంతేయున్నది. మరియు అతని గ్రంథములు పద్యప్రబంధములవలె, సాహిత్యపరులకు సంసేవ్యములు

కాని, సామాన్య ప్రజలకు సుబోధములుకావు. సోమనాథుని తరువాత వెలసిన తెలుగు ద్విపదకావ్యములన్నియు ఈ ప్రమాణమునుబట్టి చూచినచో ఒక ఛందస్సులో దేశీయములుగాని తక్కిన గుణములలో మార్గకపిత్వమునకు చెందినవే. కాగా ఈ దేశికవితా శబ్దమును అన్నిట సార్థకముచేసిన కావ్యములలో ఈ పల్నాటి వీరచరిత్ర మొదటిది; మేటి.

సహజకావ్య సంపదను సంతరించుకొని దేశితనమును ప్రతిష్ఠించిన ఉత్తమకావ్యము పలనాటివీరచరిత్ర. బసవపురాణాదులు ఇంకొక విధముగా ప్రశంసార్హములు. ఆ ద్విపద కావ్యకర్తలు ఈ దేశికవిత్వమునకుకూడ, పద్యకవిత్వముతోపాటు, సారస్వత ప్రతిష్ఠ కలిగించి వాఙ్మయమున స్థిరత్వము నెలకొల్పుటకై పలువిధముల పాటుబడిన వాఙ్మయ సంస్కర్తలు. వారు దేశీయమైన శుద్ధ పదకవిత్వమునకు, సాంస్కృతికమైన ప్రౌఢసాహిత్యమునకు సామరస్యము కలిగించి, ఉభయతారకమైన కావ్యపథమును తీర్చిదిద్దిరి. ఇదియే ద్విపద కావ్యకర్తల ప్రత్యేకత.

ఈ పలనాటి పదము ప్రౌఢ సాహిత్యమున స్థానమాశింపనే లేదు. పండిత పఠన యోగ్యముకావలెనని అభిలషింపనులేదు. ప్రజల కొరకే పుట్టి, ప్రజలకే ఆదరపాత్రమై వారి మెప్పునే ఆశించి, తాను తరించి, వారిని తరింపజేయు, ప్రజా కవిత్వమిది. ఈ దృష్టితో చూచినచో, ఇట్టి స్వతంత్ర కావ్యముకాని, దేశి రచనకాని, మహాపురుషుల చరిత్రకాని, ఆంధ్ర సాహిత్యమున ఇంకొకటిలేదని, పూర్వపక్ష భయము లేకుండ చెప్పవచ్చును.

మరి చారిత్రక కథలలో దీనికే అద్వితీయమైన ప్రశస్తి వచ్చుటకు కారణమేమి ? మొదటి కారణము : ఇది యితర కథలవలె కతిపయదినవర్తనతో అంతమొందిన వృత్తాంతము కాకపోవుట. ఈ గాథ, భారతేతి వృత్తాంతమువలె, ఒక రాజవంశములో రెండు తరముల జీవిత కాలమంతయు నర్తించిన విపుల చరిత్ర. కాల ప్రమాణమును బట్టి చూచినచో ఒక్క భారతముతప్ప, మరి ఏ గ్రంథ వస్తువునకును ఇంత దీర్ఘ ప్రవృత్తి లేదు. వృత్తాంత దీర్ఘతా వ్యాప్తియేకాక,

పలనాటి కథకు, భారతము తోడి పోలికలు మరి చాల కలవు. అది ఈశ్వర సంకల్పమేమో చెప్పలేము గాని, పలనాటి చరిత్రయంతయు భారత చరిత్రకు కొద్దిపాటి ప్రతిబింబముగా కన్పడును. అక్కడవలె ఇక్కడ వచ్చిన తగువుకూడ, దాయభాగమును గురించియే. కౌరవ పాండవులు అన్నదమ్ములబిడ్డలు; నలగామ మలిదేవులు సవతులబిడ్డలు. "అన్నదమ్ములలో జ్యేష్ఠుని పుత్రుడను గనుక రాజ్యము నాది' అని దుర్యోధను డన్నట్టుగా, "నా తల్లి వంక రాజ్యమునకు నేనే అర్హుడను" అని నలగాము డనెను.

'హక్కులమాట అటుంచి, హత్తిన మనస్సులతో కలిసి మెలసి బ్రతుకుడు'అని, అక్కడి పెద్దలు, ఇక్కడి పెద్దలును కుటుంబ కలహమును వారించునుద్దేశముతో ఇతవు చెప్పిరి. కలిసి బ్రతుకుట, దుర్యోధనునకు ఇష్టముకాకపోబట్టి కౌరవరాజ్యము విభాగింపబడినది. ఇక్కడ నలగామునకు ఇష్టములేకపోబట్టి పలనాడు విభక్తమైనది. అక్కడ దుర్యోధనునకును, ఇక్కడ నలగామునకును దుష్టమంత్రుల ప్రేరణ, ఆధారమైనది.

రాజ్య విభాగము న్యాయ్యము గాదనుకొని పంచియిచ్చిన సగమును మరల దోచుకొనుటకు శకుని ప్రేరణచే దుర్యోధనుడును, నాగమ ప్రేరణచే నలగాముడును యత్నించిరి. నిర్జీవద్యూతవ్యాజమున ధర్మరాజు వనవాసమునకు పోగా, సజీవద్యూతమిషగా మలిదేవుడు అడవుల కేగెను. అడవులలో మాత్రము ఏల సుఖముగా బ్రతుకనీయవలెనని దుర్యోధనుడు ఘోషయాత్రా కల్పన చేసినట్లుగా నలగాముడు మందపోటు జరిపించెను. సమయ నిర్వహణానంతరము రాజ్యభాగమిచ్చుటకు దుర్యోధనునివలె నలగాముడును నిరాకరించెను. ఇర్వురును రాయబారులకు విషప్రయోగ ప్రయత్నములు చేసిరి భారత కృష్ణుడు విషప్రయోగమును శంకించి తప్పించుకొనెను పల్నాటి అలరాజు విషప్రయోగమువల్ల మరణించెను. వంశనాశమును నివారించుటకు చేసిన సంధి ప్రయత్నములు, రెండుచోట్లను విఫలము కాగా కాలచోదితులై ఇరువాగును యుద్ధమునకు తారసిల్లిరి. కురుక్షేత్రమునందువలె కారెంపూడిక్షేత్రమునందును ఉభయపక్ష వీర

సంఘములు సర్వనాశమయ్యెను. అయితే భారతయుద్ధ జయముతో కురురాజ్యము ధర్మరాజునకు లభింపగా పల్నాటి రాజ్యము మాత్రము హతశేషుడైన నలగామునకు దక్కెను. అతని రాజ్యప్రాప్తి యుద్ధ జయలబ్ధి కాదు; అది బ్రహ్మన యనుగ్రహదత్తము.

ఈ విధముగా పలనాటికథ యంతయు భారత కథతో సంవదించుట, యేకవియు చేసిన అభూత కల్పనకాదు. స్వతఃప్రవృత్తము. భారతకథ, భారతజాతికెల్ల విస్మరింపరానిదైనట్లే పలనాటికథ విశేషించి ఆంధ్రులకు విస్మరింపరానిది. పాండవవీరులు సమస్త భారతావనికి ఎట్టి చిరస్మరణీయులో పల్నాటి వీరులు సర్వాంధ్రులకు అట్టి చిరస్మరణీయులు. అందుచేత ఇతర చారిత్రక పదములకు లభింపని ప్రతిపత్తి, యీ పలనాటి పదమునకు లభించెను.

రెండవకారణము: బొబ్బిలికథ మొదలైన చరిత్రలను, పదములుగా వ్రాసిన రచయితలు, ఈ పలనాటి పదమును వ్రాసిన కవులతో సాటిరాగల కవితాప్రజ్ఞ కలవారుకారు. ఆ కథలు పాడుచుండగా, వినుచున్నంతవరకే హృదయావర్జకములుగానుండునుగాని, చదువబూనగా రచన అంతగా రుచింపదు. పలనాటి చరిత్రను పిచ్చుకుంట్లు పాడునప్పుడు కలిగెడి భావోద్రేకముమాట అటుండగా, గ్రంథము చేతబట్టి చదువుట మొదలిడినచో ప్రౌఢపద్య కావ్యోచితములైన పెక్కుసొగసులు, రసభావస్ఫోరకములైనవి అస్పృక్పృత్తుగా, ప్రత్యక్షమగును. ఈరెండు కారణములవల్ల ఈ పలనాటి పదము ఆంధ్ర చారిత్రక పదకవిత్వ శాఖలో అగ్రతాంబూలార్హతను గడించుకొన్నది.

ఈ కథకు అక్షరరూపము కల్పించిన ఆదికవి ఎవడు? అను ప్రశ్న ఎప్పటికిని సమాధానము దొరకని శంకగా నిలిచియుండును. ఏమనగా, సాంఘికములు చారిత్రకములైన ఇట్టి దేశోపద్రవములు జరిగినవెంటనే, భావోద్రిక్తతగల ఒక పుట్టుకవి వాటిని పాటగా పాడును; లేదా రచించును. అంతియెకాని, ఆ వృత్తాంతము జరిగిన కొన్ని వందల ఏండ్లవరకును ఏ కవి పుట్టుకకోసమో ఆ కథలు వేచియుండవు. సుమారు నలుబదిఅయిదు సంవత్సరముల క్రింద గుంటూరు

జిల్లా రెడ్డిపాలెము వాస్తవ్యుడును ఎల్లమంద కోటప్పకొండలో జరిగిన తిరుగుబాటునకు నాయకుడును అయిన చిన్నపరెడ్డి ప్రభుత్వము చేత ఉరితీయబడిన వెంటనే "భళిరా ! చిన్నపురెడ్డి నీపేరే బంగారపు కడ్డీ"అనెడి పదము వెంటనే వెలసినది. అట్లే, గాంధీజీ సత్యాగ్రహోద్యమము ప్రారంభించి, ప్రభుత్వముతో అహింసా యుద్ధము చేయుచుండిన రోజులలోనే తునివాస్తవ్యుడు రంగాచారి అను ఒక పుట్టుకవి ఆ ఉద్యమమును గురించి వేలకొలది పంక్తులలో ప్రకర ప్రకరణములుగా, పదమును వ్రాసెను. ఇట్టివి అనేకములు పేర్కొనవచ్చును. కాబట్టి, పలనాటి యుద్ధము జరిగిన వెంటనే ఆ సంక్షోభమంతటిని, కన్నులార, చూచియో, లేక చూచినవారు చెప్పగా వినియో, వీర రసావిష్టుడైన ఏ పుణ్యాత్ముడో ఆనాడే దీనిని పదముగా పాడియుండును. అయినచో ఇంత సుదీర్ఘమగు నితివృత్తము నంతయు, ఆతడు పదముగా వ్రాసియుండునా లేక, దీనిలో మిక్కిలి రసవత్తరమైన ఏదో ఒక ఘట్టమును మాత్రమే వ్రాసియుండునా ? అని ప్రశ్నించుచో, ఇందు ఏదైనను సంభవమే. మొదటికవి కథనంతటిని గాక, తన హృదయమును ఆకర్షించిన ఘట్టమును - బహుశః అది యుద్ధఘట్టము కావచ్చును - తొలుత, పదముగా పాడియున్నచో తరువాత కొద్దికాలమునకు ఇంకొక కవి ఇంకొక ఘట్టమును, మరియొక కవి మరియొక ఘట్టమును పరిగ్రహించి కథ అంతయు కలసివచ్చునట్లు సంపూర్ణగ్రంథమును నిర్మించి యుండవచ్చును. ఆ ఆదికవియును, తర్వాతికవులును, ఆ యుద్ధక్షేత్రమునకు సమీప గ్రామస్థులై యుందురు కాని, దూరదేశస్థులై యుండరు. ఒక ప్రాంతమున జరిగిన సంఘటన తత్ప్రాంతీయులను ఆకర్షించినంతగా, దూరస్థులను ఆకర్షింపదు. ఆ కథలయందు, కథాపురుషులయందు సమీపస్థులకుండెడి అభిమానము దూరదేశస్థులకుండదు.

అసలు ఈ పాటను పాడెడి పిచ్చుకుంట్ల యిండ్లలోకూడ సమగ్రముగా గ్రంథమున్నట్లు లేదు. ఈ పాటపాడెడి పిచ్చుకుంట్ల జట్లులు చాల యున్నవి. వారందరికి బాలచంద్రుని యుద్ధఘట్టము విధిగా నోటికివచ్చును. తక్కినవి ఒకరి కొకభాగము, ఇంకొకరి కింకొకభాగము

నోటికి వచ్చునట. యుద్ధక్షేత్రమైన కార్యమపూడిలో, వీర పీఠాధిపతులైన పిడుగువారి యింటకూడ సమగ్రమైన ఈ గ్రంథము దొరకలేదు. అదియునుగాక, ఇప్పుడు లభ్యమగు ఈ భాగములు, ఆ కథ జరిగిన వెంటనే వ్రాసిన కవుల రచనను ఆధారముగా తీసికొని, కాలక్రమమున పెంపొందింప బడినవేకాని, ఆ మూల స్వరూపములు మాత్రము కావు. తొలినాటి ఆ మూల రచనలు ఆనోట ఆనోటపడి ఆ పాటలకు వైపుల్యముతోపాటు రూపాంతర స్థితియు కలిగినది. అందుచేత ఇప్పుడు లభ్యమైన యీ గ్రంథమును ఎప్పుడు ఎవరు వ్రాసిరని ఆశంకించుకొని సమాధానము చెప్పుకొనుటకు ప్రయత్నింపవలెనేకాని, మొదటిపల్నాటి పదమును వ్రాసిన రచయిత ఎవరు అని ప్రశ్నించుట వ్యర్థ ప్రశ్న.

ఇప్పుడును ఈ గ్రంథము సంపూర్ణముగా ఒకచోట లభింపదు. పలువురువ్రాసిన పలు ప్రకరణములను జతపరచిననేతప్ప గ్రంథసమగ్ర స్వరూపము, పొడకట్టదు. ఈ పలువురును, ఎవరికివారే పూర్తికథను వ్రాసిరో లేక తమకు ముచ్చట గొల్పిన ఏదో ఒక ప్రకరణమును వ్రాసిరో ఊహించుటయు దుష్కరము. అంతియెకాక ఏదైన ఒక గ్రంథ భాగము లుప్తముకాగా, దానిని పూర్తిచేయు తలంపుతో రచన కుపక్రమించిరో లేక పూర్వకవికంటె బాగుగ వ్రాయవలెనను కుతూహలముతో వ్రాసిరో చెప్పలేము. మరియును ఈ కథాఘట్టములను పాడెడి పిచ్చుకుంట్లు అనేక యిండ్లవారున్నారు. కనుక ఏజట్టునకు ఆజట్టు, తనకు కావలసిన ఘట్టమును ఏ కవినో ఆశ్రయించి, వ్రాయించుకొన్నదేమో తెలియదు. ఇన్ని కారణములవలన, ఈ గ్రంథము బహుకర్తృకమగుట, ఒక్కొక్క ప్రకరణము సగము లుప్తమై సగము దొరకుట, అవతారికలలో గ్రంథకర్తల పేరులు కానరాక పోవుట, ఒక ఘట్టమునే పలువురు వ్రాయుట సంభవించినది.

ఈ ముద్రిత గ్రంథములో పదకొండు ప్రకరణములున్నవి: (1) అనుగు రాజు పలనాటి సంపాదనము. (2) పలనాటి రాజ్య విభాగము, (3) కోళ్ళ పోరు: గోపన్నవిరుగు. (4) అరణ్యవాసము (అనగా మండాది వలస) (5) మందపోటు:లంకన్నవిరుగు (6) గురజాల యుదమ్ధు, (7) అలరాజు రాయబారము (8) కల్లుప్రతిష్ఠ,

(9) బాలచంద్రుని యుద్ధము, (10) కొమ్మరాజు యుద్ధము, (11) బ్రహ్మన్న విరుగు. పలువురు వ్రాసిన ఈ పదకొండు ప్రకరణముల లోను, తమ పేర్లు చెప్పుకొన్న కవులు ముగ్గురు మాత్రమే. వారు శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ. కల్లుప్రతిష్ఠ, బాలచంద్రునియుద్ధము లను శ్రీనాథుడు రచించినట్లు ఆద్యంతములందును, కోళ్ళపోరు : గోపన్న విరుగును, మల్లయ వ్రాసినట్లు అవతారికయందును, కొమ్మ రాజు యుద్ధమును, కొండయ చెప్పినట్లు ఫలశ్రుతియందును కలదు. (వీరి అవతారికా ఫలశ్రుతుల పంక్తులు ఈ గ్రంథమున యథాస్థాన మున అచ్చు పడలేదు. అది పొరపాటు. ఆ భాగములు 1, 2 అను బంధములుగా, ప్రత్యేకము ఈయబడినవి.) మిగిలిన ఏడు ప్రకరణ ముల లోను మొదటి రెండింటిని వ్రాసినకవి ఒక్కడే; కాని అత డెవరో తెలియదు. కృత్యాదిని అతడు వ్రాసిన పంక్తులు ఇవి :

"వరభరద్వాజుని వంశాన బుట్టి
ధరణి శ్రీనాథుడన్ ధన్యుండు మహిమ
విలసిల్లు పలనాటి వీరచరితమును
సలలితమ్ముగ జనుల్ చదువుట కొరకు
సంజాత నవరస సంభృతియొప్ప
మంజరీ ద్విపదగా మన్నించిచేసె;
ఆ కథావృత్తాంత మది యెట్టిదనిన
చేకొని వినిపింతు చిత్తముప్పొంగ."

ఈ పంక్తులకు అర్థము, 'శ్రీనాథుడను పేరుగల నేను ఈ మంజరీ ద్విపదను వ్రాయుచున్నాను' అనికాదు. 'శ్రీనాథుడు మంజరీ ద్విప దగా చెప్పిన కావ్య కథావృత్తాంతమును నేను వినిపించుచున్నాను' అని ఇంకొక కవి చెప్పినమాటలు. ఆ కవి ఎవడో పేరు మాత్రము లేదు. శ్రీనాథుడు ఏనాడో చెప్పిన కథ, ఏ కారణముననో లుప్తమై పోగా, అతడు ఈ కథను ఏనాడో వ్రాసినాడని విన్న ఒక కవి తాను ఆ కథావృత్తాంతమును మరల వ్రాయుటకు ఉపక్రమించెను. ఇట్లే కొండయ "కొమ్మరాజు యుద్ధము" అవతారికయందు శ్రీనాథుని పేరుదహరించెను.

"భువిని శ్రీనాథుండు పుణ్యులౌననగ
పలనాటి వీరుల భాగవతంబు
తెలుగున విరచించె తెల్లంబుగాను
వినిపించుచు నే జగద్విఖ్యాతిగాగ
ఘనమైన యా కథాక్రమ మెట్టిదనిన"

ఈ యిద్దరును శ్రీనాథుని తరువాతి కవులైనను, కొండయ్య, ఏ శతాబ్దివాడో చెప్పలేము. కాని మల్లయ మాత్రము పదహారవ శతాబ్దివాడు కావచ్చునని చెప్పవచ్చును. అతడు బ్రహ్మనాయుని వర్ణించునపుడు, శ్రీకృష్ణరాయుని మూర్తిని ఉపమానముగా గ్రహించెను:

"నడిమి మేడకు బ్రహ్మనాయుడు వచ్చి
విడియంబు చేయుచు విభవంబు మెరయ
నిడుదలై తరుచులై నిగనిగల్ తేరి
నలుపులై మెరుగులై నవకమైయున్న
వెండ్రుక లల్లనవిచ్చి బాగమర
జడ దుల్లి చేమంతి జాజిపూదండ
లొప్పార కైచేసి యొనరసంధించి
మృగమద కుంకుమ మిళితమైయున్న
పరిమళగంధంబు బాగుగాపూసి
చెంగావి వలిపంపు చీరయు కట్టి
నవరత్న ఖచితమై నలినొప్పుచున్న
హస్తకంకణముల నమవుగా తొడిగి
నీలాలపోగులు నింపార పెట్టి
రత్న కీలితములై రంజిల్లుచున్న
పంచశరంబులు పసిడియుత్తరిగె
పెంపైన ముత్యాల పేరులు వైచి
పచ్చల కెంపులు పద్మరాగముల
ఉంగరంబులు వ్రేళ్ల నొప్పుగాపూని
బొలుపార సందెట పూసలుకట్టి

హరితులసీమాల నరుతధరించి
శ్రీకృష్ణరాయుని చెలువంబునొంది"

(పుట 86-87; పంక్తులు: 14-347)

ఇట కవి యుద్దేశము శ్రీకృష్ణరాయు డనగా శ్రీకృష్ణదేవరాయలు కాక, శ్రీకృష్ణుడని; అతని యీభావమే ఈదిగువ పంక్తులలో మరింత స్పష్టపడుచున్నది :

"అనిన శీలమనాయు డా గోపుమాట
లన్నియు తలపోసి యంతరంగమున
ఇట్లు వితర్కించె "నిలమీద తొల్లి
రేపల్లెలోపల శ్రీకృష్ణరాయు
డేపార లీలమై యేలుచునుండె;
అతనివంశమునందు గోపు
భూమిపై మనుజుడై పుట్టినవాడు
గాక ! యీ పోకళ్లుగలవె యొక్కనికి ?'

(పుట 113; 777-84)

ఏ కవియును శ్రీకృష్ణుని, శ్రీకృష్ణరాయుడని అనడు. ఈ కవికి శ్రీకృష్ణరాయుడు అను ఈ శబ్దస్ఫురణము విజయనగరసామ్రాజ్యాధిపతియైన శ్రీ కృష్ణదేవరాయుని పేరువల్ల కలిగియుండును. మరియు ఇతడు నలగాముని కొలువులో తురకభటులున్నట్లును, నాయకురాలు బ్రహ్మనపై యుద్ధముచేయుటకు తురకరౌతులకు గుఱ్ఱములిచ్చి పంపించినట్లును వర్ణించెను.

" ఆయుధసవరణ నధికులై తురక
రాహుతులందరు రవరవతోడ
వెసవచ్చి యాయారువెల్లి నాగమకు
సరిసలామ్‌చేసిరి సందడిగొనుచు"

(పుట: 129; పంక్తులు: 1117-1120)

" తొలుత నాయకురాలు తురకలచూచి
అలతి నవ్వులరంగ నంత నిట్లనియె :

'రాళ్లపక్షిని సాళ్వరాయుని మున్ను
పోట్లాటలోనను పోరిచూడంగ
ఎన్నెన్నొవిధముల నెక్కంగనేర్చు
మీర్‌ఖాన్ సాహెబ్‌కు మెచ్చగనిండు
ఖైరని బెల్లాడుఖానునకిండు
బాడీలగొంగను బహుళముకిండు
లోకవిఖ్యాతిగా లూలూకు నిపుడు '

(పుటలు 129-132; పంక్తులు 1227-1316)

ఈ కథాకాలమునాటికి తురుష్క సర్దారులు, హిందూరాజుల కొలువులో చేరిరనుట చరిత్రవిరుద్ధము. వారు హిందూరాజులకు సేవ చేయుట శ్రీకృష్ణదేవరాయల కాలముననే ఎక్కువగాజరిగెను. కనుక మల్లయ, శ్రీకృష్ణదేవరాయల కాలమువాడో అతని తరువాత కాలము వాడో కావచ్చును.

శ్రీనాథుడు పల్నాటివీరచరిత్ర రచించినట్లుగా మల్లయయును, కొండయయును మొదటి రెండు ప్రకరణములు రచించి తనపేరు చెప్పుకొననికవియును, తమ కథాభాగములందు స్పష్టముగా పేర్కొనిరి. కల్లుప్రతిష్ఠయును, బాలచంద్రుని యుద్ధమును శ్రీనాథుని కర్తృకమే అని, వాటి ఆద్యంతములు చాటుచున్నవి :

"చెన్నకేశవపాదసేవారతుండ
వలను భారద్వాజ వంశవర్ధనుడ
కవిసార్వభౌముడ ఘనతగన్నట్టి
శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ
శాశ్వతంబైనట్టి సద్గ్రంథమొకటి
చెప్పబూని మనసు చెలరేగియుండ

... ... ...

విలసిల్లు పలనాటివీరులచరిత
జనులెల్ల భక్తిచే చదువుటకొరకు

మంజరీద్విపదగా మన్నించి నేను
చెప్పబూనితి పచఃశ్రీ మెరయంగ"
(కల్లుప్రతిష్ఠ; పుట 293-94; పంక్తులు 16-41)
"ఘనుడైన శ్రీనాథకవిరాజరాజు
చెన్నుని కృపచేత చిత్తముప్పొంగ
బాలుని విక్రమప్రౌఢియంతయును
విరచించె జనులకు విశదంబుగాను"
(బాలచంద్రుని యుద్ధము : పుటలు 482; పంక్తులు : 4340-43)

ఇంతకుముందు ఈ విషయములు పరిశోధించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావు, అక్కిరాజు ఉమాకాంతము, వేటూరి ప్రభాకరశాస్త్రి మున్నగు ఐతిహాసికులు, సారస్వత విమర్శకులు, పండితులు, శ్రీనాథుడు మల్లయ, కొండయ. పల్నాటివీరచరిత్రను రచించినట్లు పేర్కొనిరి. అంతియేకాక, పల్నాటివీరచరిత్ర శ్రీనాథకృతమని చిరకాలము నుండియు నేటివరకును ప్రబలమగు జనశ్రుతియును కలదు. కాని ఆంధ్రమున సారస్వతవిమర్శ ప్రారంభమైనతరువాత పెక్కుమంది పండితులు, పల్నాటివీరచరిత్రను శ్రీనాథుడు వ్రాసియుండునా అని సందేహింప మొదలిడిరి. ఇది శ్రీనాథుని కావ్యమని చెప్పెడి మత మెంత ప్రబలముగా నున్నదో కాదని వాదించెడి మతమును అంత ప్రబలముగానున్నది. ఈ రెండవ మతమువారు చూపెడు యుక్తులు ఇవి : (అ) ఉద్దండపండితుడైన శ్రీనాథుడు పామరరచన అనిపించుకొనదగిన సుద్దుల కవిత్వమును వ్రాసియుండడు (ఆ) శ్రీనాథుని ఇతరకావ్యములలో కానవచ్చెడి శైలీప్రౌఢి ఈ గ్రంథమున ఎచ్చటను కానరాదు. (ఇ) శ్రీనాథుని కర్తృకమని చెప్పబడుచున్న కల్లుప్రతిష్ఠ అవతారికయందు అతడు తాను "చెన్నకేశవపాదసేవారతుండ"నని చెప్పుకొన్నట్లు కలదు. శ్రీనాథుడు శివభక్తిపరాయణుడేకాని విష్ణుభక్తుడుకాడు. కనుక పల్నాటివీరచరిత్రను శ్రీనాథుడు వ్రాసియుండడు.

ఈ యుక్తులకు సమాధానము చెప్పుటకుముందు కల్లుప్రతిష్ఠ బాలచంద్రునియుద్ధమును పండితకవిరచితమా, లేక పామరకవి

రచితమా అని ప్రశ్నించుకొనవలయును. ఈ ప్రశ్నకు అర్థము ఈ కవి విద్యావంతుడా లేక సహజకవితాప్రజ్ఞ మాత్రమే కలవాడా? అని ఇట్టి పదములను వ్రాయుటకు ఎవనికైనను సహజ కవితాప్రజ్ఞయున్న చాలును. అతనికి ఇతిహాస పురాణాది ఉద్గ్రంథ పరిచయము, సంగీత నాట్యాదికళల పారిభాషిక జ్ఞానము, కావ్యాలంకారశాస్త్ర పరిజ్ఞానము యుండనక్కరలేదు ఈపరిజ్ఞానమును వ్యుత్పత్తియందురు. ఇది కవి చేసెడి విద్యాపరిశ్రమవల్ల కలిగెడు సంస్కారఫలము. ఇట్టి సంస్కారమున్న కవి వ్యుత్పన్నుడు. ఈ కథాభాగమును రచించిన కవి, వ్యుత్పన్నుడా, లేక, అవ్యుత్పన్నుడా అని పరిశీలించుచో, ఆతడు పరిపూర్ణ విద్యాసంస్కారమున్న వ్యుత్పన్నుడని, ఈ గ్రంథమునగల పంక్తులు, అడుగడుగునను ఉద్ఘోషించుచునే యుండును. ఉదాహరణకు నలగామరాజు కొలువులో గాయకులును, నాట్యకత్తెలును నెరపిన కళాప్రదర్శనములు వర్ణింపబడిన ఈ దిగువ పంక్తులను చదువరులు పరిశీలింపదగును:

"వింతగా గాయకుల్ వీణలుపూని
తంత్రులు బిగియించి తగశ్రుతిచేసి
సరిగ మేళనమైన సప్తస్వరములు
ఆరోహణావరోహణ భేదములను
బహురాగసంస్ఫూర్తి పట్టుగాచేసి
సంచారి సంస్థాయి సరసభావముల
మృదుతర శబ్దార్థ మిళితమైనట్టి
ఘనతరాలంకార గతిపరంపరలు
మూర్ఛనల్ మొదలైన ముఖ్యధర్మములు
జంత్రగాత్రంబుల జంటకావించి
ఎండినమ్రాకులు ఇగిరించునట్లు
పాడిరి తమ తమ ప్రౌఢిమీరంగ;
చెలగి నాటకజనుల్ చేరి జోహారు
గావించి నిలచిన కామభూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబుచేయ.

పరమృదంగము తెన్నవాయించు మేటి
కుడిభాగమందున కుదురుగానిలచె
తాళమానజ్ఞుడు తగనెడమదిశను
నిలచె నుత్సాహంబు నెమ్మదినిండ
ముఖవీణవాయించు ముఖ్యుడొకండు
రాగజాలము బాడు రమణులిద్దరును
నిండువేడుకతోడ నిలచిరి వెనుక
కంజలోచనయను ఘనమైనపాత్ర
మదనుపట్టపుదంతి మంజులవాణి
భరతశాస్త్రోచిత ప్రాణముల్ పదియు
గలిగిన యక్కాంత కాంతుబాణంబు
వలె వచ్చి సభవారు వర్ణించిచూడ
నిలచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికి తగవినయంబుచూపి
అతడొసంగిన గజ్జె లతిభక్తితోడ
పదముల గట్టుక పంచవన్నియల
కాసెగట్టిగగట్టి కడుజపంబమర
మద్దెల తాళంబు మధ్య నిల్చుండి
ఓరచూపుల ప్రభు నొయ్యనచూచి
సమపాదయుతమైన స్థానకస్థితిని
అఖిలదేవతలకు నలరులతోడ
పుష్పాంజలియొసంగి పూని నాట్యంబు
ఆవెనుక సమకట్టి యతివలు పాడు
సంగీతనాదంబు సభయెల్లక్రమ్మ
కైముడి కట్టుముల్ కనుపింపచేసి
వెలయంగ తొమ్మిది విధములైనట్టి
భూచారినాట్యంబు పొందుగాసల్పి
పదహారువిధముల పరగినయట్టి
ఆకాశచారియు నమరంగనాడి

అంగహారాఖ్యచే నమరునాట్యంబు
విదితమౌ తొమ్మిదివిధముల నాడి
గతిచారిభేదముల్ గనుపడునట్లు
భ్రమణసంయుతదీప్తి పటిమమీరంగ
పాణిభేదంబులు పదభేదములును
స్థానకసంచయ సంయోగమమర
పేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బహుచారి
సప్తతాండవములు సరవిప్రకటింప
సభవారలాశ్చర్య సంయుక్తులైరి;
తరువాత నిరుమేల తగుచెలు లమర
సంయుక్త సంయుతా సంయుతహస్త
నానార్థకములు నాట్యహస్తములు
శిరమును చూపులు చెక్కిళ్లు బొమలు
దంతోష్ఠకంఠముల్ తగచుబుకంబు
ముఖమును వక్షంబు మొదలుగానెన్న
అంగంబులారు ఉపాంగములారు
ప్రత్యంగసముదయం బారునుకూడ
ఎనిమిది పదియగు నెసగు నంగంబు
లమరంగ నభినయం బాశ్చర్యముగను
మాచెర్లచెన్నుని మహిమంబు తెలుపు
ఆంధ్ర సంస్కృతభాషలమరుగీతముల
భావంబు లెస్సగ ప్రకటనచేయ
చూచిరంభాదులు చోద్యంబునొంది
శిరసులువంచియు సిగ్గునుచెంది
రప్పుడు భూమీశు డాదరంబొప్ప
వస్త్రభూషణములు వారలకిచ్చి
భట్టును రమ్మని పంపించె నంత,"

(పుటలు 319-21; పంక్తులు 729-800)

ఇందులో కవి ప్రయోగించిన పారిభాషికపదము లేవియు వినికిడి మాటలు కావు. అవి ఆతని సంగీత నాట్యశాస్త్ర పరిజ్ఞానమునకు నిదర్శనములు. శాస్త్ర పరిజ్ఞానమేకాక, నట్టువరాలు, సభాప్రవేశము చేసినది మొదలు, రాజుచే కానుకలు పొంది నిష్క్రమించువరకును గల సంప్రదాయమంతయు అనుభవపూర్వకముగా యెరిగిన కవి; అంతియె కాదు; అతడు భగవద్గీతోపనిషత్తును నిత్యపారాయణచేసి, ముఖస్థము చేసికొన్న నిష్ఠాపరుడు. తలుచుకొన్నచో ఆ గీతలను చక్కని సరసమైన శైలిలో తెనిగింపగల సమర్థుడుకూడ;

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః"

అని శ్రీకృష్ణుడు, అర్జునునకు చేసిన చరమోపదేశ శ్లోకమును ఈ కవి ఎంత సరసముగా, తెనిగించెనో చూడుడు.

"సకలధర్మంబులు సమ్మతి విడచి
నా శరణందితే నను జేర్చుకొందు
వగవకు మదిలోన వద్దు భయంబు
సత్య మీమాట... ... ... ... ..."

(పుట 38వ; పంక్తులు 773–76)

తెలుగు కవులలో యుద్ధవర్ణనములు చేయుపట్టున, తిక్కన, నన్నెచోడులు ఒకరికి ఒకరు అనుకర్తలుగా పొడగట్టుదురు. వారిద్దరకును శబ్దార్థభావసన్నిహితసంబంధ మెక్కువ. అనగా, యుద్ధములను వర్ణించునెడ ఇరువురి కవిత్వమున పోలికలు సాధారణము శత్రువులను సంహరించుట "వంద తరిగినట్లున్నద"ని వర్ణించుట, యిద్దరకును చాల ప్రీతి. ఈ కవియును, దానిని అట్లే ఉపమించెను. ఈతని యుద్ధ వర్ణనలను, అందలి పలుకుబడులను పరిశీలించుచో ఇతడు భారతమును కూలంకషముగా పఠించి, అందలి సొగసులను పుణికి పుచ్చుకొన్న గడుసరివలె తోచును. తిక్కన తన భారతమున పెక్కు

చోట్ల, యుద్ధరంగమున ప్రవహించు రక్తమును నదీప్రవాహముగా రూపించి వర్ణించెను. ఈ రూపకాలంకారము సర్వప్రాచీన కవి సాధారణము.

"కరి కళేబరములు ధరణీధరములు, దురంగ గాత్ర
ములు గ్రాహసమితి
నర శరీరములు మీనములు గౌక్షేయక క్షురికాది శ
స్త్రంబు లురగకులము
రుధిరార్ద్ర శిరములు రుచిరప్రవాళముల్ ప్రేవుల
ప్రోవులు ఫేనతతులు
నెత్తురువెల్లువ నిశులు భూషణస్తోమాస్థిచయము
ల తుమురులిసుక
గాఁగ నంబురాశికరణి సంగ్రామభూభాగ మొప్పు
మిగుల యోగ
నిద్రనున్న విష్ణునికిఁ బాటియగుచు శోభిల్లె
నమ్మురారి యల్లుఁడంతున"
(ద్రోణపర్వము; రెండవ ఆశ్వాసము; 172 వ పుట; పద్యము 128)

ఈ కవియును బాలచంద్రునియుద్ధమున కార్యమపూడి యుద్ధక్షేత్రమును ఇట్లే ఉపమించుట అతని ప్రాచీన కావ్యపరిజ్ఞానమును ప్రస్ఫుటీకరించుచున్నది :

సమరరంగము చూడ చక్కనైయుండె
ఘనమైన నెత్తురు కాల్వలై నిలిచె
తెగిపడ్డ గజములు దీవులైయొప్పె
సరకిన తురగముల్ నక్రములయ్యె
పొర్లాడు శిరములు బుద్బుదపటలి
పెక్కెముల్ గొడుగులు డిండీరవితతి
ఘనమైనయరిగెలు కచ్ఛపరాజి
మేటినేతంబులు మీనవారంబు
దీర్ఘశిరోజముల్ తీరైననాచు

మెడడ నుమాంసంబు మించిన బురద
తరచైన యీ౽కులు దర్వీకరాళి
పొడియైన భూషణపుంజంబులెల్ల
సైకతనిచయంబు చాడ్పున నెసగె"

(పుట 470-71; పంక్తులు : 4023-35)

ఇతడు పూర్వకావ్యపరిజ్ఞానమున్న కవిమాత్రమేకాక సంస్కృత వ్యాకరణ మర్యాదను ఆకళించుకొన్న పండితుడని, ఆతని సమాస రచనాపద్ధతి నిరూపించుచున్నది.

"పూర్వపర్వతశిరఃపూజ్యాగ్రమందు
ఘనతరమాణిక్యఖచితసౌవర్ణ
కుంభంబువలె నిల్చి గురుతేజమునను
భానుండు దిక్కుల ప్రబలె నావేళ"

సూర్యోదయవర్ణన సర్వకవిసామాన్యమయ్యును, ఇవి కవి సమయములు తెలిసిన కవిమాత్రమే వ్రాయదగిన పంక్తులనుటకు సందేహము లేదు. ఇందలి దీర్ఘ సమాసరచన అపండితుడు చేయ వలసినది కాదు అట్లే "పగలును రేలును బహుజాగ్రదాత్మ కాపాడుడీ మీరె కలవారు మాకు" అనెడు పంక్తులందలి 'బహుజాగ్రదాత్మ' అను సమాసమును సంస్కృతవ్యాకరణసంప్రదాయమెరిగిన పండితుడు మాత్రమే, ఘటింపగలడు.

ఇట్లు ఈ కథాభాగమునందంతటను, పండితవాక్కు ప్రతి ధ్వనించుచునే యుండునని చూపుటకు మరియొక ముఖ్యమైన విశే మును ఉదాహరింతును. వేదములో 'స' కార 'న' కార సంయు మైన అక్షరమును ఉచ్చరించునపుడు, ఆ రెంటికి నడుమ ఒక ' కారమును చేర్చి పలుకుట సంప్రదాయము. దానిని అ నిధాన 'త' కారము అందురు. స్నానము అను శబ్దములో 'స్నా' అను సంయుక్తాక్షరమున, ఆ అభినిధాన తకారమ చేరగా, అది 'స్త్నానము' అని ఉచ్చరింపబడును. స్నానమున తెలుగున తానము అను తద్భవ మేర్పడుట, ఈ 'త' కారమున

బట్టియే కాని, 'స్నా' అను అక్షరమునుబట్టి కాదు. 'స్నా' లోని 'నా' నుండి, 'న' నుండి, 'తా' పుట్టుట అసంభవము. వైదికసంప్రదాయ మెరిగిన అల్ప సంఖ్యాకులైన ఆంధ్రకవులు, ఒకటి రెండుచోట్ల ఈ స్నానశబ్దమును స్త్నానశబ్దముగానే ప్రయోగించిరి. తిక్కన భారతముప్రాచీన ప్రతులందును, ఎఱ్ఱన అరణ్యపర్వము పూర్వపు ప్రతులందును, ఈ శబ్దము స్త్నాన శబ్దముగానే కలదు. కాని అది యతిస్థానములో 'త' కారమును అపేక్షించిన శబ్దము కాకపోబట్టి ముద్రాపకులు ఆ 'త' కారమును తొలగించి లౌకికోచ్చారణము ననుసరించి స్నానశబ్దమునే ముద్రించిరి. ఆ మార్పువల్ల యతిభంగము కలుగలేదు కనుక, వ్యాకరణయుక్తమైన శబ్దస్వరూపము స్నానమే కనుక, ఆ 'త' కారమును తొలగించినందువల్ల, ఏ విధమైన లోటును కలుగలేదు. కాని శ్రీనాథుని హరవిలాసములో ఒక పద్యమున ఆ 'త' కారమును తొలగించుటచే యతిభంగమైనది.

ఉ. *ధీనిధి సెట్టినంబి తనదేహమునిండ విభూతి మంగళ
స్నానముఁ జేసి ధౌతపరిధానముఁ గట్టి త్రిపుండ్రధారియై
చే నమృతాంశుమౌళిని వశీకృతభక్తుధరించి సంతత
ధ్యానముఁ జేసి యెంతయును దత్పరభావము ప్రస్ఫుటంబుగన్.

(ద్వితీయాశ్వాసము; పద్యము 36)

శ్రీనాథుడు అచ్చట స్త్నానశబ్దమును ప్రయోగించి 'త'కారమునకు యతిని పాటించెను. ముద్రాపకులు చేసిన యీ తప్పును తొలుత పట్టిచూపినవారు, కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

వైదికమైన యీ శబ్దస్వరూపమును ఎరిగియున్న కవి, గొప్ప పండితుడై యుండవలెననుట నిస్సందేహము. ఈ గ్రంథములో *స్నానముల్ చేసియు, తమపేరు పేరో (పుట 456; పంక్తి 2715) అనుచోట, యతిస్థానమున 'త' యుండుటచే యతిభంగమైనది. ఈ కావ్యమున యతిభంగమైన ప్రదేశములు పెక్కులు నేను సవరింపబూనలేదు. కనుక యీ పాదమును అట్లే యుంచితిని. పంక్తి, అర్థవంతమై, శబ్దము సాధువై, వాక్యము అన్వితమగుచున్నప్పుడు,

ప్రత్యేకము యతికోసమని, నేను, స్వంతకవిత్వము చెప్పబూనలేదు. అపనికే పూనుకొన్నచో, ఈ గ్రంథమునందలి పేలవములైన అనేక పంక్తులు సంస్కరించియుండెడివాడను. నె నాదారి త్రొక్కలేదు. ఈ పంక్తిలో కవి యతిభంగము చేయనేలేదనియు, "స్థానముల్" అనియే వ్రాసియుండుననియు నా అంతరాత్మ బోధించినది. అయినను పైన చెప్పిన కారణములవలన నేను ఈ శబ్దమును మార్చలేదు. ఈ శబ్దస్వరూపము ఈ కవికి తెలియుననియు, ఇతడు కేవలము వ్యుత్పన్నుడేకాక, వైదికసంప్రదాయాభిజ్ఞుడనియు నిర్ణయించుటకు యీ యొక్క నిదర్శనమే చాలును. కావున, పిండితార్థమేమనగా, కల్లు ప్రతిష్ఠ మొదలుకొని బాలచంద్రుని యుద్ధమువరకును వ్రాసిన ఈ కవి సామాన్యుడు కాడు; పండితులలో లెక్కింపదగినవాడు. సాహితీసంపన్నుడు; ఇట్టివాడు, రసవంతమైన ఈ కథాభాగమును రచించి, ఆంధ్ర లోకమున్నంతవరకును నిల్వదగిన తనయశస్సును, శ్రీనాథునకు ధారపోయవలసిన అవసర మేమి కలదు? గ్రంథరచనము చేయుట, కవి, యశము సర్థించియేకదా! గ్రంథగుణమునుబట్టి, హస్తగతమైన ఆ యశస్సును అతడు వదలుకొనుటకు కారణమూహింపగలమా? ఒక వేళ శ్రీనాథుని పేరుపెట్టిన గ్రంథమునకు పేరువచ్చుననని అతడు ఆ త్యాగముచేసెనందుమా అది బొత్తుగా పొసగదు. పసలేని గ్రంథమునకు శ్రీనాథుని పేరుపెట్టినను పేరు రాదు; కాళిదాసు పేరు పెట్టినను లాభములేదు. గ్రంథయశము, రచనను బట్టి వచ్చును కాని, కవి పేరును బట్టి రాదు: ఈ గ్రంథము, కవిపేరు లేకపోయినను, స్వతః ప్రభావమువలన, ఆంధ్రమున్నంతవరకును జీవించియుండును. కాబట్టి ఎవడో అనామకుడు వ్రాసిన ఈ గ్రంథమునకు శ్రీనాథుని పేరు పెట్టెననుటయు క్తిరహితమైనవాదము.

అయినచో, ఉద్దండపండితుడైన శ్రీనాథుడు, ఈ సుద్దుల కవిత్వమును వ్రాసియుండునా? యుగకర్తలని పేరుబడిన తెలుగు కవులలో శ్రీనాథునివంటి జాతీయకవి యింకొకడు లేడు. అతడు ఆంధ్రదేశమంతయును పర్యటించి, రాజులను సందర్శించి, వారి సత్కారములను పొందెను. రాజమహేంద్రవరము రెడ్డిరాజుల ఆస్థాన

మునుచేరి, ఆ మంత్రికి భీమేశ్వరపురాణమును కృతియిచ్చినపుడు, తత్పురాణ రచనావ్యాజమున, గోదావరీమండలమునంతయును తనివి తీర వర్ణించుకొనెను. అతడు కొండవీటి రెడ్డిరాజుల ఆస్థానమున విద్యాధికారిగా ప్రఖ్యాతి వహించెను ఈపలనాటి చరిత్రకు రంగమైన సీమ, శ్రీనాథుని కాలమునాటి కొండవీటి రాజ్యములోనిది. సుప్రసిద్ధ చారిత్రక స్థలములైన గురజాల, మాచెర్ల, కార్యమపూడి, చంద్రభాగా నదీతీరము, ఆతనికి సుపరిచితములు.

పల్నాటివీరుల కథను శ్రీనాథుడు ఆవేశపూరితుడై క్రీడాభిరామమున ఉదాహరించెను.

"ద్రుతతాళంబున వీరగుంభితకథుం
ధుంధుంకిటూత్కార సం
గతి వాయింపుచు నాంతరాళిక యతి
గ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపద ప్రబంధమున వీ
రానీకముంబాడె నొ
క్కత ప్రత్యక్షరసుం గుమారకులు ఘీ
ట్కారంబునం దూలఁగన్"
"గర్జించి యరసి జంఘాకాండ యుగళంబు
వీరసంబెటకోల వ్రేయు నొకడు
ఆలీఢపాదవిన్యాసమొప్పగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁగన్నుల సుబ్బు బెదరుఁజూపులతోడ
ఘీట్కారమొనరించుఁ బెలుచ నొకఁడు
పటుభుజావష్టంభ పరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాటు నొకఁడు
ఉద్ది ప్రకటింప నొక్కరుం డోలవాఁడు
బయలు గుఱ్ఱంబు భంజళ్ళఁ బఱపు నొకఁడు
కొడుము దాటింపుచును బెద్ద గొలువులోనఁ
బడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు."

ఈ కథను ఆతడు ఊరక ఎరిగియుండుటయే కాదు. అందలి సూక్ష్మవివరములు కూడా ఆతనికి తెలియునని క్రీడాభిరామము నందలి (75 వ పుట) ఈ పంక్తులు ఘంటాపథముగ చెప్పుచున్నవి: " మీకు నీ గండంబులు దొలంగుంగాక యనుచు నటచని ముందటం గక్షవిలంబిత తామ్రచూడులగు నూడు పందెగాండ్రం గను గొని యిది యును నొక్క సజీవద్యూతంబ యీ దురోదర క్రీడావిహారంబు నాదరింపవలయుం బానుగంటి కలుకోడి తోడం బుట్టువులు వోని యీ జగజెట్టి కోడిపుంజుల యందుం బ్రత్యేకంబు." ఇచ్చట 'పానుగంటికలుకోడి' అనగా, కోళ్లపందెమున పోరాడిన బ్రహ్మన్న పుంజు చిట్టిమల్లు. శ్రీనాథుడు, తాను జూచిన ఆ కోడిపుంజులు నాటి చిట్టిమల్లుని తోబుట్టువులని వర్ణించెను. ఆ వీరపురుషులు త్రొక్కిన తావులను కన్నులార చూచి

"ఇచ్చోటంబోరిరి యిల పణంబుగ గొల్ల, సవతి
తల్లులబిడ్డ లవనిపతులు: ధీరులగువార లేవు
రు వీరపురుషులై మదోద్ధతి నిచ్చోట నాజిం బడిరి"
అని ఆ ప్రదేశమును వర్ణించుటబట్టి,

పల్నాటివీరులకథ, ఆతనిహృదయమును ఆకట్టుకొనెననిప్రత్యేకముగ చెప్పనక్కరలేదు. ఆ వీరుల పరాక్రమగాథలు ఆతనిని పరవశు చేయుటయేగాక, వారిపట్ల ఆతనికి గౌరవ భావమును పెంపొందించెను.

"కులము దైవతంబు గురిజాల గంగాంబ,
కలని పోతులయ్య చెలిమికాడు,
పిఱికి కండలేని యఱువదియేగురు
పల్లనాటి వీరబాంధవులకు''
"కోలదాపునం ద్రిక్కటింగూడియున్న
గచ్చుచేసిన చిత్రంపుగద్దెపలక
వ్రాసినా రది చూడరా వైశ్యరాజ!
శీలబ్రహ్మాది వీరనాసీరచరిత"

"ఈ వీరపురుషులు మనకుఁ గార్యసిద్ధి సేయుదురుగాక పదపద మనుచుంగతిపయపదంబులరిగి ..."

ఇట్లు పల్నాటివీరుల వృత్తాంతము, శ్రీనాథుని ఆవేశపూరితుని చేయగా, అతడు అంతఃప్రేరణవలన, దానిని కావ్యవస్తువుగా స్వీకరించి యుండును. అంతకుముందే, పేలవముగా అవ్యక్తరూపముననున్న ఆ పదమును పిచ్చుకుంట్లు పాడగా విని, అది తనకు తృప్తినీయక పోవుటచే, అంతకంటె ఉదారమైనపద్ధతిలో, ఆ వీరపురుషుల చరిత్రను, సత్కావ్యరూపమున ప్రతిష్ఠింపవలయునని అతడు సంకల్పించియుండును. పురాణమువలె అతి విస్తృతమగు ఆ కథ నంతను కావ్యముగ సంతరించుటకు ఇష్టము లేకయో, లేక తీరిక లేకయో, అతడు మిక్కిలి రసవత్తరమైన యుద్ధఘట్టమునుమాత్రమే చేపట్టియుండును. అయినచో, అతడా కథను, పద్యకావ్యముగా కాక ద్విపదగా ఏలరచించెనని ప్రశ్నించుచో, దానికి సమాధాన మిది: శ్రీనాథుడు, అంతకుముందే ఈ కథను, ప్రజలు పాడుకొనుచు వినుచు తన్మయులగుట కన్నులార జూచెను; దానిని అట్లే ప్రజలు పాడుకొని ఆనందింపవలెనని తలంచి, పద్యకావ్యమునకు అట్టి యోగ్యత లేదుకనుక, తానుగూడ, ఆ కథను పదరూపమున సంత రించియుండును.

శ్రీనాథుని యితర గ్రంథములలోని సంస్కృతసమాసములు, విశేషించి అతని పదగుంభనము, దుంధుభిధ్వానమువలె వినిపించెడి శైలి యివేమియు నిందు కానరావేమని కొందరు ప్రశ్నింతురు. శ్రీనాథుడు, నైషధము, కాశీఖండము, భీమఖండము మొదలైన మహా కావ్యములను ప్రౌఢసారస్వతమునకు అలంకారములుగ నుండునట్లు తీర్చిదిద్ది రచించెను; తత్కావ్య ప్రయోజనమును బొందు పఠితృ లోకము వేరు. ఇది అట్టిదికాక, పాడుకొనుటకు, చదువుకొనుటకు వీలుగా, సామాన్య ప్రజలకు ప్రీతికరముగా సులభశైలిలో పాండిత్య ప్రకర్షకంటె, కవితా సౌందర్యమునకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చి బుద్ధి పూర్వకముగా రచించినపదము. అనగా శ్రీనాథుని పద్యప్రబంధముల లక్షణము వేరు; ఈ పదప్రబంధ లక్షణము వేరు. కాని శ్రీనాథుడు

ఎంత తేలికగా వ్రాయతలపెట్టినను, "ఇవి ఈతడు వ్రాసియుండునా?" అని సందేహము కలిగించు పేలవమైన కొన్ని పంక్తులు, ఈగ్రంథమున లేకపోలేదు. నా ఉద్దేశములో, ఈ పేలవమైన పంక్తులు, పిచ్చుకుంట్ల నోటబడి అసలు రూపమును పోగొట్టుకొన్నవి కావచ్చును; లేదా, అవి మూలగ్రంథమున కొన్ని పంక్తులు లుప్తముకాగా, ఇతరులు, పూరించినవి కావచ్చును; దీనికి ఇదమిత్థమని సమాధానము చెప్పుట కష్టము.

ఇంకొక విశేషమేమనగా, కాశీఖండమును రచించిన పిమ్మట, శ్రీనాథుడు గ్రంథరచనయందు అంత శ్రద్ధవహించినట్లు కనుపింపదు. హరవిలాసము, శివరాత్రిమహాత్మ్యములు, శబ్దచాతుర్యమందు, కాశీఖండ, భీమఖండ నైషధములకు సాటిరావు. అందు ముఖ్యముగా, శివరాత్రిమహాత్మ్యము, ఎవరికోరిక్రయో చెల్లించుటకు వ్రాసిన మ్రొక్కుబడి గ్రంథమువలె యుండునుగాని, శ్రద్ధతోవ్రాసిన కావ్యము వలె నుండదు. అది, వార్ధక్యమువల్ల కలిగిన బుద్ధి బలహీనత కావచ్చును; లేక మరి ఏదైనను కారణము కావచ్చును. పలనాటి వీర చరిత్రలోని నీరస భాగములు కూడ అట్టివే కావచ్చును.

కల్లుప్రతిష్ఠ అవతారికయందు శ్రీనాథుడు తాను "చెన్నకేశవ పాదసేవారతుడ"నని చెప్పుకొన్నట్లు కలదు; శ్రీనాథుడు శివభక్త పరాయణుడు; ఆతడే దీనిని రచించియున్నచో, ఇట్లు చెప్పికొనునా అని శంకించుట యుక్తి యుక్తముగ తోపదు. ఏమనగా శ్రీనాథుడు ఆ అవతారికయందే, "శ్రీకంఠుపదు మేపుశివునాత్మదలచి" తన శివభక్తిని ప్రకటించకొనెను. అంతియెగాని, చెన్నకేశవుని ఆశ్రయించి, శివుని విడిచిపెట్టలేదు. వాదమునకు, అది సరియేకాని, శివభక్తిపరాయణుడైన శ్రీనాథుడు తాను "చెన్నకేశవ పాదసేవారతుడన"ని, ఏల చెప్పికొనవలయును? అని ప్రశ్నించుచో, చెన్నకేశవుడు పల్నాటి వీరులకు ఇష్టదైవము. ఆయనను సంస్మరింపకుండ, పల్నాటివీరులకథను వ్రాయుట పొసగదు. అంతియెకాక, శ్రీనాథుడు, విష్ణునామమును స్మరింపనేరని, వీరశైవుడు కాడు. తిక్కన, పోతనలు శివపూజా దురంధరులయ్యును, ఎట్టి శివకేశవుల బేధమును పాటింపని అద్వై

తులో శ్రీనాథుడుకూడ అట్టివాడే. భీమేశ్వరపురాణములో అతడు కావించిన విష్ణుక్షేత్రమైన సర్పవరపుర వర్ణనమును పరికించుచో, అతడు వైష్ణవుడేమో అను భ్రమకల్గును. అంతమారమెందులకు, హరవిలాసమున శివునిలీలలను వర్ణించుటకు ఉపక్రమించిన ఈ కవి, కృత్యాదిమంగళాచరణపద్యమున కంచివరదరాజేశ్వరస్వామిని(విష్ణువు) స్తుతించెను :

"శ్రీమహిళాపయోధరహరిణ్మణిహారము హస్తిభూధర
స్వామి పయోజసంభవుని జన్మముఁ గాచినవేల్పు దేవతా
గ్రామణి కంచి శ్రీ వరదరాజు మనోహరపుణ్యకోటి పీ
ఠీమణిమండితుం డవచిదేవయ తిప్పఁ గృతార్థుఁజేయుతన్"

పూర్వోదాహృతమైన "సకలధర్మంబులు సమ్మతి విడచి, నా శరణందితే నను జేర్చుకొందు వగవకు మదిలోన వద్దు భయంబు, సత్యమీమాట" అను పంక్తులకు మూలమైన గీతాశ్లోకముతో పోల్చి చూచినచో, ఈ అనువాదము శ్రీనాథునిదే అని అంతరాత్మ ప్రబోధించును. సంస్కృతశ్లోకమును, ఎంత గంభీరార్థము, జటిల శబ్దములు కలదానైనను, సరళమైన తెలుగు పద్యమున ఇముడునట్లు అనువదించెడి నేర్పు శ్రీనాథునకు కలదు ఆయన ఈ ప్రజ్ఞను, నైషధాంధ్రీకరణమున బహుధా ప్రదర్శించెను. ఆయన అనువాద పద్ధతిని గురించి పరిశ్రమచేసిన పండితులు, ఈ పంక్తులు శ్రీనాథునివే, అని చెప్పుటకు సందేహింపరు.

సాధారణముగా తెలుగు కవులు, విశేష్యమునకు విశేషణమును కూర్చవలసివచ్చినప్పుడు విశేషణమును ప్రథమావిభక్త్యంతముగా నుంచి, దానికి "అగు" అను క్రియాజన్యవిశేషణమునుచేర్చి, విశేష్య ముతో పొందింతురు. కాని శ్రీనాథుడు సంస్కృతకవులవలె, తరుచుగా, విశేష్యవిశేషణములను ఏకవిభక్తిలోనే నిల్పుచుండును; క్రీడాభి రామము శ్రీనాథ కృతమే అని ఋజువు చేయుటకు శ్రీ ప్రభాకరశాస్త్రి గారు, చెప్పిన తిరుగులేని యుక్తులలో ఈ విషయమును పేర్కొని యున్నారు. విశేషణ ప్రయోగములో శ్రీనాథునిది, యింకొక చిత్రమైన పోకడగలదు.

తెలుగు కవులు ఒక వాక్యమును విశేష్యమునకు విశేషణము చేయవలసినపుడు, ఆ విశేషణవాక్యమును సమాపకక్రియతో పూర్తిచేసి, విశేష్యముతో పొందింతురు కాని శ్రీనాథుడు అసమాపక క్రియలతో అనేక వాక్యములను మాలగా గ్రుచ్చి, ఆ విశేష్యమునకు అలంకరించుటకు ముచ్చటపడును. దీనికొకఉదాహరణముగా, కాశీఖండము నుండి ఈ పద్యమును పేర్కొనవచ్చును.

"దుర్భిక్ష దోషంబు దొరకొన్నఁ గడపని
కడపని గృహ సూతకంబునందు
నింటఁ బీనుఁగు వోయె నేనియుఁ గడపని
కడపని ముక్కడి గవిసె నేని
కువలయేశుడు దండుగులుగొన్న గడపని
కడపని భవనంబు గాలె నేని
పితృకార్యవిధి సమాప్తింపక గడపని
కడపని ముట్టంటు గలసె నేని
వేళగాకున్నఁ గడపని వేలుపులకు
మీఁదువోకున్నఁ గడపని మిన్నకెట్లు
గడపి రింటింట నీ కాశికాపురమునఁ
బుణ్యగేహిను లిది మహాద్భుతము గాదె ?"

ఇట్లే బాలచంద్రుని యుద్ధమున, కని, మాంచాలకురులను వర్ణించుచు విశేషణవాక్యములను పొందించిన పద్ధతి శ్రీనాథుని తలపించుచున్నది.

"బంభరచయమును భయమొంద జేయు
కాటుకకాకచే కందగాజేయు
చీకటి గుహలందు జేరగాదించు
కాలాంబుదంబుల గట్టులజేర్చు
దీర్ఘమై మనుపులై తీరైననెరులు"

ఈ కారక వైచిత్రి తెలుగున ఒక్క శ్రీనాథునిదే; కనుక, పైన చెప్పిన కారణములన్నిటినిబట్టి, పల్నాటి వీరచరిత్రను అతడు వ్రాసి

యుండుననని భావించుట, దోషముకాదు; ఆతడు దానిని వ్రాసి యుండెనేని, వ్రాయలేదనుకొనుట మహాపచారమగును. ఏనాటికేని భారద్వాజసగోత్రుడు, కవిసార్వభౌముడు ఇంకొక శ్రీనాథుడు, పరిశోధనలవల్ల బయలుపడువరకు, శృంగారనైషధకర్త శ్రీనాథుడే పల్నాటి చరిత్ర కర్తయని అనుకొందము.

శ్రీనాథుని రచనగా కానవచ్చెడి యీ కథాభాగమును ఇంతకు ముందు శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు, పరిశోధించి, ప్రకటించి, ఆంధ్రులకు మహోపకారముచేసిరి. ఆయన కృత్యాదిని ఆధారముగా గైకొని, యీ రచన శ్రీనాథునిదే అని ఘంటాపథముగా వక్కాణించిరి. నేను సాధ్యమైనంతవరకు, యుక్తియుక్తముగా,ఆవాదమునే, బలపరిచితిని. నిజము దేవునికెరుక. శ్రీ ఉమాకాంతముగారు, గ్రంథము కంటె పెద్దదైన విపులమగు ఉపోద్ఘాతమును వ్రాయుచు అందు, శ్రీనాథుని గురించి, ఆతని రచనలను గురించి కొన్ని అభిప్రాయములను ప్రకటించిరి. ఆయన అభిప్రాయములతో, నేనేకీభవింతునో ఏకీభవింపనో, ఆమాట అటుంచి, ఒక్క అంశమును మాత్రము పూర్వపక్షము చేయవలసి వచ్చినందుకు, చింతించుచున్నాను. శ్రీనాథుడు,

"కుల్లాయుంచితిఁ గోకసుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ బిసికితిన్ విశ్వస్త వడ్డింపగాఁ
జల్లా యంబలి త్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుడన్"

అను పద్యమున "తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుడన్" అని సంబోధించుట బట్టియు

"ప్రౌఢి పరికింప సంస్కృతభాషయంద్రు
పలుకు నుడికారమున నాంధ్రభాషయందు
నెవ్వరేమన్ననంద్రు నా కేమి కొఱఁత
నా కవిత్వంబు నిజము కర్ణాటభాష"

అనుపద్యమును బట్టియు, శ్రీ నాథుడు కన్నడదేశస్థుడని, కర్ణాటకుడని, అక్కడనుండి వలసవచ్చి ఆంధ్రదేశమున స్థిరపడిన

వాడని, ఒక సారాంశమును తేల్చిరి. ఇది నాకే కాక ఆంధ్రులందరి కిని మనస్సు నొప్పించెడి సిద్ధాంతము. దీనిని సహింపలేక కొందరు "కర్ణాటరాజ్యముతో పూర్వపరిచయమున్న శ్రీనాథుడు, దారిద్ర్యపీడితుడై, అపరవయస్సున మరల దేశసంచారము చేయవలసివచ్చినపుడు, కన్నడభూమికి పోయి, కన్నడరాజ్యలక్ష్మినని సంబోధించుచు తనను ఎరుకపరుచుకొన్న ఆత్మదైన్యపూరితమైన పద్య మిది" అని సమాధానముచెప్పిరి. అది అట్టిదే. కాని "నా కవిత్వంబు నిజము కర్ణాట భాష" అను వాక్యమునకు సరియైన తాత్పర్యము ఇంతవరకు ఎవరును చెప్పలేదు. దీనినిగురించి నాకు తోచిన అభిప్రాయము ఇది :

ఇచ్చట కర్ణాట భాష అనగా, కర్ణాటశైలి అని అర్థము. ఒక కవి రచనను గురించి, 'వానిభాష కఠినముగా ఉండును; వాని భాష' రసవంతముగా ఉండును అని మనము చెప్పునప్పుడు, అచ్చటి ఆ కాఠిన్యముగాని, రసవత్తగాని, భాషకు సంబంధించనది కాదు; శైలికి సంబంధించినది; కనుక, అక్కడ భాష అనగా శైలి అని అర్థము. శ్రీనాథుని పద్యములో 'భాష'కును శైలియనియే అర్థము. అయినచో, "నా కవిత్వంబు నిజము కర్ణాటశైలి' అని శ్రీనాథుడు ఎందుకు అనలేదని అడిగినచో, దానికి కారణ మిది : ఈ 'శైలి' అను పదమును, మనము ఆంగ్లభాషలో Style అను దానికి పర్యాయ పదముగా కల్పించుకొన్నదే కాని, మన భాషలోని శబ్దము కాదు. ఇది మన అలంకారశాస్త్రములో ఎచ్చటను లేదు. మన పూర్వు లెవ్వరును దీనిని వాడలేదు. శైలికి సన్నిహితమైన అర్థముగల శబ్దములు రీతి, శయ్య అనునవి కలవు. ఆ శబ్దములనైనను, విశేషార్థములో వాడెదరుకాని సాధారణార్థములో వాడరు. కావున శైలీశబ్దము మనకు నూతన సంపాదనము. శ్రీనాథుడు ఇయ్యెడ భాషాశబ్దములను లక్షణార్థములోనే వాడెను, వాచ్యార్థమున కాదు.

శ్రీనాథుని పద్యములో కర్ణాటభాష అనే పదమునకు వాచ్యార్థమే యున్నదనుకొన్నచో అతడు వ్రాసిన అన్ని గ్రంథములలో, ఒక్క వాక్యమైనను కన్నడభాషలోనిది చూపగలమా ? చూపుటకు లేదుకదా ! నన్నెచోడునివలె, కన్నడపదములనైనను విచ్చలవిడిగా

వాడని శ్రీనాథుడు, "నాది కర్ణాటభాష" అని వాచ్యార్థములో ఎట్టు లనగలడు ?

అయినచో కర్ణాటకశైలి అనగా అర్థమేమి ? సంగీతములో మార్గసంగీతము, దేశిసంగీతము అను రెండుభేదములున్నవి. మొదటిది శాస్త్రనిబద్ధమై నిర్దుష్టమైన సంగీతము. రెండవది, శాస్త్రనిర్దుష్టము కాని,ఆయాప్రాంతములందలి జనులనురంజింపచేయు ప్రజాసంగీతము. ఈ రెండును విభిన్నములైనను, ఒకదానిప్రభావ మింకొకదానిపై నెరపుకొనుచునే యుండును. శాస్త్రీయసంగీతములోని ఫణుతులు దేశిలోనికి ప్రవేశించుట, దేశిసంగీతములోని ఫణుతులు శాస్త్రసంగీతములోనికి అవతరించుట, నిరంతరము సాగుచునేయుండును. ఈ రెండిటి సమ్మేళనమువల్ల శాస్త్రజ్ఞాన మున్నవారితోపాటు శాస్త్రజ్ఞానము లేని సామాన్యులనుకూడ ఆనందింపజేయు ఒకానొక శైలి, మన దేశమున పరిణామము చెందినది. ఆ సంగీతశైలియే, ఇప్పటి కర్ణాట సంగీతము. అంతియెకాని దాక్షిణాత్యులందరు పాడెడి సంగీతము కన్నడదేశమునుండి ఉద్భవించినది కాదు.

ఈ మార్గ దేశి అనెడి భేదము ఒక్క సంగీతమునందే కాక, సాహిత్యమందును, నాట్యమందునుకూడ కలదు. సుమారు ఏబది ఏండ్ల క్రిందట, నట్టువరాండ్రు, తీర్చినసభయెదుట చేయు నాట్యమును భరతనాట్యమనియు,భరతాభినయమనియు, పెండ్లియూరేగింపుముందు అడుగడుగున ఆగుచు జావళీలు పాడుచు జేయు అభినయమునకు కర్ణాటకమనియు పేర్లుండెడివి. ఈ రెండవజాతి అభినయము కేవలము భరతశాస్త్రోక్తమును కాక, కేవలము స్వారస్యములేని చిందువేయుటయు కాక, మార్గ, దేశి మేళనమున ఒక విధమైన సాధారణరంజకత్వముకొరకు ప్రదర్శించెడి కళ. కనుక, దానికి కర్ణాటక నాట్యమని పేరువచ్చినది. పెండ్లిండ్లకు, నట్టువమేళమును పిల్చినపుడు, పెద్దలు అడిగెడివారు : "మీ మేళములో, భరతాభినయము చేసెడివా రెవరైన ఉన్నారా ? అందరిదీ కర్ణాటకమేనా?" అని. ఆ మాటలు, ఆ సంప్రదాయము ఇప్పుడు పోయినవి. సంగీతనాట్యములలోవలె, కవిత్వములో కూడ మార్గ, దేశి భేదములున్నవి.

సంస్కృతమును, సాంస్కృతికమును అయిన కవిత్వము మార్గకవిత్వము. జానుతనమును, దేశీయతయును కలది దేశి. ఈ రెండిటి ప్రభావము ఒకదానిపై ఇంకొకటి ప్రసరించి, ఉభయగుణ సమ్మేళనమువల్ల ఉభయప్రాధాన్యముగల ఒక శైలి ఏర్పడును. ప్రత్యేకముగా, సాంస్కృతికమును, దేశియును చేపట్టక, రెండిటి సారమును ఆకళించుకొని, చెవికి యింపును, మనస్సునకు సొంపును కలిగించెడి ఒక శైలిని శ్రీనాథుడు, తెలుగుభాషలో అవతరింపజేసెను. ఆ శైలినే, ఆతడు సంగీతనాట్యపరిభాషానుకరణముగా, కర్ణాటభాషగా పేర్కొనెను.

శ్రీనాథునకు పూర్వము, తెలుగున శబ్దప్రాధాన్యముగల కవిత్వమొకటియును, అర్థప్రాధాన్యముగల కవిత్వ మింకొకటియును, రెండు పాయలుగ ప్రవహించుచుండెడివి. ఒకశైలి సంస్కృతమయమైన శబ్దములతోను, వేరొకటి జానుతెనుగుశబ్దములతోను విభిన్నశాఖలుగా విడివడి వర్ధిల్లినవి. శబ్దార్థములకు సమ ప్రాధాన్యమును, సాంస్కృతదేశీయములకు సమప్రాధాన్యమును యిచ్చి తన పేరుమీద ఒక శైలిని సృష్టించిన కవి, శ్రీనాథుడు. "నాకవిత్వము శుద్ధ సాంస్కృతికమును కాదు; శుద్ధ దేశీయమును కాదు; ఉభయప్రాధాన్యము కలద"ని ఆయన చెప్పిన పద్యమునకు తాత్పర్యము.

బెండపూడి అన్నయామాత్యుడు, శ్రీనాథుని "పాకనాటింటివాడవు, బాంధవుడవు"అని సంబోధించుటబట్టి, ఇద్దరును బంధువులని స్పష్టపడుచున్నది. కనుక, శ్రీనాథుడు కర్ణాటకుడైనచో, అన్నయ కూడ కర్ణాటకుడే కావలెను. కాని ఆమాట ఎవరు అనలేదు; అనజాలరు. బెండపూడి అన్నయ ఏ శాఖవాడో, శ్రీనాథుడును ఆ శాఖవాడే. అనగా ఇద్దరును పాకనాటి నియోగులు. ఇద్దరును ఏకశాఖీయులు కానిచో, వారికి చుట్టరికమే కుదరదు. నిన్నమొన్నటి వరకును నియోగులతో, పాకనాటివారికిని ఆరువేలవారికిని సంబంధములు లేవు; బంధుత్వములు లేవు. కనుక శ్రీనాథుడు ఆరువేల నియోగియునుకాడు. బ్రాహ్మణశాఖలలో వెలనాటి, వేగినాటి, కాసలనాటి, పాకనాటి, ఆరువేలు అను శాఖాంతరములు ఒక్క ఆంధ్రదేశముననే కలవు కాని కన్నడదేశములో ఉన్నట్లు నేనెరగను.

ఎవరును చెప్పలేదు. ద్రావిడ కర్ణాటక దేశములనుండి ఆంధ్ర దేశమునకు వలసవచ్చి స్థిరపడినశాఖలవారికి, వారి అభిజననామములేకలవు. కాని, ఆంధ్రశాఖానామములులేవు. శ్రీనాథుని పూర్వులు ఏ నాడో తెలుగుదేశమునకు వచ్చి ఇక్కడ స్థిరపడి పోయినను, వారికి తెలుగు బ్రాహ్మణశాఖలతో స్నేహమేర్పడునేకాని బంధుత్వమేర్పడదు. ఏనాడో, తెలుగుదేశమునకు వచ్చిన ద్రావిడ బ్రాహ్మణులు అనగా, ఆరామద్రావిడులు, దిమిలిద్రావిడులు, మున్నగువారు పూర్తిగా, తెలుగు బ్రాహ్మణులలో లీనమైపోయినను ఇచ్చి పుచ్చుకొను బంధుత్వము చేయవలసివచ్చునపుడు మాత్రము, వారి వారి శాఖలుదాటి ఆవల అడుగుపెట్టరు. తెలుగుదేశమునుండి, దక్షిణాదికి వలసపోయిన రాజులు, రెడ్లు, కమ్మవారును, అరవ మొదలియారులతోను, పిళ్ళేలతోను, వెల్లాలతోను, తమ తమ శాఖలను దాటి, సంబంధములు చేసినట్లు కానరాదు. మంచియో చెడ్డయో ఈ కాలమునకూడ, ఈ కట్టుబాట్లు ఈ విధముగా చెల్లిపోవుచుండగా, ఆకాలమున ఇవి ఎట్లుండెడివో చెప్పనక్కరలేదు. కనుక శ్రీనాథుడు, అన్నయ్యకు బంధువగునేని (అదిసత్యమే) అతడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడు. శ్రీనాథుడు కన్నడుడుకాడని అచ్చముగ తెలుగువాడని చెప్పుటకు ప్రసక్తానుప్రసక్తముగ, ఇంత చెప్పితిని గాని ఈ చర్చ శ్రీనాథుని కర్తృత్వమునకు ఉపకరించుననికాదు.

లోకములో ఏ కావ్యమునైనను ప్రతిపద్యరసాస్పదముగా వ్రాసిన కవులు పెక్కురుండరు. అందునను విపులమైన ఇతివృత్తము గల చారిత్రకకావ్యమున అన్ని ఘట్టములును రసవంతములుగానే యుండవలెనని కోరుట, చందమామను అందుకొనుటకు చేతులు చాచుటవంటిది. కథాంశము భావనిర్భరమైనప్పుడే, రచన రసవంత మగునుకాని, అది భావహీనమైనప్పుడు, రచనలో రసవత్తయుండదు. కనుక ఒక కావ్యగుణమును రసాపేక్షచే, పరిశీలింపవలసివచ్చి నప్పుడు, కలగవలసినచోట, రసస్ఫూర్తి కలిగినదా, లేదా అని వివేచింపవలయునేకాని, కావ్యమంతటను రసము వెల్లివిరిసినదా లేదా, అని వితర్కింపరాదు. కథనాత్మకమైనరచనచేసినకవి, పాటింపవలసిన ముఖ్యమైనధర్మములు కొన్ని కలవు. అవి, కథను నిర్వక్రముగా నడుపుట, కథాగతికి ఉపహతి కలిగించు అప్రస్తుత ప్రసంగములు చేయకుండుట, కథను అలంకరించెడి ఉద్దీపన విభావాత్మకమైన వర్ణనలు చేయుట, కథారంగమును, కథాపురుషుల మూర్తులను ప్రత్యక్షగోచరమగునట్లు వర్ణించుట, ఆ యా సందర్భముల, ఆ యా పాత్రలచేత, తదుచితసంభాషణములు చేయించుట, కార్యవశమున కొంత, వాక్యవశమున కొంత, పాత్రల స్వభావాదులను నిరూపించుట మొదలైనవి. ఈ కావ్యాంశము లన్నింటిని, యథాభావ రసావస్థముగా ప్రదర్శించుచు, కథామూర్తిని సర్వాంగ సుందరముగా నిర్మించి, రసవద్ఘట్టములలో రసపుష్టిని కలిగించెనేని ఆ కవి, చరితార్థుడైనట్లే భావింపవలయును.

ఈ కావ్యగుణములను పరిపోషించుటకు, కవికి, నిశితమైన భావనాశక్తియు, తీక్ష్ణమైన భావావేశమును, నేపథ్యశిల్పరచనా

కౌశలమును, లోకవృత్త పరిజ్ఞానమును సహజముగా నుండవలెను. ఈ గుణసంపద యంతయు, కవి, సంతరించుకొను, కవితా సామగ్రి. ఈ సామగ్రిని, యథోచితముగా ప్రయోగించునేరుపే, కవితాశిల్పము.

ఈ కావ్యమున నీరసములు పేలవములైన ఘట్టములు కొన్ని యున్నవనుట నిజమే; అయినను ఇందు పూర్వోదాహృతమైన కావ్యగుణములు కలిగి హృదయమును చూరగొని, ఆహా అనిపించెడి ఘట్టములు పెక్కు కలవు. అట్టి ఘట్టములలో, బరిమీద పోరెడి కోళ్ళవర్ణనమును పొలికలను చూచుటకు పోయిన కన్నమదాసును వర్ణించు ఘట్టమును ప్రత్యేకముగా చెప్పుకొనదగినవి. ఇట్టి భావనాశక్తి ఆంధ్ర మహాకవులలో ఏ ఇర్వురి ముప్వురికో మాత్రము కలదనుట అతిశయోక్తి కానేరదు.

*పోరుకు విడిచిన పుంజులు రెండు
పొంగుచు రెక్కలు పొరిపొరినార్చి
కనుల నిప్పులు రాలు కైవడి రవులు
ఉగ్రంపుదృష్టిని నొండొంటి చూచి
కులగిరు లదరంగ కూయుచు చేరి
ముక్కు ముక్కునచేర్చి మొనసి రోషమున
మెడయీక లుబ్బగా మెడవంచి రెండు
ఉప్పరం బెగయుచు నురవడితన్ను
తన్నిన తూలక దట్టంపుగోళ్ళ
మిట్టిమీదికి నెగసి మీరుచుతన్ని
కరువంగ వచ్చిన గతి చూచి బరిని
వలయంబుగా వచ్చి వడి తన్నుటయును
చిరచిర తిరుగుచు చేరి యాలోన
ఉరవుగ్రేయగచూచి యొక్కటై యుబ్బి
రెక్కల పెల్లార్చి రేగి మొత్తంగ
పెంధూళియెగసియు పెంపగుచుండ
సంగ్రామకేళికి సంతసంబంది
ఊకించి తన్నగా నురములనాటి

రక్తంబు దొరగంగ రాగంబునొంది
తన్నుట తాకుట తమకు నొచ్చుటయు
తలపక మగమి తలకొని రెండు
తలపడె నట దేవతలు చోద్యపడగ.
వృత్రాసురుండు, దేవేంద్రుండు మరల
వైరముల్ పొడమగా వాలి యీ పగిది
రూపులుమార్చి యారూఢి విక్రములు
కయ్యంబు చేయంగ కణగిరోయనగ
పుటపుట డయ్యుట పొరలుటపడుట
ఘటితంబులాదిగాగల చిత్రగతుల
కంటికి వేడుకల్, కలిగింపచూచి
భూమిలో ఈ పాటి పుంజులపోరు
చెప్పగా వినియును చేయ చూచియును
ఎరుగమెన్నడుననుచు నెల్లవారలును
వెరగంది పోరెడువిధము కన్గొనిరి."

బ్రహ్మన్న, "ఈ పోలికలనిలో ఈ రాత్రివేళ ఎవ్వరెవ్వరు కాచి యెట్లున్నవారో" అరసిరమ్మని పంపగా కదనభూమికి బయలుదేరిన కన్నమను కవి ఎట్లు వర్ణించెనో చూడుడు :

"వాసిగా నురమున వనమాలకదల
కరములగుజ్జరికడియముల్ మెరయ
నేర్పైన పిడిగంట నెమలిసోగలును
నల్లనిదట్టిని నయమొప్పకట్టి
అర్ధనారీజల్లు లమరవీపునను
ఘోర భైరవకత్తి కోరమీసములు
ఎగుభుజంబులు మించు నెరజీరకండ్లు
ఘనమైనదేహంబు కాలిపెండెరము
వెరవైన యిటువంటి వేషంబుతోడ
కదలె కన్నమనీడు కదనభూమికిని."

అతడు చూచిన

"అరుద్రవసుమతి నపుడిట్టులుండె
కూడని శల్యముల్ కురుచతుండములు
స్రుక్కినచర్మముల్ చుట్టలైయున్న
ప్రేవులు నరములు పెంటలైయున్న
ఎండుమాంసంబులు ఎముకలు పగిలి
రాలిన మూలుగురాసులు తరుచు
మురిగి దుర్గంధంబు మొనసిన మెదడు
గాలికిటూలెడు ఘన శిరోజములు
కాలి కుప్పలుపడ్డ ఘనమైనబూది
చిమిడిన శవములు చెదరుకొర్వులును
నానావిధంబుల నటనలుసలుపు
భూతకోటులతోడ పొందికైయుండె
తలకాయ పుఱ్ఱెల తగబంతులాడ
శాకినుల్ మొదలైన సకలభూతములు
బెదరక వాదించు భేతాళచయము
పిల్లరివాడెడు పెనుపిశాచములు
మిణుగుర్లు దిక్కుల మించి రాల్చుచును
కొమరొప్ప పరుగిడు కొరవిదయ్యములు
వేదమంత్రంబులు వెసచదువుకొనుచు ... "

ఇది ముఖ్యముగా వీరరసప్రధానమైన కావ్యము. ఈ వీరము యుద్ధవీరము. వీరరసము అంగియైనపుడు, రౌద్ర బీభత్స భయానకములు విధిగా అంగములై తీరును. అట్లే శృంగారమునకు విప్రలంభమువలె, వీరమునకు కరుణరసము ఆనుషంగికమగును. భారతములో భీష్మ పర్వాది సౌప్తిక పర్వాంతము వర్ణించిన వీరరసాసారము వెలిసిన తరువాత, స్త్రీ పర్వము కరుణరసము వెల్లువయై ప్రవహించినది. ఈ కావ్యమున వీరరసము, దానికి అంగములైన రౌద్రాదులు, ఆనుషంగికమైన కరుణము ఇంచుమించు భారతాదిమహాకావ్యములలోవలె పరిపోషింపబడినవని నా అభిప్రాయము. యుద్ధభూమి

యందు పిశాచగణముల తాండవమును వర్ణించుపట్టున బీభత్సమును, గోపుమరణమునకై దొరమ్మ విలపించు ఘట్టమున కరుణమును, ఇట్లే తక్కినవియు ఆయాసందర్భములందు చక్కగా పరిపోషణచెందినవి. కావ్యమునుచదువుచున్నప్పుడు సహృదయులైనపాఠకులు ఇట్టి అనేకవిశేషములను గ్రహింపగలుగుదురు.

ఇంతియెకాక ఆకాలమున మనసాంఘిక మర్యాద లెట్లుండెడివో ఈకావ్యమువలన కొంతద్యోతకమగుచున్నవి. ఆకాలమున ప్రజలమాటకు మంచిచెల్లుబడియుండుటయే కాక రాజులను మందలించెడి అధికారము కూడ వారికినుండెడిది. కాని వారివాల్లభ్యము పరిమితము. అట్లే ఉదాత్తస్వభావముగల అంతఃపురస్త్రీలకు రాజకార్యములందు పురుషులకు సలహానిచ్చెడి ప్రతిపత్తియుండెడిది. రాయబారమునకు భట్టు, లేదా బ్రాహ్మణుడు పోవలెను; ఒక్కొక్కప్పుడు రాజబందుగులుకూడ రాయబారము నెరపెడువారు. రాయబారి అవధ్యుడనెడు ధర్మమును వేదవాక్యమువలె శిరసావహించెడివారు. అతడు ఎంత పరుషముగా మాటలాడినను ఆపరుషవాక్కులు ఒకరు చెప్పిపంపిన మాటలే కనుక, అవి క్షంతవ్యములని భావింపబడెడివి. ఒకవేళ రాయబారియే పరుషవాక్కులాడినను అప్పుడుగూడ అతడు అవధ్యుడు. రాయబారము ఫలించక పోయినను, రాజులు అతనిని సత్కరించి పంపుట ఆచారము. రాజులకుగాని, ప్రజలకుగాని, భూసంపదయు, గోసంపదయు మహాధనములు. సీతనపహరించిన రావణునిపై రాముడెట్టి ప్రతీకార దీక్ష పూనెనో, అట్లే పంటచేనుమీద చేయి వేసిన పరునిమీద రైతులు అంతటి ప్రతీకారదీక్ష పూనెడువారు. రైతులు, రాజులు, గోవులను తమకన్న బిడ్డలవలె చూచుకొనెడివారు. ఆవులకు, ఎడ్లకు, వారు పెట్టుకొన్న ఆ ముద్దుపేర్లు వారి పిల్లలకుకూడ లేవేమో అనిపించును.

ఇది బసవేశ్వరుడు వీరశైవమతమును ప్రచారమునకుతెచ్చిన పిమ్మట జరిగిన కథ. ఆంధ్రదేశమున పాల్కురికి సోమనాథుడు, ఈ కథాకాలముననాడే, వీరశైవశంఖారావమును చేయుచుండెను.

ఆ మతమున వర్ణభేదములేదు. దానికి ప్రతిగా, బ్రహ్మనాయుడు, వర్ణరహితమైన సంఘమును నిర్మింప పూనికవహించినవాడువలె, ఈ కథయందు లీలగా గోచరించును. నానాకులములందుపుట్టిన బాలచంద్రుని మిత్రులు. బ్రహ్మనకు పుత్రసములగుట, అందును గోసంగి కన్నమ అతని జ్యేష్ఠపుత్రునిగా పరిగణింపబడుట, అతని చేతి తీర్థ ప్రసాదములు గైకొన్నవారందరు ఏకసంఘీయులుగా పరిగణింపబడుట, మొదలగు కథాంశముల అంతర్యాతమైయున్న సాంఘిక ధర్మము, వర్ణభేదనిర్మూలన ప్రయత్నమేమో అని స్ఫురించును.

తెలుగుదేశీయచ్ఛందములన్నియు, తాళయుక్తముగా, పాడుకొనుటకు అనువైనవి. వాటిలో ద్విపదయు, రగడయు, మిక్కిలి ప్రచారములో నున్న గేయచ్ఛందములు. (Musical metres) ద్విపద అను పదమునకు రెండు పాదములు గల పద్యము అని అర్థము. ఈ ద్విపద ఇంగ్లీషులో (Couplet) వంటిది. దీని పాదమునకు మూడు ఇంద్రగణములు ఒక సూర్యగణ ముండును; నాల్గవగణముయొక్క ప్రథమాక్షరము యతిస్థానము. రెండు చరణములకు ప్రాస చెల్లవలెను. నాల్గు చరణములతో, ఒక గీతమో, ఉత్పలమాలయో, చంపకమో, పూర్తియగునట్లు, రెండు చరణములతో, ఇదియును పూర్తి యగును. కాని ఆదినుండియు ఈ ద్విపద, మాలికవలె దీర్ఘముగా వ్రాయబడుట పరిపాటి అయినది. అందుచే, ద్విపదఅనెడి పేరున కందము, గీతమువలె, ప్రత్యేక పద్యములు లేవు. ఉన్నవన్నియును ద్విపదమాలికలే. అవి మరికొంత దీర్ఘములైనచో ద్విపదకావ్యములగును. ఈ ద్విపదలక్షణములో, ప్రాసను తొలగించి, పదకర్తలు, రచన మరికొంత సులువగునట్లుగా, మంజరీద్విపదను సృష్టించిరి. రెండుపాదములున్నప్పుడే, ఆ పద్యమునకు ద్విపద అనుపేరు సార్థకమగును. కాని, ఏకపాదముగల పంక్తికి, ద్విపద అను పదము చెల్లనేచెల్లదు. అయినను ఆ ఒక్కపాదలక్షణమును, ద్విపద లక్షణమే కనుక, ఈ మంజరిని కూడా మంజరీద్విపద అని, ద్విపదమంజరి అని పేర్కొనిరి. నిజమునకు ఇది అర్థము లేని పదము.

ఈ గ్రంథమున పాటింపబడిన ఛందస్సు మంజరీద్విపద. ఇందు పెక్కుచోట్ల మూడుఇంద్రగణములు, ఒక సూర్యగణము, నాల్గవ గణము మొదట యతిస్థానము అనెడి లక్షణముగూడ, ఉల్లంఘింప బడినది. యతిభ్రంశమునకు కారణము రచయితయో, తరువాతి వ్రాయసకాండ్రో, చెప్పలేము. గణభంగమునకు మాత్రము చాలవరకు రచయితయే, కారణమని,తోచుచున్నది. ఎట్లనగా, ఈ పాటుపాడు నపుడు, ఛందస్సు, తాళానుగుణముగానున్నచో ఛందోయు క్తముగను, లేనిచో ఛందోభంగమగునట్లుగను, పాడుట ఆచారము. అట్లు పాడుటలో, తాళము కొరకు, దీర్ఘాక్షరములను హ్రస్వములు చేయుట, హ్రస్వాక్షరములను దీర్ఘములు చేయుట ఆవశ్యకమగును. అట్టియెడ, ఒక్కొక్క ఇంద్రగణమునను, ఒక మాత్ర ఎక్కువ గుటయో లేదా ఒకమాత్ర తక్కువగుటయో తటస్థించి, గణభంగమై నట్లు పాడకట్టును. నల, నగ, సల, భ, ర, త అను ఆరు ఇంద్ర గణములలో, 'నల' 'భ' అనునవి రెండును, నాలుగుమాత్రలుగల గణములు. తక్కినవి అయిదుమాత్రలుగల గణములు. ఒక్కొక్క పాదమున ఈ అయిదుమాత్రలగణముప్రక్క, నాల్గుమాత్రలగణ మున్నచో, అయిదుమాత్రలగణముమీ దపడినతాళము, ప్రక్క గణముమీదకు వచ్చుటతో, తాళము తప్పిపోవును. అందుచే, నాల్గు మాత్రల గణములోని, ఒక అక్షరమును దీర్ఘముచేసియో, లేదా ఇంకొక మాత్ర చేర్చియో, పాటగాడు, తాళము సరిపెట్టుకొనును. కాదా, పాటగానికోసము, కవియే వ్రాయును. పాటగాడు పాడిన ఆ పాఠమే, గ్రంథమున జొరబడి, గణభంగముగా గోచరించును. ఇట్టివి, ఈ గ్రంథమున కొన్ని కలవు. ఉదాహరణము :

"దిగవిడిచి మిక్కిలి దీనులైపోయి"

(పుట 106; పంక్తి 559)

ఈ పంక్తిలో మొదటి అయిదుఅక్షరములు, ఒక గణము. ఇటువంటి గణము ఇంద్రగణములలో లేదు. 'నల'మునకు ఒక లఘు వును చేర్చుటచే ఏర్పడిన అయిదు మాత్రల గణమిది. ఈఅధికమాత్ర, తాళముకొరకు పుట్టినదే; దీనిప్రక్క రెండవగణముగా నిలిచిన

'మిక్కిలి', నాలుగుమాత్రల గణమైనప్పటికి, 'లి'ని దీర్ఘాక్షరము చేసి 'మిక్కిలీ' అని దీర్ఘముగా పాటగాడు పాడును. కనుక పాడునపుడు అదియును అయిదుమాత్రలగణమేయగును. వ్రాతలో "లి" ని దీర్ఘము చేయక పోయినను, గణము సరిపోవును కాని, "దిగవిడిచి" లో "చి" ని తొలగించినచో, గణము సరిపోయి నను తాళము సరిపోదు. కనుక కవి, గణభంగమును అంగీకరించి అయిదుమాత్రలగణమును ప్రయోగించెను. దీనివంటివే, "కలసి రవి చంద్రులు గతితప్పవలయు" (పుట 194; పంక్తి 132) "ఛావంగ కట్టుదుమొ, చాలదైన్యమున (పుట 148: పంక్తి 1769) నీ సుతుడు బ్రహ్మన్న నీలవర్ణుండు (పుట 206; పంక్తి 157) మొదలైన పంక్తులు.

కొన్నిచోట్ల సంయుక్తాక్షరమునకు పూర్వాక్షరము, గురువు కావలసినచోట ఆసంయుక్తాక్షరమును తేల్చిపలికి, పూర్వాక్షరమును లఘువుగా, నిలుపుట కలదు. ఉదాహరణము: "దివ్యక్షేత్రమ్ముల తీర్థమ్ములాడి" (పుట 18; పంక్తి 294")

ఇచ్చట "వ్య" గురువైనచో, తాళము తప్పును; తాళమే కాదు; గణమును తప్పును. అందుచే, 'క్షే' ను తేల్చి పలుకవలెనని, కవి ఉద్దేశము. ఇట్లే "సచివుడే మాత్రము స్వామిద్రోహమ్ము" (పుట 51; పంక్తి 36) మొదలైన పంక్తులు. మరికొన్నిచోట్ల శబ్దము నందలి మధ్యాక్షరముమీది అచ్చునుగాని, అంత్యాక్షరముమీది అచ్చునుగాని, లోపింపజేసి, గణమును తాళమునుగూడ సరిపెట్టు కొనుట కానవచ్చును. ఉదాహరణము : "వేగుల దామినేడ వెళ్ళులై మీరు" (పుట; 206: పంక్తి 164) ఈ పంక్తిలో రెండవగణము తప్పినది. అది సంజ్ఞావాచకము కనుక, దీనికింకొక వర్ణ క్రమము కుదరదు. దీనిని పాటగాడు 'దామ్నేడ' అని పాడి, తాళము సరిపెట్టుకొనును; అట్లే "వాసంతమాడించి వరుస జాతరలు" (పుట 177 పంక్తి 2583) అను పంక్తిలో 'వాసంతము' అపశబ్దము. అయినను 'వసంతము'ను అసలుపదమును దీర్ఘము

చేసి పాటగాడు 'వాసంతమ'ని పాడి తాళమును సరిపెట్టు కొనును. ఛందోభంగమైన పంక్తులు ఈ గ్రంథమున తండోపతండ ములు గలవు. ఆ పంక్తులను, పైసిద్ధాంతానుసారముగా చదువు కొన్నచో, లక్షణభంగమైనట్లు చెవికిసోకదు. ఇదిగాక ద్విపదలో ప్రాసయతి లేదు. ఈ గ్రంథమున కొన్ని కథాభాగములు వ్రాసిన కవులు వాటినిగూడ అంగీకరించిరి: "జొన్నకంకులు మాకు గొన్ని యీవయ్యా". ఇట్లే కొన్నిచోట్ల యతిభంగములైన పంక్తులును కానవచ్చును. "శరణంబు మాపాలి శ్రీ చెన్నరాయ", "చెక్చెర మూడేండ్లు" జరిగెనిచ్చోటు. "ఇత్యాది స్థలములలో యతిభంగమైనదని ఆక్షేపించుటకంటె, కవి, యతిని పాటింపలేదనుటయే సమంజసము. పిండితార్థమేమనగా, ఈ కవులు, అవసరమైనచో, ఛందోవ్యాకరణాది నియముల నుల్లంఘించుచు, సడలించుచు, అతి స్వతంత్రులై, ఇంచు మించు వ్యావహారికమని చెప్పదగినభాషలో ఈ పాటను, రచించి పాటమర్యాదలను గమనించి దీనినిపఠింపదగునని లోకమునకు ఆదేశించి పోయిరని నా తలంపు. అట్లుకాక, ఈ రచన, కేవలము అసాధుశబ్దభూయిష్టము, లక్షణభంగమయము, వ్యాకరణవిరుద్ధము అని ఆక్షేపించువారున్నచో, వారితో నాకు వివాదములేదు.

శబ్దసాధుతా నిర్ణయమునెడ సంస్కృతమునందువలె, తెను గున ప్రక్రియానిష్కర్షత కుదరదు. సంస్కృతమున ప్రతి శబ్దమునను, ప్రకృతిప్రత్యయవిభాగసౌలభ్యము, ప్రకృతి సంయోగముచే, ప్రత్య యములలో కలిగెడి మార్పులు మొదలైన విశేషములన్నియు, శాస్త్రీయముగా నిర్దిష్టములై యున్నవి; కనుక ఆ భాషయందలి శబ్ద సాధుత్వ – అసాధుత్వములను, సుకరముగా నిర్ణయింపవచ్చును. ఏనాడో, శాస్త్రబద్ధముచేయబడిన ఆ భాష, కొన్ని వేలయేండ్లకు పిమ్మట, నేటికికూడ, ఆ రూపముతోడనే, భాసిల్లుచుండుటకు కార ణము, అది లోకవ్యవహారమునుండి తొలగి, గ్రంథస్థమైయుండుట. శాస్త్రరూఢములైన ఆ శబ్దములే, లోకవ్యవహారముననున్నచో, వాటికి, ఏ రూపాంతరపరిణతివచ్చునో, ఊహింపలేము. అనగా, సంస్కృతము, ప్రజలవాడుకలో లేకపోబట్టి అందలిశబ్దములకు అన్య

ధాత్వముకల్గలేదు. తెనుగునకు, అట్టినియమబద్ధత యింతవరకు ఏర్పడలేదు. ఈ భాషావ్యాకరణమైనను, స్వల్పప్రయోజనము గలదే కాని, సమగ్రమైనదికాదు. అసలు ఈ భాషాశబ్దములకు ప్రకృతి ప్రత్యయవిభాగమేర్పరుపబూనుట కృత్రిమమే కాక, అది వ్యర్థ పయత్నము గూడా అగును. వైయాకరణులు ఏదో, లాంఛనార్థము, సంస్కృతపద్ధతిని, ఈ విభాగప్రయత్నము చేసిచూచిరి కాని దానిని భాషాతత్త్వవేత్తలంగీకరింపలేదు. వ్యాకరణముకంటె శాస్త్రీయ మని చెప్పదగిన భాషాతత్త్వపరిశీలనముగూడ తెలుగుపట్ల కృతార్థము కాలేకపోయెను. అందుచే, పూర్వకవులప్రయోగము లును, వాటిననుసరించి పుట్టిన నిఘంటువులును, మనకు ప్రమాణములైనవి. నన్నయకాలమునుండి నేటివరకు, గ్రంథస్థమైన వాఙ్మయమంతయు కలసినను, దేశమున వాడుకలోనున్న తెలుగు శబ్దములలో సగముపాలైనను, గ్రంథముల కెక్కియుండునని నాకు తోచదు. కాగా దేశమున ఏ మూల ఏ శబ్దము ఏ అర్థమున వాడ బడునో, తెలుసుకొనకుండ అపరిచితమైనశబ్దమును అపశబ్దమను టయు. నిఘంటువులలోలేని శబ్దము, లోకములో లేదనుకొనుటయు అపచారము. మగశబ్దమునకు భావార్థకము మగతనము అని మన మెరిగిన రూపము. దీనిని కవి, యిందు "మొగతనము బాయక మొనలు చూచుచును" అనుచోట మొగతనమని ప్రయోగించెను. లోక మున మగడు అనుటకంటె మొగుడు అనుటయే ఎక్కువగా వినబడును. ఈ కవులు వ్యావహారికపదములను పెక్కింటిని ప్రయోగించిరి. వచ్చు ధాతువునకు "ఒచ్చు" అనునది వ్యవహారములో సర్వసాధారణ రూపము. "అనుజుడు పేర్మి డన్నకడకొచ్చి" మున్నగు పెక్కు చోట్ల వచ్చుట అను పదమునకు ఈ కవులు, ఒచ్చుట అను రూపమును వాడిరి. ఈ 'వ' కారాది శబ్దములు 'ఒ' కారాదులగుట ప్రాకృత భాషలమర్యాద. ఉపాధ్యాయశబ్దము ప్రాకృతమున వఝ్ఝుల, ఒజ్జలగా మారినది.

ప్రాతిపదికకు తప్ప, ప్రత్యయమునకు బహువచనము చేయుట తెనుగువ్యాకరణమర్యాదకాదు. "అటకింద యంతరంబందుల

చాల", "ఏపుంజులందుల నెరుగమే భూమి" అను చోటుల, ప్రత్యయమునకు బహువచనరూపములే పాటింపబడినవి. ఇవి "అంతరంబులయందు, ఏ పుంజులయందు" అను అర్థమున వాడుకలోనున్న రూపములు. కవి వాటిని అట్లే గ్రహించెను. ఇట్లే ఈ కవులు ప్రయోగించిన వస్తిమి, వుడితె, అట్టులయితె, ఆనతిస్తిరి, వెళ్ళితె, మొదలగునవన్నియు వాడుక పదములు. ఇవి వ్యాకరణమువల్ల సాధింపతగినవి కావు.

ఇంతియెకాక, ఈ గ్రంథమున,అర్థములో,రూపములో,అపూర్వతను ప్రదర్శించెడి శబ్దములు కోకొల్లలుగా నున్నవి. జీవాళము=సారము,లేక,జీవసారము; ఓజులు=బత్తులు; అసత్తువ=బలహీనత; మరియాద=గౌరవము; గద్దనలు=గద్దరింపులు; పరిణామము=సంతోషము, అంతము; ఆడుపాపలు=నాట్యకత్తెలు; మగసిరి=పౌరుషము;చమురు=నేయి; మాలిమి=మైత్రి; విచ్చేయు=పోవు; తల చెడు=పరాభవము పొందు; పరిగె=పరుగున; దృష్టము=దృష్టాంతము; అభిమానములు=అభిమానవస్తువులు, పౌరుషకార్యములు; పడుచువాడు=పనివాడు; గలభకారులు=అల్లరిమూక; పదిలుడు=జాగరూకతగలవాడు; పరమేశుడు=విష్ణువు; వింతవేడుక=అపూర్వానందము; ప్రాప్తంబు=విధిలిఖితము; కుంభము=అన్నపురాశి; ప్రతిమలు=బొమ్మలు; మొదలైన శబ్దములు ఇట్టివే.

నన్నయ, భారతములో ప్రయోగించిన కఱకంటుడు, ప్రాణగొడ్డము అను వ్యాకరణవిరుద్ధప్రయోగములను కాదనలేక, వైయాకరణులు, అనింద్యగ్రామ్యములుగా వాటిని పరిగణించిరి. నన్నయచే ప్రయుక్తము లగుటబట్టి, వైయాకరణులు అంగీకరించుటబట్టి, ఆ రెండు సమాసములు మాత్రమే ప్రామాణికములై, తాదృశములైన యితరములు దుష్టములుగా పరిగణింపబడెను. శ్రీనాథుడు "దినవెచ్చ మే రాజు తీర్పగలడు" అని ప్రయోగింపగా, దినవెచ్చము, ప్రామాణికము కాలేదు. అది అపశబ్దమనికూడ, ఆక్షేపింపబడినదే మో. పాల్కురికి సోమనాథుడు, అనువైనప్పుడెల్ల ఛందోవ్యాకరణాదినియమముల నుల్లంఘించినవాడే. కనుక అతని రచనలలో కానవచ్చెడి "పుడమిూశ"

"దీపకంబము" మొదలైన వింతసమాసములు అపశబ్దములుగానే పరిగణింపబడెను. మరి, ఈ పల్నాటికవులుగూడ, భూతరాట్కంబము ప్రతిమ్రోత, పుడమిూశ, మొదలగు సమాసములను యథేచ్ఛగా వాడి సోమనాథుని శిష్యవర్గములో చేరిరి. నన్నయ భారతమునాటికి, ఈ జాతి సమాసములు మనభాషలో పెక్కులుండియుండును. నన్నయ, తన అవసరమునుబట్టి, ప్రాణగొడ్డము, కలకంఠుడు అను ఆ రెండింటినే ప్రయోగించెను. కనుక ఆ రెండింటికి అనింద్యతాముద్ర పడినది. నిజమునకు ఆ జాతిసమాసములన్నియు అనింద్యములే. కన్నడములో, నన్నయకుపూర్వమునుండియు, నేటివరకును, ఇట్టివి, వైరిసమాసములనుపేర చెల్లుచున్నవి. మన నిత్యవ్యవహారములో ప్రతిరోజు, ప్రతివాడు, ప్రతియేట, శుద్ధతప్పు, మున్నగు వైరి సమాసములు లేని వాక్యమే కనపడదు. ఆంధ్రభాషాజాత్య చిహ్నములైన ఆ సమాసములను శిరసావహింపవలసినదే.

నా బాల్యములో పిచ్చుకుంట్లు మా పల్లెలకు వచ్చి, ఉదయవేళ కమ్మవారి యిళ్లిళ్లు తిరిగి గోత్రములను చెప్పుచు రాత్రిపూట రచ్చపట్టున పల్నాటి పదమును పాడుచుండెడివారు. పాటగాడు చేత, కత్తిని,డాలును పట్టుకొని, కాలికి గజ్జెలు కట్టుకొని వీర కరుణ రసములు వెల్లివిరియునట్లు ఆ పాటనుపాడుచు అభినయించుచుండగా అక్కడ చేరిన ప్రజలు రసావేశభరితులయ్యెడివారు. నేను నా బాల్యములో, అట్టి ఆనందమును పెక్కుసార్లు అనుభవించితిని ఒక్క పల్నాటి పదమే కాదు బొబ్బిలికథ, చిన్నమ్మ కథ, బాలనాగమ్మ కథ మొదలైన బుఱ్ఱకథలు, మా హృదయముల నుఱ్ఱూత లూగించెడివి. ఒంగోలు తాలూకా, ఈతముక్కల గ్రామస్థులైన జంగాలు, శైవగాథలను రచ్చపట్టుల రాత్రిపూట పాడుచుండగా, ఆ పాటలను ప్రొద్దుపోయెడివరకును వినుచు ఆనందముతో ఉప్పొంగెడివారము. ఆ దినములలోనే నేను కూచిపూడి వారి నాటకములు కలాపములు పెక్కుసార్లు దర్శించుట కూడ తటస్థించినది. ఈ విధముగా, ఇట్టిపాటల పదముల పరిచయము, అక్షర జ్ఞానము కలుగక పూర్వమే నాకు కలిగినది. నేను పెద్దవాడనై కొద్దియో, గొప్పయో, ప్రౌఢసాహిత్యసంపాదనము చేసినతరువాత

కూడ, నన్ను ఈ దేశికవితావాసన విడనాడలేదు. అట్టి నాకు శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు సమారు ఏబదిసంవత్సరముల క్రితము ప్రకటించిన పల్నాటివీరచరిత్రయందలి బాలచంద్రుని యుద్ధకథాభాగమును చూచుభాగ్యము కలిగినది. నాటినుండియు పల్నాటికథ అంతయు, ఎవరైనను అచ్చువేసి ప్రకటించుచో, ఆంధ్ర దేశమున కెంతయో ఉపకారము చేసినట్లగును కదా అని ఉవ్విళ్ళూరు చుండెడివాడను. ఇట్లు కొంతకాలము గడిచినపిమ్మట, నేను మద్రాసు విశ్వవిద్యాలయమున ఉద్యోగము స్వీకరించిన కొన్నినాళ్లకు, కీ. శే వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, పల్నాటి కథా ప్రాశస్త్యమును ఉగ్గడించుచు, ఆ గ్రంథమును సంపూర్ణముగా ప్రకటించుట ఎంత ఆవశ్యకమో, నాకంటె ఎక్కువ అభినివేశముతో నొక్కిచెప్పిరి. కాని నేను, ఆ కాలములో ఆ పనికి పూనుకొనలేదు. తరువాత, నేను ఆంధ్ర విశ్వవిద్యాలయములో ప్రవేశించిన పిమ్మట ఈ విషయమై హెచ్చరింపగా, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమున కొన్ని వ్రాత ప్రతులున్న వనియు, అవియైనను అసమగ్రములేననియు, ఒకొక్క ప్రకరణమునకు రెండుమూడు పాఠములు కలవనియు, నేను గ్రంథప్రకటనమునకు పూనుకొన్నచో తాము చేతనైనంత సహాయము చేయుదుమనియు శ్రీ శాస్త్రిగారు వాగ్దానము చేసిరి. ఆ వాగ్దానము చేయుటయేకాక, పుస్తకభాండారమునలేని భాగములను సంపాదించువిషయములో, కొన్ని సూచనలుకూడ చేసిరి. కృష్ణా, గుంటూరుజిల్లాలలో ఎవరిఇండ్లలోనైనను ఈ లుప్తభాగముల వ్రాతప్రతులున్న వేమో విచారించిచూడుమనియు, శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారివద్ద, కథాప్రారంభమునుండి, బాలచంద్రుని యుద్ధము వరకు, సంక్షిప్తరూపమున ఒక ద్విపదకలదనియు, వారుకూడ యీ గ్రంథప్రకటనపట్ల కుతూహలము చూపుచున్నారనియు, వారిని అడిగినచో దానిని ఇచ్చెదరనియు సూచించిరి. నేను వారిమాటమీద శ్రీ వేంకట కృష్ణారెడ్డిగారిని అడుగగా, వారు సంతోషపూర్వకముగా ఆ పుస్తకమును నాకు పంపించిరి. తరువాత శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గల వ్రాతప్రతులలో,

సాధ్యమైనంతవరకు మేల్తరములని తోచినవాటిని ఏరి నాకు సూచింపగా ఆ భాగములకు ప్రతులు వ్రాయించుకొంటిని. "మందపోటు : లంకన్న విరుగు" అను భాగములు అక్కడ దొరకలేదు. నేనీ గ్రంథ సంపాదనము కొరకు చాలమంది మిత్రులను అర్థించుటలో, శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారితో ప్రసంగించగా, ఆయన "మందపోటు : లంకన్న విరుగు" అనెడి భాగము తమవద్ద కలదనిచెప్పి, దానిని యిచ్చిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయము గుంటూరులోనున్న రోజులలో, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు తమవద్దనున్న పల్నాటి కథాప్రారంభము మొదలు, కోళ్ళపోరువరకును గల ఒక ప్రతిని యిచ్చిరి. ఈ భాగము లన్నింటిని చేర్చి చదువుట మొదలుపెట్టగా, దీనిని సంస్కరించి అచ్చువేయుట దుర్ఘటమని నాకు తోచినది. ఏమనగా, ఈ వ్రాతప్రతులలో నూరింట అరువది, డెబ్బది వంతుల వాక్యములు అన్వయించవు; శబ్దముల స్వరూపములు తెలియవు. అపూర్వమైన పదములకు అర్థము బోధపడదు. సందర్భశుద్ధి లేకుండ ఒక భాగము లోని అనేక పంక్తులు ఇంకొక భాగములో పునరుక్తమగుచుండును. సూర్యోదయమును వర్ణించెడి పంక్తులలోనే, సూర్యాస్తమయవర్ణన పంక్తులుకూడ కలసియుండును. ఒక యుద్ధములో గతించిన వీరుని యుద్ధక్రీడ, తరువాత జరిగిన ఇంకొక యుద్ధఘట్టములో వర్ణింపబడును. ఇన్ని చిక్కులను విడదీసి, ఎట్లో ఈ గ్రంథమును పఠనయోగ్యము చేసినను, దీనిని లోకము ఎంతవరకు ఆదరించునా అనెడి సందేహము కలిగి, మనస్సు వెనుకంజవేసినది. నా మనస్సు పిరికిబారినప్పుడెల్లను, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, ధైర్యపుమందు పోయుచు, ఎట్లైనను యీ గ్రంథమును ప్రకటింపుమని వ్రాయుచుండెడివారు. ఇంతపని చేసిన తరువాత, దీనికొక స్వరూపమిచ్చి శ్రీ ఉమాకాంతముగారు, ప్రారంభించిన పనిని పూర్తిచేసి, కృతార్థత చెందవలెననెడి ఆశ, ఉద్బోధకముకాగా, సాహసించి ప్రకటనభారమువహించితిని. ఇంతలో, కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తువారి పుస్తకభాండారములో, ఈ గ్రంథప్రతిఒకటి కలదని విని, దానిని వ్రాయించి తెప్పించుకొని

చూడగా, అది కథాదినుండి కోళ్లపోరువరకునున్న పూర్వకథకు సంబంధించిన భాగముగా కానవచ్చినది.

నిజమునకు, పల్నాటి కథాప్రాధాన్యము కోళ్లపోరుతోడనే ప్రారంభమగును. అంతకుముందు కథలో, స్వారస్యముతక్కువ. అందు చేతనే కాబోలు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో ఆ భాగమునకు చెందిన ప్రతులు లేవు. అసలు ఈ గ్రంథమునకు, ప్రతులు వ్రాయించి సేకరించిన, ఆంధ్రభాషోద్ధారకుడు, కీ॥ శే॥ బ్రౌన్ దొరగారుకూడ కోళ్లపోరాటమునుండియు గ్రంథమును సంగ్రహింపగల్గిరి. స్వారస్య మున్నను లేకపోయినను, గ్రంథపూర్తికి ఆ భాగముకూడ అవసరమే కనుక, దాని ఉనికి తెలిసికొని చూడగా అది ఉత్తరభాగముకంటె ఎక్కువ పరిణామముకలది యగుటయేకాక, పలనాటికిని పల్నాటివీరు లకును సంబంధించని అనేక ఉపాఖ్యానములు, పురాణపద్ధతిని వ్రాయ బడినట్లు పొడగట్టినది. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, నాకు ఇచ్చిన పూర్వభాగసంగ్రహగ్రంథము, ఈ పురాణములో నుండి సందర్భోచితముగా, ఎవరో, సంఘటించి కూర్చుకొన్న కథా భాగమేనని స్పష్టపడినది. అనగా, ఏనాడో ఏ ఉచితజ్ఞుడో, అప్రస్తుతవిషయభూయిష్ఠమైన ఆ పురాణమునుండి, పల్నాటి కథకు, పూర్వరంగముగా, అక్కరకు రాదగిన పంక్తులను మాత్రము, ఏర్చి ఒకసంగ్రహరూపము తయారుచేసినట్లు స్పష్టపడినది. అదియే శ్రీ లక్ష్మీనారాయణగారు నాకు ఇచ్చినది. ఈ సంగ్రహగ్రంథములో, అక్కడక్కడ కథ కలసిరాని స్థలములు చాల కలవు. ఆ భాగములను ఈ కాకినాడప్రతి సహాయమువల్ల నేను పూర్తి చేసికొని, పూర్వభాగమునకు ఒక సంపూర్ణస్వరూప మిచ్చితిని ఇదంతయు ముగిసిన పిమ్మట, శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య భాషా పుస్తక భాండారములో ఇంకొక ప్రతికలదని విని దానిని సంపాదించి చూడగా, అది మద్రాసు ఓరియంటల్ లైబ్రరీ యందున్న ప్రతికి నకలు అని స్పష్టపడినది. ఈ విధమున ఈ గ్రంథ సంపూర్తి కొరకు నాకు సాయముచేసిన పూర్వోదాహృతులైన మిత్రు లందరికి నేను చాల కృతజ్ఞుడను. ఇంతచేసినను, ఈ గ్రంథములో

అక్కడక్కడ కొంతగ్రంథపాతమున్నదేమోఅని సందేహముగొల్పెడి కొన్ని పట్టులు కలవు. ఆ స్థలములలో పాటగాడు, వీథినాటకములోని సూత్రధారునివలె సంధివచనములు చెప్పుచుండెడివాడు కాబోలు. వాటినిపూరించు తలంపుతో నేను, స్వంతకవిత్వము చెప్పరాదనుకొని, వాటిని అట్లే యుంచితిని. అయినను అక్కడ గ్రంథము లోపించినట్లు గాని, కథ కుంటుపడ్డట్టుగాని చదువరులకు అసంతృప్తిగొల్పదు.

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు నాకు ఇచ్చిన పూర్వభాగసంగ్రహమునకు గ్రంథమున పేరులేదు. దానికి మూలమైన కాకినాడ వ్రాతప్రతిలోను పేరులేదు. ఆ భాగమునకు అనుగు రాజుపలనాటి సంపాదనము: పల్నాటిరాజ్య విభాగము, అని నేనే, పేర్లుపెట్టితిని. అట్లే, కోడిపందెము ఓడిపోయి మలిదేవాదులు వలసపోయిన భాగమును, శ్రీ వెంకటకృష్ణారెడ్డిగారు పంపిన భాగము నుండిగైకొని, గ్రంథమును పూర్తిచేసితిని.

వారి గ్రంథము ఆ భాగమున అక్కరకు వచ్చినది. ఆభాగమునకు అరణ్యావాసమని పేరు పెట్టితిని. కాని, దానికి మండాదివలస అని పేరుపెట్టినచో బాగుండునని తరువాత తోచినది. యుద్ధాంతమున బ్రహ్మన్నవిరుగు ఎంతయో మహత్తరముగా, కథకు తలమానికముగా, నుండవలసిన భాగము. కాని దురదృష్టవశమున ఈ గ్రంథమున ప్రకటించిన పంక్తులు తప్ప మరేమియు దొరకలేదు. కథాంతము హఠాత్సంభవమైనట్లుగా, ఎంతయో అసంతృప్తి కలిగించును. ఈ, కథాభాగము ఎక్కడైనను లభింపగలదేమోఅని పలుచోట్ల ప్రయత్నించితినిగాని, లోకములో ఇదితప్ప ఇంకొక ప్రతి యున్నట్లు జాడలేదు.

ఈ గ్రంథమును సంస్కరించుటలో, నేను సాధ్యమైనంతవరకు ఛందోవ్యాకరణాది విరోధములను దిద్దవలెననెడి నియమము పెట్టుకొనలేదు. ఈ గ్రంథస్వభావమునుబట్టియు, వ్యావహారికభాషా సంప్రదాయమునుబట్టియు వాటిని అట్లే యుంచితిని. వాక్యముల అన్వయము చెడినచోట్ల అర్థావబోధమే కలుగదుకనుక, అర్థావ

బోధములేని కవిత్వము వ్రాయుటయు, చదువుటయు వ్యర్థమేకనుక, అనన్విత వాక్యములకు అన్వయము సంఘటించితిని. వ్రాయసకాని పొరపాటువల్ల వర్ణక్రమముచెడినచోట వర్ణక్రమము దిద్దితిని.

ఈ గ్రంథములోని కథకును, లోకములో వ్యాప్తిచెంది యున్న కథకును, కొంత విరోధముకలదు. అనుగురాజు, కృష్ణానదిలో స్నానమాడి తన పాపములను పోగొట్టుకొనినట్లు లోకమున వాడుక. అది వేరొక రచనలోనున్నదేమో! కాని అతడు, మోటుపల్లెవద్ద సముద్రస్నానము చేయుటవలన అతని పాపములు పోయినవని ఈగ్రంథమున కలదు. అట్లే అలరాజుమరణమునకు కారణము నరసింగరాజనియు, అతడును నాయకురాలును దురాలోచన చేసి, విషాన్నము పెట్టి అలరాజునుచంపించిరనియు లోకమున చెప్పుకొందురు. కాని ఈ కథయందు నాయకురాలు పంపిన విష పుష్పాఘ్రాణమువల్ల అలరాజు చనిపోయినట్లు కలదు.

ఈ పల్నాటి కథను సరిగా నూరుసంవత్సరముల క్రిందట శ్రీ ముదిగొండ వీరభద్రకవి, "వీరభాగవతము" ను పేర, ఒక పద్య కావ్యముగా రచించెను. అది చాలవరకు పురాణపద్ధతిని నడచిన గ్రంథము. బ్రహ్మన్న సాక్షాత్తు విష్ణుని అవతారమని సమర్థించుటకో అనునట్లు, అతని జననాదివృత్తాంతములను, కవి అత్యద్భుత మానవాతీతసంఘటనములతో విపులముగా వర్ణించెను. వీరభద్ర కవి కావ్యమునకు, మూలగ్రంథమేదైన కలదో, లేక జన శ్రుతిననుసరించి అతడు రచించెనో చెప్పలేము. ఏమైనను ఒక్కటిమాత్రము నిజము. పల్నాటియుద్ధము జరిగిన నాటినుండియు, సుమారు రెండుమూడువందలఏండ్లవరకును, తరువాత ఇటీవల వరకును, ఎవరికి తోచినట్లు వారు భిన్నభిన్నరీతుల, భిన్నభిన్నభాగ ములను వ్రాయుచుండిరనియు, ఈ వ్రాతలలో, ఎవరికి నచ్చిన భాగ ములు, వారు ప్రతులు వ్రాయించుకొనిరనియు విదితమగును. కాగా, ఇది ఒక్కకవి చేతిమీద నడచిన గ్రంథముకాదు. కనుకనే ఇంతటి వైవిధ్యమేర్పడినదని మనము ఊహింప వచ్చును.

ఇంచుమించు ముప్పదేండ్లనాడు సంకల్పించి వదలిపెట్టిన ఈ పని, తలకుమించిన భారమైనను, మరల చేపట్టి, ఈ వీరులయెడ గల అభిమానముచే, పదకవిత్వముపట్ల గల భక్తిచే, శక్తివంచనలేకుండ సంపూర్ణ పల్నాటి వీరచరిత్రమును సాధ్యమైనంతవరకు పఠన యోగ్యము గావించితిని. ఈ ముద్రితగ్రంథమందున్న పొరపాట్లన్నింటిని సైచవలెనని ఈ పత్సేవను ప్రేమతో స్వీకరింపవలయునని ఆంధ్ర లోకమును అభ్యర్థించుచు, దీనిని సమర్పించుచున్నాను.

లాభనష్టములను గణింపక, ఎంతయో వ్యయప్రయాసలకు లోనై, నే నడగకుండ తమంతట తాముగా ఈ ప్రచురణభారమును పూనిన "విశాలాంధ్ర ప్రచురణాలయము" వారికి మిక్కిలి కృతజ్ఞుడను. వారి భాషాసేవ సఫలమగుగాక !

పింగళి లక్ష్మీకాంతం

# అనుగురాజు పలనాటిసంపాదనము

## కథాసంగ్రహము

ఉత్తరహిందూదేశమున పాలమాచాపురి అను పట్టణము కలదు. అది సకలసంపదలకు పుట్టినిల్లు; దానిని కార్తవీర్యార్జునునివంశస్థుడైన అనుగురాజు ప్రజానురంజకముగా, పరిపాలించుచుండెను. దేశమునందలి రాజులందరును, అనుగురాజునకు కప్పములు చెల్లింపుచు, ఆతని కనుసన్నల మెలగుచుండిరి.

ఇట్లుండగా, ఒకనాడు అనుగురాజునకు, పురాకృత పాపములను పరిహరించుకొనవలెననెడి బుద్ధిపుట్టెను. పాపపరిహారార్థము అతడుతనకోశాగారమునగల ధనమును రాసులుగా బోయించి, కొలువుదీర్చి విప్రులను రావించి, వారికి భూరి దానములు చేయుదొడగెను.

వారి యిలువేల్పయిన కనకాద్రిచెన్న కేశవుడొక వృద్ధ బ్రాహ్మణరూపమున, రాజు కొలువునకే తెంచి, మున్ను కార్తవీర్యార్జునుడు, జమదగ్నియాశ్రమమునకు పోయి

ఆయనచే ఆతిథ్యమును పొంది, కృతఘ్నుడై ఆయనను సంహరించెననియు, అట్టి బ్రహ్మహత్యాదోషపతితుడైన కార్తవీర్యార్జునుని వంశసంభూతుడగు అనుగురాజుచే, దానమందుట తగదనియు విప్రులను హెచ్చరించెను. ఆ పలుకులను విని అనుగురాజు బ్రహ్మహత్యాదోషనిష్కృతికై తగుమార్గముపదేశింపుడని యావిప్రుని ప్రార్థించెను. ఆతని ప్రార్థనను మన్నించి చెన్నకేశవుడు "ఓ రాజా ! నీవు నీలికోకలు ధరించి, పుణ్యతీర్థముల స్నానదానాది క్రియలుచేయుచు, దివ్యక్షేత్రములు సందర్శింపుము. నీవు ధరించిన నీలికోకలు ఏ తీర్థస్నానము వలన తెల్లబడునో, ఆ తీర్థము మీ వంశకళంకమును తొలచి నట్లనుకొనుము. అంతతో మీరు పావనులగుదురు." అని యానతిచ్చి యంతర్హితు డయ్యెను.

చెన్నకేశవుని యాదేశానుసారము, అనుగురాజు తీర్థయాత్రలు సేవింప సంకల్పించుకొని, తన తమ్ముడగు బిరుదురాజునకు పట్టముగట్టి, పట్టమహిషి విద్యలదేవిని, చెన్నకేశవు పూజాపీఠమును, మంత్రి దొడ్డనాయని, అతని పుత్రులైన పెద్దన బ్రహ్మనాదులను, సేనాధిపతియైన తెప్పలినేనిని తోడ్కొని సపరివారుడై బయలుదేరి పుణ్యనదుల జలకమాడుచు దివ్యక్షేత్రములను సేవించెను. అతడు గయాక్షేత్రమును సేవింపబోగా, ఆ పట్టణమేలు భీమరాజు, తన పుత్రికయగు భూరమాదేవిని అతనికిచ్చి పెండ్లిచేసెను.

అనుగురాజు దేశమునగల ఎన్ని నదులస్నానమాడినను అతడు ధరించిన నీలికోకలు తెల్లబడకపోయెను. అంతట అతడు ఆంధ్రదేశమునగల కృష్ణానదినిదాటి మోటుపల్లెకు వచ్చి

సముద్రస్నానము చేయగా, అచట అతని వస్త్రములు తొల్లబడి బ్రహ్మహత్యాదోషము తొలగిపోయెను. అనుగురాజు, తనవంశ కళంకము బాపిన మోటుపల్లెప్రాంతము ముక్తిక్షేత్రమని సంతోషించి అచట డేరాలనెత్తించి, కొన్నాళ్ళు గడిపెను. ఒకనాడు అనుగురాజు, కొలువుండగా సేవకులేతెంచి, గ్రాసము లేక ఏనుగులు గుఱ్ఱములు, పశువులు శుష్కించిపోవుచుండెనని విన్నవింపగా ఆతడు తన సేనాధిపతియగు వీర తెప్పలినాయని పిలిపించి, ఆరణగండ్లకుపోయి పశుగ్రాసము తెమ్మని ఆన తిచ్చెను. వీర తెప్పలినేడు కతిపయసైన్యముతో, ఆరణ గండ్లకు పోయి అచ్చటి కాపులకు వలసిన ధనమిచ్చి పశు గ్రాసమును బండ్లకెత్తించి, మోటుపల్లెకు బయలుదేరెను. దారిలో ఊరకోట చెంత, అపురూపమగు జొన్నచేనొకటి, తెప్పలినాయుని కంటపడి అతని నాశ్చర్యపరచెను. అతడా చేనుకడ కావలియున్న రెడ్డిని, తనకు కొన్ని జొన్నకంకు లిమ్మని యడిగి తీసికొనిపోయి, వాటిని అనుగురాజునకు చూపించెను. ఆ రాజు వాటినిచూచి యబ్బురమొంది, ముత్యాలవలెనున్న అట్టి జొన్నలను తమ దేశమున సైతము పైరు చేయవలెననెడి కోర్కెతో ఆ జొన్న విత్తులను తెమ్మని తెప్పలినాయున కాజ్ఞాపించెను. తెప్పలినేడు, సైన్యసమేతుడై, ఊరకోటకు వచ్చి యా భూస్వామిని వలసిన ధనమునకు జొన్నచేను అమ్ముమని కోరెను. అందులకా రెడ్డి యంగీక రింపనందున, తెప్పలినాయుడు, ఆచేనును తన భటులచే కోయించి, బండ్లపై తరలించుకొని, మోటుపల్లెకు బయలు దేరెను. చేయునదిలేక, యారెడ్డి దుఃఖించుచు, తమ యేలిక

యగు పేంమరాజునకు ఈ దురాగతము నెరిగించెను. అతడు సకలసైన్యముల వెంటనే సమకూర్చుకొని, తెప్పలినాయుని దారిలో అడ్డగించి వానితో పోరాడెను. తెప్పలినేడు పేరవ రాజును సంహరించి శరణాగతుడైన అతని పుత్రుడు ఉత్తముని మన్నించి విడిచిపుచ్చి భూమండలమునందలి రాజులందరును స్త్రీలవంటి వారనియు, అనుగురాజొక్కడే రాజనామార్హు డనియు నొక బిరుదుశాసనము వ్రాయించి ఊరకోటయందు ప్రతిష్ఠించెను.

ఆ వృత్తాంతము విని చందవోలురాజు, అనుగురాజుపై యుద్ధము ప్రకటించెను, పెద్దన్న యాతనిపై కదియబోగా, అతని తమ్ముడగు పేర్నీడు, తానా రాజును ఓడించెదనని పల్కి అన్న యనుమతిపడసి, యుద్ధరంగమున కురికెను. యుద్ధమున చందవోలురాజు పరాజితుడు కాగా, అతనిని బందిగాగొని, పెద్దన్న అనుగురాజు కడకు తీసుకుపోయెను. యుద్ధమున పరాజితుడైన చందవోలురాజు, సంధిచేసికొని, అనుగురాజునకు తన కూంతురు మైలమాదేవి నిచ్చి, పెండ్లిచేసి పల్నాటిసీమను అరణమిచ్చెను.

అనుగురాజు పల్నాటిసీమను అరణముగా గైకొని, గురజాల ప్రవేశించి, అట కొన్నిదినములుండి పాలమాచాపురి పయనముకాగా, కనకాద్రిచెన్నకేశవు డాతనికి కలలో కన్పించి పాలమాచాపురి తొల్లిటి కార్తవీర్యార్జునుడు చేసిన పాపములవల్ల కళంకితమై అపవిత్రమై యుండెననియు, ఆ నగరము రాజనివాసయోగ్యము కాదనియు, గురుజాలయందే నిల్చుట శ్రేయమనియు, తానుగూడ అచటనే వెలసెద

నన్నియు, ఆనతిచ్చెను. స్వామి యానతిని శిరసావహించి అనుగు రాజు, గురజాలను రాజధానిగా చేసికొని, దేవాలయము కట్టించి చెన్నకేశవుని ప్రతిష్ఠించెను. కొన్నినాళ్ళకు చెన్న కేశవుని వరప్రసాదమున, విద్యలదేవికి. పెదమల్ల, పినమల్ల బాలమలిదేవులను ముగ్గురు కొడుకులును, ఈశ్వరానుగ్రహ మున, భూరమాదేవికి కామరాజు, నరసింగరాజు, అను ఇద్దరు సుతులును, మైలమాదేవికి, నలగాము అనెడి కుమారుడును జన్మించిరి. అనుగురాజు, తన బిడ్డలతో సుఖియై తనివిచెంది, ప్రజానురంజకుడై, పల్నాటిసీమను పరిపాలించు చుండెను.

ఇట్లు కొంతకాలము గడచిపోయినది. ఆనాడు ఊర కోట యుద్ధరంగమున తెప్పలినాయుని చేతిలో మరణమొందిన వీరమరాజుకొడుకు ప్రతీకారవాంఛతో, చుట్టుపట్ల రాజు లను కూడగట్టుకొని, సైన్యమును ఆరణగండ్లయొద్ద సమా యత్తపరచి యుద్ధమునకురమ్మని అనుగురాజునకు కబురు బెట్టెను. అనుగురాజు తన సేనాధిపతియగు, వీరతెప్పలి నాయుని ఆరణగండ్లను పంపెను. ఆరణగండ్ల యుద్ధమున తెప్పలినాయుడు మరణించెను. ఆ వార్తవిని గురజాలలో బ్రహ్మనాదులనుంచి, అనుగురాజు, తన బలములను కూర్చు కొని, ఆరణగండ్లకు బయలుదేరెను.

ఆరణగండ్లలో డేరాల నెత్తించి అనుగురాజు విప్రులను రావించి, యుద్ధమున జయసూచకముగా ఎవరిపేరువచ్చునో, తెల్పుడని ప్రశ్న యడిగెను. వారు, బ్రహ్మనాయుని పేరునను అతని బావమరదియైన గండుకన్నమనాయుని పేరునను, తెప్పలి

కుమారుడైన కన్నము పేరునను ప్రశ్న వచ్చినట్లు తెలియ చేయగా, అనుగురాజు, బ్రహ్మనాయుని రమ్మని లేఖవ్రాసి పంపెను. బ్రహ్మన ఆ లేఖనందుకొని, గండుకన్నమతోడను, కన్నమనేనితోడను ఆరణగండ్లకు బయలుదేరెను. ఈ లోపు సనే ఉత్తరుడును, ఆతనికి సహాయులై వచ్చిన రాజులును సైన్యముతో గురజాలకు కదలివచ్చుచుండగా, బ్రహ్మనాదులు వారిని దారిలో నెదుర్కొని రాజులను బందీలను గావించిరి. బ్రహ్మన కోరికపై అనుగురాజు వారివద్ద కప్పములను గైకొని విడిచిపుచ్చెను.

కొన్నేండ్లు గడువగా, అనుగురాజు తన కుమారులైన నలగామ, నరసింగ, ఝట్టి, పెదమాళ్ళరాజులకు పెండ్లిండ్లు చేసెను. ఒకనాడు, ఆ రాజు సపరివారుడై, వేటకుపోయి, మృగములను చంపి, మరలివచ్చుచుండగా పంటరెడ్డివారి యాడుపడుచును, ఆర్వెల్లివారికోడలును, వీరజగ్గారెడ్డి దత్తపుత్రికయునైన నాగమ్మయను నొకవనిత, అనుగురాజుకడ కేగి తన యూరువచ్చి తామిచ్చు ఆతిథ్యమును స్వీకరింపవలసి నదిగా, అతనిని ప్రార్థించెను. అనుగురాజు అందుకు సమ్మ తంచి, విందారగించి, యానందపరవశుడై, ఏదైన నొక వరము కోరుకొమ్మనగా, నాగమ్మ, తనకు పల్నాటి ప్రభువుల చెంత ఏడుగడియల కాలము మంత్రిత్వముచేయ కోరికకలదని చెప్పెను. అనుగురాజు, ఆమె కోరినట్లుగా, పత్రముప్రాయించి యిచ్చెను. ఆ పత్రమును స్వీకరించి అనుగురాజు ప్రాపు దొర కెనుగదాయని సంతసించి, నాగమ్మ అప్పుడప్పుడు గురజాలకు వచ్చిపోవుచు అక్కడి జాడలను కనిపెట్టుచుండెను. నాయకు

లందరును నాగమ్మపట్ల విసమ్రులై యుండిరిగాని, బ్రహ్మ నాయుడు మాత్రము, ఆమెను లెక్క-చేయకుండెను. అది నాగమ్మకు క్రోధకారణమయ్యెను. ఇరువురికిని పగ వృద్ధి పొందెను; పంతములు హెచ్చెను.

ఇట్లు, బ్రహ్మనాయునికిని నాగమ్మకును వైషమ్యములు పెరుగుచుండగా, కొన్నాళ్ళకు, అనుగురాజునకు వీపున రాచ పుండు పుట్టి యాతడు మరణించెను. మరణవేళ నతడు, తన కుమారులను బ్రహ్మనాయకుని కప్పగించి, యందరినొక్క-తీరున చూచుకొమ్మనియు, వారందరు నైకమత్యమున మసలు కొనునట్లుగా, చూడుమనియు, నలగామునకు పల్నాటిపట్టము కట్టి బ్రహ్మన మంత్రిత్వము చేయవలెననియు కోరెను. బ్రహ్మ నాయుని తండ్రియగు దొడ్డనాయుడు అనుగురాజు మరణము నకు దుఃఖించి, మనోవ్యథతో మంచముపట్టి, మరికొన్ని నాళ్ళకు మరణించెను.

# కృ త్యా ది

గణనాయక! శ్రీమహాదేవ!
యోగిజనార్చిత! ఉద్ధతవీర!
దేవాసురార్చిత! దివ్య ప్రభావ!
భావజమదహార! బాలేందుధారి!
భక్తిని ప్రణుతింతు భావజవైరి!
శక్తి ప్రసాదింప సన్నుతిచేతు
మహిలోన చెన్నారు మహాదేవిచర్ల
మహిముని చెన్నుని మదిని సేవించి
భారతి వినుతించి బ్రహ్మను తలచి
కాళిదాసుకు మ్రొక్కి గౌరవం బొప్ప
నళినజవంశజు నన్నయకు మ్రొక్కి
వరభరద్వాజుని వంశాన పుట్టి
ధరణి శ్రీనాథుడన్ ధన్యుండు మహిమ
విలసిల్లు పలనాటి వీరచరితమును
సలలితమ్ముగ జనుల్ చదువుట కొరకు
సంజాత నవరస సంభృతి యొప్ప
మంజరీ ద్విపదగా మన్నించి చేసె;
ఆ కథావృత్తాంత మది యెట్టిదనిన
చేకొని వినిపింతు చిత్తముప్పొంగ.

## కథాప్రారంభము

*అనుగురాజు పరిపాలనము: చెన్నకేశవుడు వృద్ధబ్రాహ్మణవేషమున కొలువునకు వచ్చి, పూర్వ పాపపరిహారార్థము తీర్థయాత్రలు చేయుమని రాజునకు ఆదేశించుట.*

అరయ లోకమ్ముల కాధార మనగ
ధరణిదేవికి ముఖదర్పణమ్మనగ
పాలమాచాపురి పట్టణం బొప్పు;
వెలయు దేవాలయవితతులు మిగుల
వలు గోపురమ్ములు పసిడ మేడలును
ప్రవిమలకాంతి సభాభవనములు
విరులతోటలు మించి విఱ్ఱవీగెడిని;
వేదశాస్త్రములచే వెలయు భూసురులు
అదిత్యతేజులై యమరు క్షత్రియులు
అల కుబేరుని కెనయైన వర్తకులు
బలిమి కీర్తియు గల పద్మనాయకులు
వెరవార సంగీత విద్యాప్రవీణు
లరుదొంద నా పురి నలరుచునుంద్రు;
ఇట్టి వైభవముల నింతగా నొప్పు
అట్టి పట్టణమేలు నా మహారాజు
కార్తవీర్యుని వంశ ఘనపయోరాశి
వార్త కెక్కిన శశి; వంశవర్ధనుడు
వీరగాముని సుతుడు విమలచారిత్రు
డాత్రేయ గోత్రజు డలుగు భూవిభుడు
పడతి విద్యలదేవి పత్నియై తనర
అనుజుడు బిరుదు రా జతనిని కొల్వ

ప్రజల బిడ్డల నట్లు పాలించుచుండె;
అష్టదిక్కుల రాజు లలుగు భూపతికి
కనకంపురాసులు కప్పమ్ము లిచ్చి
నిరతమ్ము కుశలులై నీతినుండగ
సంతోషమున పొంగి సరసు డా రాజు
"ఏను భూసురులకు నెంతయు ప్రీతి
భూరిదానమ్ములు పొందుగా చేతు
మీరెల్ల భంగుల మిగులగజముల
తురగసంఘమ్ములతోడ ధనమ్ము
గరిమతో కొలువునకు గ్రక్కున తెండు"
అని యానతిచ్చిన ఆ మంత్రివరులు
పనివడి పల్కిరి భటులను పిలిచి :
"సరగున మొగసాల సద్మమ్ము లెల్ల
ఉరువుగ శృంగార మొప్పచేయుండు"
అనిన యా భటు లంత ఔగాక యనుచు
వినయమ్ము తోడుత వేవేగ వెడలి
ప్రత్యేకముగ తీర్చి రాజవీథులను
మొత్తమ్ముగా నట మొగసాల నెల్ల
చిత్తరువులు వ్రాసి చెలువంబు మిగుల
రాజితమ్ముగ పుష్పరాగమ్ము లమర
రజితవస్తువులు వజ్రాలపేరులును
తెల్లఝల్లులు ముందు తీరి తూలాడ
చల్లగా వట్టివేర్చప్పరా ల్తీర్చి
కంబాల కటు నిటు కమ్ముల నిలిపి
మకుటతోరణములు మణిదర్పణములు
ప్రకటమ్ము తోడుత బాగొప్పచుండ
ఆ తరి జముఖాన నందున నునిచి
సొంపుగా తీర్చిరి చూపరుల్ మెచ్చ ;
అప్పుడు కవిగాయకానేకసమితి

హితులు మంత్రులు పురోహితులు నాశ్వికులు
రాజులు మన్నీలు రాయబారులును
పావనవిప్రులు భరతపండితులు
ఒప్పుగా కూర్చుండి రుచితాసనముల;
అంతట ననుగురాజాధిపు డధిక
సంతుష్టి పన్నీట జలకమ్ములాడి
వెన్నెలగతి తోచు వెలిపట్టు కట్టి
సన్నతిరుమణి నొసట చక్కగా తీర్చి
దివ్యగంధమ్ములు తెరగొప్ప బూసి
పతకమ్ము నురమున బాగొప్ప దాల్చి
అతిప్రీతి కంఠాన హారాల నునిచి
హస్తకంకణముల ననువుగా దొడిగి
చెలగి కిరీటమ్ము శిరసున బెట్టి
బ్రాహ్మణుల్ దీవించ భట్లు కీర్తింప
పుణ్యాంగనలు వేడ్క పుష్పాలు జల్ల
వెనుకటి పాపముల్ విదళింతు ననుచు
భూరిదానము చేసె భూమీసురులకు.
కనకాద్రిచెన్నుడు కారుణ్యమూర్తి
వడకుచు కడు పెక్కు వర్షముల్ చనిన
ముదుసలివేషమ్ము ముచ్చట దాల్చి
తెలికేశముల బూని తెరగొప్ప దువ్వి
బవిరిగడ్డమ్మును పంచాంగముష్టి
కావిధోవతియును కరకమండలము
గొడుగును చురకత్తి కొమరొప్పబూని
"హరి హరి" యనుచును అంతంత చేరి
"ఇదియేమి దాతృత్వ మీ విప్రులేల?
దానమందుట యెట్లు తగ చేరుటెట్లు?
ధరలోన నీరాజు తాతలు తొల్లి
బ్రహ్మహత్యాదోషపతితులు కాదె!

తగునయ్య యితనిచే దానమందుటలు ?"
అనుచు ప్రశ్నింపుచు నాశ్చర్యపడుచు
చెలువొప్ప నా రాజు జేరి యిట్లనియె :
"స్వస్తి ! దీర్ఘాయుఃప్రశస్తి ! రాజేంద్ర !
గోవిప్రశిష్టసంక్షోభ కారణుడ !,
పావనగోహంత ! పటుబ్రహ్మఘాతి !"
అని ఆదివిష్ణువు ఆడినయంత
అనుగుభూవరుడు తా నంత మూర్ఛిల్లి
ఒక్కింతలో తెలివొంది యిట్లనియె :
"ధరణీసురోత్తమ ! ధర్మనచ్ఛీల !
ఘ నేమి యెరుగను ఎట్టి పాపంబు
ఏనాటి పాపమో యెరిగింపుమ"నిన,
ఆదిదేవుండనె నపుడు నవ్వుచును :
"ఓ ధరణీశుడా ! యొనర నీతాత
ముత్తాతలై నట్టిముఖ్యుల పూర్వ
వృత్తాంతమిది : కార్తవీర్యార్జునుండు
వేటాడ ఒకనాడు విపినముల కేగి
చెచ్చెర పయిగ్రమ్మ చీకట్లవరుస
జమదగ్ని కడకును చనెను వేవేగ;
ఆ మహాత్ముడు వారి నతిగౌరవమున
ప్రేమెల్ల నేడిట తగు విందు కొనుడు'
అన చక్రవర్తి తా నటుసమ్మతించె;
కడుభక్తి జమదగ్ని కామధేనువును
'ఎంతయో మధురమౌ నింపు భక్ష్యాల
వింతగా నొసగుము వీరికి' ననిన
వివిధ భోజ్యమ్ములు వెలయగా వారు
విందులు భుజియించి వేడ్కతో నుండ
వేల్పుటావును జూచి వెరగంది రాజు
ఆస జనింపగా నడిగె నా మునిని;

వెన నాతడొప్పక వేరుగా నుండ
అక్రమరీతి నా యధిపుడు తొడరి
చక్రమున ఖండించి జమదగ్ని నపుడు
కామధేనువు గొనె కార్తవీర్యుండు;
ఆనాటి యాపాప మనుగుభూవరుడు
బాపుకొన్నది లేదు భావించి చూడు !"
అనవిని పార్థివుం డతిభీతి నొంది
"ఈ పాపవారాశి నెవ్విధి గడతు ?
సెలవిమ్ము భూదేవ" చెచ్చెర ననిన
ఆ పరమాత్ముడు ఆ రాజు కనియె;
"నీలికోకలు గట్టి నీమమ్ముతోడ
వారణాశియు మొదలు పరలు యాత్రలను
చేయగా కట్టిన చీరలన్నియును
ప్రాకటంబుగ తెల్లబారినచోట
తీరిపోవును కీడు, తేజంబు కలుగు"
అని యదృశ్యంబయ్యె నందరు చూడ.

*అనుగురాజు సపరివారముగా తీర్థయాత్రకు వెడలుట: మోటుపల్లిలో సముద్రస్నానము చేయుటచేత పాపనిష్కృతి యగుట.*

అదిగని వెరగంది యనుగుభూవిభుడు
ఆదినారాయణుండని నిశ్చయించి
"ఏను తీర్థములాడ నేగెద" ననగ
అనుజుడు బిరుదు రా జతిభీతుడగుచు
చిన్నబోవుచు నేగి చెంగటనిలిచి
అన్నకు మ్రొక్కి తా నతిభక్తితోడ
"నగరాజు బోలిన నయధైర్యమతివి
తగునయ్య నీకు నీతలపేల పుట్టె
సకలరాజ్యము వీడి సంపదల్ ద్రోసి
కాననమ్ముల కేగ గలవె సౌఖ్యములు

మాను డీ కార్యంబు మహనీయ మీరు"
అని విన్నవించిన ననుగుభూవిభుడు
"తాతగా రెన్నడో తా జేసినట్టి
పాతకమ్ముల నెల్ల బాపుదు నేను
వలదని తమ్ముడా వారింప కిపుడు"
అని పల్కి విప్రుల కతిభక్తి మ్రొక్కి
"నలువొప్ప రాజ్యమ్ము నా సోదరునకు
కట్టుడు మీరెల్ల కరుణించి" యనుచు
నంతట నా కొల్వు నతడు చాలించె.
అవనీశు పల్కుల కాశ్చర్యమంది
ఒప్పుగ విప్రులు నొగిచేరవచ్చి
ప్రీతిగా శుభవేళ బిరుదురాజునకు
పతిగాను ధరణికి పట్టమ్ముగట్ట
మండలాధీశులు మంత్రులు వచ్చి
దండప్రణామముల్ తగ నాచరింప
అలుగురాజప్పుడు అతని తమ్మునకు
చెలువార బుద్ధులు చెప్పగా దొడగె :
"వినుము తమ్ముడ ! మాట వీనులనూని
ప్రేమతో నందర ప్రియమున నీవు
నామాటగా జూచి నారాజ్యమెల్ల
ప్రకటితమ్ముగ నెపుడు పాలింపుమయ్య
ఎవ్వట్టునైనను ఈసునజేసి
నొప్పింపబోవక నుతుల జేకొనుము
తప్పుల నరయుచు ధరను బాలింపు
బందుగులను మెచ్చి ప్రజల రక్షింపు"
అని యొప్పగించిన నా బిరుదు రాజు
"భూనాథ ! నాకు నీ భూమెల్ల నిచ్చి
నన్నారడించుట న్యాయమా నీకు ?
పట్టణంబేటికి ? ప్రజలు నా కేల ?

పట్టుపుట్టములేల ? భాగ్యంబులేల ?
కనకమ్ము నా కేల ? కప్పమ్ము లేల ?
నీ తోడబుట్టియు నిను నెడబాసి
ఏ తీరుతోనుందు నీ భూమి నిచట
ననుబాసి బో నీకు న్యాయమా" యనిన
"తీర్థమ్ములాడి నే తిరిగి వచ్చెదను"
అనుచు నొడబరిచి యనుగుభూవిభుడు
సంతోషమున తన సచివుల గాంచి
"ఓ పుణ్యమతులార ! యో మంత్రులార
శైలార్ద్రివస్త్రముల్ ధరియించి మనము
సేవించ యాత్రలు చెన్నునితోడ
పోవలె నిప్పుడు పురమును విడిచి
కావలసినయట్టి ఘనుల బంధువుల
తడయక రమ్మని తరలించవలయు"
అని రాజు చెప్పగా నా మంత్రివరులు
పనివారి నందరి పరువడి పంప
భేరీలు ఢమరుకల్ పెద్దబూరగలు
ఘోషన వాయించి పొల్పుగా వీథి
చాటించి చెప్పగా సాగి రావేళ
"మాటలు వినరయ్య మన్నించి మీరు
పట్టణమ్మును బంధువర్గమ్ము వీడి
ఇట్టుల యాత్రల నెలమితో మీరు
సేవింపవలెనన్న శీఘ్రమే రండు"
అనుపల్కులను విని యాత్మబంధువులు
అరుదెంచిరావేళ నా రాజువెంట;
కోరి డెబ్బదిరెండు గోత్రాలవారు
పరగ పన్నెండిండ్ల పద్మనాయకులు
అవాలవారును నచ్యుతువారు
పైడిచుక్కలవారు పాలెమువారు

అట్లూరి మట్లూరి యాఖ్యలవారు
ముతుసానివారును ముయ్యూరివారు
ఖండారువారును బాదమ్మువారు
కొండవిందులవారు గోవిందువారు
దొడ్డనాయుడు మొదలు దోర్బలఘనులు
పెద్దన్న బ్రహ్మన్న పేరినాయుండు
బాగొప్ప తెప్పలి బలునాయకుండు
కదలిరి యనుగుభూకాంతుని వెంట;
రణరణమని భేరి రంతు సేయంగ
ధణధణమని ఝంజ తరుచుగా మ్రోయ
తేజమ్ము మీరంగ దివిజులు పొగడ
నడుమ భాగవతులు నయమున పాడ
చేరి బ్రాహ్మణులును సేసలు చల్ల
ఆటపాటలవారు నాడుచు రాగ
అంగనామణులెల్ల నారతులీయ
కనకాద్రి చెంతకు కడువేగ వచ్చి
చెన్నకేశవునకు చరువు సేయించి
విన్నవించెను రాజవిభుడు కేల్మోగచి
"ఓదేవ దేవేశ ! యో కలినాశ !
ఓ దీనమందార ! యో గుణోదార !
ఓ పుణ్యచారిత్ర ! యో పద్మనేత్ర !
ఓ పాపసంహార ! యో మహాధీర !
ఓ యిందిరాభర్త ! యో లోకకర్త !
ఓ యదుకుల రక్ష ! యో దుష్టశిక్ష !
వేదాంగముల్ నీవె ! వేదముల్ నీవె !
ఆదిమూర్తివి నీవె ! యవ్యయుం డీవె
పరమాత్ముడవు నిన్ను భావంబునందు
నెరిగి సేవింప మే మెంతవారలము
మత మెన్న వైష్ణవమతము మామతము

ఇతరదైవంబుల నెరుగమెన్నడును
తాతలు చేసిరి తగనిదోషమ్ము
కాపాడి రక్షించు కరుణతో మమ్ము
పుణ్యతీర్థములాడ పుడమిలో నిపుడు
సర్వసౌఖ్యమువీడి సంపదల్ వీడి
పర్వినభక్తి నీదు పాదాలు గొలిచి
ముదముతోడుత మేము ముం దేగవలయు
కదులుము మా వెంట కదులుమ”నంగ
ఆవలీవలఁజేరి యపుడు నంబులను
దేదీప్యముగ స్వామి దివ్యసన్నిధిని
పరిమళధూపముల్ భక్తితోవేసి
అరవిందలోచను హస్తాల బట్టి
పీటపై నుంచంగ ప్రేమమీఱగను
మద్దెళ్ళు తాళముల్ మరి నింగి ముట్టె
తమ్మట ధ్వనులతో ధర పిక్కటిల్లె;
సకలలోకముపట్టు స్వామిపీఠమును
ప్రకటితమ్ముగ వారు పట్టి యెత్తగను
మనుజేశు డంతట మంత్రులు తాను
సురటీలు విసరుచు సురవంద్యునకును
చెన్నకేశవు డేర చెలగి యెత్తించె;
వైష్ణవులచోటు వరుసగా వచ్చి
విష్ణునామము బాడ వేగ పాలకులు
పట్టిరి గొడుగులు పరగ చెన్నునికి;
స్వాములు కదిలిరి స్వామి వెంబడిని.
సంతసమ్మున వీరసంఘమ్ము లెల్ల
సకలసన్నాహముల్ సందడింపగను
ఎత్తిరి డేరాల నింపు పెంపార;
శౌర్యబలఘనుడగు దొడ్డనాయుండు
పెద్దన్న బ్రహ్మన్న పేర్నిటు మరియు

సూర్నీడు మల్నీడు శూరులందరును
గొల్లెన లెత్తిరి కొదువలేకుండ;
అనుగుభూవరు నాజ్ఞ నౌదల దాల్చి
అణిముత్తెముబోలు నతివలు కొలువ
వీరవిద్యలదేవి విచ్చేసె నటకు;
కడువేగమున గండుకాంతసానెమ్మ
తనదు కోడండ్రతో తాను నేతెంచె;
క్రమమొప్ప శీలమ్మకాంతయు కదలె
కోడండ్రు కదలిరి కొమరొప్పగాను;
పెనుమాల పెద్దమ్మ పెద్దసానెమ్మ
తన దాదులను గొని తాను నేతెంచె;
పొలుపొంద జవ్వాజిపునుగుపెట్టెలును
పన్నీరుబుడ్లును పచ్చకప్పురము
తరిమైన మంచాలు తమ్మపడిగెలును
పరుపులు దిండ్లును పట్టుపుట్టములు
ఒయ్యన కదిలెను ఒద్దికతోడ;
బిరుదురాజున కెన్నొ ప్రియములు చెప్పి
చాల సంతోషాన జరుగుచు రాజు
వాగువాగేశ్వరపట్టణ మ్మరిగి
జాగరణమ్ములు సలిపి యా రేయి
పరగున నదిలోన స్నానంబుచేయ
తెల్లగా వస్త్రముల్ తేలకపోయె;
అంతట వారెల్ల నటనుండి కదిలి
అచటచ్చట విడిసి యతులితభక్తి
దివ్యక్షేత్రమ్ముల తీర్థమ్ములాడి
బదరికావనభూమి పద్మాక్షుమ్రొక్కి
కేదారమున నభ్రకేశవుని గొలిచి
మధురాపురీనాథు మదిని ప్రార్థించి
కతిపయదినములకు కాశిని చేరి

భేరీలు రుంజలు పెక్కుగా మ్రోయ
గాలికొమ్ములు డోళ్లు కైముళ్లు మెరయ
అందంద గీతమ్ము లా దేవుమీద
సొంపుగా పాడుచు సోలియాడుచును
ఆ రాత్రి శివరాత్రి యగునట్లు గడిపి
తూరుపు తెలవార తొలిచుక్క పొడువ
మందాకినీతీర్థమహిమమ్ము లెంచి
సంతోషమున రాజు సరిగంగలాడ
చీరల మలినంబు చెరగకపోయె
ఆ కాశివిశ్వేశు నర్చించి మ్రొక్కి
తనర షోడశమహాదానముల్ చేసి
గయలోని కేతెంచి కార్తవీర్యునికి
పిండప్రదానంబు ప్రీతితో చేసి
తన విడిదికి చేరె ధరణీశ్వరుండు;
'అతడు తీర్థములాడ నరుదెంచినాడు
ఆడబోయినతీర్థ మదె వచ్చె'ననుచు
గయభీమరాజు తనగారాబుపుత్రి
భూరమాదేవిని భూపతి కిచ్చి
కల్యాణ మొనరించె కడు వైభవమున;
అటనుండి కదలి యా యనుగుభూవిభుడు
దివ్యక్షేత్రమ్ముల తీర్థమ్ములాడి
దక్షిణదేశమునకు తరలివచ్చుచును
సింహాచలము చేరి చిత్తముప్పొంగ
పంచధారలయందు పత్నులతోడ
స్నానంబు కావించి స్వామికి మ్రొక్కి
గోదావరిని జేరి గోపాదమందు
నిలచి తీర్థములాడి నిజభక్తులకును
తగిన దానములను దయతోడ నిచ్చి
దినదినంబును తీరదివ్యలింగముల

అర్చించి యర్చించి యటనుండి కదలి
బెజవాడ దుర్గను పొడగని మ్రొక్కి
కృష్ణవేణను దాటి కొమరొప్పగాను
మోటుపల్లెకు వచ్చి మోదంబుతోడ
సాగరజలమున స్నానంబుచేయ
కట్టుపుట్టము లెంతొ కాంతి చెన్నొందె.
అగణితచారిత్రు డనుగుభూవిభుడు
"సకలదేవతలకు స్థావరంబిదియు
ముక్తికి నిది మంచిమూలమార్గంబు
ఈ సాగరము దరి నిరవుగా మేము
కొన్నినాళ్లుండగా కోర్కెజనియించె
ఏకాదశీవ్రత మెలమిచెల్లించి
అచటచట క్షేత్రమ్ము లరయుదు" మనిన
విని సంతసమునొంది వీరులచ్చోట
డేరాల నెత్తించి చెందముప్పొంగ
శీలమ్మపేరున చీరాల యనియు
నాయుడుపేట యని నాయునిపేర
పేరినాయునిపేర పేరాలయనియు
పేరులు పెట్టిరి పేరుపేరునను,

*పశుగ్రాసము కోసము అనుగురాజు తెప్పలినీడు అనెడి సేనాపతిని అరణగండ్లకు పంపుట: జొన్నచేను దోపిడి: తెప్పలినీడు కోరకోటరాజును చంపి బిరుదుశాసనము వేయించుట.*

అంతట దొరలతో నధిక మోదమున
కొలువుండ నొకనాడు కువలయాధిపుడు
సేవకులేతెంచి చేయెత్తి మ్రొక్కి
"వినవయ్య రాజేంద్ర ! విన్నవించెదము
మన మత్తగజములు మన తురంగములు

ఘనమైన ఒంటెలు కంట్లపెద్దులును
కసవులేకను కొన్ని కడుచిక్కిపోయె
పాలను నిచ్చెడి పశువులు కొన్ని
చాల సౌఖ్యము దప్పి సన్నంబులాయె"
అనుచు చెప్పినమాట లాలించి రాజు
వీరతెప్పలినాయు వేగపిలిపించి
"కదలి నీ విప్పుడు కాల్బలముతోడ
ఆరణిగండ్లకు నతివేగపోయి
మేతలు గొనితెమ్ము మేలుగలెడిని"
అని యానతీయంగ నా తెప్పలన్న
విని తాను సంతోషవివశుడై కదలె;
కదలె నీటెలు ముందు కదలె బల్లెములు
కదలె మత్తేభముల్ కదలె నోష్ట్రములు
కదలెను వృషభముల్ కదలె నశ్వములు
కదలి తెప్పలినీడు కాల్బలముతోడ
ఆరణిగండ్లకు నతివేగవచ్చి
అందుండు కాపుల నందఱ పిలచి
యాత్రల వృత్తాంతమంతయు చెప్పి
గజతురంగములకు గ్రాస మిండనియె;
ఆ కథ విని వారలాశ్చర్యమొంది
మితిలేని వాములు మిన్నకతెచ్చి
కుప్పలుబెట్టంగ కొండలరీతి
ఎంచి తెప్పలినీడు యిచ్చె రొక్కమ్ము;
అంతట సేవకు లతిమోదమునను
మొత్తంబుగా చొప్ప మోపులుకట్టి
ఎత్తిరి బరువుల నేస్గులమీద
వాజుల నొంటెల వాములనెత్తి
బండ్లపై మోపులబరువులువేసి
పల్లెలు పట్నాలు పరగణాల్ గడచి

దారిని విచ్చేయ దాపున నొక్క
జొన్నచేనును చూచి చోద్యంబునొంది
మెచ్చుచు తమలోన మేటి నాయకులు
"మంచి ముత్తెము లట్లు మది కింపుకూర్చు
ఇటువంటి జొన్నల నెన్నడు కనము"
అనుచు బాటను నిల్చి రతివేడ్కతోడ;
పంటపై వ్రాలెడు, పక్షుల త్రోలు
మంచెపై నిల్చిన మనుజుని కాంచి
వీరతెప్పలినీడు వేగమేపోయి
"జొన్నకంకుల మాకు గొన్ని యీవయ్య
పోయి చూపెదము మా భూపాలునకును"
అని యడుగ యా రెడ్డి "యట్లనే" యనుచు
కనుల కింపగు జొన్నకంకులు కోసి
యిచ్చెను వారికి నెంతొ మోదమున
"వెళ్ళెద"మని చెప్పి వీరులు వెడలి
మోటుపల్లెకు వచ్చి మ్రొక్కి రాజునకు
చూపిరి సొంపారు జొన్నకంకులను
చూచి భూపాలుండు చోద్యంబుపొంది
"ఈ తీరుగల జొన్న లెన్నడు మనము
చూడగాలేదయ్య చూస్తిమినేడు
ముత్యములేమొకొ మొలచిపండినవి
పాలమాచాపురి పట్నమ్మునందు
పండించవలె నిట్టి పంటలు మీరు
కావున తెప్పలి! గ్రక్కునపోయి
అడిగిన బహుమతి నా రెడ్డి కిచ్చి
తడయక యా చేను త్వరితంబుగాను
కోసుకరమ్మ"న కోర్కెచేమించి
వీరతెప్పలి కదలె వేగంబుగాను;
మదగజతురగ సమూహము కదలె

భీకరధ్వనులతో పెడకేకలిడుచు
చిత్త మువ్పొంగగా సేనలుకదలె
కదలియా చేనికి గ్రక్కునవచ్చి
బండ్ల నెద్దులనిల్పి బాహువిక్రములు
నిలచిన యా రెడ్డి నేర్పున చూచి
"ఇదియేమి మీరిపుడెందుల కిట్లు
దారి తప్పియు చేను దాపుకొచ్చితిరి ?"
అన విని తెప్పలి యా రెడ్డితోడ
"వినుము చెప్పెద నేను వివరంబుగాను
మొన్న నీ విచ్చిన ముత్యాలవంటి
జొన్నకంకులు చూచి చోద్యంబునొంది
మమ్మిటు పంపెను మా రాజచంద్రు
'డడిగిన ధనమును నాతనికిచ్చి
తడయక యా చేను త్వరితంబుగాను
కోసుకరమ్మ'నె కువలయాధిపుడు."
అనిన తెప్పలి మాటలాలించి రెడ్డి
కనులెఱ్ఱజేయుచు కడునుగ్రుడగుచు
"పదపద ! నీయొక్క పరువెల్ల తెలసె
ముందు కంకులు నీకు ముదముతో నిచ్చి
సదయుడవని నేను చాలనమ్మితిని;
పాడిముంతకు వచ్చి బఱ్ఱెల నడుగ
ఏడ చూడగలేదు ఈ వెఱ్ఱితనము
ఇట్టి కష్టముచేసి యింత కాపాడి
ఈ వడిగినరీతి నీ చేను నిచ్చి
ఏయూర బిచ్చంబు నెత్తెద నిపుడు
పోవయ్య నీమాట పొసగ దిచ్చోట"
అన విని తెప్పలి యాగ్రహమ్మంది
"జొన్నచేలను నీవు చూచుక మురిసి
కన్నుల మదమెక్కి గద్దించి మించి

మమ్ము చుల్కనచేసి మాటలాడెదవు
వీరులతో నీకు విరసంబు లేల ?
మారాజుకెరిగింప మండిపడి యిపుడె
చతురంగబలముతో వెచ్చెర వచ్చి
పంటచేలనె కాక పల్లెలన్ గూడ
కాళ్ల ద్రొక్కించును కావున నీవు
పైకమ్ము పుచ్చుక పదిలముగ పొమ్ము"
అన విని యా రెడ్డి యత్యుగ్రుడగుచు
"రాజరాజనుచును రంకెలువేసి
పలుమారు పాడినపదము పాడెదవు
అనుగురాజన నెంత అతని బలమెంత
ఈ రాజ్యమేలెడు నినకులాధిపుడు
పేరమ రాజనే పృథివీశ్వరుండు
మీరాజుకంటెను మేటి ధీరుండు
ఈవార్త తెలిసెనా యిక్కడే మిమ్ము
పట్టించి కొట్టించి బందిపెట్టించు
దైవంబు మీపాల దయచేసినాడు
అత దెరుగకమున్నె యరుగుడీ" యనిన
వినియు తెప్పలి తన వీరులచూచి
"సేనాధిపతులార ! సేనలు మీరు
కుదురుగా చేలను కోయుడీ వేగ
అనుగురాజన నెవరో యతని బలమెంతో
చూపెద వీనికి సోమించి మించి"
అని యానతీయగా నా వీరవరులు
పంటచేలను చొచ్చి పంతమ్ముతోడ
కోసి బండ్లకునెత్తి కొనిపోయిరంత
కకవికల్చెందుచు గగ్గోలుపడుచు
ఊరకోటకు పోయి యుర్వీసుతోడ
కొలకులకన్నీరు గోళ్ళ చిమ్ముచును

విన్నవించెను రెడ్డి వివరమంతయును
ఆవార్తవిని రాజు అత్యుగ్రుడగుచు
తన మంత్రివరులను తడయకపిలిచి
"పరరాజు మనభూమి పరగంగవచ్చి
పొలముల ద్రొక్కించి పోతరించెడిని
సేనలుకూర్చుక చెండిరమ్మ"నిన
అమితవిక్రములైన ఆ మంత్రివరులు
చతురంగబలములు సమకూర్చి రంత
మునలముల్ గదలును ముద్గరచయము
వెస భిండివాలముల్ విచ్చుకత్తులును
పరిఘలు చక్రముల్ బాకు కటార్లు
అరుదుగ మెరయు చంద్రాయుధములును
పట్టి నాయకులెల్ల పయనంబులైరి ;
ముందర భేరీలు ముదమున మ్రోయ
సంతసంబున మంత్రి సంఘంబుతోడ
గజముపై కూర్చుండి కదలె నా రాజు ;
కదలిరి సరదార్లు కదలి రాశ్వికులు ;
"ఏరాజు పంపెరా యిచటకు నిన్ను
నీ రాజు పేరేమి నీదు పేరేమి
గర్వంబుతో పొంగి గడ్డకువచ్చి
ధాన్యంబు దోచుక తర్లెద వీవు
రూపణగింతుము రూఢిగా" ననుచు
ముట్టడివేసిరి మొనగాండ్లు బండ్ల
అది చూచి తెప్పలి యాగ్రహమ్మునను
కుప్పించి గజముల కుంభస్థలముల
త్రిప్పి నేలకుకొట్టి తేజీల నరికి
ఉక్కుచువ్వల నీటె లొక్కపెట్టునను
ముక్కలంబుగ విరచి మొనపైకి దుమికి
మొండెములుగా నరికి మొనగాండ్లనెల్ల

ఒక్కరి నిద్దరి నొనరనల్గురిని
ముక్కులు చెక్కులు మూపులు తలలు
తుత్తుమురుగా తరిగి దోపణగించి
సింహానాదముచేసి చెలగి దుముకంగ
విరిగెను ఆ సేన వింతగా నపుడు
ఇలమీద రక్తంబు ఏరులై పారె;
అంతట పేరమ అవనిపాలకుడు
"పారిపోవుట మీకు పంతంబుకాదు
పారిన బవరమున పాపంబు వచ్చు
పోకుడంచు"ను వారి పురిగొల్పి తాను
వెసగుణధ్వనిచేసి విల్లెక్కుపెట్టి
వీరతెప్పలినేని వేగమే కదిసె;
కదిసి యిద్దరు నపుడు కయ్యంబు చేయ
బూనిన, వింతగా భూమండలంబు
సారె దిరిగినరీతి చయ్యన తిరిగె;
మదపుటేనుంగులు మల్లాడినట్లు
కొదమసింహంబులు కోరాడినట్లు
పెళపెళనార్చుచు పెనగుచునుండ
రాజువెనుకను వచ్చి రభసంబుతోడ
చలిచీమలనుపోలి సైన్యంబు కప్పె;
పేరమరాజంత పెక్కు బాణములు
మునుకొనివేయంగ ముంచుకు సాగి
తప్పించుకొని యతడు ధరణిపాలకుని
కంఠంబు తా త్రుంచి కలకలనార్చి
విరిగిన సేనను వెన్నంటి తరిమె;
ఉర్వీశుతనయుండు ఉత్తరుం డపుడు
అభయమిమ్మని వేడ నతని మన్నించి
"అవనిపాలకులెల్ల నతిపలెచూడ
పుడమి నమగురాజె పురుషుడన చెల్లు"

అని శాసనమొకటి యచట నెక్కించి
మోటుపల్లెకు చేరె మోదమ్ముతోడ.

చందవోలురాజు యుద్ధమున నోడిపోయి సంధి చేసికొని అనుగురాజునకు తన కూతురు మైలమా దేవిని ఇచ్చి పెండ్లిచేసి పల్నాటిసీమను అరణమిచ్చెను.

ఆ వార్తవిని యంత నధికరోషమున
చందవోలు పృథివిజననాయకుండు
వెలలేని కీర్తియు వీర్యమ్ము కలిగి
ఇలలోని రాజుల నెనలేనివాడ
నిలిపెద నాపేరు నిఖిలంబు నెరుగ'
అనుచు బలమ్ముల నాయత్తపరిచి
జయభేరి మ్రోయించి చయ్యన కదలె;
ఆ వార్త బాదరాజంతయు నెరిగి
తన యనుజులందరు తన్ను కొలువంగ
మెండైన యడిదములు మేలుబల్లెములు
బాకులు ఈటెలు బలుముద్గరములు
విండ్లు శూలాలును విచ్చుకత్తులును
పరువడి సంధించి పంతమ్ముతోడ
వీరులు నాయకుల్ వెంటనడువంగ
తమ్మటధ్వనులతో ధర పిక్కటిల్ల
కదనరంగమునకు కదలి యేతెంచి
చందవోలుపతిని చతురత కదిసె;
కదిసిన నా రాజు కనలి విల్లంది
"ఎంతయు కణకతో నీ సేనలెల్ల
త్రుంచెద ననుచును దుడుకుగా బోకు
తెంపున నేనుండ దీపించుచెట్టు
శరవృష్టి కురిపింతు సరగున" ననగ
అనుజుడు పేరిసీ దన్నుకడకొచ్చి

"ఎన్నంగ రణము నా కెప్పుడులేదు
బవరమున నీరాజు భంజింతు నేను
సెలవీయుమనుచును చెయ్యెత్తి మ్రొక్క;
అప్పుడు పెద్దన్న యధికమోదమున
కలకలనవ్వుచు కౌగిటచేర్చి
"ఎన్నడు రణము నీవెరుగక యిపుడు
కదనంబులో నిల్వగలవె నీవనిన
అన్న పెద్దన్నతో ననియె పేర్నీడు
"తగునయ్య యిట్లాడ ధర్మమా నీకు
అవునని యందరు హర్షించునట్లు
పగతుర శీఘ్రంబె పరిమార్చి వత్తు"
అన విని బాదన్న యౌఁగాకయనుచు
సెలవొసంగిన యంత చెలగి పేర్నీడు
"భళి భళీ" యనుచును పైకి దుముకుచును
వచ్చెడి భటులెల్ల వడి చెదర నార్చి
ఎక్కడెక్కడివారి నక్కడే పట్టి
కాళులు కరములు కంఠముల్ త్రుంచ
అదనును కనిపెట్టి యవశిష్టు లెల్ల
పారగ దొడగిరి పలుదిక్కులకును;
అంతట పేరినీ డశ్వమ్ము త్రోలి
గజముతొండము నరుక గజముపై నున్న
భూమీశు డంతట పుడమిపై పడియు
చెచ్చెర లేచుచు చెయ్యెత్తి మ్రొక్క
బందిగాకొనె నతని బాహువిక్రముడు;
అంతట పెద్దన్న యటనుండి కదలి
మోటుపల్లెకు వచ్చి మోదంబుతోడ
ఆ వార్త వినిపింప అనుగుభూవిభుడు
వీరులందరికిని వేడ్కతో నపుడు
దివ్యభూషణములు దివ్యవస్త్రములు

దివ్యమాల్యమ్ములు తెరగొప్ప నిచ్చె ;
ఆ సమయమ్మున నతిభక్తితోడ
చందవోలుపృథ్వీశజననాయకుండు
సభయెల్లచూడగా చనుదెంచి మ్రొక్కి
అనుగుభూపతితోడ ననె నొక్కమాట :
"ని న్నెదిరించగా నే నెంతవాడ
నీ పొందుకోరుచు నే నిటు నిలువ
పగనుసాధింపగా పాడియే చెపుమ ,
పడతి మైలమ్మను పరిణయమ్మాడి
నా కోర్కె మన్నించు నరనాథ నీవు"
అన విని యనుగురాజప్పు సమ్మతించ
చందవోలుపృథ్వీశజననాయకుండు
చిన్నకూతురు పెండ్లిచేసె నా వేళ ;
పెంపార పుత్రికి పృథ్వీశ్వరుండు
ఇంపార పసుపున కిచ్చె పల్నాడు.

*వీరకోటరాజు కుమారుడు ఉత్తరుడు, ఇతర రాజుల సాయముతో దండెత్తివచ్చుట: తెప్పలిసేని మరణము: బ్రహ్మనాయుడు వారిని ఓడించి అప్పనములు గొనుట.*

అంతట నా రాజు అతివలతోడ
గురజాలకును వచ్చి కొన్నినాళ్ళుండి
పాలమాచాపురి పయనంబుకాగ
కలలోన కనిపించి కనకాద్రివిభుడు
"వినవోయి భక్తుడా ! విశదంబుగాను
కనకాద్రికిని మనము కదలిపోరాదు
కార్తవీర్యుడు చేయు కడుపాపమెల్ల
ఆ పట్టణంబున నమరియుండినది ;
ఇచ్చోట నిలచెద మిద్దర మిపుడు

తీరుగా కట్టించు దేవళంబొకటి"
అని యదృశ్యంబయ్యె నా చెన్ను డంత
ఒక సుముహూర్తాన నానర భూవిభుడు
చెన్నకేశవునకు చెలువగ్గలింప
కోవెల కట్టించె గురజాలలోన ;
వీరులందరికిని వెలయగా నచట
గృహములు కట్టించె కొమరొప్పగాను
సర్వసన్నాహంబు చయ్యన చేసి
గురుతరంబై నట్టి గురజాలలోన
పట్టంబు గట్టగా పార్థివమౌళి
ముదమొంది పత్నులు ముగ్గురితోడ
పరువడి పల్నాడు పాలింపుచుండె ;
విడువ కప్పుడు వీరవిద్యలదేవి
సంతానమును కోరి సద్భక్తితోడ
చెన్నకేశవునోము చేయగా పిదప
పెదమలిదేవుడు పినమలిదేవు
బాలమల్లు డనగ బాలురు కలిగి
అలఘునిత్యోదారులైన మువ్వురును
మలిదేవులనగ నీ మహినొప్పి రంత
పార్వతీశునినోముపట్టినోమగను
భూరమాదేవికి పుట్టిరి సుతులు
కామరాజు నరసింగవిభుడు పుట్టి
రాజును పెరుమాళ్ళరాజును వేడ్క ;
మహిళాశిరోమణి మైలమాంబికకు
రూపకందర్పు డారూఢవిక్రముడు
నలగాముడు కలిగె నయముదీపింప
అష్టపుత్రులతోడ ననుగుభూవిభుడు
పలనాడు పాలించె ప్రజ సంతసింప.

వీరకోటరాజు కుమారుడు ఉత్తరుడు, ఇతర రాజుల సాయముతో దండెత్తివచ్చుట: తెప్పలనీని మరణము: బ్రహ్మనాయుడు వారిని ఓడించి అప్పనములు గొనుట.

కన్నమ యానాడు కదనరంగమున
ఓడించినట్టి యా యుత్తరుండిపుడు
తన తండ్రి చావుకు తాను కోపించి
'సృష్టిలో రాజులు స్త్రీలెట్టులైరో
పుడమి ననుగురాజు పురుషు డెట్లగునో
చూచెద మిప్పుడే శూరతమించి
మగజన్మమెత్తియు మగబిరుదుకట్టి
వెలుపల యజ్ఞోపవీతంబువేసి
మనమంత రాజుల మైనట్టులయితె
అనుగుభూవరు మద మణచెదమిచట
తడవుచేయక తమరు తరలిరావలయు'
అని యిట్లు లేఖలు నందరిపేర
వ్రాయించి పంపగా రాజులందరును
రాజబిరుదులతోడ రాజసంబొప్ప
నఫిరీలు రుంజలు నాగస్వరములు
భేరివాద్యమ్ములు పెళ్ళుగా మ్రోగ
ధరణి యాకాశమ్ము తల్లడమ్మంద
పగలు చుక్కలు రాల పాతాళమదర
కళతప్పి సూర్యుడు గడగడవణక
వారివారి దళములు వరుసగా నడువ
సప్తసముద్రములు సరికూడినట్లు
అందరు కూడుక అరణిగండ్ల
కోరుబైళ్ళ విడిసిరి గొబ్బున నపుడు
ఈతీరు దిగియుండ నిలరాజులెల్ల

ఉత్తరుం డంతట నుప్పొంగి మదిని
తన బలములతోడ తాను విచ్చేయ
సంతోషపడి రంత సకలనాయకులు.
అప్పుడందరు గూడి యనుగురాజునకు
యోజించి యొక కమ్మ యొప్పుగా వ్రాసి
భట్టు చేతికినిచ్చి పంపగా నతడు
గురిజాలపట్నంబు గొబ్బున చేరి
పొడగని రాజును పొందుగా మ్రొక్కి
"రాజకులాధీశ ! రాజదేవేంద్ర !
రాజరాజాధీశ ! రాజమార్తాండ !
ఆరణగండ్లలో ఆరాజపతులు
తమకు విన్నపమొకటి తగవ్రాసి కమ్మ
నాచేతి కిచ్చిరి నరవర !" యనుచు
కమ్మ నందీయగా ఘనుడనుగురాజు
చదవమని చెప్పగా చదివె బ్రాహ్మణుడు
"పాలమాచాపురి పట్నంబు వీడి
మా భూమికినివచ్చి మర్యాదతప్పి
తమరు వ్రాయించిరి తగని శాసనము
వసుధ రాజులు చూడ వనిత లెట్లయిరో
పుడమిలో తమరెట్లు పురుషులైనారో
చెప్పుడీ మాతోడ చేసి యుద్ధంబు ;
ఈ లిఖితముచూచి యిప్పుడు మీరు
ఆరణిగండ్లకు పనిసేయ రండు;
మహిలోన మీరెల్ల మగువలై పుడితె
స్త్రీలు గట్టెడిచీర శీఘ్రంబె కట్టి
తమ రిండ్లలోనుండి తరలిరావలదు ;
వసుధ, యుత్తరునికి వనితయై యిపుడు
తలబ్రాలుపోయును తనరెడు వేడ్క"
అని వినిపింపగా అనుగుభూవరుడు

ముసిముసి నవ్వుల మురియుచు నంత
పట్టుకట్నము లిచ్చి భట్టును పంపి
వీరుతెప్పలినేని వేడ్కతో చూచి
"వినవోయి తెప్పలివీరకుమార !
ఆరణిగండ్లలో నని సేయ నీవు
కలబలమ్ములతోడ కదులుమీ" యనిన
పెడియమందుకొని తా వేగమే కదలి
తన దళములనెల్ల తాను రప్పించి
"కోతకొచ్చెను చేను కొరతలేకుండ
ఆ పైరు కోయగా నడచెవరులేరు
ఆరణిగండ్లకు నతివేగపోయి
కోసి కుప్పలువేసి కొమరప్ప మనము
మన పట్టణమునకు మగిడి వచ్చెదము"
అని యిట్లు తన దళముకంతయు చెప్పి
వేయించె రణభేరి వీరనందనుడు
అందరికిని పెద్దయైన పేర్నీడు
ముదముతో వాజిపై ముందరకదలె
వెలగలు మన్నీలు వెలమనాయకులు
విచ్చుకత్తులవారు వీరనాయకులు
బాకులవారును బరిసెలవారు
కదలిరి ధరయెల్ల గడగడవణక
తెప్పలియెక్కుడీ తేజంపుకరికి
అంబారియెత్తించి రంత వేగమున :
భోగవతి కరికి బొడ్డు గంటయును
కంఠము తిరుగగా కంచుగంటలును
తోకతొండములందు తొగరుకుచ్చులును
నాల్గుపాదమ్ముల నాగుటందెలును
పిరుదులతూలాడు బిరుదులుగట్టి
అంబారియెత్తిరి యప్పుడు కరికి

అందులో తెప్పలియపుడు కొలువయ్యె ;
షువ్వలు గజ్జెలు మువ్వతప్పెట్లు
రుంజలు నఫిరీలు రుద్రవీణలును
మిన్నంది మ్రోగెను మిగులవాద్యములు
కార్తవీర్యునినాటి కంచు రణభేరి
కరులపై నవుబత్తు ఘనముగా మ్రోగె;
బలములన్నియు కదల పరగనావేళ
ధరణి యాకాశమ్ము తల్లడమందె
కులగిరులన్నియు క్రుంగగావొచ్చె
కదలి వారందరు కడలి పొర్లిల్ల
ఆరణగండ్లలో ఆ కోరుబైళ్ళ
ఎత్తించిరప్పుడు ఎన్నొగుడార్లు
ఆ గుడారులమధ్య నట నొక గుడారు
తెప్పలి యెత్తించె తేజమ్ముమీర
ఆ గుడారువయిన అటు సూర్యకుండ
సూర్యునికి ప్రతిసూర్యునిరీతి
ఉండంగ చూచియు ఉత్తరు బలము
మగిడి యుద్ధానకు మరి తరలెనంత
తనుకొల్చు బలముల తరలింపుకొనుచు
"విత్తులు చెడిపోక విరివిగా చేను
చాలుచాలును జూడ చక్కగా పెరిగి
పండినట్లుండెను పగతుర సేన
పోదము మనమటు పొలిపొలియనుచు"
అనిపల్కి తెప్పలి యటువైపు చూచి
కోతకు సెలవీయ కూతబెట్టుచును
ఆయుధమ్ములుబూని యావీరవరులు
మొక్కలంబుగలేచి మొనలపై దుమికి
విందుకు తెచ్చిన విడిగొట్టెలనగ
ఒక్కరినిద్దరి నొనరంగబట్టి

కరకర కంఠముల్ ఖండించిఎంత
మావంతుఁను నరికి మన్నీల నరికి
పాటిమీదిజొన్న వడదోయుపగిది
ఎక్కడెక్కడివారి నక్కడే పట్టి
మోకాలుపైకిని మోపుగా చేర్చి
మొలనున్న పిడిబాకు మొఁ:చేర్చి పట్టి
కూతలుపెట్టగా కుతికెలుకోసి
కుప్పకుప్పలుగాగ కూల్చిరివ్వేళ;
ఈరీతి తెప్పలి యెదిరించి నిలువ
ఉర్వీశులందరు వ్యూహంబు పన్ని
అటునిటు దళముల నాయత్తపరిచి
కాకిమూకలపలె కదిసిపైపడిరి
ఆలోచనలుచేసి యప్పుడుత్తరుడు
వీరతెప్పలినేని వెనుకకుబోయి
వెన్నున బాణమ్ము వేయగా నంత
మహినొరిగి తెప్పలి మరికదలకుండె
ఎత్తిన యా హస్తమెత్తినట్లుండె
కన్నుల ప్రాణముల్ కడువేగవిడిచె
అది చూచి పేరినీ డత్యుగ్రుడగుచు
అశ్వమ్ము దూకించి యడిదముబ్రేయ
ఉత్తరుశిర మప్పు డుర్విపైపడియె
ఆదిత్యుడంతట నపరాద్రిచేరి
దట్టమైచీకట్లు ధరణినిక్రమ్మె.
అక్కడ గురజాల నలగుభూవిభుడు
వీరతెప్పలిచావు విని వెరగంది
చతురంగబలములు చయ్యనకూర్చి
బ్రాహ్మణుల్ దీవింప భట్లు పొగడగను
చేడెలందరు కూడి సేసలుచల్ల
న ష్టవాద్యమ్ములు సరగునమ్రోగ

కోరి డెబ్బదిరెండుగోత్రాలవారు
పరగ పన్నెండిండ్ల పద్మనాయకులు
తన మంత్రినాయుడు తక్షణమె కదల
"పట్టమ్మ పదిలమ"ని బ్రహ్మతోచెప్పి
గురుతరంబైనట్టి గురజాల వెడలి
ఆరణగండ్లకు నతివేగవచ్చి
తెప్పలి పడియున్న తీరునుచూచి
కన్నుల నశ్రువుల్ క్రమ్మకురాగ
తివ్వాసి పరిపించి తీరుగా నతని
శయనింపచేయించి సెలవిచ్చె నిట్లు
"తొలి యుద్ధమంతయు తెప్పలిపాలు
మారుయుద్ధము చూడ మరియెవరిపాలొ
వివరించుడ"నిపల్క విప్రులందరును
"వినుమిపుడు రాజేంద్ర! విన్నవించెదము
బ్రహ్మనాయునిపేర ప్రశ్నవచ్చినది
ఆ నాయునికి బావయయిన సుంకరియు
దామనాయునిపేర తథ్యముగవచ్చె
విష్ణుపరమునపుట్టి వీరుడై చెలగు
పెనుమాల కన్నమపేరనువచ్చె
పట్టవచ్చినవిధిని పండ్లూడ తన్ని
నట్టి శీలమబ్రహ్మ యాది విష్ణుండు
అతనివల్లనెకాని హతముకారెవరు"
అనవిని భూమీశుడాత్మరంజిల్లి
లేఖను వ్రాయించి లెస్సగా నపుడు
పంపెను భట్టును బ్రహ్మన్నకడకు
అట గురజాలలో నా బ్రహ్మనీడు
సొగటాలనాడుచు సుంకరితోడ
ముసిముసినవ్వుల మురియుచునుండ
భట్టుతానప్పుడు పరుగునవచ్చి

హస్తముల కందించె నా లేఖనపుడు
కమ్మలో వ్రాసిన కలవార్తలెల్ల
చదువుకొని బ్రహ్మన్న సంతోషమొంది
వీరులకు పయనమ్ము వేగంబె చెప్ప
కదనభూమికి తాను కదలిపోవంగ
పట్టు టిజారును బాగుగా తొడిగి
కాసెమీదను వీరకాసె బిగించి
చుక్కల తలపాగ సొగసుగాతీర్చి
చంద్రకాంతిరుమాల చెలువమరకట్టి
పచ్చపువ్వులబంతి పసిడిబాసికము
మోకాలిఝల్లియు మోరచిక్కమును
కాలిబిరుదందెలు ఘనముగాకట్టి
ఆయుధమ్ములుపూని యాయత్తపడియె;
సుంకరి, కన్నమ శూరులిద్దరును
నాయుని కలియగా నాయుడు, వారు
శీలమ్మకడకేగి చెలగి మ్రొక్కంగ
ముదమొంది మదిలోన ముదితశీలమ్మ
"మొక్కలంబుగ మీరు మొనలఖండించి
గుబ్బమ్ము లేనుగల్ కూలంగ పొడిచి
పెలగొనికొట్టుడీ సేనలనెల్ల
ఎనలేనియుద్ధంబు నీరీతిచేయ
దేవతలందరు ధీరత మెచ్చి
కనిపెట్టుదురు మిమ్ము కరుణతో" ననుచు
దీవించి యప్పుడు ధీరులపంపె.
అచట నారణగండ్ల నారాజు లెల్ల
గురజాలపట్నంబు గొబ్బునపొడువ
కదలింపసాగిరి కాల్బలంబులను ;
అటు వచ్చు బలముల నా బ్రహ్మిచూచి
సుంకరి, కన్నమ శూరులతోడ

"గురుతరంబైనట్టి గురిజాల కిపుడు
సైన్యము లెల్లను సాగివచ్చెడిని ;
మనరాజు సెలవడుగ మనకు పనిలేదు
ఖండింపుడు దళముల కావరమణచి"
అనియానతీయగా నా వీరవరులు
అట్టహాసముచేసి యడిదములూని
మొక్కలంబుగసేన మొనల ఖండించి
గుఱ్ఱాలపట్టియు గుఱ్ఱాలకొట్టి
గజములపట్టియు గజములకొట్టి
ఒక్కరిద్దరి నొనరంగపట్టి
కూరగుమ్మడిపండు చదురైన కత్తి
పీటనుతరిగిన పెంపుతోఁదఱగి
చీకాకుచేయుచు సేనలనెల్ల
పదునాల్గురోజులు బవరంబుచేయ
వారి పౌరుషమును వారి శౌర్యంబు
దివినుండికనుగొని దివిజులు మెచ్చి
దివ్యాయుధంబులు తెరగొప్పనీయ
బ్రహ్మ తానప్పుడు పర్వతంబెక్కి
సైన్యముల దిక్కటు చక్కగా చూచి
పరదళంబులు విన ప్రకటించెనిట్లు :
"ఇపుడేడుగడియలు ఈరణమందు
కదకచూపెద నేను కలని మధ్యమున
ఆలుబిడ్డలమీద నాశగలవారు
తల్లితండ్రులపట్ల దాక్షిణ్యపరులు
బ్రతుకులమీదను భ్రమయున్నవారు
కదనరంగమువీడి గ్రక్కునపొండు;
తడబాటుచేతను దాగెడివారి
చెట్టులెక్కెడివారి చెదరినవారి
పారిపోయెడివారి భయమందువారి

చేతులెత్తెడివారి శరణన్నవారి
కాచిరక్షించెద కదనమున" ననగ
చెదరెను సేసలు శంకింతలేక;
చూచియు నాయుడు సుంకరి మరియు
ముదముతో కన్నమ ముందుగా నడువ
తక్కినదళముపై తలపడివేగ
కుప్పనూర్పిడిగాను కూల్చిరి భువిని;
అందులో కొందరు హతశేషులెల్ల
చేడ్పడి శరణంచు చేయెత్తి మ్రొక్క
కన్నమ సుంకరి కరుణదీపింప
పన్నుగానందరి పట్టుకవచ్చి
నిగిడి నాయునియెదుట నిలిపిన నతడు
దుష్టపశులనువలె దొడ్డి పెట్టించె;
అప్పుడు నాయుడా యనుగుభూపతిని
తప్పకకొనివచ్చి ధరపతుల చూపి
"అరియప్పనముకొని యఖిలాధిపతుల
విడిపింపుమో రాజ! వీరచారిత్ర
కడలేని కీర్తియు కలుగు నీక"నిన
ఆ రాజశేఖరు "డది మంచిద"నుచు
సమ్మదంబునుపొంది సకలరాజులను
కప్పమ్ముకట్టంగ కట్టడిచేసి
నెమ్మితో పనిచెను నిజపురంబులకు.
అంతట జనపాలు డా బ్రహ్మనేని
"వీరుడా! నిన్నె నే వినుతింపగలనె
తలతుము మాపాలిదైవంబుగాను"
అనుచు కౌగిట చేర్చి యభినుతిచేసి
వినయమేపారంగ విజయంబులంది
మనుజవల్లభుడంత మగుడియేతెంచి

తనపురంబునకేగి తనరెడువేడ్క
పటుతర శౌర్యసంపన్నుడై యుండె.

*అనుగురాజు నాగమ్మను వరియించుట : అనుగురాజు మరణించుచు తన పుత్రులను బ్రహ్మనాయని కప్పగించుట.*

అంతట కొన్నేండ్ల కనుగు భూవిభుడు
నలగామరాజుకు నరసింగరాజు
కలజెట్టిపెరుమాళ్ళ కాదరంబునను
తగిన రాజాధీశ తనయల తెచ్చి
పెండ్లిండ్లు చేయించె పెంపుతోడుతను
తన బంధువులతోడ తనరెడువేడ్క
కొన్నాళ్లు గడిపి యాకువలయాధిపుడు
అంతట నొక్కనాడాత్మరంజిల్ల
ఒప్పుగా తెంపువేటకూహించి కదలె;
అడ్డకత్తులవారు అరిగెలవారు
చేకత్తి పిడిబాకు శరములవారు
పచ్చబద్దలవారు బరిసెలవారు
రాజుతో కదలిరి రాజసంబొప్ప
రుంజలు కైముళ్ళు రుద్రవీణలును
నఫిరీలు తప్పెట్లు నాగస్వరములు
కార్తవీర్యునినాటి కంచురణభేరి
గుభులుకొని మ్రోగంగ కువలయాధిపుడు
కానమ్ముల చేరి కడుసంతసమున
వేటాడ సెలవిచ్చె వీరులందరికి.
వీరులందరుకూడి విపినాల తిరుగు
చిరుతగండుపులుల చెలగి వేటాడి
పెక్కుమృగముల చంపి ప్రీతితో కదలి
మగుడి గురజాలకు మార్గంబుపట్టి

సంటరెడ్డివారి పడతియు మరియు
వీరజగ్గారెడ్డి వేడుకపుత్రి
మేకపోతులరెడ్డి మేనకోడలును
అరవెల్లివారింటి యనుగుకోడలును
నాగమ్మయను ఒక నారీలలామ
అనుగుభూపతిదారి కడ్డంబువచ్చి
కరములు ముకుళించి కడుభక్తితోడ
"వినవయ్య రాజేంద్ర! విన్నపంబొకటి
కంటిని రెప్ప తా కాచెడుభంగి
పుణ్యపురుషుండవై భూమిపాలింప
నెమ్మినున్నారము నీదు రాజ్యమున
నేడు నాకోర్కెను నీవు మన్నించి
గ్రామాలపాడుకు గ్రక్కునమరలి
విందారగింపగా విచ్చేయవలెను"
అనవిని యనుగురాజందరితోడ
గ్రామాలపాడుకు గ్రక్కునకదలి
వచ్చియుండగ చూచి వనిత నాగమ్మ
ఏర్పర్చి విడిదల నెల్లవారలకు
విందులుకావించె వేడ్కమీరంగ;
అనుగురాజప్పు డా యతివనుమెచ్చి
"ఇచ్చితి వరమును నెలనాగ నీకు
కోరు మేదైనను కూర్మితో" ననగ
హస్తముల్ ముకుళించి యతివనాగమ్మ
"ధరణిపాలక! నీదు దయచేతమాకు
సకలంబు కలిగెను సందేహమేల
ఐనను నీయాజ్ఞ నౌదలదాల్చి
అడిగెద నొకవర మనుగుభూరమణ!
ఆరునొకగడియ లతిశయముమీర
పల్నాటిరాజ్యాన ప్రభువులచెంత

మంత్రిత్వమునుచేయ మదికోర్కె కలిగె
అర్థకాలమ్మున నడిగెద నేను
అడిగిన కాదన కపుడీయవలయు
ఈరీతి పత్రమ్ము నిపుడె వ్రాయించి
ఇప్పింపు డ"నికోరె నెలనాగవల్లి
ముందువచ్చెడిహాని వోల్చగాలేక
పత్రమ్ము వ్రాయించి పడతి కిప్పించె.
ఇట్టి ప్రాపునుపొంది యెంతొ గర్వించి
గురజాలనగరుకు కొలువుకూటముకు
వచ్చుచు పోవుచు వనితనాగమ్మ
జాడ లెరుంగుచు జాణయైమసల
నమ్రులై యుండిరి నాయకులెల్ల ;
స్త్రీయని తలపోసి శీలమబ్రహ్మ
చులకనచేయగా చూచి రోషించి
పగబట్టె నాగమ్మ పాముచందమున
అంతకంతకు చూడ నా యిర్వురికిని
పంతముల్ హెచ్చెను పగవృద్ధిపొందె
అట కొన్నిదినముల కనుగురాజునకు
వీపున ఒకపుండు విపరీతముగను
ఏపారగాపుట్టె నెన్నిచేసినను
మానక యా రాజు మరణంబునొందె
మరణంబునొందుచు మాన్యు డా రాజు
తన పుత్రులందరి తడయకపిలిచి
వారల హస్తముల్ పరుస తాపట్టి
నాయుని హస్తమున నయమునపెట్టి
"నలగామరాజుకు నా రాజ్యమిచ్చి
పరగ ప్రధానివై పరిణమించుచును
మేమున్నతీరున మెలగవలెనుమ్మ
అన్నదమ్ముల వీరి నైకమత్యమున

నడిపించుకోవలె నాయుడ, నీవు
తమ్ములనందరి ధరణిపాలకుడు
అరమరలేకుండ నరయుచుల్లగను
చూచుకోవలె నీవు శూరుడ బ్రహ్మ!"
అనిపల్కి యనుగురాజసువులు విడిచె;
అనుగయ్య మరణమున కాత్మ క్షోభిల్ల
దుఃఖించి దుఃఖించి దొడ్డనాయుండు
మరణమ్ముకోరి తా మంచమ్ముపట్టి
విష్ణుని తలచుచు విడిచె ప్రాణమ్ము.

# పల్నాటిరాజ్య విభాగము

## కథాసంగ్రహము

అనుగురాజు మరణానంతరము బ్రహ్మనాయుడు నలగామును పట్టాభిషిక్తునిచేసి, తాను ప్రధానియై ఆతనిచే పల్నాటి రాజ్యమును చక్కగా నేలింపుచుండెను. ఇంతకాలము, అదను వేచియున్న నాగమ్మ, ఒకనాడు, నలగాముని కొలువుచొచ్చి, మున్ను అనుగురాజు, తనకిచ్చిన వరము చెల్లింపుమని నలగాముని కోరెను. నలగాముడు నాగమ్మకు మంత్రిత్వమిచ్చి తండ్రి మాటను చెల్లించెను.

నాగమ్మ మంత్రిపదవిని స్వీకరించి నాయకురాలను బిరుదు వహించి, రహస్యముగా రాజభటులను పంపి, బ్రహ్మన స్నేహితుల యిండ్లను కొల్లగొట్టించెను. రాజభటులు దోచి తెచ్చిన ధనరాసులను నలగామునకు చూపించి ప్రభుత్వ కోశాగారమునకు చేరవలసిన యీ ధనము బ్రహ్మన అపహరించి, తన చెలికాండ్ర యిండ్లకు తరలించెనని ఆతనిపై కొండెములు చెప్పి, నలగాముని మనస్సు విరిచెను. నలగాము డామె

మాటలు నమ్మి, నెనుకటివలె కాక బ్రహ్మనతో మనసుగలిపి మెలగక ఎడసేయుచు వచ్చెను. నాయకురాలు తన పాచిక పారెనని మురియుచు బ్రహ్మన నలగాముల స్పర్థను మరింత పెంచెను. పట్టమహిషివిజ్జలదేవిపుత్రుడైన మలిదేవునకు రాజ్యము కట్టబెట్టుటకై బ్రహ్మన యెత్తులు వేయుచుండెనని నలగామునకు చెప్పి, మలిదేవుని, యతని తమ్ములను చెరసాలలో నేయించెను.

బ్రహ్మన కన్నమను పంపించి మలిదేవాదులను చెరసాలనుండి విడిపించి గురజాలచుట్టును సైన్యములను మోహరించి, పల్నాటిరాజ్యమును నలగామ మలిదేవులకు వంతులు వేసి మలిదేవాదులతో గురజాల విడిచిపెట్టి, చంద్రవంకకు తరలివెళ్ళి, అచ్చట మాచర్ల అను పట్టణము కట్టించి, మలిదేవుడు బాలుడైనందున తాను రాజ్యమును చూచుచుండెను.

కొంతకాలము గడచినది; మలిదేవునకు యుక్త వయస్సు వచ్చినది. బ్రహ్మన అతనికి వివాహము చేయతలపెట్టి కళ్యాణపురాధీశుడైన వీరసోముని కడకేగి, అతని పుత్రిక యగు సిరాదేవిని మలిదేవున కిమ్మని అడిగెను. వీరసోముడు శైవుడు; మలిదేవాదులు వైష్ణవమతస్థులు. కనుక వీరసోముడు, తా నా వియ్యమున కంగీకరింపజాలనని బ్రహ్మన కోరికను త్రోసిపుచ్చెను. "నీ పుత్రికను మలిదేవునకు నీవే యిచ్చెదవు; చూడుము"ని చెప్పి బ్రహ్మన యింటికి మరలెను.

బ్రహ్మన పలికిన పలుకులు నిజమగుటకో యనునట్లు కొంతకాలమున కొక సంఘటనము జరిగినది. వీరసోముని

తమ్ముడగు నందిసోమునిపుత్రిక నాగులాదేవి, తన మేనత్త కొడుకు శివసింగును ప్రేమించి పెండ్లియాడగోరెను. అందులకు నందిసోము డంగీకరింపనందున శివసింగు నందిసోముని పూజా పీఠముతో, నాగులాదేవిని రహస్యముగా తన శివనండ్ల కోటకు తీసుకొనిపోయి, ఆమె నచ్చట వివాహమాడెను.

ఆ వార్త విని వీరసోముడు తనతమ్ములతో కూడి, బలముల నాయత్తపరచుకొని, శివనండ్ల కోటను ముట్టడించెను. కాని ఎన్నేండ్లు యుద్ధము చేసినను ఆ కోట పట్టుబడకుండుటచే వీరసోముడు తన తమ్ముని ఆలోచనము ననుసరించి యుద్ధమున బ్రహ్మన సాయ మపేక్షించుచు తన కుమార్తెను మలిదేవున కిచ్చెదనని కబురుపెట్టెను.

వీరసోముని అభ్యర్థనమును మన్నించి, బ్రహ్మన శివనండ్ల కోటపై దండెత్తి, శివసింగు నోడించెను. శివసింగు నాగులాదేవులు విషము తిని మరణించిరి. బ్రహ్మన వారి బిడ్డ లకు పిన్నయక్కలంకపోతన్న అని నామకరణముచేసి వారిని చేరదీసి, శివనండ్లకోటను వీరసోమునికి అప్పగించి అటనున్న భూతర్కాటంబును తరలించి, త్రిపురాంతకమున ప్రతిష్ఠించి మాచర్లకు తిరిగి వెళ్ళెను.

వీరసోముడు తానిచ్చిన మాటప్రకారము తన పుత్రిక సిరాదేవిని మలిదేవునకిచ్చి వివాహము చేసెను. వివాహానంత రము భోజనములవేళ మగపెండ్లివారి జెట్టీలకును, ఆడపెండ్లి వారి జట్టీలకును వివాదము వచ్చెను. మాటకు మాట పెరిగి అది పోరాటముగా పరిణమింప, వీరసోముని జెట్టియగు

రాయపడవాలు అను గొల్లబంటు పల్నాటి జట్టీలలో బలగర్వితుడగు భీమన్న నోడించెను. రాయపడవాలు పరాక్రమమును చూచి, బ్రహ్మన్న ఆశ్చర్యపడి, కళ్యాణపురమునగల పట్టి జట్టీలను తన వెంట గొంపోవుట క్షేమకరమని నిశ్చయించుకొని, సిరాదేవి కడకేగి, ఆమె అత్తవారింటికి వచ్చునపుడు తండ్రినడిగి గోవులను, గొల్లబంట్లను అరణము తెమ్మని చెప్పెను. బ్రహ్మన చెప్పినప్రకారము సిరాదేవి గుండుబోయని సుతులగు రాయబోయడు, రాయపడవాలు, గోసన్న అను ముగ్గురు గొల్లబంట్లను, కొన్ని గోవులను పుట్టింటనుండి అత్తవారింటికి అరణము తెచ్చెను.

అంతట బ్రహ్మన, మాచెర్లలో, ఒక సుముహూర్తమున, మలిదేవునకు పట్టముకట్టి, మలిదేవుని పెండ్లికి విచ్చేయని నలగామునితోడి పొరపుసమసిపోవుటకై, గురజాలచేరి, ఆతనికి కట్నములిచ్చి, సంతుష్టిపరచి, స్నేహభావము పెంపొందించుటకై ప్రయత్నింపసాగెను.

సవతిబిడ్డల మధ్య సఖ్యము నెలకొన్నచో, ఇక తన యాటలు సాగవని నాయకురాలు గుర్తించి, బలమైన మాచెర్ల రాజ్యము పొరుగున నున్నచో, గురజాలకు భద్రత లేదనియు, పల్నాటిసీమను నలగాము ఒక్కడే పాలించు మార్గమును తా నాలోచించితిననియు, కోడిపందెములయెడ బ్రహ్మనకు అతికుతూహలము కనుక ఆ మిషతో, ఆతని నోడించి, మాచెర్లసీమను చేపట్టవచ్చుననియు నలగామునకు బోధించెను. నలగాము డందుల కియ్యకొనకపోయినను, ఆమె సాహసించి, రెండు కోడిపుంజులను తెప్పించి, వాటికి కాసె

పాతలు కత్తులు కట్టించి, బ్రహ్మన విడిది కెదురుగ, గరిడిలో విడిపించి వాటిని పోరాడించెను. కోడిపోరును చూచుటకై బ్రహ్మన, తన విడిదినుండి బయటకువచ్చి కూర్చుండెను. గరిడిచుట్టును, గురజాల పౌరులు గుంపులు గుంపులుగా గుమి గూడిరి. బరిమీద వదలిపెట్టిన రెండు కోళ్ళును ప్రాణములు తెగించి పోరాడినవి. కొంతసేపటికి అందులో ఒక పుంజు వెనుదిరిగిపోగా, ఓడిపోయిన ఆ పుంజు బ్రహ్మనదనుచు నాయకురాలు చప్పట్లుచరిచి గేలిచేసెను. అంత బ్రహ్మన, చెన్నుని ప్రార్థింపగా, పసుగులుపెట్టెడి ఆ కోడిపుంజు తిరిగి తన జవసత్త్వములను పుంజుకొని రెండవకోడిని చంపివేసెను. నాయకురాలిది సహింపజాలక, బ్రహ్మనను తనతో కోడి పందెము వేయవలసినదనియు, పందెమున ఓడిపోయినవారు గెల్చినవారికి తమ రాజ్యమును విడిచిపెట్టి ఏడేండ్లు అరణ్యవాసముచేసి. పిమ్మట తమ రాజ్యమును తిరిగి చేకొనవచ్చుననియు నొక నియమము విధించి కయ్యమునకు కాలుదువ్వెను. బ్రహ్మన అందుల కంగీకరించి గురజాలను వీడి మాచెర్లకు మరలెను.

ఆ మరునాడు, మలిదేవుని కొలువునకు బ్రహ్మన విచ్చేసి, గురజాలలో జరిగిన వృత్తాంతమంతయు సభవారికి తెలియచేసి పోరునగెల్చెడి పుంజు నెట్లయిన నెదకి తేవలయు నని చెప్పెను. అది విని, పెద్దన పానుగల్లుపురమున శనైశ్చరు డనియెడి చట్టుక్రింద చిట్టిమల్లుడను ఒక కోడిపుంజు కలదనియు, అట్టి పుంజు మరెక్కడ లేదనియు, తగిన వీరుని పంపి, దానిని తెప్పింపవలెననియు నుడివెను.

వీరపడవాలు తా నా పుంజును తెచ్చెదనని బ్రహ్మాన ఆజ్ఞగైకొని, వానుగల్లు పురమునకేగి, అట మాస్టీలను రాజ భటులను ఓడించి, చిట్టిమల్లుని మాచెర్లకు తీసుకొనివచ్చెను. చిట్టిమల్లుని చూచి అబ్బురమంది మలిదేవుడు బ్రహ్మానను గురజాలకు పయనము కమ్మని ఆనతిచ్చెను.

*మున్ను అనుగురాజిచ్చిన వరమును చెల్లింపుమని కోరి నాగమ్మ, నలగామునివలన మంత్రిత్వమును బడసి నాయకురాలను బిరుదు వహించుట : నాయకురాలునకును బ్రహ్మనాయునకును మధ్య స్పర్థ పెరుగుట.*

అంతట కొన్నాళ్ళ కా బ్రహ్మనీడు
పొందుగా నలగాముభూపాలునకును
గురిజాలపట్టంబు గురుతుగా కట్టి
ఇరవుగారాజ్యంబు నేలించుచుండ
అప్పుడు నాగమ్మ యాత్మరంజిల్లి
పదపడి యానాటి పగగొనదలచి
దిట్టగామాల్పాడు ధీరత వెడలి
గురిజాల కొలువుకు గొబ్బున చేరి
నలగామరాజుకు నరసింగునకును
కరములు ముకుళించి కడుభక్తితోడ
"నామనవాలించి నన్నాదరించి
అనుగయ్య యిచ్చిన యానాటి కమ్మ
చదివించుకోరయ్య సర్వజ్ఞులార !
పత్రమ్ములోగల పలుకులనరసి
పాడి తప్పక మీరు పాటించవలెను"
అనవిని నలగాము డా కమ్మ చూచి
మగువ నాగమ్మకు మంత్రిత్వమీయ
నాయురాలను బిరుదు నాతివహించి
పలనాటివారెల్ల పరగ కూర్చున్న
కొలువుకూటమ్మును గొబ్బున వీడి
భటులను పిలిపించి పల్కె తానిట్లు:
"నాయాజ్ఞ తలదాల్చి నాయునిమాట

వినవద్దు మీకిది విహితమ్ముసుండు
ఉడుగక నసుకొల్పి యుండెదరేని
ఉడుగరలిప్పింతు నుర్వీశుచేత
సర్వసంపదలను సమకూర్చి మనసు
మెప్పింపవలెనిప్డు మేదినీశ్వరుని
శీలమ బ్రహ్మన్న చెలికాండ్రయిండ్ల
కలధనంబులనెల్ల గైకొనిరండు"
అనిపంపి మాడ లా యతివతెప్పించి
రాశిగాపోయించి రాజునుచూపి
"కవిలెలు చూచి నేకంటి నొకపంత
ఏచేటవచ్చెడి యీ హెచ్చుధనము
మనకుకాకుండగా మంత్రియౌ బ్రహ్మ
చెలికాండ్ర యిండ్లలో చేర్చుచునుండె
సచివుడేమాత్రము స్వామి ద్రోహమ్ము
తలపెట్టుచో నది తగనిదోషమ్ము"
అనవిని నలగాము డానాటినుండి
శీలమబ్రహ్మని చేరంగ వెరచె;

*నాయకురాలు, బ్రహ్మనపై నలగామునితో కొండెములు చెప్పి, మలిదేవాదులను చెరసాలలో వేయించుట: బ్రహ్మన వారిని విడిపించి పల్నాటి రాజ్యమును పంచి, మలిదేవాదులతో తరలివెళ్ళి, మాచెర్లను కట్టించి, అర్ధ రాజ్యమును, మలిదేవుని పేర పాలించుట.*

అంతయు తెలిసియు నపుడు బ్రహ్మన్న
'మమ్ము కలువగనీదు మగువనాగమ్మ
పెదరాజు చెప్పిన ప్రియమైనతీరు
జరగదాయె'నని చాల చింతించె ;
అంతకంతకు విరిచి యా రాజుమనసు
నాయురాలతనితో నయమొప్ప ననియె :

"వింటివా యీవార్త విపులచరిత్ర !
'నలగాముడన నెవడు నాయురాలెవతె?
బాదన్న మాయన్న బవరంబులోన
చందవోలుపతిని చెలగియోడించి
ఇప్పించె రాజ్యంబు నినకులేశునకు
అనుగుభూవరుపత్నులందరిలోన
పట్టపుదేవి యా పడతి విజ్జమ్మ
పుత్రుడు మలిదేవభూవిభునకును
అర్ధకాలంబున నమరు నీ భూమి
అందాక నీరాజు అవనిపాలించు'
అని బ్రహ్మ పల్కుచు నాత్మకలుషించి
పుడమీశ ! వానిప్డు పోతరించెడిని
బ్రహ్మన్న మనకెపుడు పగవాడెసుమ్ము
ఉడుగక నినుగొల్చి యుండెదనేను"
నాయునిమారుగా నడుపుకోవలయు
అనవిని నలగాము డటు సమ్మతించె.
అది చాల నానాటి కంతంతబలసి
మదమున నుప్పొంగి మలిదేవపతుల
విదితముగ చెరసాల వేయించెనంత
ఆ వార్తవిని బ్రహ్మ యాత్మకోపించి
కన్నమనాయుని కడువేగనంపి
కన్నానతెప్పించి ఘనుల ముగ్గురిని
"కలబలంబులతోడ కన్నమ ! కదలి
గురుతరంబైనట్టి గురజాలపురము
చుట్టుముట్టడివేసి చుట్టుగ్రామములు
అరికట్టి యెవ్వరి నటునిటు పోవ
రాకుండ చేయుము రాజసంబొప్ప
పల్నాటి రాజ్యంబు పంచెదమ"నిన
తనుకొల్చు బలముల తాను రప్పించి

కట్టాయితపడి కన్నమనీడు
మూడామడలు చుట్టుముట్టడివేసి
గవకులు బిగియించి కంబలము నిల్పి
కామరాజు కడకు కడువేగవచ్చి
"ఎంతపని చేసితివినకులేశ్వరుడ!
మగువ మాటలువిని మర్యాదతప్పి
బందిపెట్టితివీవు బాలరాజులను
బంధుమిత్రులతోడ బవరంబుచేయ
కూడదుకాన నో కువలయేశ్వరుడ
పాలించి పల్నాడు పంచుట నీతి"
అనవిని నలగాము డప్పు డిట్లనియె:
"కంఠమ్ముపై బ్రహ్మ ఖడ్గమ్ముమోపి
అన్నదమ్ముల పాళ్ళ నడుగగానేల
నయశాలియైనట్టి నాయుడువచ్చి
ఎవరిభాగము వారి కిప్పింపతగును
కాదందునా నేను కన్నమ! చెపుమ!"
అనవిని కన్నమ్మ యటనుండి కదలి
వినిపించె నావార్త విశదంబుగాను
ఆవార్తవిని బ్రహ్మ యాత్మరంజిల్లి
పలనాడు రెండుగా భాగాలుపంచె
పంచియు నావీరప్రముఖులనెల్ల
తనపాల పెట్టెను తలప నాయుండు;
భావింప చతురంగ బలములనెల్ల
వేగంబె నలగామువిభుపాలపెట్టి
పంచుక తావచ్చి బ్రహ్మనాయకుడు
వీరులందరితోడ వెడలి గురజాల
చంద్రవంకకు వచ్చి జలకమ్ములాడి
మజిలిచేసినతావు మాచర్ల యనుచు
పట్నమ్మునకు పేరు పరగంగబెట్టి

కట్టించె నచ్చట కడువేడ్కతోడ ;
రాణింపుచుండెడి రాచవాడలును
అంతఃపురమ్ములు నాటకూటములు
నాటకశాలలు నగరులు మరియు
చెన్నకేశవునకును చెలువగ్గలింప
కోవెల కట్టించె గొప్పగా నచట ;
తూరుపుతెలవార తొలిచుక్కపొడువ
స్నానసంధ్యలుతీర్చి సద్భక్తితోడ
హరిని కీర్తించుచు నందరుకూడి
కోవెల కేతెంచి కొమరు దీపింప
చెన్నప్రతిష్ఠయు చేయించిరంత ;
ఆ పురమునగల యందరి జనుల
సంతర్పణలుచేసి సంతుష్టిపఱచి
పట్టుపుట్టములిచ్చి పంపించివారి
కూర్చుండి బ్రహ్మన్న కొలువుకూటమున
మన్నీల శూరుల మన్ననచేసి
విధులప్పగించెను వీరు లందరికి ;
మలిదేవు పేరిట మాన్యుడు బ్రహ్మ
పలనాటి నింపార పాలింపుచుండె.

*కల్యాణపురాధీశుడైన వీరసోముని పుత్రిక సిరాదేవిని మలిదేవు కిమ్మని బ్రహ్మన యడుగగా, వీరసోము తండ్రి కియ్యకొనకపోవుట: వీరసోముని తమ్ముడగు నందిసోముని పుత్రిక నాగులాదేవిని, ఆమె మేనత్తకొడుకు శివసింగు ప్రేమించి, నందిసోముడు పూజించు మహంకాళిపీఠముతో ఆమెను రహస్యముగా తన శివసండ్లకోటకు కొనిపోవుట; వీరసోముడు తన తమ్మునితో శివసండ్ల కోటపై దండెత్తగా, అది పట్టుబడకుండుట: కోటను ఆక్ర*

*మించుకొనుటకై యుద్ధములో వీరసోముడు బ్రహ్మన సహాయమర్థించుట : బ్రహ్మన శివసంధ్యకోటను వశపరచుకొని, వీరసోమున కిచ్చుట : శివపురిలోనున్న భూతరాష్ట్రంబమును త్రిపురాంతకమున ప్రతిష్ఠించుట.*

కొన్నేండ్లు జరుగగా కూర్మితో బ్రహ్మ
సభతీర్చి యొకనాడు చతురత పలికె :
"బాగుగా యోచించి బాలరాజునకు
ఒప్పుగా కల్యాణ మొనరించవలెను
ఇప్పుడు చూడగా నీదేశమందు
బంధుజనంబులు పగవారలైరి ;
ఐనను నేమాయె నటుపోయివత్తు
కల్యాణపురమున కలదొకకన్య
వీరసోమునిపుత్రి విమలచారిత్ర
అడిగివచ్చెద రాజు కా కన్యనిపుడు
పట్నంబు భద్రంబు ప్రజలు భద్రంబు"
అని యిట్లు సభవారికంతయు చెప్పి
పయనమాయెను బ్రహ్మ పంబినపేడ్క—
సుంకరి, కన్నమ సొంపుగా రాగ
తనవెంట తోడ్కొని తరలి బ్రహ్మన్న
కల్యాణనగరంబు కడువేగచేరె ;
ఆ పట్టణంబేలు నా వీరసోము
డల్లాణరాజును భల్లాణరాజు
నందిసోముడు మరి నాగసోముడును
మొదలైన తమ్ములు ముఖ్యులు కొలువ
ధనసంపదలతోడ ధరనేలుచుండె ;
ఆ పట్టణముచేరి యపుడు బ్రహ్మన్న
వీరసోముని కిట్లు విన్నపముచేసె :
"భూపాలతిలక ! మీ పుత్రికామణిని

మా రాజసుతుడగు మలిదేవునకును
వారక మేమడుగవచ్చితిమ"నిన
వీరసోము డపుడు వివశుడై పలికె
"మీరు దాసరివారు మేదినిమీద
భవులకు నేరీతి పదుచునిచ్చెదము"
అనవిని కోపించి యా బ్రహ్మనీడు
వీరమ్ముతో పల్కె "వీరసోమేంద్ర !
పనిపూనివచ్చితి పడుచునునడుగ
ఈసున తలపక యీవియవైతి
నీవెయిచ్చెదచూడు నిఖిలైకవీర !"
అనిపల్కి యానాయు డచ్చోటు వెడలి
చనుదెంచి తనపురికి, జరిగినదెల్ల
వినిపించె నచ్చటివీరులకెల్ల.
పదపడి కల్యాణపట్టణంబందు
నందిసోమునిపుత్రి నాగులాదేవి
మేనత్తకొడుకును మేటిశివసింగు
పెండ్లాడగోరగా ప్రియపుత్రికోర్కె
మన్నింప కా తండ్రి మండిపడె తాను;
అంతట శివసింగు డాత్మరోషించి
మామపూజించు మహంకాళిపీఠి
చిన్నలింగమ్ములు శివపూజపెట్టె
ఎత్తుకపోయి తానింతితోవెడలి
కొమరొప్ప శివనండ్ల కోటకుచేరె;
అదివినిసోము డత్యాగ్రహమొంది
సమరభీకరశత్రుసంహారులైన
అన్నదమ్ములగూడి నాహవమ్మునను
గొబ్బున శివనండ్లకోటపైనడచె;
అది దేవనిర్మితంబైనట్టి కోట
ఆ యాదిదేవుండు ఆదికాలమున

త్రిపురంబులనుగెల్చి తేజంబుమెరసి
ఆపరివేషంబు నట కోటచేసి
పోతరాజును నందుపొందుగానిల్పె;
వీరసోమాదులు విడిసి యాకోట
చుట్టు ముట్టడివేసి పోరిదిపెక్కేండ్లు
ఘట్టించి పోరాడ తమ్ములు సుతులు
మనుమలు కొందరు మడిసిరచ్చోట ;
ఇనకులేశ్వరుడంత నేపెల్లతూలె;
ఆవేళ విప్రుడై యా పోతరాజు
ఆ వీరసోముతో ననె నొక్కమాట
"ఎన్నాళ్ళుపోరిన నీశివపురము
చెన్నొందగా నీకు చేకూరదింక
విష్ణుతేజంబున విలసిల్లునట్టి
ఆ బ్రహ్మనేనిచే ననుకూలమగును
ఏబ్రహ్మచేతను నిది చక్కపడదు"
అని యానతిచ్చి యా విప్రుండుచనియె;
అది విని రాజు తానాశ్చర్యమొంది
"అది యేటి తలపోత యది కూడద"నిన
నందిసోముండప్పునయము దీపింప
తన యన్నకును మ్రొక్కి తానిట్లు పలికె
"మనసిరాదేవిని మలిదేవునకును
అడుగవచ్చెనుకదా యలనాడుబ్రహ్మ
ఆతనికోరిక యొదలతాల్చి
సఫలంబుచేసిన సరగున మనకు
తోడురాగలడయ్య దోర్బలఘనుడు
తడయక బ్రహ్మని తరలి రమ్మనుచు
లెస్సగా వ్రాయించి లేఖనుపంపు"
అనవిని యారాజు బోగాకయనుచు
కమ్మనువ్రాయించి గ్రక్కునపంపె ;

పంపిన లేఖను బ్రహ్మన్న చూచి
కనుకులదాసుడౌ కన్నమను పిలచి
"దాసమానికొడుకు దండిశూరుండు
గండుకన్నమతోడ గ్రక్కున నీవు
పయనమై రమ్మ"ని పలికెనంతటను
ఆయత్తపడి వారలతివేగరాగ
తానప్డు తనతల్లిదాపునకువచ్చి
కరములు ముకుళించి కడుభక్తితోడ
"వినవమ్మ యోతల్లి ! విన్నపంబొకటి
శివపురికోటను శీఘ్రంబె గెలువ
నన్ను దీవింపుము నను కన్నతల్లి !"
అనుమాటలకు తల్లి యల్లననవ్వి
"నాపుత్రరత్నమా ! నను కన్నతండ్రి !
కోరి యాశివపురికోట యుద్ధమునకు
తరలిపోయెడివేళ తనయుడ ! నీవు
భుజియించిపోవలె పొందుగానిపుడు"
అనవిని బ్రహ్మన్న అతిముదమొందె;
తల్లియాశీలమ్మ తగుపళ్లెరముల
పంచభక్ష్యన్నముల్ బాగుగానిడిన
తనరెడు వేడ్కతో తానుభుజించి
ఖడ్గమ్ము కుంతమ్ము కరమునబట్టి
సర్వాయితంబయ్యె సమరరంగమునకు;
తనయుడౌ బ్రహ్మని తల్లితా పిల్చి
శోకంత పాదంబు పొందుగా నమరు
పాత్రలో నుదకంబు పట్టుగానుంచి
కుంతమునకు దాని కుదురుగాకట్టి
దృష్టిదోషముబాపి దీవించెనిట్లు;
"అల్లమార్కండేయు నాయువుకలిగి
ధర విభీషణువంటి తాలిమికలిగి

తెంగొప్ప సూర్యుని తేజంబు కలిగి
శివపురికోటను శీఘ్రంబె గెల్చి
తడవుచేయక రమ్ము తనయుడ నీవు"
అని యిట్లు శీలమ్మ యపుడు దీవించ
తల్లిచే దీవన తానందుకొనియు
చెన్నుని గుడికిని చయ్యనవచ్చి
కరములు ముకుళించి కడుభక్తి మ్రొక్కి
పన్నిద్దరాళ్వార్ల ప్రస్తుతిచేసి
పాలకి నెక్కెను పరగ బ్రహ్మన్న ;
కన్నమ, వీరులు కదలియేతేం
మాచెర్లపట్నంబు మరివేగ వెడలి
వెలుగోటి కనుమకు వీరుడుచేరె ;
అచ్చోట వెడలియు నతి చయమ్మునను
శ్రీగిరి చేరిరి శ్రీ వీరవరులు
జాజుల మల్లెల సంపెంగపూల
మల్లెల మందార్ల మంచి గన్నేర్ల
కొల్లగా పూచిన గొజ్జంగి విరుల
శ్రీశైలనాథుని చెలగి పూజించి
శివపురికోటకు చేరిరి వేగ ;
అంతట బ్రహ్మన్న యాకోట చూచి
పురము కావలియున్న పోతరాజునకు
తనకుంతమునకున్న తగుప్రసాదమును
అర్పించి యాతని నభినుతుల్ చేసి
ఆకోట రక్షించు నధికశక్తులను
అందరి సమయించి యాకోటచొచ్చె ;
పన్నుగా నప్పుడా బ్రాహ్మనాయకుడు
గండరగండల ఖండించునపుడు
శివసింగురాజును శివనాగదేవి
విధిలేక యిద్దరు విషముసేవించి

చచ్చియుండగచూచి చాలచింతించి
చెచ్చెర ఆరాజు శిశువులదెచ్చి
ఆడుబిడ్డను పిన్నయక్కనిపిలిచె
పుత్రుపిల్చెను లంకపోతన్నయనుచు
పరగ ఆకోటను బ్రహ్మనాయకుడు
సొలవకప్పుడు వీరసోమునకిచ్చె;
వీరసోముడు తాను వినయంబుతోడ
బ్రహ్మకి మ్రొక్కి బొబ్బెక్కనిట్లనుచు:
"నీవు చేసినమేలు నేనెట్లు మఱతు
ఆనాటి నీకోర్కె యటు త్రోసిపుచ్చి
దోషమ్ముచేసితి దూఱకు నన్ను
మాసిరాదేవిని మలిదేవుకిచ్చి
కల్యాణమొనరింతు కడువైభవమున
నాకోర్కె మన్నించి నాయుడా! నీవు
సుముహూర్తమొక్కటి చూచి పెట్టించు"
అనవిని బ్రహ్మన్న యటుసమ్మతించి
సిరులతో విలసిల్లు శివపురినున్న
ఘూతరాట్కుంబంబు పొందుగాచూచి
ఆహార మర్పించి యతులితభక్తి
శకటమున తరలించి చయ్యనతాను
పాలకీయెక్కెను పర్వినవేడ్కను
పాలకీలకుభయపార్శ్వమ్ములందు
అందంబుగా పట్టి రరిగెలజోళ్ళు
వింజామరంబులు వెలయగా నెమలి
కుంచెలవారును కూడివీవంగ
బూరలు భేరీలు ఫోటుధారలును
కాహాళపంకిణి గాలికొమ్ములును
శంఖసమూహంబు సన్నాయిజోళ్ళు
మురళీచయంబును ముఖవీణతతియు

కార్తవీర్యునినాటి కంచురణభేరి
ప్రతిమోతలీనంగ భావముప్పొంగ
భట్టువారలు మించి బహువిధంబులను
బిరుదుపద్యమ్ములు పెక్కుగాచదువ
శీలమ్మతనయుండు సింహవిక్రముడు
వెలుగోటికనుమకు వేగమేతెంచి
అచ్చట కాలూన కటనుండి కదలి
అడవిచెంచులపల్లె లవలీలదాటి
చెన్నుమల్లునిపల్లె చెలువమరగడచి
మల్లికార్జునిపల్లె మహదేవిపీడి
కోనసింగరి తరలి కొండలుదాటి
శ్రీశైలమునకును శీఘ్రంబె రాగ
అంతట నస్తాద్రికరిగె భానుండు
అప్పు డాబ్రహ్మన్న యతులితభక్తి
మల్లికార్జునముఖమంటపముచేరి
హస్తముల్ ముకుళించి యతులితభక్తి
"దేవ ! మహాదేవ ! దేవతారాధ్య !
నన్ను కరుణనుచూడు నగపుత్రితోడ"
అని యిట్లునుతియించి యాబ్రహ్మనీడు
యామముల్ నాలుగు నచ్చోట గడుప
కుక్కుటంబులుకూసె గువ్వలుకూసె
చుక్కతా బొడిచెను సూర్యుడుదయించె
అంతట బ్రహ్మన్న యతివేగమునను
పర్వతమ్మలపల్లెప్రాంతముల్ గడచి
ఎగువపల్లెను దాటి యెనసిన వేడ్క
మొగుళపల్లెకువచ్చి మోలేరుదాటి
దిగువపల్లెలు గడచి దీమసంబొప్ప
త్రిపురాంతమునకు తిన్నగావచ్చి
ఆవేళ మహదేవు నతిభక్తిమ్రొక్కి

"నాగకంకణ ! శివ ! నందివాహనుడ !
కాంచనగిరిచాప ! కంధితూణీర !
గరుడాసనాంబక ! ఖట్వాంగహస్త !
సకలభూతేశ్వర ! శరభావతార !
ఫాలాక్ష ! కలకంఠ ! పరమేశ ! యిపుడు
శివపురిలోనుండి శీఘ్రంబెతెచ్చు
భూతరాట్కంబంబు పొందుగానుంచి
మితివచ్చుపర్యంత మీనగరమున
మితిచేసి చనవలెమించినవేడ్క
కార్యమీడేర్పంగ కర్తవునీవు"
అనుచు ప్రార్థనచేసి యా దేవదేవు
సన్నిధి నిల్పె నా స్తంభంబునపుడు
ఆత్రిపురాంతకు నానతిపొంది
మాచెర్ల పట్నమ్ము మాన్యుడుచేర
సకలవాద్యమ్ములు సరగున మ్రోగె ;
హారతులిచ్చిరి యంగనామణులు.
బహువిధగీతముల్ పాఠకుల్ చదువ
వివిధవిద్యలవారు వెనువెంటరాగ
పదిదిక్కులందున ప్రజలు క్రిక్కిరియ
దేవళంబునుచొచ్చి ధీరుడుబ్రహ్మ
చెన్నరాయునిమోము చెలువారగాంచి
కరములు ముకుళించి కడుభక్తితోడ
"కరివరదాచ్యుత ! కాకుస్థ తిలక !
పరమాత్మ ! కేశవ ! ప్రహ్లాదవరద !
సర్గంబులును నీవె ! సాక్షివి నీవె !
భువనకర్తవు నీవె ! భువనముల్ నీవె
హరుడవు నీవె ! శ్రీహరియును నీవె !
పరమాత్మ ! మాపొందె ప్రాణంబు నీవె !
గురుడవు నీవె ! మా కోర్కెలు నీవె !

కల్యాణ గుణధామ ! కల్యాణరామ !
శరణంబు మాపాలి శ్రీచెన్నరాయ !"
అని సన్నుతుల్ చేసి యందందుమ్రొక్కి
తన గృహంబునకును తానపుడుచేరి
తల్లి శీలమ్మకు దండంబుపెట్టి
"అర్థికొడుకులకన్నయమ్మ శీలమ్మ
నీయాజ్ఞ గైకొని నేపోయివేగ
చేకొని శివపురి చెండాడి మరియు
అందున్నవారల హతము కావించి
మరలి నీకృపచేత మగిడివచ్చితిని"
అని చెప్పగా తల్లి యతిమోదమొంది
దృష్టిదోషముబాపి దీవించెనతని,

*మలిదేవ, సిరాదేవుల వివాహము : వీరసోముడు, గొల్లబంట్లను తన కొమార్తెను, అరణమిచ్చి పంపుట.*

అంతట నొక్కనా డా బ్రహ్మనీడు
కొల్వుకూటంబున కూర్చుండి తాను
వినయంబుదోపగా విప్రుల బిలిచి
"వినుడు విద్వాంసులు ! విశదంబుగాను
మలిదేవరాజుకు మనమిప్డు పెండ్లి
చేయంగవలె నుడీ ! సిరులుప్పతిల్ల
తిథివారబలములు తీరుగా చూచి
సుముహూర్త మొక్కటి చూడుడీ" యనిన
పంచాంగమును చూచి పండితులనిరి:
"ఈతిథినాటికి నింక పక్షంబు
దినములకున్నది దివ్యలగ్నమ్ము
అన్నివిధముల నది యనువుగా నుండు"
అనవిని బ్రహ్మన్న యధికమోదమున
గంధము కస్తూరి కలయంగ నలది

పట్టుపుట్టమ్ములు పండితులకిచ్చి
"ఆముహూర్తమునకు నయ్యలందరును
ఆయత్తపడుడ"ని యానతినిచ్చి
నలగామపేరిట నయము దీపింప
"మగపెండ్లివారము మనవీటనుండి
తరలి వెడలెదము తడయక రండు"
అని లేఖవ్రాయించి యానాటి కొలువు
చాలించె బ్రహ్మన్న సంతసమ్మునను.
అంతట నొక్కనా డంగనామణులు
మలిదేవరాజును మన్నించి మించి
పెండ్లికుమారుని ప్రీతితో జేయ
కల్యాణపురమునకు గ్రక్కునబోవ
ఆయత్తపడిరంత నయ్యలందరును ;
కదలివెడలుచు బ్రహ్మ కన్నమను పిలిచి
"ఏమిపుడు కల్యాణ మేగివచ్చెదము
పట్నంబు భద్రమ్ము ప్రజలు భద్రమ్ము
కనిపెట్టియుండుమీ కలబలముతోడ"
అని పల్కి యాశూరు నచ్చట నిల్పి
తగినట్టి జెట్టీలు తనవెంటరాగ
కల్యాణపురమునకు గ్రక్కున కదలె :
ఆ ముహూర్తమునకు నయ్యలందరును
పయనమైరప్పుడు పడతులతోడ.
బ్రాహ్మణుల్ దీవింప భట్లు పొగడంగ
చెలగి బ్రాహ్మణస్త్రీలు సేసలుజల్ల
మగువలందరు నిడ మంగళారతులు
ముత్యాలుగూర్చిన మురువుజాలరులు
అందముగగట్టిన యంబారిలోన
రాజు కూర్చుండెను రాజసంబొప్ప ;
ముత్యాలగొడుగులు ముదముతో బట్టి

జగజంపుగొడుగులు చాల్పుగాబట్టి
రత్నాలగొడుగులు రమణతోబట్టి
పడిగెలవారును పరుగున కదల
కదలె గొడుగులు పెక్కుకదలె చామరలు
పొలుపొంద జవ్వాజి పునుగుపెట్టెలును
పన్నీరుబుడ్లును పచ్చకప్పురము
పసుపులు దిండ్లును పట్టుపుట్టములు
కంట్లపెద్దులమీద కనకవస్తువులు
ఒయ్యాన కదలెను ఒద్దికతోడ ;
నఫీరీలు ఝంజలు నాగస్వరములు
మురళీచయంబును ముఖవీణవితతి
కదులపై నవుబత్తు కనకతప్పెటలు
మద్దెళ్ళు తాళముల్ మరి నింగిముట్ట
తమ్మటధ్వనులతో ధరపిక్కటిల్ల
మగపెండ్లివారంత మాచెర్లవీడి
సకలసన్నాహులై సాగి వెడలుచును
కడువేడ్క చేరిరి కల్యాణపురము.
అక్కడ పురమున నంతకుమున్నె
సచివులు భటులను సరగున పిల్చి
"చక్కని శ్రీదేవిసఖిపెండ్లియనుచు
చాటింపుడయ్య బజారులవెంట
గాటమ్ముగా"ననగా భటవరులు
"పొందుగా మన రాజపుత్రికపెండ్లి
చేయుదురట ! పురి శృంగారమిపుడు
చేయుడీ"యనుచును చెప్పిరందరకు ;
అప్పుడు పురజను లతివేడ్క భటులు
చెప్పిన చొప్పున చిత్తరువులను
గోడలవ్రాయించి గొజ్జంగివిరులు
వాడవాడలయందు వన్నెగాగట్టి

పచ్చలతోరణపంక్తులేర్పఱిచి
రచ్చకొట్టమ్ములు రాజమార్గములు
సకలగృహమ్ములు చక్కఁగాఁజేయ
కల్యాణపురమప్డు కల్యాణశోభ
నకలంకవై భవోన్నతి చెందియుండె.
అంత సిరాదేవి నతిమోదమునను
పెండ్లికూతురిజేయ ప్రేమతోడుతను
పల్లవాధరయొక్కపడతి సంపెంగ
నూనెతో తలయంట నువిదతానొకతె
నలుగుపెట్టెను నొక్కనారీలలామ
చెలువైన పన్నీటిచే స్నానమపుడు
కావించి తడియొత్తి గద్దెపైనుంచె
కలికి శిరోజముల్ కరమునబట్టి
అగరుధూపమువేసి యారగాఁజేసి
సన్నగా కురులను నొగి చక్కదువ్వి
తిన్నగా కొప్పుసంధించిరి చెలులు;
తీరైనరాగిడి తిరుగుడుపూవు
సౌరైనకెంపుల చంద్రవంకయును
పాపటబొట్టును పసిడిపోకయును
చూపులకింపైన సూసకంబమర
నిలిపి పల్లేరుపువ్వు నెరితమ్మిరేకు
రావిరేకయు నవరంజికమ్ములును
బావిలీల్ కుంచెంట్లు బవిరెలు కుప్పె
కుతికంటు మెడనూలు గుండ్లపేరులును
తగు నానుపట్టెడ దండసరిగెలును
వెలలేని కడియాలు వింతదండలును
గంటలమొలనూలు గజ్జెలందియలు
జంటమ్రోగెడు గిల్కుసరిమట్టియలును
ముక్కుకు ముక్కెర ముత్తెపునత్తు

శృంగారమొనరించి శ్రీసిరాదేవి
దోడిదెచ్చిరి చెలుల్ తోరంపు ప్రీతి;
నఫిరీ నగార సన్నాయిలు డోళ్ళు
శంఖముల్ కాహళల్ సద్దుగామ్రోయ
దివిటీలకాంతులు దిక్కులవెలుగ
వారకాంతల నృత్యవర్తనల్ మెరయ
పెదమల్లు విచ్చేసె పెండ్లిపందిరికి;
పెద్దమల్లును రత్నపీఠమ్మునందు
ఒద్దికతోనుంచి యువతీలలామ
నతనికి సరసగా నమరుపీఠమున
జతగూర్చి బ్రాహ్మణజనులు విఘ్నేశ
పూజ ముందుగజేసి పుణ్యాహవాచ
నాది విధులనెల్ల నాపైని తీర్చి
మంగళసూత్రమ్ము మగువకంఠమున
వరునిచే గట్టించి వైభవంబెసగ
ముత్యాలతలబ్రాలుపోయించిరంత
మంగళహారతుల్ మగువలొసంగ
పెదమల్లుదేవుని పెండ్లినెరవేరె.
అంతట నొక్కనాడందరు పంక్తి
భోజనంబులుచేయు పొందైనవేళ
పల్నాటి జెట్టీల బలగర్వితుండు
జగజెట్టిభీముండు జగడంబుకోరి
ఆజ్యంబు వడ్డించు నతులసాహసుని
వీరపడవాలును వింతగాజూచి
పరిహసించుచు వాని పలికెనిట్లనుచు :
"ఆవులుండగ మీకు నాజ్యంబుకేమి
కొదువ నేమియులేదు గొల్లడ ! నాకు
నీసత్త్వమరయగా నెయ్యిగాదిపుడు
వలదనువరకును వడ్డించు మూనె"

అనవిని పడవాలు బొగాకయనుచు
నువ్వులఖొడిని గానుగనాడుభంగి
చీరలోపోసియు జేర్చి పిండంగ
కోపించి భీమన్న గొబ్బునలేచి
"నేడు మా ముందర నీ ప్రతాపంబు
చూపంగవలయునా సోమించిమించి
మాతోడ చెయ్యెచ్చి మగటిమిచూపి
బ్రతికితివేనియు పంతంబునిల్పు
రమ్మ"ని పిలువగా రాయపడవాలు
పట్టి భీమన్నను పరపె చిత్రముగ.
అదిచూచి బ్రహ్మన్న యాశ్చర్యమొంది
'ఇటువంటి జెట్టీలు ఎందరో యిచట
కల్యాణపురమున గలరనివింటి
ఏ తీరుగానైన నీ గొల్లబంట్ల
వెంట గొంపోవగా వేడుకయ్యెడిని'
అని మది తలపోసి యటనుండికదలి
అంతఃపురమునకు నతివేగపోయి
శ్రీసిరాదేవికి చెప్పె నిబ్బంగి :
"వినుము సిరాదేవి ! విశదంబుగాను
నీ తండ్రి సోముండు నిన్నంపునపుడు
అరణంబులిచ్చెడు నత్యాదరమున
అప్పుడు నీవడిగి యావులతోడ
గొల్లబంటుల చాల కోరితేవలయు"
అని యిట్లు బ్రహ్మన్న యతివకుచెప్పి
వీరసోమునికడకు విచ్చేసి తాను
"మా చెర్లకును మేపు మగిడిపోవలెను
అత్తవారింటికి నతివనుపంపు"
అని యానతిచ్చియు నటనుండికదలి
తనవిడిదికి చేరె తనరెడువేడ్క ;

అంతట నాసోము దత్యంత మోదమున
తన కొమ్మరాజును తక్షణమె పిలిచి
"వినవయ్య తనయుడా! విశదంబుగాను
మనసిరాదేవికి మన్ననచేసి
అతులితప్రేమతో నరణంబులిచ్చి
అత్తవారింటికి నంపగావలయు
కావున నీవిపుడె గ్రక్కునపోయి
తరుణిని తోడ్కొని తడయకరమ్ము"
అని యానతీయగా నాకొమ్మరాజు
తన చెల్లెలికడకు తడయకపోయి
తండ్రి చెప్పినమాట తగినట్లు చెప్పి
తోయజనేత్రిని తోడ్కొనివచ్చె;
అంత కుమార్తెను నారాజుచూచి
"వినవమ్మ నామాట విశదంబుగాను
అరణంబులిచ్చి నిన్నంపగావలెను
అడుగవలసిన వన్ని యడుగుమీ" యనిన
అడిగె సిరాదేవి యరణమ్ము లిట్లు
"గుండుబోయనిసుతులు గురుతైనవారు
రాయబోయండును రాయపడాలు
పడవాలు తమ్ముడు బాలగోపన్న
వారు ముగ్గురుకూడి వరుసగా కాచు
గోవులు వెయ్యియు గొఱ్ఱెలు వెయ్యి
అల్ల బోయలతోడ నరణంబు నాకు
నిచ్చి పంపించుమీ యనవులేశ్వరుడ!"
అన విని సోముండు ఔగాకయనుచు
అవ్విధంబుననె తా నరణంబు లిచ్చి
మగువను పంపెను మలిదేవువెంట;
తనదు సోదరితోడ దనరెడు వేడ్క

కొమ్మ భూవిభుడును గొబ్బున కదలి
మాచెర్ల పురముకు మరి పయనమయ్యె.

*మలిదేవునిపట్టాభిషేకము : మలిదేవాదుల వివాహమునకు విచ్చేయని నలగామాదులతో స్నేహము నెరవుటకై, బ్రహ్మన్న గురజాల వెడలి, వారికి కప్పము లిచ్చుట : అచ్చట నాయకురాలు, బ్రహ్మన్నను కప్పించి, కోడిపందెమున కాత డంగీకరించునట్లు చేయుట.*

అంతట బ్రహ్మన్న యతిముదమొంది
వేదపండితులయిన విప్రుల పిలిచి
సుముహూర్త మొక్కటి చూచిపెట్టించి
మాచర్ల పురమున మలిదేవునకును
పట్టంబుకట్టి తా బల్కె నిట్లనుచు :
"వినరయ్య వీరులు ! విశదంబుగాను
తమ్ముని పెండ్లికి తరలిరమ్మనుచు
కాముని పిలువగా గదలిరాడాయె
స్త్రీబుద్ధి విని వాని చిత్తమ్ము చెడెను
వైరమ్ము పెరుగుచో వారికి మనకు
చెడును రాజ్యంబును చెడును వంశంబు
కావున నే నిప్డె గ్రక్కునపోయి
పెదమలిదేవుని పెండ్లికట్నములు
కొనిపోయి వారికి గొప్పగా నిచ్చి
వారిక్షేమంబులు పరుసగా నరసి
మిత్రభావమ్మున మెలగివచ్చెదను"
అనవిని మలిదేవుడటు సమ్మతించె ;
అంతట బ్రహ్మన్న యటనుండికదలి
పాలకియెక్కి తా పర్వినవేడ్క
గురుతరంబైనట్టి గురజాలకరిగె ;

నాయుడు వచ్చుట నలగాముడెరిగి
ఏగువాద్యమ్ముల ఎదురుపుత్తెంచి
కొలువుకూటమ్మున కూర్చుండజేసి
"మా భాగ్యవశమున మాన్యుఁడా బ్రహ్మ
ఇంతకాలంబున కిటకువచ్చితివి
మాచెర్లపురమున మనవారలెల్ల
క్షేమానున్నారె చెప్పుమీ" యనిన
నాయుడిట్లనియెను నయముదీపింప;
"మనవారలందరు మాచెర్లలోన
క్షేమానున్నారు చెన్నునికృపను
మలిదేవుపెండ్లికి మనవారితోడ
తరలివచ్చెదవని తమ్ములుచూడ
కదలిరావాయెను కారణంబేమి?
అన్నదమ్ములు మీర లైకమత్యమున
మెలగినచో చాల మేలు చేకూరు
తనపెండ్లి కట్నముల్ తమ్ముడు నీకు
ఇమ్మని పంపెను నివియె గైకొనుము"
అనవిని నలగాము డలతినవ్వలర
కట్నముల్ గైకొని కడుసంతసించి
ఆనాటికొల్వు తానంతజాలించె;
అంతట నాయురా లాత్మరోషించి
నలగామునెల్లైన నాయుడు తనకు
వశవర్తిగాజేయ వలపన్నుచుండె
'ఆతని నిటనుండి యంపుటెగాక
మాచెర్లనుండియు మరలింతు'ననుచు
మదిలోనతలపోసి మచ్చరించుచును
నలగాముచేరి యానాతి యిట్లనియె:
"వినవయ్య యోరాజ విశదంబుగాను

పల్నాడు నీవప్డు పాలింపుచుండ
పంతమ్ముతోడుత బంచుకపోయి
బ్రహ్మతానిప్పుడు బలిసియున్నాడు
బలమైన రాజ్యమ్ము ప్రక్కనెయున్న
మనకు క్షేమముకాదు, మాన్యుడా ! వినుము
బ్రహ్మన్న యెప్పుడు పగవాడెకనుక
తరిచూచి మనమీద దండెత్తగలడు
ఏతెరంగుననైన నేత్రోవనైన
మాచెర్ల రాజ్యంబు మనము చేపట్టి
పల్నాటినంతయు పాలింపవలయు
ఆతెరగు నుడివెద నవనీశ వినుము
పందెమ్ములన బ్రహ్మ పరవశుండగును
కోడిపోరుకు మనము కూర్మితోపిల్చి
ఒడబరచి యాతని నోడింపవలయు"
అనవిని నలగాము "డది కూడద"నిన
"వలదనిచెప్పకు వారింపక"నుచు
ఆర్వెల్లినాయురా లటనుండి కదలి
తనబంటు నొక్కని తడయకపంపి
కోడిపుంజులు రెండు కోరితెప్పించి
కాసెపాతయుచుట్టి కత్తులుకట్టి
తనజెట్టి యొక్కటి తా నొకటి పట్టి
విడిపించె బ్రహన్న విడిదికెదురుగను;
కోడిపోరును చూడ కోర్కెచే మించి
శీలమ బ్రహ్మన్న చేరెనచ్చోట;
కాపులు కరణాలు కలజనులెల్ల
గరడిచుట్టును చేరి గమనింపుచుండ
కుక్కుటంబులు రెండు క్రోధంబుతోడ
కాటుకకొండలు కదసిన రీతి
మత్తగజములురెండు మల్లాడు పగిది

ఒకవానిపై నొకటి యురుకుచుపోరె;
చాలసేపిటువలె జరుగగా నంత
అందులో నొకపుంజు అడలుచు వెనుక
పరుగులు బెట్టెను పౌరుష మెడలి
అదిచూచి నాయురా లధికమోదమున
"పారిపోయెడి పుంజు బ్రహ్మన్న" దనుచు
చప్పట్లుగొట్టెను జంకింతలేక;
ఆ మాటలాలించి యా బ్రహ్మనీడు
మాచెర్ల చెన్నుని మదిని భావింప
వెళ్ళెడి యాకోడి వేగమేతిరిగి
పొంగుచు రెక్కలు పొరిపొరినార్చి
తనపైకి వచ్చెడి తామ్రచూడమును
పొట్టపై నొకపోటు పొడవగా నదియు
ఈకెలన్నియు డుల్లి యిలమీదబడియె;
చూచుచు సభవారు చోద్యంబునొంది
బ్రహ్మని మెచ్చిరి బాగుబాగనుచు
సభవారు నాయుని శ్లాఘింప కనలి
పడతి నాయకురాలు పలికెనిట్లనుచు;
"ఓడు గెల్పులులేని యొట్టిపందెమ్ము
చూచి మీరిప్పుడు చోద్యంబునొంద
ఇదియేమి పోరాట మీకోళలేమి
బ్రహ్మన్నతో నేను పందెమ్ము గట్టి
పుంజును విడిపించి పోరించునపుడు
మాచెర్ల కోళుల పగటిమితెలియు"
అన విని బ్రహ్మ తానతివ కిట్లనియె:
"ఓడు గెల్పులులేని యొట్టి పందెమ్ము
ఆడుటే మెక్కువ యామాటనిజము
పణమేదియో చెప్పు పందెమాడెదను"
ఆమాటలాలించి యార్వెల్లినాగు

"కోడిపందెముమీద గోర్కెయేయున్న
వినవయ్య బ్రహ్మన్న విశదంబుగాను
పణముగా రాజ్యమ్ము పందెమొడ్డుదము
వీగిపోయినవారు విడిచి రాజ్యమ్ము
వనముల నేడేండ్లు వసియించి గడువు
చెల్లించి రాజ్యమ్ము చేకొనవచ్చు
ప్రథమ - ఏకాదశి పందెమాడుదము"
అనవిని బ్రహ్మన్న యటుపందెమొప్పి
రాజుల సెలవొంది రాజసంబొప్ప
పాలకీయెక్కి తా పయనమై కదలి
మాచెర్లపురముకు మగిడి యేతెంచె;

*బ్రహ్మన్న, చిట్టిమల్లుడను కోడిపుంజును తెచ్చుటకై రాయపడవాలును పానుగల్లుకు పంపుట : పానుగల్లుపట్నమున, రాయపడవాలు మాస్టీలను, రాజభటులను ఓడించి, చిట్టిమల్లుని తెచ్చి బ్రహ్మన్నకిచ్చుట : మలిదేవుడు బ్రహ్మానను, గురజాలకు పయనమ్ము కమ్మని చెప్పుట.*

మర్నాడు కొలువుండ మలిదేవరాజు
చుక్కలగద్దెపై సుంకరివారు
రేలపూగద్దెపై రేణూరివారు
పొగడపూగద్దెపై పోతులవారు
ఆవపూగద్దెపై ఆణెమువారు
రేవనూళ్వారును రేచర్లవారు
పైడిచుక్కల పాలపత్రివారలును
ముతసానివారును ముయ్యూరివారు
అట్లూరి మట్లూరి యాఖ్యలవారు
భావజాకారులు బలమూరివారు
ఆవాలవారును అచ్యుతువారు

కొండపిండ్లవారు గోవిందువారు
పెద్దన్న సూర్నీడు పేర్నీడు మరియు
గండుకన్నమయును కన్నమనీడు
రాయనబోయని రాయపడవాలు
పడవాలుతమ్ముడు బాలగోపన్న
యాదిగానరుపది యార్వురు వీరు
లొప్పుగా కూర్చుండిరుచితాసనముల ;
అంతటబ్రహ్మన్న యచటకేతెంచి
తనతోడ నాయురాల్ తామసమ్మనను
పందెమ్ముగట్టుచు బల్కిన పల్కు
లన్నియునెరిగించి యనియెతానిట్లు :
"ప్రథమ - ఏకాదశి బందెమొప్పితిని
పయనమైపోవలె బందెమాడుటకు
పోరునగెల్చెడి పుంజునెట్లయిన
వెదకితేవలయును వేగంబెమీరు"
అనవిని పెద్దన్న యపుడిట్టులనియె :
"ఎనవయ్య తమ్ముడా ! విశదంబుగాను
భూమండలపు కోడి పొసగదు మనకు
మనము పట్టగవలె మహిమగలకోడి
పానుగల్ పురమున బడమటి దిశను
ఒగి శనైశ్చరుడను నొకచట్టుక్రింద
చిట్టిమల్లనియెడి చిత్రంపు కోడి
కలదయ్య యచ్చట కంటినానాడు
తగుజెట్టి నొక్కని తడయక పంపి
ఆపుంజు దెప్పింపుమ"ని చెప్పినంత
విని వీరపడవాలు వినయంబుతోడ
"నా మనవాలించి నాయుడా ! నీవు
సెలవిచ్చి నన్నంపు శీఘ్రంబుగాను
ఎదురెవ్వరైనను నేమైనగాని

తెచ్చెద నా కోడి తేజంబుమీర"
అన విని బ్రహ్మన్న యౌగాకయనుచు
మంత్రాక్షతలనిచ్చి మన్నించి పంపె;
అంతట పడవాలు అటనుండి కదిలి
తన పడకటింటికి తా వేగవచ్చి
రత్నాలకాసెను రంగుగా కట్టి
పట్టుధట్టిని కట్టి బాగుమీరంగ
చెంగావిపాగయు చెలువమరచుట్టి
కరముల చేమపూకడియాలు తొడిగి
ముత్యాలహారముల్ ముదమునవేసి
పచ్చలపతకముల్ బాగుగాతాల్చి
చెంద్రకావిరుమాలు చేతనుపట్టి
రాహుంంపమ్మొకటి రాచబిరుదొకటి
అర్ధనారీఝల్లు అమరబంధించి
శూలమ్ము భుజమున సొంపుగానుంచి
తనతల్లికడకేగి దండంబుపెట్టి
తల్లిదీవెనపొంది తనరెడువేడ్క
శ్రీచెన్నకేశవు చిత్తముననిల్పి
హరిణంబు వలె వేగనటనుండిదుమికి
చిట్టేలరేవును శీఘ్రంబెదాటి
పొన్నల పొగడల పోకవృక్షముల
చందనఖర్జూర జంబుదానిమ్మ
మద్దులమారెళ్ళ మఱ్ఱివృక్షముల
అడవులుదాటుచు అతి సాహసమున
పానుగల్ పురమును పరుగునజేరె
పానుగల్ పురమున బలిసియున్నట్టి
మాష్టీలు వానిని మరిమరి చూచి
"ఏ రాజభటుడవు ఏమి నీ పేరు
పంచవన్నెలబిరుదు పరగకట్టితివి

ఈ బిర్దులన్నియు నిప్పటనుంచి
పోవలె నీవిప్పు పోకుంటివైన
ప్రాణముల్ దక్కవు పాటించి వినుము"
అనవిని పడవాలు అలతినవ్వలర
"పలనాటివారితో పంతమ్ము లేల
మాతోడ చెయ్యిచ్చి మగటిమిమించి
పోరి గెల్చినవాడు పుడమిలోలేడు
ఆలుబిడ్డలమీద నాశయేయున్న
నామాటవిని మీరు నమ్రభావమున
మారుమాటాడక మగిడిపొండ" నిన
మాష్టీలు వానిపై మండిపడిలేచి
చుట్టుముట్టిరచట శూరత మెరసి;
అంతట పడవాలు అత్యుగ్రుడగుచు
కుప్పించి దుముకుచు కూత పెట్టుచును
ఒక్కరి నిద్దరి నొనరంగపట్టి
కరకర కంఠముల్ ఖండించివైచి
పట్నము పొలిమేరపడమటిదిక్కు
నున్నట్టి చట్టును నొప్పుగాచేరి
చిట్టిమల్లును చూచి చోద్యంబునొంది
"రావోయి మల్లన్న రావోయి" యనుచు
చట్టుపై నక్షతల్ చల్లగా కోడి
మెయివంచి పొదలించి మెడయెత్తి నిక్కి
'కొక్కొరోకో' యని కూత పెట్టుచును
కైదండపై నెగిరి గ్రక్కునవ్రాలె;
పుంజును పడవాలు పొందుగాపట్టి
చంకను పెట్టుక సరగునకదిలి
పురవీధులనుదాటి పోవుచుండంగ
రాజభటులు చూచి రభసంబుతోడ
పడవాలు పెబడిరి పటువాయుగతిని;

అప్పుడాపడవాలు ఆత్మరోషించి
అట్టహాసముచేసి యడిదంబుపూని
ఎక్కడెక్కడివారి నక్కడేపట్టి
ఖండించి వారిని గ్రక్కునమరలి
పానుగల్ పురమ్ము పరుగునవీడి
అడవులు గడచుచు నతిసాహసమున
చిట్టేలరేవును శీఘ్రంబె దాటి
మహాదేవిచర్లకు మగిడి యేతెంచె;
ఆవార్తవిని వీరు లధికమోదమున
పేగువాద్యంబుల నెదురువత్తేర
కొలువున కేతెంచి కోర్కెచే మించి
పడవాలు పుంజును బ్రహ్మన్నకిచ్చె;
ఆతడిచ్చిన కోడి నందుకొని బ్రహ్మ
తనయంకముననిడి తనరెడువేడ్క
ఈకెలుననువుతో నిరవు గాతీర్చి
ఒడలెల్ల నిమురుచు "నో చిట్టిమల్లు !
పందెమ్ము గెలువుము పంతమ్ముచూపి
నాయకుల్ వీరులు నమ్మిరి నిన్ను"
అనిపల్క మలిదేవు డలతినవ్వలర
చిట్టిమల్లును తను చేరరప్పించి
పక్షముల్ నిమురుచు బాగుబాగనుచు
"ఇట్టి పుంజునుచూడ మేభూమియందు
పందెమ్ము గెల్చును పలుమాటలేల
పయనమ్ముకమ్మని బ్రహ్మతో పల్కి
కొలువును చాలించె కూర్మితో నంత.

# కోళ్లపోరు: గోపన్న విరుగు

## క థా సం గ్ర హ ము

మలిదేవుడు పయనము చెప్పగా బ్రహ్మన ఆమరునాడు గురజాల పోవుటకై ఆయత్తపడెను; అభ్యంజనముచేసి వస్త్ర భూషణములు దాల్చి చిట్టిమల్లుని చేరదీసి కోడిపందెమున తనకు జయమగునేని ఎలుగెత్తికూయుమని దాని నడుగగా అది అటులనే కూసెను; కాని బ్రహ్మన రెట్టించికూయుమని మరల నడుగగా, అది ఒడలు స్రుక్కించి ఉత్సాహముమాని హీనస్వరమున నెలిగించెను. శకునజ్ఞులది విచారించి బ్రహ్మన తొలి పందెమున గెల్చుననియు, మారుపందెమగుచో నోడిపోవుననియు జోస్యము చెప్పిరి. అందులకు బ్రహ్మన చలింపక శీలమ్మకడ సెలవుగైకొని చిట్టిమల్లుని వెంటనిడుకొని పల్లకీ ఎక్కి కన్నమాదులతో గురజాలకు బయలుదేరెను.

బ్రహ్మన కోడిపందెమాడుటకై గురజాల బయలుదేరెనను వార్త గొట్టిపాళ్లనున్న గోపన్న విని అతనిని కలియుటకై పరుగుపెట్టసాగెను. పరుగెత్తి వచ్చుచున్న గోపన్నను

దూరమునుండి చూచి బ్రహ్మన్న అతనిని వెనుకకుమరల్చుమని కన్నమను ఎదురుపంపెను. అతడు గోపన్నను సమీపించి తమవెంట రావలదని బరివ్రాసి బరి దాటవలదని బ్రహ్మనాదులపై ఆనలు పెట్టెను. కాని, గోపన్న ఆ యానలు త్రోసిపుచ్చి ముందుకు పోజొచ్చెను.

అది చూచి బ్రహ్మన వాని నింటికి మరల్చుమని అడపకే దాసిని పంపెను. కాని గోపన్న అతని మాటలనుకూడ పెడ చెవినిపెట్టి బ్రహ్మనను చేరెను. బ్రహ్మన అతనిని నిష్ఠుర వాక్యములాడి, వెనుకకుమరల్చచూచెనుకాని గోపన్న తానును, తనసోదరులును కల్యాణపురమునుండి సిరా దేవితో మాచెర్లకు అరణమువచ్చిననాటి వృత్తాంతము జ్ఞాపకముచేసి, బ్రహ్మనను సందిగ్ధహృదయుని చేసెను. బ్రహ్మన తను మాచెర్లనుండి బయలుదేరునపుడు తనకు వచ్చిన శకునములు పేర్కొని, వాటి ఫలితములు చెప్పుమని గోపన్న నడుగగా, ఆతడా శకునఫలితము లెరిగించి బ్రహ్మన నాశ్చర్యచకితుని కావించెను; అంతియేకాక, తన అన్న రాయ పడవాలు పానుగంటిపీడుల నోడించి చిట్టిమల్లుని తెచ్చిన విధ మును, తానును గురజాలలో కోడిపందెమును గెల్చి విజయ లక్ష్మిని చేపట్టెదననియు, రావలదని వారించినచో ప్రాణ త్యాగముచేయుదుననియు భీష్మించుకొని బ్రహ్మనవెంట పడెను. మున్ముందు గోపన్న మరణించుటాది భవిష్యత్ వృత్తాంతమంతయు నెరింగిన బ్రహ్మన గోపన్న నిక వారించి నచో ప్రయోజనములేదని భావించి, ఆతని రాక కియ్యకొని చిట్టిమల్లు నతనిచేతి కిప్పించెను.

అంతట సూర్యుడస్తమించెను. చీకట్లు నలుదిశలు క్రమ్మెను. బ్రహ్మన కంబముపాడు మంచికల్లు అనెడి గ్రామములు దాటి మాడుగులు చేరెను. బ్రహ్మన రాక నెఱింగి మాడుగులు రెడ్డి ఆరాత్రి భోజనముచేసిపొండని వారినందరి నాహ్వానించెను. అతని ఆహ్వానమును మన్నించి, బ్రహ్మన అట ఆగి, తన రాక నలగామున కెరిగింప తనలెంకలను గురజాలకు పంపెను. వారు గురజాలకు పోయి, నలగామున కావార్త వినిపించిరి; బ్రహ్మనను ఆ రాత్రి కాక, ఆ మరునాడు గురజాలకు విచ్చేయుమని నలగామిడు అతనికి కబురు పంపించెను. ఆ రాత్రి బ్రహ్మన, మాడుగులరెడ్డియింట విందారగించి గోపన్నకు వైష్ణవమిచ్చి అతనికి గోపాలదాసి అను పేరుపెట్టి, రెడ్డి ఇంటివారందరికి కానుకలిచ్చి వారిని సంతోషపరచెను.

అందరిపంపున నొకరెడ్డి, బ్రహ్మన్నవద్దకుపోయి మున్ను నలు డాదిగాగలరాజులు జూదమాడి సిరిసంపదలు కోల్పోయిరనియు, ద్యూతమున జయాపజయములు అనిశ్చితములనియు కనుక కోడిపందెమాడవలదనియు అతనికి హితోపదేశము చేసెను. కాని బ్రహ్మన అతనిని సమాధానపరచి, ఆ పూట అట విశ్రమించి ఆ మరునాడు తన పరివారముతో మాడుగుల నుండి గురజాలకు బయలుదేరెను.

అట గురజాలలో నాయకురాలంతకుముందే తన ప్రయత్నములలో తానుండెను; కోడి పోరునకు గరిడీ చేయించుటయే కాదు; ఆశ్రితులను పిలిపించి వారికి పేరు పేరునను మంచి గుఱ్ఱములనిచ్చి, బ్రహ్మన పందెమును గెల్చినచో

వానిని యుద్ధమున నోడించుటకు కాబోలును, ఆశ్వికులను ఫౌజులుగా నేర్పరచి కట్టుదిట్టముచేసెను.

బ్రహ్మన గురజాలకు వచ్చుచున్నాడను వార్తవిని నలగామడతనిని తోడి తెచ్చుటకై తన తమ్ముడు నరసింగ రాజును పంపించెను. బ్రహ్మన నలగాములు గరిడికి వచ్చి తమ స్థానములందాసీనులైరి; పందెమును చూచుటకై గురజాల ప్రజలు గరిడి చుట్టును కోలాహలముగా చేరిరి; నాయకురాలు నల్లమల్లుడను తమ పుంజును రప్పించెను.

అంతట నలగామడును నాయకురాలును బ్రహ్మనయు పుంజులు విడిపించి పోరింపుడని తమ వారి కాజ్ఞాపించిరి; వారి సెలవొంది గోపన్న చిట్టిమల్లుని, చింతపల్లి రెడ్డి నల్లమల్లుని, గరిడిలో విడువగా అవి పొంగుచు రెక్కలు పొరిపొరి నార్చి చూపుల నిప్పులు రాల్చుచు మీది కెగురుచు ఒకదానినొకటి కాళ్ళతో తన్నుకొనుచు బరియంతయు గుండ్రముగా తిరుగుచు పొడుచుకొనుచు చూపరు లాశ్చర్యపడునట్లు కొంతసేపు పోరాడెను; పోరాటమున చిట్టచివరకు నల్లమల్లడు నెత్తురు కక్కి కూతపెట్టుచు తల తెగి క్రిందపడెను. పడుచున్న పుంజును చూచి నాయకురాలు మూర్ఛిల్లెను; నలగామడు నిట్టూర్చి విషణ్ణుడై తలయొంచుకొనెను. కొంతసేపటికి నాయకురాలు తెలివి తెచ్చుకొని తనను తాను సంబాళించుకొని నలగాముని చేరి అతనికి ధైర్యము చెప్పి సామదానభేదదండోపాయముల నెట్లైన బ్రహ్మన్న నోడింతునని పంతముపట్టి బ్రహ్మనను మాచెర్ల పందెమున కొప్పించి నాటి పందెము చాలించి నలగామునితో నగరిలోనికి పోయెను.

నాయకురాలైనను బ్రహ్మన్న నోడించెదనని పంతము పట్టినదే కాని ఆమె మాటలపై ఆమెకే నమ్మకము లేదు కాబోలును బ్రహ్మనను చంపించుటకై భోజనము వేళ అతని విడిదికి విషాన్నము పంపించెను. బ్రహ్మన ఆ విషాన్నమును భుజించి గరళకంఠునివలె తేజరిల్లెను. విషాన్నమారగించియు బ్రహ్మన బ్రతికియుండుట తన చారులవలన తెలిసికొని నాయకురాలిక లాభము లేదని యా ప్రయత్నము మానుకొని, కట్టుబోతులను పిలిపించి, గరిడిలో పోరునపుడు మంత్రతంత్రాదుల నెట్లైన బ్రహ్మన పుంజును చంపుడని వారి నందుకు నియోగించెను. కట్టుబోతులు నాయకురాలి యెదుట నొక కోడిపుంజును మంత్రించి చంపి తమ శక్తిసామర్థ్యములకు దృష్టాంతము చూపినను, నాయకురాలు ఎందుకైనను మంచిదని ఇంకొక పదక మాలోచించి బ్రహ్మనాదులు కూర్చుండుటకై గరిడిచెంత నొక పాతర త్రవ్వించి అందు నారసములు వేయించి మన్నుతో కప్పించి దానిపై కీలులాగిన క్రిందపడునట్లొక తమగము కట్టించెను ; అంతియె కాక పట్టణమున అందందు ఫౌజులనిల్పి కట్టుదిట్టము చేయించెను. ఇట్లు సర్వమాయత్తము చేసికొని ఆ మరునాడు గరిడికివచ్చి "ఇది తుదిపందెము ; దీనికిక తిరుగు లే"దని బ్రహ్మననొప్పించి ఆమాట జనులెల్ల వినునట్లుగా చాటింపు వేయించెను. వెనుకటివలె గోపన్నయును రెడ్డియును తమతమ పుంజులను గరిడిలో విడిచిరి. అవి యథాప్రకారముగా, పోరాడుచుండగా, కట్టుబోతులు, చిట్టిమల్లునిపై మంత్రాక్షతలు చల్లిరి. చిట్టిమల్లుడు బిరబిర తిరుగుచు గజగజ వణకుచు కుత్తుకయొండి, నోరు తెరచుకొనుచు నేలపై నొరగి

పోయెను. నలగామునికి నగు మొగంబయ్యెను; నాయకురాలి ఆనందమునకు మేర లేకుండెను. పందెమున నోడిపోయిన బ్రహ్మనను చూచి నాయకురాలు, తమ బంట్లు మాచెర్లకు వచ్చి మలిదేవాదులను మరలించకమున్నె, వారటనుండి కదలిపోవుట మంచిదని హెచ్చరించెను. బ్రహ్మన ఔగాక యని నలగాముడిచ్చిన విడియమందుకొని అటనుండి మరలు చుండగా నాయకురాలి దుస్తంత్రమును ప్రజల కెరిగించుటకై కన్నమ తమగము కీలూడ్చి చూపింపగా, అది క్రింద పడి పోయెను.

అది చూచి గోపన్న ఉగ్రమూర్తియై నాయకురాలి దుశ్చేష్టితములను పేర్కొని ఆడుదానిమాట విని చెడిపోవల దని నలగాముని హెచ్చరించెను. నాయకురాలు గోపన్నను తూలనాడెను. ఇరువురకును వాక్కలహమయ్యెను. నలగాముని లెంకలు గోపన్నపై బడిరి. గోపన్న నలగాముని లెంకలను చంపి, శత్రుసైనికులను చెల్లాచెదరు చేయుచుండగా నాయకు రాలు వారిని పురిగొల్పి అతనిపైకి పంపెను. వారు ఇనుమడించిన కోపముతో గోపన్న నెదుర్కొనగా ఆతడు శత్రు భీకరుడగుచు కొందరి తలలు నరికి మరికొందరి కంఠములు దునిమి మిగిలివారిని తరిమికొట్టి తనకు కన్నెకయ్యము కలిగెనని సంతోషపడుచు విజృంభింపసాగెను. అంతట నాయకురాలు ఫౌజుకు పెద్దయైన ఆరెజోగనను, గోపన్నను చంపుటకై పంపించెను. అతడు వీరులను వెంటనిడుకొని గోపన్నను ఖడ్గమున వ్రేసి అతనిని నేలకూల్చెను. నేలకొరగిన గోపన్న

బ్రహ్మనదర్శనార్థమై ప్రాణములు బిగబట్టుకొని అట్లే పడి యుండెను.

గోపన్నను సంహరించితిమని ఆరెజోగన సైనికులు, ఆర్పులు పెట్టుచు బ్రహ్మనపై పడుట కుద్యమింపగా, కన్నమ వారి నడ్డగించి ఆరెజోగనను చంపివేసెను. ఆశ్వికులతనిని కదియగా వారిలో పెక్కండ్రను నిహతులనుచేసి కన్నమనేడు కదన రంగమున పరాక్రమించెను. అతని పరాక్రమమునకు ఎదురు నిలిచి పోరాడజాలక శత్రువులు వెన్నుచూపి పరుగిడసాగిరి. గురజాలపౌరులు తమప్రాణములు గుప్పిటపెట్టుకొని పరుగిడుచు అక్కడక్కడ దాగుకొనజొచ్చిరి.

శత్రుమూకలను చెల్లాచెదరుచేసి కన్నమ బ్రహ్మనకడ కేగి గోపు నేలకొరగుటాది వృత్తాంతమంతయు అతనికి తెలియజేసెను. బ్రహ్మన గోపుపడియున్న తావునకు చేరి పరి పరి విధముల వగచుచు, అతనినోట తులసితీర్థము పోసెను. గోపన్న దానిని సేవించి నారాయణుని మదితలచి బ్రహ్మ రంధ్రమున ప్రాణములు విడిచెను.

గోపన్నశవమును అందలమున నిడుకొని బ్రహ్మన గురజాలనుండి మాచెర్ల చేరగా, మలిదేవాదులు, వీరనాయ కులు అంతఃపురస్త్రీలు కన్నమవలన ఆ వార్తవిని కడు దుఃఖించిరి. కన్నీరుమున్నీరుగా ఏడ్చుచున్న గోపన్నతల్లిని పురమునగల పెద్దలూరడించి, ధైర్యము చెప్పి గోపన్నకు అగ్ని సంస్కారము చేయించిరి.

*బ్రహ్మన కోడిపందెమాడుటకై కన్నమతో గురజాలకు బయలుదేరుట : ఆ వార్త విని గొట్టిపాళ్ళనున్న వెవుల గోపన్న అటనుండి తానుకూడ పయనమగుట.*

నగరిలోనికి బ్రహ్మనాయుడు పోయి
విజ్జలదేవికి వినయంబుతోడ
వండంబుపెట్టిన తాపుత్ర ! కామ
రాజును మలిదేవరాజులు నీకు
వీరును వారును విను మొక్కరూపు”
అని బుద్ధిగాచెప్పి యనుప నాయకుడు
తన వసారుకుపోయి తలకొన్న వేడ్క
అభ్యంజనస్నానమమరంగనాడి
ఉచితకర్మంబులనొప్పుగాతీర్చి
ఒగి నాయుధంబుల కుపహారమిచ్చి
బంతికి తగువారి పరగరప్పించి
షడ్రసాన్నములలో చవులుగ్గడించి
ఆరగించినమీద నతిసంభ్రమమున
నడిమిమేడకు బ్రహ్మనాయుడు వచ్చి
విడియంబుచేయుచు విభవంబుమెరయ
నిడుదలై తరుచులై నిగనిగల్ తేరి
నలుపులై మెరుగులై నవకమైయున్న
వెంద్రుకలల్లనవిచ్చి బాగమర
జడయల్లి చేమంతి జాజిపూ దండ
లొప్పారకై చేసి యొనరసంధించి
మృగమదకుంకుమమిళితమైయున్న
పరిమళగంధంబు బాగుగాపూసి
చెంగావి వలిపంపు చీరయుకట్టి

నవరత్నఖచితమై నలినొప్పుచున్న
హస్తకంకణముల ననువుగాతొడిగి
నీలాలపోగులు నిండారపెట్టి
రత్నకీలితములై రంజిల్లుచున్న
పంచశరంబులు పసిడియుత్తరిగె
పెంపైన ముత్యాలపేరులువైచి
పచ్చల కెంపుల పద్మరాగముల
ఉంగరంబులు వ్రేళ్ళనొప్పుగాపూని
పొలుపార సందెట పూసలుకట్టి
హరితులసీమాల నరుతధరించి
శ్రీకృష్ణరాయుని చెలువంబునొంది
ఆశీలమబ్రహ్మ యాయర్థనారి
చిట్టిమల్లనకోరి చిత్రముగనపుడు :
"కినుక యేమియులేక గెల్చెదీమహిని
సత్యవాదివియగుదు జయశీలివగుదు
బ్రహ్మనాయునికింక పందెంబులోన
జయమగునేనియు సంపూర్ణనాద
మొప్పార కూయుమీ యో చిట్టిమల్ల ."
అని సేసపైచల్లి యటువేడుకొన్న
మెయిపంచి పొదలించి మెడయెత్తినిక్కి
'కొక్కొరోకో'యని కోళులగొంగ
పంచమస్వరమున పాటించికూయ
"ఇప్పట్ల రెట్టించి యెలిగించు"మనిన
ఉత్సాహమునుమాని యొడలుస్రుక్కించి
హీనస్వరంబున నెలిగించుటయును
శకునజ్ఞులెల్ల విచారించిచూచి
"మునుపటిపందెంబు మోసంబుకాదు
మనము గెల్తుము; వేరె మరుపందెమైన
జయము దుర్లభము విచారించిచూడ"

అని యాడుకొని వారలందరు నరిగి
రంత నాయుడు పయనమతి వేడ్క చెప్ప
పావురమ్ముల పట్టి ఖామిదేవుండు
మంగిదేవుడు నారిమంచిదేవుండు
జయశీలనాథుండు జామిదేవుండు
పిచుకపోరుకు నేర్చు బిరుదుభీముండు
మందులుగలయట్టి మలిదేవమల్లు
పోరుపొందెరుగని బోపోల్కెతల్లు
తగరుపట్టంగ నుద్దండవల్లభుడు
కుంచశ్రీరాముండు గొడుగుమోగాయ
సంబువుల్ పట్టెడి చండివెంకాయ
అతివీరుడైనట్టి యదపకేదాసి
కరతిత్తిమాచండు కావటివెంక
లెంకకాముండును లెంకమాచండు
లెంకలింగాయయు లెంకపేముండు
లెంకన భీముండు లెంకమాచాసి
మొదలగులెంకలు ముప్పదిమువురి
ఊడిగంబులవారి నొనరరప్పించి
పయనంబు తెల్పుచు బ్రహ్మనాయుండు
బామినేనికి విన్నపముచేసిమ్రొక్కి
తమతల్లికతిభక్తి దండంబుపెట్టి
శీలమపెట్టిన సేసగైకొనుచు
బ్రాహ్మణాశీర్వాదభరితవాద్యములు
బహుళమై మ్రోయంగ పట్టణంబందు
పుణ్యకామినులెల్ల పొదలిదీపింప
తమ వతారమ్మున తగువారినిల్పి
చెన్నకేశవనాథుశ్రీపాదములకు
నెంతయు సాష్టాంగమెరగి యాదేవు
తీర్థప్రసాదముల్ శిరముగాదాల్చి

మాచర్ల వెడలి యామహితవిక్రముడు
భాగానదీ చంద్రవంకలన్ గడచి
బ్రాహ్మల పెద్దల పడవాళ్ల దొరల
నాయకులను బ్రహ్మనాయుడు ప్రీతి
ఉచితసంభాషణల నునిచి వేవేగ
గురజాల తెరవు గైకొని యేగెనంత.
గొట్టిపాళ్ళను చెవుల గోపన యెరిగి
పాడియావులమంద పరికింపుచున్న
పురుషార్థనిధి మల్లబోయనికర్థి
పెళ్ళికి మ్రొక్కెడి ప్రియముతో మ్రొక్కి
మల్లబోయని వలన మన్ననపొంది
సఖులును తాను విశ్వాసంబుతోడ
మహాదేవచర్లకు మగుడిపచ్చుచును
ఆలోన గోపాలురాపురినుండి
వచ్చిన కనుగొని వారి రప్పించి
"తమ్మటధ్వనిమ్రోసె దశదిక్కులందు
పిక్కటిల్లంగను పేర్చి వాద్యములు
పరదేశదొరలు కప్పము తెచ్చినారొ ?
బ్రహ్మనాయుడును కప్పంబులెత్తగను
పోవుచునుండెనో ? పురిలోన క్రొత్త
వార్తలేమైన వినవచ్చెనో ?" యనుచు
నడిగిన నందులో నని యె నొక్కరుడు :
"వినవయ్య గోపయ్య ! విమల చారిత్ర !
మీయన్న పడవాలు మేటిసాహసుడు
పానుగంటికిపోయి బలిమిమై నిన్న
మాపటికాచిట్టిమల్లని గొంచు
వచ్చెను; మలిదేవవసుధీశ్వరుండు
గురజాలలోనుండు కోడిపోరునకు
"పొమ్మ"ని యనిపిన పురిలోన నేడు

నాయుడు పయనమై నలిపోవుచుండ
వాద్యముల్ మ్రోగెను వనధియుఘోలె
అంతియెకాని యేమరసితిమందు
మాచర్ల లోపల మరిక్రొత్తవార్త
లేమియులేవ"న్న యెంతయునుబ్బి
కౌగిట నాతని కదియంగజేర్చి
విడియంబుబెట్టించి వేగవీడ్కొల్పి
చెలికాండ్రగూడి మాచర్లకువచ్చి
వారినందరినంపి వలనొప్పగాను
మజ్జనభోజనమాల్యాంగరాగ
వస్త్రభూషణములు వరుససంధించి
గోపు కుంతము పుచ్చుకొని వేగవెడలె.
బ్రహ్మనాయుని నన్పి వడివడినడచి
మానుసుల్ మూకలై మగిడివచ్చుచును
ఎదుర గోపన గాంచి "యెందుపోయెదవు ?
బ్రహ్మనాయుడు కంబముపాడువాటె
గోపు ! నాయునినింక గూడంగలేవు
మగిడిరమ్మ"న వారిమాటలు వినుచు
"ఎంత దవ్వైనను నెదురంగపోయి
పొడచూపివచ్చెద పొండు పొండ"నుచు
పటువాయుగతి గోపు పరతెంచెనంత.

*గోపన్నను రాకుండ వారింపుమని బ్రహ్మన కన్నమను పంపుట: కన్నమ, గోపన్నుచేరి తమ వెంట రావలదని ఆనలు పెట్టుట.*

కాని దుశ్శకునముల్ కనుగొనుచు బ్రహ్మ
నాయుడు కన్నమనాయునిజూచి
"మనమెవ్వరినినైన మగుడించ మరచి
రాముగదా చూడరా త్రోవవంక"

అనిన కన్నమనీడు నటునిల్చిచూచి
"కొదమసింగమువోలె గొదకొని యెవడొ
పరతెంచుచున్నాడు పటురయంబునను
రూపింపనెవ్వరో రూఢి తెలియంగ
రాదన్న శీలమబ్రహ్మనాయకుడు
తనమదిలోపల తలపోసిచూచి
బ్రాహ్మల పెద్దల రాచకొమాళ్ళ
నాయకులను దొరల నగరిలెంకలను
పడవాళ్ల నాదిగా పరికించిచూచి
"చెవుల గోపనగాని చేరడియ్యెడల
వాడుగానోపు తా వచ్చుచున్నాడు
మగిడించు పొందుగా మాటలుచెప్పి
గారాదు పొమ్మను కన్నమనేడ !"
అనుటయు "నాచేత నతడేలమగుడు
దేవరయానతి తిరుగునోకాని"
అని విన్నవించిన నతనికిట్లనియె :
"పరుసతోనానలు వ్రాయించి పొడువు !
ఆనలన్నియుత్రోచి యరవాయిగొనక
వచ్చెనా రానిమ్ము వలదనరాదు
పొమ్మనియెద మరి బుద్ధులుచెప్పి
అడ్డుపెట్టుము వేగ నతడురాకుండ"
అనిన కన్నమనేడు నటకెదురేగి
అంతటలోపల నతివేగిరమున
వచ్చినగోపు "రావలదటునిలువు !
నాయునిగారి యానతివచ్చినాడ
మహాదేవిచర్లకు మగుడుమువేగ"
అనిన నాగోపన యల్లననవ్వి :
"పట్టణంబునగల పరివారమెల్ల
పొడచూపగా నేను పొడచూపవలదె

ఏనూరలేకుండ పెరుగవానీవు
అప్పటి తరిరాక యటుతప్పెగాక
కన్నార కదలుట కన్గొని నాకు
ఊరకమగుడుట యుచితమా చెవుమ ?
సేవ నాధర్మంబు చింతించిచూడ
బ్రహ్మగారికిమ్రొక్కి పనివినియెదను
ఇకనుండ వచ్చెద నేమైనచెపుమ
అడ్డుపడగనేల యకలంకధీర !"
అనినకన్నమనాయు డడ్డంబువచ్చి
తెరువుకు బరివ్రాసి "తెగువయైదాటి
యరుగుదెంచితివేని యనుగురాజాన !
రాజానత్రోయకు ! రావలదుడుగు !"
అనుటయు గోపు తా నటు మగిడిచూచి
"ఆరాజ్యమెట్టిదో యతడెట్టివాడొ
విన గాన నెన్నడు వెరప నాకేల ?
త్రోసితిపో ! దాన దోసమేమనుచు
చయ్యన బరిదాటి చనుటయుచూచి
"మలిదేవరాజాన మగుడుమీవేగ
ఈబరిదాటరాదెన్నిచందముల"
అని బరివ్రాసిన నటబోకనిలచి
"మలిదేవరాజాన మాతలమీద
నున్నది ; రాజునకూడిగపువాడ
ఆనపాలింపంగ నాజ్ఞకునిలువ
బాదినాయుడొ గాక బ్రహ్మనాయకుడొ
వంకిదేవకుమారవరుడైన కొమ్మ
భూపతియోగాక పొసగంగనిల్వ !
ఏయానకున్ నిల్వనిదె వత్తు"ననుచు
కదిలిన నడ్డంబుగావచ్చి మరియు
బరివ్రాసి "దాటితే బ్రహ్మన్నయాన

దాటకు మున్నవంతటనుండి పల్కె :
"అవసరంబున ప్రాణమరవాయిగొనక
యిచ్చువాడను నేను ; నేనేల నిలువ ?
ఈ యానకికనిలువ నెబ్బంగినైన
వచ్చెద నిప్పుడే వలదన్న మాన
వని త్రోసి నడచిన "యౌరౌర !" యనుచు
అటపోయి తెరువున కడ్డంబునిల్చి
ఒరిప్రాసి "దాటితే పరివారమాన
తొడిబడ నానలుత్రోసితందండ
పరివారమునకెల్ల బంటగుపెట్లు
ఈ యానత్రోయ నీకే యుపాయమ్ము ?
రాగాదు మగుడుము ; ఎంతేల నీకు ?"
అనిన గోవన్న తానటు విచారించి
"త్రోయగా నీయాన తొడుసాయె" ననుచు
చెలియలికట్టకై చేరంగరాక
తగుడారమునుండి తనదారియున్న
వారాశియునుబోలె వడిరాకనిల్చి
"పరివారమాన భూపతిత్రోయవెరచు;
ఈయానత్రోయ నేనెంతటివాడ ?
పరివారమే లోకపాలకులెందు
తమరాజు పగవారి దర్పంబులణచ
తలచి పైనెత్తుచు దాడిపెట్టగను
స్థలదుర్గ గిరిదుర్గ జల వన దుర్గ
ములమీద విడిసియు ముట్టడిచేసి
గాసిగా చేయుచు కప్పంబుగొనుచు
శరణన్నకాచుచు గెరవులుబెట్టి
తమరాజుగన్న భూతలనాథులెల్ల
జయపెట్టచేయుచు సరిభూములేల
మగతనమ్మనునున్న మానసాహసులు

తమరాచకార్యంబు తరియాయెనేని
ప్రాణంబు సరకుగా పట్టరెయ్యెడల
పరివారమే ధర్మపాలకులరయ
పొలుపొంద నిమ్మహి పొసగనాడెదరు
పంతముల్ తప్పక పాటించుచుంద్రు
సరసులు జాణలు సత్కృపాపరులు
సజ్జనాధారులు సద్ధర్మపరులు
ధర్మమార్గము తప్పి ధరణిపాలించు
పట్టభద్రునినైన పలుచచేయుదురు
న్యాయమార్గంబున నవనిపాలింప
పడుచునైనను పట్టభద్రుజేయుదురు
సకలకళ్యాణులు సత్యసంగ్రహులు
మహిమీద చెన్నారు మహితవిక్రములు
తగవగునే యిట్లు తలపలేవైతి;
కోడిపోరును చూడ కొరగానెచెపుమ ?
కొరత లేకుండగ కొన్ని యెన్నితివి ;
సిగ్గు మాచర్లకు శీఘ్రమే చనగ ;
వనధిని కనుగొని వడిబారుచున్న
నదికడ్డమైయున్న నగము చందమున
బరివ్రాసి యేగగా పాడియే నీకు
తగవుకాద"ని కొంతతడవు చింతించి
"ఐన నేమాయెలే యటుల చింతింప
ఈయాన త్రోయుట యిది భావ్యమనగ
నిజముగా జగమును నీవును మెచ్చు
విధమును చెప్పెద వివరంబుగాను;
మున్ను మాచెర్లలో మోదంబుతోడ
పెదమల్లుభూపతి పెదకొలువందు
మంత్రులు హితులు సామంతులు బుధులు
పరదేశులును రాయబారులు దొరలు

కపిరాజరాజులు గాయకోత్తములు
ప్రకటకళాభోజపాండిత్యులెల్ల
సమయులు సరసులు జాణలుమరియు
దేశాధికారులు తీర్పరుల్ కూడి
బ్రహ్మన్నతో వారు పలికిరిట్లనుచు :
'గురజాలముందర కోడిపోరపుడు
కయ్యంబుకలిగిన కణకతో నీవు
కుంతమందగరాదు కోపింపరాదు
మాటయిమ్మన్న' నా మానసాహసుడు
కొలువెల్ల వినుచుండ 'కుంతంబు ముట్ట
నను నానవిడచిన యది మదితలచి
వచ్చుచున్నాడను వారింపబోకు
నాయునిగారికి నమ్మినబంట
అవసరంబున ప్రాణమరవాయిగొనక
యిచ్చువాడను నేను; నేనేలనిత్తు ?
సేవకధర్మంబు చింతించి చూడు !"
అనిన కన్నమనాయుడది సమ్మతించి
బ్రహ్మన్న యానతి బాగుగాతలచి
గోపుతో తానును గూడి యేతెంచె.

*కన్నమపెట్టిన ఆనలు త్రోసిపుచ్చి గోపన్న వచ్చుచుండగా, వానిని వెనుకకు మరల్చుమని బ్రహ్మన, అడపకేదాసిని పంపుట: వాని మాటలు పెడచెవినిపెట్టి గోపు, బ్రహ్మనను చేరగా, ఆతడు వానిని నిష్ఠుర వాక్యములాడుట.*

అంతట నాయుని యడప కేదాసి
బాగాలుపెట్టుచు పాలకిచేరి
ఆకు చుట్టియ్యంగ నాగోపు తలచి
"కన్నమనాయుని గడచి తా వెనుక

రాడుగదా ? చూడరా ! రంతుకాదు !"
అనవుడు కేదాసి యటునిలచిచూచి
"కన్నమ వలదనగా త్రోచి గోపు
వాచేపో పరతెంచు వాయువేగమున"
అనుటయు "తాంబూల మతనికినిచ్చి
తిరిగిపొమ్మని బుద్ధి తెలియంగచెప్పు"
అనినను కేదాసి యతిప్రియమలర
రత్నసంగతమయి రంజిల్లు పసిడి
కోరతో విడియంబు గొనిపోయిపట్టి
"నీలవర్ణుడు నిన్నునిలుపగా నేడు
విడియంబు పుత్తెంచె వేవేగమంది
మగిడిపో గోపన్న ! మన్నించుమమ్మ
వలదని కన్నమ్మ వారించునపుడు
నిలువకవచ్చుట నీతిగాదరయ
తన్నేలువాని చిత్తముకొలదెరింగి
చరియింపవలవదే ? సజ్జనులకైన
పతియాజ్ఞమీరిన భంగంబువచ్చు
పతిపంపు సేయుట భటునకు మేలు
నాకెదురులేంని నడవడితప్పి
మెలగిననాతనిమీద శ్రీలక్ష్మి
చలనంబునొంది విసర్జింపచూచు
తనమీద పతికిని దయగల్గుటెరిగి
అంతకంతకు తన కణకువవలయు
నీవు సర్వజ్ఞుడవు నేర్పరి వింత
నాటనుండియు నరనాథు సమ్ము
ఖంబుబాయకయున్న కార్యపరుడవు
సకలవిద్యాజాలసంవేది విట్లు
మారుపలుకుట నీకు మగపాడిగాదు
శీలమనాయనిచిత్తంబు కొలది

నెరిగి నే చెప్పితినింత నాయన్న !
కినియకు" మనిన తా కేదాసికనియె :
"మాకు నాయనగారి మాటుగా నిపుడు
నీవుచెప్పినపని నిశ్చయంబగును
ఐనను నేమాయె నాయాసమొంది
అరుగుచెంచితినింక నపకంచిదాటి
లీలమైనాయుడు లెంకలతోడ
నాడెడుమాటలు అమృతోపమాన
మై కర్ణములునిండె ; నల వాడె బ్రహ్మ !
నాయునిశ్రీపాదనలినంబులకును
సాష్టాంగమునుబెట్టి సంతోషమొంది
ఆన బాపుఁడ మరియరిగెద గాని
అందాక వీడె మే నందుకొనుటెట్లు ?
'చేరఁచేరంగను చేటయ్యె'ననుట
నీలవర్ణునివలన నిక్కమైతోఁచె ;
ఐననూరక నేను నరుగంగనేల
పరికించి చూచి యాబ్రహ్మనాయకుని
గుణమెరింగెద" ననుచు కుంతంబు వామ
హస్తమ్మననుబట్టి యనుపమంబైన
ఉదయార్కతేజంబు నుల్ల సంబాడు
చేకంకణములపై చేరిచియున్న
మణిసంఘములు దీప్తిమండలింబర్వ
పసిడిమయంబైన పాలకిదండె
ఆవలి డాచేత నమరంగపట్టి
"బిరుదాతిరాజిత భీకరరూప !
సజ్జనసంస్తుత్య సత్కీర్తినిత్య !
మల్లభూపతిరాజ్యమహితసంస్థాప !
సత్యవ్రతాచార సద్గుణాధార !
నిజభామినీచిత్తనీరజమిత్ర !

సర్వజ్ఞమూర్తివి ! చల్లనియన్న !
పదమ"ని కదలి గోపన బ్రహ్మనకును
చెంగట పొడచూపి చెయ్యెత్తి మ్రొక్కె.
మ్రొక్కిన చూడక మొగమీక యొండు
దెసజూచె నాయుండు తెల్లంబుగాఁగ ;
చూచిన నంతట స్రుక్కిక గోపు
'పంతంబుమాటల పసబడి చూడ
మఱచె గాకని'తన మదితలపోసి
వెనుకకు పొడసూపి వేగంబె మ్రొక్కె ;
మ్రొక్కిన గైకోక మోమాటలేక
ముందరజూచి ప్రమోదంబుతోడ
మాటలాడుచు చనె మానసాహసుడు ;
చనుటయు మదివిచారించి గోపు
"తొలితొలి కన్నమతో ప్రియమాడి
పుత్తెంచి తంతట పోనీక యడప
కేదాసినిని పసిడిగిన్నెతో పీడె
మెదురుగా పంపితి విప్పుడు గదియ
వచ్చిన, బ్రహ్మ ! నావంక కన్గొనవు ;
ఆడిబొంకనియట్టి యాచారపరుడ !
బాహువిక్రమ పరఖండనవిజయ!
ప్రకటించిచెప్పెద పాటించి నాదు
విన్నపం బిటు విను వివరంబుగాను :
వడగొని భీతితో వర్షమ్ము రాక
కోరుచుండెడి వానకోవిలభంగి
నీపాదసేవయు నిజము చింతించి
కన్నమ కేదాసిగారి మాటలకు
నిలువక పరతెంచి నిండినభక్తి
మ్రొక్కిన గైకోక మొగమీక నీవు
చనుచున్నవాడ వే చందమరయంగ ?

కోడిపోరుకు నన్ను కొనిపోవ తగదె?
మనసురాకుండుట మత మెట్టిదన్న!
పగతురనెల్లర బాది మాయన్న
కడిమిమై కండలు ఖండతుండెములు
గా ఖండనంబున కావించలేదె?
భీతి మాయన్నయు పెరవారిపోయి
బతిమాలి రణములో పారెనే చెప్పుము!
అటుగాక యతిభక్తి నవసరంబైన
నీవున్న రణములో నిష్కళంకముగ
రిపులకు భీకరవృత్తిశోపంగ
కాలాంతకునిభంగి కన్నుల నిప్పు
లురలంగ గొంతంబు నుబ్బుచు విస్ఫు
లింగముల్ దొట్టంగ లీలమైపట్టి
కయ్యంబుచేయక కడువడివైచి
వస్తినో? విరిగి పొడువంగ జంకితినో?
ఒనరంగచెప్పుమ యొకయొచ్చెమైన;"
అనుటయు బ్రహ్మనాయకు డంతచూచి
అతని తలంపుకు నతని మాటలకు
ఆశ్చర్యచకితుడై యతనికిట్లనియె!
"తల్లిదండ్రుల నన్నదమ్ములనైన
సతులనైనను కడుచుట్టాలనైన
మంత్రుల చెలికాండ్ర మన్ననపొంద
తగినట్టిగురువుల తమయాజ్ఞలోన
నిలిపెడుగా కటు నిలువకతప్పి
మెదలిన కొట్టించు మేదినీశ్వరుడు
తడయక వారల దండింపచూచు
అటుగాన నిను ప్రియమలరంగనేడు
పెదమల్లభూపతి పిలిపించిచూడ
పొమ్మన్న వచ్చితో? పోవకనీవు!

రమ్మనకవత్తురే రభసంబుతోడ ?
వచ్చినాడవుగాన వావిరిదూలి
రాజాజ్ఞ త్రోచుటరాజకమయ్యె !
నీవాజ్ఞ త్రోయంగ నేమికారణము ?
రంతులు సేయుచు రాపనియేమి ?
ఆజ్ఞలో నిలవక యట్టిట్టునడవ
నే సహింపగనేర నెవ్వరినైన ;
పసిబిడ్డచేతలు పాడియే చేయ ?
‘కులము దాచడు వెఱ్ఱిగొల్లవాడ’నుట
నేడు నీవల్లను నిశ్చయంబయ్యె ;
‘ప్రియమున పిలువని పేరంటమునకు
అటుపోదురే’యని యాడెడుమాట
భూమిలో నీ తల బుట్టెనేయింత ;
అరయంగనీవు నాయంతటివాని
తమ్ముడవటులౌట ధరణీశుడెరుగు !
పోరుకుగొనిపోప పోడిమేనాకు ?
సామంతమంత్రుల సహితమైయున్న
పెదమల్లభూపతి పేరోలగమున
‘కోడిపోరుకు నీవు కోరినవారి
గొనిపొమ్మటంచు’ను కువలయేశ్వరుడు
పలికిన ‘నెవ్వరీ బలములలోను
వలద’ని నే తగ వాని కుత్తరము
పలికి కన్నమనేని పాటించినేడు
కొనివచ్చితిని నిక కొనిపోవనెవరి ;
పోరును కనుగొను బుద్ధియే నీకు
కలిగెనేనియు మహీకాంతునకెదుట
నిలచి విన్నెరిగించి నీవు ననుగూడి
వచ్చెదనన్న నేవలదంటి నోటు;
ఇటువంటి తుచ్ఛంబు లికనైనమాను

పెద్దరికమునను ప్రియమున నిన్ను
మన్ననచేసితి మగడివౌమ్మ" నిన
బ్రహ్మన్న కిట్లని పలికెను గోపు :
"కులము దాపగనేల గొల్లడనగుదు
'ప్రియమున పిలువని పేరంటమునకు
పోయెడి'వాడనా ? పొసగదామాట
వినుమన్న చెప్పెద విశదంబుగాగ :
అలకాపురంబునకు నమరావతికిని
సరిగాగ కన్పట్టు సకలసంపదల
కాలయంబై యున్న యాశృంగిబేరి
పట్టణంబుకు నీవు బహువైభవమున
పెదమల్లురాజన్యు పెండ్లికి వచ్చి
శ్రీసిరాదేవిని చిత్తజమూర్తి
పెదమల్లుభూపతి పెండ్లిచేసితివి;
అంతట సమ్ముదంబలరంగ వాప
భోజనవేళలపొంగిరి యిట్లు :
'నీ సత్త్వమరయగా నెయ్యిగా దిపుడు
నూనెదెమ్మ'న్న వినోదంబుమీర
మాయన్న బిరుదన్న మహితశూరుండు
నువ్వులపొడిని గానుగనాడుభంగి
చీరలోపోసియు చేర్చి పిండంగ
కోపించి నీజెట్లు గొబ్బునలేచి
'నేడు మాముందర నీ ప్రతాపంబు
చూపంగవలయునా ? సోమించిమించి
మాతోడ చెయ్యిచ్చి మగటిమిచూపి
బ్రతికితివేనియు పంతంబునిల్పి
రమ్మ'ని పిలిచిన రాజులు జెట్లు
ఇరువాగు చూడంగ నిచ్చలోబొంగి
సెలవుగా నాభీమజెట్టి యేతెర

పట్టి మాయన్నయు బహుచిత్రగతుల
భంగపెట్టుచు వాని పరపె నబ్బంగి
అతని బలంబున కాశ్చర్యమొంది
శ్రీసిరాదేవికి చెప్పితి విట్లు :
'అరణంబులిచ్చుచో నపనీళునడిగి
వస్తువాహనతతుల్ వలదని నీవు
గొల్లబంటుల చాల కోరితేవలయు
తేకుంటిపేన్ మలిదేవరాజునకు
పెక్కుచంద్రుదేవుల పెళ్ళిళ్ళుచేసి
నీమీదకృపమాన్పి నిను తలగింతు
అని బెదరించిన నాసిరాదేవి
కడకునేతెంచిన కనుగొని యతడు
'గురజాల చుట్టును కొమరగ్గలించి
తిరముగ కోటయే తెరచీరకాగ
తరిమి యొండొండ నౌదలమీదనాడు
శితబాణపంక్తులే సేసలుగాక
కదనరంగంబున కల రక్తమిశ్రిత
మాంసఖండంబుల మత్తిల్లు భూత
జాలంబులే. క్రంతసాగించుచుండ
జగములోపలకల్గు సకలకర్మముల
చూడంగకర్త యౌ సూర్యుండు సాక్షి
గా ముక్తికాంతతో కడువేడ్క పెండ్లి
యాడెద'నంచు మహానందమొంది
కణకతో కట్టెను కంకణమదియు
దానికి నీమది తలపోయ నలడె ?"

*బ్రహ్మన తనకు వచ్చిన శకునములు చెప్పగా గోపన్న శకునఫలితములు వివరించుట: బ్రహ్మన*

*గోవన్న వచ్చుట కంగీకరించివానికి చిట్టిమల్లు నిప్పించుట.*

అనిన శీలమనాయుడటు విచారించి
"నీకును శకునముల్ నేడెట్టులయ్యె
ఓడక వెరవక యున్నట్టు చెపుమ!"
అనినను గోవన్న యతని కిట్లనియె :
"బల్లి వాయసమును బ్రాహ్మణోత్తముడు
గాలిగాడును ఎరకలపోతు పయిడి
కంటియు వరదును కనుబెంటి పాల
పసిడిమూగయు నేలపాము నుప్పెనయు
ఇవియాదిగాగల విన్నియు నాకు
మిక్కిలి పొడసూప 'మేలుగాక'నుచు
పయనమై వచ్చితి బరువిడితోడ
నీ శకునంబులే నీబంటుకగును
నీవు విచ్చేయక నిలుచుండియుచట
బంటుశకునంబులు పాటింప తగవె
పంచాస్త్రసమరూప బ్రహ్మసమూహా!
నీ శకునంబులే నెరయంగనాదు
పీనుల నిండార వినదలతు చెపుమ!
మందలోపల తొల్లి మాపెద్దవారు
శకునంబులొక కొన్నిచర్చింప విందు
గొల్లడగావున కొన్నేని మరువ
ఎరుగుదు"నన బ్రహ్మ యెద ముదమొంది
కులదీపకుండైన గోవుకిట్లనియె :
"శ్రీసతినాథు డాశ్రితపారిజాతు
డవ్యయుడచ్యుతు డానందమూర్తి
వేదాంతవేద్యుండు విశ్వనాయకుడు
సంభవస్థాపన సంహారకర్త

*గోపన్న వచ్చుట కంగీకరించివానికి చిట్టిమల్లు నివ్వించుట.*

అనిన శీలమనాయుడటు విచారించి
"నీకును శకునముల్ నేడెట్టులయ్యె
ఓడక వెరవక యున్నట్టు చెపుము :"
అనినను గోపన్న యతని కిట్లనియె :
"బల్లి వాయసమును బ్రాహ్మణోత్తముడు
గాలిగాడును ఎరకలపోతు పయిడి
కంటియు వరడును కనుబెంటి పాల
పసిడిమూగయు నేలపాము నుప్పెనయు
ఇవియాదిగాగల విన్నియు నాకు
మిక్కిలి పొడసూప 'మేలుగాక'నుచు
పయనమై వచ్చితి బరువిడితోడ
నీ శకునంబులే నీబంటుకగును
నీవు విచ్చేయక నిలుచుండియిచట
బంటుశకునంబులు పాటింప తగవె
పంచాస్త్రసమరూప బ్రహ్మసమూహ :
నీ శకునంబులే నెరయంగనాదు
వీనుల నిండార వినదలతు చెపుము :
మందలోపల తొల్లి మాపెద్దవారు
శకునంబులొక కొన్నిచర్చింప విందు
గొల్లడగావున కొన్నేని మరువ
ఎరుగుదు"నన బ్రహ్మ యెద ముదమొంది
కులదీపకుండైన గోపుకిట్లనియె :
"శ్రీసతినాథు డాశ్రితపారిజాతు
డవ్యయుడచ్యుతు డానందమూర్తి
వేదాంతవేద్యుండు విశ్వనాయకుడు
సంభవస్థాపన సంహారకర్త

అమరేంద్రసన్నుతు డమితవిక్రముడు
ఎనమంద్రుభార్యల నిచ్చలోమెలగు
మిండగోపాలుడు మేరుధీరుండు
శృంగారవారాశి జితగుణత్రయుడు
మారుండు తనకు కుమారుండుగాక
చెలువగు మహాదేవిచర్లచెన్నునికి
పయనమైవచ్చుచు పదిలమైనేను
దండంబుపెట్టిన తనరి యంతంత
తోమాలె చయ్యన తునకలై పడియె;
ఎదురుగా తెరువున నేతెంచు నిండు
కడవ చూడగ విచ్చె కడుచోద్యమయ్యె;
తోటలోపల మంచితోరంపు టాను
గంపుకాయను తునకలుగాచేసి పట్టు
కొని తోటవాడు నగుచును నపుడు
గవనిముందర నాకు కట్టెదురయ్యె;
ఒంటిబడి యచ్చోట నొనరంగ వేగ
కొనిపోవుశవము కన్గొంటినినేను;
మైలచీరలమూట మరియేనుగంటి;
ఊరిముందర రావి నొక పులుగుపిట్ట
మ్రాకుపై నుండ కావలపోయె నెగసి;
చంద్రవంకయుదాటి చనుచెంచునంత
వంటకట్టెలబండి పడి నటు దొర్లి
పడుటయు పొడగంటి వచ్చుచు నేను;
మలవరపుకోడెలు మరిలేగలెన్నొ
కోరాడగా గంటి కొమరొప్ప నచట;
నక్తములప్పుడు ననుచుట్టివచ్చె;
ఎండినమ్రానిపై నేపున పులుగు
నిలచి యసత్తుపై నెత్తురుక్రక్కె;
వట్టిన కుంటలో వరదు వాపోయె;

మనుబోతు లీవల మలయుచు త్రోవ
కుత్తరమున కూడియుండంగ వెరచి
మరిదక్షిమునకు మనుబోతులేగ
నెరిమంటతో నొక నీలంపుపోతు
తెరువు చంగునదాటి తెగువమై వాని
తాకిన నని కొన్నితడబడె ; నందు
కారుపోతులు వచ్చి క్రమ్మిపోనీక
పొడిచిన ఆ యొంటిపోతపుడు చచ్చె ;
ఇరువది ముప్పది యేబదిరెండు
ఏపుతో కదుపుల నే పొడగంటి ;
ఇబ్భంగి శకునంబులిట్లయ్యెనాకు.
శకునభావములు విచారించిచూడ
అపశకునంబులే యధికంబులాయె !
చెప్పుమాగోపు ! విశేషంబులేవియొ !"
ఆమాటలకు గోపుడపుడిట్టులనియె :
"కొరగాని వాని వాక్రువ్వంగరాదు
చెప్పిన మరినీదు చిత్తమెట్లగునొ ?
అటుగాన బ్రహ్మనాయడ ! వినవయ్య !
నిన్నును భూమియు నీరాజుప్రజల
కావంగ శకునమా ? ఖడ్గంబుకాక !
వెరచి నేనేమియు వెనుకనుపోవ
అపుడు మీచిత్తంబునందు కోపంబు
పుట్టు కావున చెప్పపోలదు నాకు ;
వెరతునేన"నుటయు విని బ్రహ్మనేడు :
"వెరవనీకేటికి వినవన్న గోపు !
ప్రాప్తంబుతప్పింప బ్రహ్మకు రాదు
ఈశ్వరాజ్ఞయె కాక యెవ్వరివశము
తలగంగవచ్చునే తలపోసిచూడ
దమయంతి నలరాజు తగిన రాజ్యమును

ధనమును భూమియు తమబంధుజనుల
దిగవిడిచి మిక్కిలి దీనులై పోయి
ఇద్దరు నొక చీర నిరవార గట్టి
కడుదుఃఖమును పొంది కాననములకు
పోయినవారిని పొలుపుగా వినమె ?
ధనముకై మునితోడ తానాడు మాట
స్థిరముగ నిజము ప్రతిష్ఠింప తలచి
తనయుని నాలి నాతరి తానెయమ్మి
చాలని కడమకు జగము వేసరక
తిరిగియు నొక్కమాదిగెవాని కొలిచి
కులము లజ్జయు వీడుకొని కాడు కావ
డే హరిశ్చంద్రుండు ? ఏమనగలదు !
దైవయోగంబున ధర ధర్మరాజు
దుర్యోధనునితోడ ద్యూతంబులాడి
కాదన సత్యంబు కలిగియు మాట
నిజము భూములనెల్ల నెగడింపవలసి
ధర్మపాశంబుల తాగట్టుపడియు
మోదంబుతో పదమూడేండ్లదాక
విడువడే దేశంబు ! వెఱ్ఱులేవారు ?
కావున నిది దైవఘటనగా దెలియు
నీవును శకునంబు లెరిగినభంగి
ఉన్నట్లు చెప్పుట యుచితంబు; నిన్ను
కోపింప నన్ను నాగోపిట్టులనియె :
"బ్రహ్మనాయక ! బుధరాజీవమిత్ర !
నీవు విచ్చేసియు నిష్ఠతో మ్రొక్కి
నిలచినప్పుడు ధారుణీపరుడైన
చెన్నుని పైదండ శిథిలమై పడిన
భావంబు చెప్పెద పాటించివినుము !
తోమాలె నయ్యన తొలగుటచూడ

చెన్నని దయతప్పి చెడును కార్యమ్ము;
నిండిన కడవయే నీవేలుభూమి
కడవలోపల నీళ్ళు కాపులిట్లరయ
నీ కపజయమైన నీవు చూడంగ
నీదు రూపమునకు నెగడిన భంగి
నినుకూడి కొందరు నినుబాసి యొరులు
కాపులబ్భంగిని కడుదుఃఖమంది
నానాముఖమ్ముల నాల్గు భూములకు
విచ్చిపోదురు కడవ విచ్చినయట్లు;
సౌరకాయతునకలు చూచిన శకున
భావంబు చెప్పెద బ్రహ్మన్న వినుము !
నీపాటి బంట్లెల్ల నిష్కళంకమున
మదకరిలీల తామరకొలను చొచ్చి
కలచినభంగి సంగ్రామములోన
శత్రులనెల్ల నిస్సత్త్వులంచేసి
రణముననిలిచి వారలచేత నపుడు
దురములో నటు నిరుతునకలై పడిన
అవినీవు చూచెద వతి భీమరూప !
శవముకన్గొన్నట్టి శకునంబుపోల
వినిచెద విను నీదు వీనులుమెచ్చ
అదియిట్లు : మనయందు నతులసాహసుడు
కయ్యంబులోపల కడవారికూల్చి
ఎంతయు సంతోషమంది యేగెడును ;
గురజాలత్రోవ కన్గొన్నట్టి మైల
చీరలమూటకు చెప్పెదవినుము
చందురువంకలో సతులు రేవాడ
తడికోకలన్నియు తడయక చాకి
కొనిపోవ నీవు కన్గొనుట నిశ్చయము ;
ఒకపుల్గు ప్రాకుపైనుండక యెగసి

పోయె గావున మల్ల భూపతి కొలిచి
మనము పోదుము వెంట మారుభూములకు ;
కాష్ఠముల్ వడిదొర్లి కలుగున బండి
పడినశకునంబును పాటించి వినుము
కోడిపోరున నీవు గొనకానిపోయి
ఓడినజాడల నొప్పు పోవిడిచి
'ఇట్టికాలముదాక నేపాటు నెరుగ
మిటమీద మనకెల్ల నేమి రాగలదొ ?
ప్రజలకు ధాన్యంబు పండ్రెండుపాళ్ళు
పన్నువరాయుండు పైకంబుకొనడు
తిట్టడదల్పడు తిరగడుమాట
తప్పులుపట్టడు దండుగలేదు
వెట్టిచేయింపడు వినికడుగబోడు
కాపులనేచడు కల్లరి కాడు
జారచోరులవలన జనితంబులైన
బాధలేమియులేవు పగరాజు లతని
భూమిపై రాలేరు పోరునప్పుడును
కంటికి రెప్పయు కాచినభంగి
ప్రజలను పెద్దల రక్షించె నతడు ;
మన్ననగలిగె నవమానములేదు
దుర్భిక్షమదిలేదు దోషంబులేదు
తానెయై మంచుకు తగబీడు పండు
ఇబ్భంగి కాపుర మితనికిచేసి
చేరి యింకొక్కని చిత్తంబుమెచ్చ
కాపురమిక చేయగాలేము మనము ;
నలగాముురాజ్యము నమ్మితిమైన
నాతిగుణములె తెన్న నడవడి కింక
బ్రహ్మనాయునియాళ్ళ ప్రజలను మనల
బవరంబుచేయించు భంగపెట్టించు

కట్టించు కొట్టించు గాసిబెట్టించు
ఆగించు తూగించు నఱగింపవచ్చు
పోరుచు నిలు వెళ్ళిపొండంచు పంచు
దండుగ కొనిపించు తను చేరెననుచు
గొనకొని లేదన్న కోపించు త్రుంచు
పసులపుల్లరి తలపన్ను సుంకంబు
తలవరిపన్నును దండాయములును
దిక్కుఁగల్గిన మీకు తెండు పొండనుచు
పంపించి పూటగా బత్తెముల్ కొల్చు
మనవిచెప్పిన వినక మన్ననలేక
అన్యాయములగూర్చి యందుండబేర్చి
మన్ను మోయింపుచు మదమణంచుచును
మాటికిత్రోసి యవమానముచేసి
వెట్టిచేయించును వెడలిపోనీక :
తమ పూర్వవైరంబు తలచి చిత్తమున
బానిసపాట్లను పరపంగ చూచు
నానాటికిని మనల నవ్వగాచూచు
తెగచూచు నెప్పుడును తిట్టంగచూచు
నయములేకంతట నడరుచుప్రజలు
విడిచెదమనుటకు వేసరజూచు
ఇవియాదిగా మదియేర్చినభంగి
గ్రామధర్మమ్ములు కలవెల్ల నడచు.
నాయురాలును బ్రహ్మనాయుండు భూమి
పంచుకొన్నప్పుడు ప్రజలెల్లకూడి
గురజాల పాలూళ్లు కోపుగాజేసి
మాతోడి చలమున మహాదేవిచర్ల
పాలియూళ్ళన్నియు పట్టంబుకలుగ
చేసినవారిని చేరరప్పించి
బలువగు పాతరబడిన రోకళ్ళ

పొడిచిన భంగి కాపుల నెల్ల బట్టి
ఏమి చేయించునో యెరుగంగరాదు ;
జగములోపలవారు చచ్చెడునంత
కలగన్న నింక మేలని యుండుటెట్లు ?
కావున ప్రజలార ! కణగి కాపురము
సన్యసించుటలెస్స చర్చించిచూడ
ఒండుప్రదేశ మందుండుట మేలు
వాయురాలికి ప్రీతి నడుపంగలేము
స్త్రీనాయకంబైన చెడునండ్రు భూమి
అని భూమిలో కాపులందరు బెగడి
కలుగున దొరలిన కట్టెల భంగి
బెగ్గోలుపడి తమకింపుచు నుండ్రు;
అవధారు ! బ్రహ్మనాయక ! సుచరిత్ర !
కోడెలు లేగలు కోరాడు శకున
భావంబుచెప్పెద ప్రజలును మెచ్చ
కుంపటి మండక కుమిలెడు పగిది
మనకును నలగామ మండలేశునకును
విడువక రోషంబు వెలయుచునుండు;
రెండిండ్లవారును రేగుచుండుదురు
పోరులంతంతకు పుట్టుచునుండు
నిగిడినమంటపై నేతులు చల్ల
ఆరునే: పెనుమంటలై మండుగాక ?
ఒకయరలోచొచ్చి యోర్పుమై పులులు
పోయిన నవి రెండు పోరాడుకున్నె
ఇలలోన నొక భార్య కిద్దరుమగలు
కలిగినపొసగునే కలహంబుగాక
పట్టణంబొక్కటి పాలింప రాజు
లిద్దరు కలిగిన నిలయేల బ్రతుకు
కలకాల మీపోరు కడతేరకుండ

మానదు నీ కనుమానమ్ము వలదు"
అనినశీలమనాయుడల్లన నవ్వి
"తరువాత శకునంబు తగచెప్పు"మనిన
"నీవిటవచ్చుచో నీకు మిక్కిలిగ
'ఓరణంబులు నిన్నునొంటిగా బట్టె
న'ని యానతిచ్చితి వది యేర్పరింతు ;
వినుము ! శీలమబ్రహ్మ ! విమలసత్కీర్తి !
కోడిమేడములోన గోచరమైన
నీయున్న తమగమున నీలవర్ణుండ !
ఘోటకరాజులు కుంజరంబులును
శూలాలబండ్లును సుభటసంఘములు
వలయంబుగా చుట్టి వచ్చు నీయాన:
'ఎండినమ్రానుపై నేపున పులుగు
నిలచి యసత్తువై నెత్తురుక్రక్కె'
అని నీవునాతోడ నానతి యిచ్చు
నది వివరించెద నవధారుదేవ !
గరిడిలోనెంతయు కడకమైచేరి
పుంజాలు రెండును పోరాడి యాడి
భుగులున నెత్తురు భోరున క్రక్కి
తిట్టినట్లొక పుంజు దిగ్గున చచ్చు;
వరదును వాపోవు భావంబుచూడ
శోకాంబుధాశిలో చొరబారె దీవు
సౌమిత్రిరణములో చచ్చికొందడవు
ప్రాణంబురాకున్న రఘురామనృపతి
హాహాధ్వను లెసగ నాతురమొంది
లాఘవవృత్తి ప్రలాపించినట్లు
గాంధారితనయు సంకల్పమువలన
పన్నిన రథములు భటులు నశ్వములు
ఏనుగులవల్లను ఏపగ్గలించి

సేనాబ్ధి యనిచేయ చిట్టలుగాగ
అభిమన్యుడది చూచి యా సైన్యజలధి
కలసి పిండలివండుగా చేసిచేసి
పోయిన యభిమన్యు పొడగానలేక
అడలుచెందినయట్టి యర్జునుభంగి
నీదు దుఃఖంబును నిండి దైవారు."
అనిన శీలమనాయుడా గోపు చూచి
"ఇప్పుడు వినిచిన యీ శకునంబు
లన్నియుచూచిన యట్లుకాచూడు
మనుబోతుకదుపుతో మనదారికెదుర
పోట్లాడి పడు మనుబోతు విధమ్ము
నిరతముగా చెప్పు నీ నేర్పుచేత"
అనిన నాగోపన యతని కిట్లనియె:
"వినవయ్య ! బ్రహ్మయ్య ! వినుతవిఖ్యాత
నీవు విచ్చేయంగ నీ కుత్తరమున
మార్కొనియున్న యా మనుబోతులన్ని
నలగామభూపతి నమ్మినబలము;
వాని కట్టెదురను వచ్చి నిలచియు
మలయుచునున్న యా మన్నులకదుపు
మనముగా తెలియు బ్రహ్మకుమారవర్య !
గురజాలముందర కోడిమేడమున
మాటమాటలకును మనకు వారలకు
వాదైనవేళ నివారితుండగుచు
నీ బంట్లనొక్కడు నిర్జరవరులు
పొగడంగ మనసులో పొంగుచు గదిసి
కామరాజు దళమ్ము కదలంగతాకి
బొబ్బలిం గని లేళ్ళు భీతిల్లిపారు
చాడ్పున నలగాముసైన్యంబులెల్ల
పారిన పురికొల్పి పటుఘోటకముల

దళముల పెల్లుబ్బి తరిమిన వాడు
నిశ్చల మతితోడ నిలిచిపోరాడి
మనుబోతు భూమిపై మడసినభంగి
కొండ కూలినయట్లు కూలు నీయెదుర"
అనుటయు విని బ్రహ్మనాయుడిట్లనియె :
"ఈమనుబోతుకు ఇది భావమయ్యె
ఆపైని వినువేడ్కయయ్యెడు నాకు
చెప్పుమా" యనుటయు చెప్పంగదొడగె:
"మాచెర్లలోగల మానినులెల్ల
చంద్రవంకకుగూడి చనుదెంచియచట
అంతకంతకును మహాదుఃఖమొంది
వాపోవు బెగ్గుర్ల వడపున చేరి
సంబరమిత్తురు సతులు రేవాడ
నాకు తోచినభంగి నాయుడ ! శకున
భావంబులన్నియు పరికించిచూచి
విన్నవించితి మది వెరపింతలేక."
అనిన శీలమనాయు డా గోపు మాట
లన్నియు తలపోసి యంతరంగమున
ఇట్లువితర్కించె 'నిలమీద తొల్లి
రేపల్లెలోపల శ్రీకృష్ణరాయు
డేపార లీలమై యేలుచునుండె ;
ఆతని వంశమునందున గోపు
భూమిపై మనుజుడై పుట్టినవాడు
గాక ! యీపోకళ్లు గలవె యొక్కనికి
పిన్నవాడని వీని పేర్కొన నిపుడు
వరుస ననాగతవర్తమానములు
ఎరిగెడువాడయ్యె నెన్నంగ ఘనుడు
సద్గుణమహదేవు చందంబువాడు
వీడ"ని మదిలోన వెరగంది నిలిచి

కులవర్ధనుండైన గోపుకిట్లనియె :
“శకునంబులన్నియు చర్చించిచూడ
అనుకూలమై యున్నవన్నియు నాకు ;
చెప్పెద : మహాదేవిచెర్లకు నిపుడు
నీవేగి ; యీరాత్రి నిద్దురలేచి
మాడుగులలో నీవు మముగూడు వేగు
జామున గలుగగ ; వెళ్ళి సయ్యన వేగు
తెమ్మ”న్న గోపన్న ధీరుడై పలికె:
“శకునభావంబుల జాడలు నన్ను
అడిగిన చెప్పితి నంతయు నీకు ;
శకునంబు గాదని శంకయ్యెనేని
శకునంబులన్నిటం జన నాకు సెలవు
కోడిపో ర టుగ్గైకొన నీకు సెలవు :
విచ్చేయు మటుగాక పెరచితివేని
మహాదేవిచెర్లకు మగుడుము నీవు ;
వ్రాలాకు చేపట్టి రాయపడవాలు
పానుగంటికిపోయి బలిమిమైయుంచి
చిట్టిమల్లనితెచ్చె చిత్రంబుగాగ
ఆరీతి నేనును అక్కడికేగి
గురజాలముందట కోడిపోరాడి
పందెంబు గెలిచెద పంపుము నన్ను
వ్రాలాకుపెట్టుము ! పలదిన్నచత్తు !
వేయిమాటలు చెప్ప వినన”ంచుపల్క
భవరోగజలరాశి బడబానలుండు
భక్తజనాశ్రిత పారిజాతుండు
మత్స్యకూర్మకిటి వామననృసింహ
రామత్రితయ బుద్ధరాజిత కల్కి
అవతారములు పదియయి తా చెలంగి
అవతరించిన పరమానందమూర్తి

భువనంబులెల్ల తన పుక్కిటిలోన
పరిపాటిమై నిల్పి పాయక వాని
బ్రోవంగనేర్చిన పురుషుడు లోక
మాతకు వరుడైన మహదేవిచర్ల
చెన్నుని మదిలోన చేరిచి వాని
దాసుండు గావున తలపోయతలచి
శుద్ధాంతరంగుడై సూక్ష్మమైయున్న
సోమసూర్యగతులు శోధించిపట్టి
వాయువులన్నింటి వరుస బంధించి
ప్రాణంబు నాధారపద్మంబునందు
మెరయించి మిక్కిలి మెరయంగలేని
జ్ఞానదీపము పెక్కుగా వెలిగించి
నాభి దగ్గరనున్న నాగంబు నిద్ర
దెలిపిన లోనెల దీప్తమైయున్న
పలనాడు ఒకకొంత పాడగుటయును
కాలంబు తమకెల్ల కదియవచ్చుటయు
గోపకు నాయువు గ్రుంగబోవుటయు
కయ్యంబులో బాలు కడతేరుటయును
విశ్వంబులోపల వీరులౌటయును
ఆత్మలో పొడగాంచి యనురక్తుడగుచు
ఇక గోపు వారింప నేమిటికనుచు
గోపురాకకు నియ్యకొన్నవాడగుచు
విద్యంబునెరపిన విధముతోపంగ
బ్రహ్మన్న గోపుతోపలికె నిండార :
"పృథివినాయకుడైన పెదమల్లిదేవ
రాజును నాయకులును పరివారములును
ఆదిగాగలవారలందరు మీరు
చెప్పంగవెరతురే చెప్పుమాటలకు;
నీ వొక్కడవు నాకు నెదురాడితిచట !

చాలు ! నాతోడుత చనువాడవగుదు
వాలాయముగగొల్చి వచ్చెదవేని
విడియంబుగొమ్మ"న్న విని గోపుపలికె:
"నీ కృప నాకును నిజముగాగల్గ
చనువాడనగుటకు సందియంబేమి !
ఆ మాట లట్లుండె నమరంగవినుము
గురజాలముందర కోడిపోరపుడు
కయ్యంబుకలిగిన కణకతోనీవు
కుంతమందగలేవు కోపింపలేవు
పోరెంతకలిగిన పోరి నాకు సెలవు
గా చేసితేనియు కంబముపాడు
మహాదేవిచర్లకు మధ్యమందున్న
విఘ్నేశ్వరుడు చూడ విను సాక్షిగాగ
విడియంబుపెట్టిన వెసనందుకొందు
కాదన విడియంబు కరమున ముట్ట
నీయాన" ననిన నానీలవర్ణుండు
గోపుమాటలకును కోర్కెమైమెచ్చి
మహాదేవిచర్లలో మలిదేవరాజు
కొలువెల్ల వినుచుండ 'కొంతంబు ముట్ట
న'ను నానవిడిచిన యది మదితలచి
గోపుతో నిట్లనె : "కోపింప నిన్ను
కోడిమేడములోన గొంతంబుముట్ట
ఖండన యెంతయు బరపంగసెలవు
విఘ్నేశ్వరుండును విను సాక్షిగాను;
పట్టువిడెంబ"న్న పాలకిదంచె
విడిచి సయ్యన గోపు వినతుడై పసిడి
కోర విడెంబు గైకొని యందుకొనియె.
అంతట బ్రహ్మన్న యా యర్ధనారి
చెన్నొందగసవన్న చేరంగపిల్చి

చిట్టిమల్లని వానిచేతి కిప్పించ
పుంజు చక్కనిదంచు పొగుడుచు గోవు
ఉపలాలనముచేసి యొరపుకురాని
యీకెలు చక్కగా యింపారదీర్చి
చిట్టిమల్లని నెద చేరంగచేర్చ
"గురజాలకును పుంజు గొనిరమ్ము నీవు
మాడుగులలో నీకు మంచి మంజిష్ఠ
చీరలిచ్చెద" నన్న చెలరేగె నతడు
బలువైన భూతంబు పట్టిన తన్ను
విడిపించుకొన్న యా వెజ్జు చందమున.

*బ్రహ్మన్న మాడుగులు చేరుట: అతనిని మాడుగులరెడ్డి విందున కాహ్వానించుట: బ్రహ్మన్న తన లెంకలను గురజాలకు పంపి నలగామునకు తన రాక నెరింగించుట.*

ఈ కోడిపోరాట మెల్లచూడంగ
వలయు దివసపతి వైభవంబరసి
వచ్చెదననుమాడ్కి వలకేలనట్లు
పశ్చిమజలరాశి పాలికి విసరి
సుడి మునిగెడు రాగి సుడికత్తి పోల్కి
సరసీరుహాప్తుండు సయ్యనగ్రుంకి
తనతేజ మే బ్రొద్దు తగగోరుచున్న
తమ్ములుచూడగ తగవుపోవిడచి
నిశ్చింతుడై వడి నీరధిచొచ్చె ;
'ఎట్టివికాసంబు నీవేళలందు
మనవు చేయతగదు మానంగ తగును'
అనుభంగి తామర లల్లనమోడ్చె
సరసుల క్రీడించు చక్రవాకములు
విప్రయోగంబున వెచ్చనూర్చుచును

నవమృణాళంబుల నమలంగవెంచి
దీనులై యందంద తిరుగుచుండె;
బ్రహ్మనాయుడు చాలగోపుతోకూడి
ధీరతమాటల దీమసంబొప్ప
కంబముపాడుదగ్గర కటురాగ
కాపులెదురుగవచ్చి కానుకలిచ్చి
మ్రొక్కుచు నందరు ముందరనిలచి
"విందారగింపుము విచ్చేయుమ"నిన
"ఇప్పుడు పలవదు ఎండరాకుండ
పోవలెనం"చు కాపుల వీడుకొల్పి
మంచికల్లుకు పోవ మాన్యులురెడ్లు
పొడచూప నందరి పొమ్మనియుచట
కోలేరుదాటియు గొనకొన్న వేడ్క
మాడుగులకుచేరె మహితవిక్రముడు.
అటబ్రహ్మిరెడ్డి విందాయత్తపరచి
భక్తిమై చనుదెంచి బ్రహ్మనచేరి
"చెన్నటియైన పచ్చికకుంటమీద
భాగీరథీనది పారినభంగి
ఇంతకాలంబున కిందు విచ్చేసి
నాడవు శీలమనాయుడ! యిపుడు
నిశ్చయంబయ్యెను నీవారమగుట
మము నీవు మిక్కిలి మన్నించుటయును
పల్నాటిలోపలి ప్రభువులు వచ్చి
యున్నవారగుటయు నుల్లాసమొంది
తెల్లమిగా మేము తిరిగివచ్చితిమి;
నీ భూమిలోపల నిష్కళంకమున
చుట్టాలు మేమును సుఖమునగూడి
తామరతంపరై తనిసి సంపదలు
కలిగియున్నారము కావున దేవ!

నేడు నా యింటికి నీవు విచ్చేసి
ఆరగించిన నాకు నధిక సంతోష
మ”ని విన్నవించిన నతని వాక్యములు
వినియు నూకొని వాని వీడ్కొల్పి నంత
కూటంబు నెఱయంగ గొల్లారమిండ్లు
నడుమ పందిరయును నలినంపుచవికె
పసుపుటాకుల దళ్ళు బాగుగాకట్టి
సిరితోడ నమరిన శీతలంబైన
ఆ యిండ్లకాగ్నేయమందమడియిండ్లు
మరి పశ్చిమంబున మజ్జనశాల
పరగ దక్షిణమున భండారపిండ్లు
వెలుపల రమ్యమై విస్తీర్ణమైన
వీధిసావడి కలిగి విశ్రమంబమర
చూడగలిగెడునట్టి శోభనకరము
గా ముగ్గుపెట్టించి కరముర్థితోడ
కాపులు కరణాలు కణకమై నెమరు
గా వచ్చి నాయునిగాంచి మ్రొక్కుచును
వీడుపట్టుకుతెచ్చి విడియించ నచటి
చాతుర్యములు చూచి సంతోషమొంది
కాపులకపుడు కట్నంబులిచ్చి
కామసన్నిభుడైన కామభూపతికి
ఏపుమై తనరాక నెరిగింపవలసి
మధురమై మృదువులై మాటలు పొసగ
ఆడనేర్చుట వెరవు నందంబు నెరుగు
లెంకవేమన పెదలెంకమదాసి
పిలిపించి వారిని పేర్కొన ననియె :
“గురజాల పురమునకును జనివేగ
మనరాక నలగామమహీపతితోడ
ఎరిగించి రమ్మ”ని యెనసినవేడ్క

అనిపిన వారును నాప్రొద్దెకదలి
పోయి యాగురజాలపురమును చొచ్చి
మొగసాల కడకేగి మోదంబుతోడ
సరససామంతులు సత్కీర్తిపరులు
హితు లమాత్యులు పురోహితులు సామాన్య
వరులు నేర్పరులును వారకామినులు
పణిహారులును రాయబారులు వంది
మాగధనివహంబు మరి యాంవెల్లి
నాయురాల్ మిక్కిలి నమ్మినబంటు
లాదిగా కొలువంగ నతి వైభవమున
రెండవ యింద్రుడో రేఖచెన్నొంది
కందని చంద్రుడో కరకంటు కంటి
మంటచే నొవ్వని మదనుండొ భూమి
పొలుపొందుచున్నట్టి భోజుండొ యనగ
తేజంబు కొలువెల్ల దీటుకొనంగ
కమనీయుడగు నలగామభూకాంతు
పొడగాంచి మ్రొక్కుచు పొందొందచేసి
"అవధారు విన్నపం బానందమూర్తి !
పెదమల్లుభూపతి పెక్కుచందముల
పాటించి శీలమబ్రహ్మనాయకుడు
కోడిపోరున కియ్యకొనిరి కావునను
బాసపత్రములలో పలికినభంగి
మితితోన తప్పక మిము గొలువరాగ
మదికోర్కె మీరంగ మాడుగులరెడ్డి
బోజనం బొగిచేసి పొందగ యడ్డ
పెట్టిన నటనిల్పి ప్రియముగా నీకు
విన్నవింపంగను వేవేగ మమ్ము
పొడగని ముందర పుత్తెంచెరాత్రి
కొలువుకు తావచ్చు కువలయనాథ !"

అని విన్నవించిన నతిసంతసించి
నాగమ దెస చూచి నలగామరాజు
బ్రహ్మన్న లెంకలపాటించి బిరుదు
చీరలు సరివిల్వ చెప్పంగరాని
ఒక్కొక్క మెయితొడవు లొనరఁ దెప్పించి
ఇమ్మన్న నిచ్చిరి యిందరిలోన
తన లెంకకామన తమ్మి లెంకలను
రప్పించి "శీలమబ్రహ్మన్న రాత్రి
కొలువుకు రావలదు కోడిమేడమున
నెల్లి రేపాడియు" నేతెంచుగాని
చెప్పుండు పొమ్మ"ని శీలమబ్రహ్మ
నాయునిలెంకలను కామరాజు
తన లెంకలనుగూర్చి తడయకంపించి
తానును కొలువెల్ల తరమిడియన్పి
అంతఃపురంబున కల్లనబోయె.
అంతట లెంకలు నతివాయుగతిని
మాడుగులకు పోయి మహితవిక్రముని
శీలమబ్రహ్మను చేరుచు మ్రొక్కి
బ్రహ్మనాయునితోడ పలికిరిట్లనుచు :
"నిను కామభూపతి నెమ్మితో పొగడె :
'ఆడితప్పనివాడవగుదువు నీవు
సత్యంబు జయము నసత్యంబు లయము ;
కావున నీ సరి గలరె మానవులు;
సత్యంబు నడవంగ జగములో నీకు
చెల్లుగా కొరులకు చెల్లునేయెందు;
నేడెల్ల మాడుగుల నిలిచి మీరెల్లి
గురజాలముందర కోడిమేడమున
కేతెంచునది'యని యీ రెండుమీకు
చెప్పపుత్తెంచె ప్రసిద్ధంబుగాగ"

అనపెని యా మాటలంగీకరించి
వచ్చినవారికి వరుసలనెరిగి
పట్టుపచ్చడములు ప్రతికొల్పరాని
పసిడిచెరంగుల పచ్చని యంచు
చీరలు చూడంగ చిత్రంబులైన
భూషణంబులనిచ్చి పొమ్మనె; నంత
తనమీద మక్కువ తనరెడువేడ్క
వచ్చినం దామసవామాక్షిముఖము
వికసించెనోయన వెల్లనిదీప్తి
తూర్పున నల్లన తోచె నవ్వేలర
పాకశాసనుడు ఉప్పరమునవైచు
కంచుకమ్మోయన గడునుదయించె
చంద్రుండు కలువలు సంతోషపడగ;
ఆకటివెల్లువ నలయుచునంత
కరవెల్లపోవంగ కడుపులకొలది
నోటికిన్ చవియునై నున్ననై యున్న
వెన్నెలంతంతకు వెదుకుచుకోరి
పిల్లల తార్చుచు 'పేరిమికొన్న
కౌముదిగ్రోలంగ కడలుచు చంద్రు
దేతెంచవలెనని యిలువేల్పులకును
మ్రొక్కితి మెన్నెని మ్రొక్కులో కలపు ;
అప్పటిసగటున నన్నిదైవముల
వేడుకొన్నారము వేడువారలకు
వేల్పులే తోడగు వేయిచందముల'
అని చకోరములెల్ల నానందపడుచు
వలయు వెన్నెలతీపి వరుసతోగ్రోలె ;
'తన తనూజుడు కాంతి తనరి మిన్నందె
అరయంగవలెన'ని యరుగుచందమున
పాలసముద్రంబు ప్రబలమైయుబ్బె.

*బ్రహ్మనకు మాడుగులరెడ్డి విందుచేయుట : బ్రహ్మన గోపన్నకు వైష్ణవమిచ్చి అతనికి గోపాలదాసియని పేరు పెట్టుట : మాడుగుల పెద్ద యొకడు బ్రహ్మనకు కోడిపందె మాడవలదని చెప్పుట : అతడు గురజాలకు బయలుదేరుట.*

అంతలోపల జలకమాడియు తగిన
నిత్యకర్మంబులు నిష్ఠతోతీర్చి
బ్రహ్మారెడ్డింటికి బ్రహ్మనాయకుడు
గోసంగి కన్నమ గొలచి యేతేర
ఆందోళికారూఢుడై మోదమంది
చనుదెంచె లెంకల సహితంబుగాగ;
ఆ యింటి కూటంబునందున బ్రహ్మ
నాయుడుకూర్చుండె నడిమంతరమున
గోపును లెంకలున్ కోడేరుజెట్టి
ఊడిగమ్ములవారు నొగి యువతలను
గోసంగికన్నమ గుణములకుప్ప
తన యిచ్చయగుచోట తనరకూర్చుండె ;
బ్రహ్మనాయునకును పసిడిపళ్ళెరము
పెట్టిరి తరిమిడి పేర్వేరగనుచు
పళ్ళెరమ్ములుపెట్టి బాగుమీరంగ
అంతరాంతరముల నమరంగనించి
భక్ష్యభోజనములు పానీయలేహ్య
చోష్యంబులాదిగా సొరిది వడ్డించ
అపుడు శుద్ధాత్ముడై యడపకేదాసి
బ్రహ్మనేనికి విన్నపముసేయ వినుచు
గోపు డిట్లనియె: "నీ కొంతంబునకును
నైవేద్యమిట్లయ్యె నా కొంతమిపుడు
ఉపవాసమున్నది యుచితంబుతోడ

గురజాలకడ నెల్లి కోడిమేడమున
మెదడును మాంసంబు మిశితంబుచేసి
బారసియును బోలె పారణసేతు”
అనిన నా బ్రహ్మనాయుడు గోపు కనియె:
“భోజనవేళల పొసగ దీమాట
ఉద్దండములు మాను మొగి” నిట్లనుచు
తాలిమితోడుత తన శిష్యులకును
తా ప్రసాదము పెట్టి తగ బ్రహ్మనీడు
ప్రాణాహుతులు గొంచు గ్రజవంక చూచి
“కడియెత్తవో గోపు! కారణంబేమి?
కన్నమ కేదాసిగార్లిట్లు నిన్న
మగిడింపగా వచ్చి మరియునేమేని
కొరగాని మాటలు కూరిమితప్పి
పలికిరే?” యనినను బ్రహ్మన్నచూచి
యిట్లనె గోపన్న యిచ్చలో పొంగి:
“ఎగ్గులేమియు నన్ను నెన్నరు దేవ!
పోరిలోపలి కెల్లి పోవుచున్నాడ
ఏగతివచ్చునో యెరుగము దేవ!
ఇటకింద గురుముఖం బెరుగుటలేదు
గురుముఖం బెరుగని కుమతికి నీదు
పాదముల్ దూరంబు పరికించిచూడ;
గురుడు దైవంబని కొనియాడుచుంద్రు
కావున గురువుల కానంగవలయు
గురుడనంగను నీవె కోర్కెదీపింప
దైవంబనగ నీవె దాతవు నీవె!
నీవె నాపాలిటి నీలవర్ణుడవు!
నినుదక్క నన్యుల నిక్కమెనెరుగ
కన్నమ కేదాసిగార్లలోపలను
ఒకనిగా భావించి యొప్పార నీవు

గురజాలకడ నెల్లి కోడిమేడమున
మెదడును మాంసంబు మిశ్రితంబుచేసి
బారసియును బోలె పారణసేతు"
అనిన నా బ్రహ్మనాయుడు గోపు కనియె:
"భోజనవేళల పొసగ దీమాట
లుద్దండములు మాను మొగి" నిట్టులనుచు
తాలిమితోడుత తన శిష్యులకును
తా ప్రసాదము పెట్టి తగ బ్రహ్మనీడు
ప్రాణాహుతులు గొంచు గ్రజవంక చూచి
"కడియెత్తవో గోపు! కారణంబేమి?
కన్నమ కేదాసిగార్లిట్లు నిన్ను
మగిడింపగా వచ్చి మరియునేమేని
కొరగాని మాటలు కూరిమితప్పి
పలికిరే?" యనినను బ్రహ్మన్న చూచి
యిట్లనె గోపన్న యిచ్చలో పొంగి:
"ఎగ్గులేమియు నన్ను నెన్నరు దేవ!
పోరిలోపలి కెల్లి పోవుచున్నాడ
ఏగతివచ్చునో యెరుగము దేవ!
ఇటకింద గురుముఖం బెరుగుటలేదు
గురుముఖం బెరుగని కుమతికి నీదు
పాదముల్ దూరంబు పరికించిచూడ;
గురుడు దైవంబని కొనియాడుచుంద్రు
కావున గురువుల కానంగవలయు
గురుడనంగను నీవె కోర్కెదీపింప
దైవంబనగ నీవె దాతవు నీవె!
నీవె నాపాలిటి నీలవర్ణుడవు!
నినుదక్క నన్యుల నిక్కమేనెరుగ
కన్నమ కేదాసిగార్లలోపలను
ఒకనిగా భావించి యెప్పార నీవు

నాకు ప్రసాదమ్ము నాయుంత పెట్టు!"
అనిన గోపునుచూచి యలతినవ్వలర
బ్రహ్మనే డిట్లని పలికె నాతనికి :
"కోడిపోరుకు కూడ గొనిపోయి గోపు
పిన్నవాడని తాను ప్రేరేచి బ్రహ్మ
నాయు డెంగిలి పెట్టె నగుబాటుచేసి;
ఒక్కొక్క చక్కటి నూహించి చూడ
పెద్దల యెరుకయు పిచ్చియో యేమొ!"
అనుచు మీవారు నన్నాడంగ చూతు
ఒట్లు గావున నీకు నామాటలందు
వేడుక లేదేని వేగంబె పొత్తు
లకును రమ్మిటు! కడులఘువృత్తి వలవ
ద"నిన నాగోపన యల్లన లేచి
"తన్నిచ్చుచో మరి తనకును తానె
క ర్తగా కొక్కండు క ర్తయే? నిన్ను
నెవ్వరు నాడంగనేటికి? నీదు
శిష్యగా చేకొని శీఘ్రంబె నన్ను
గతకల్మషుని చేయగా తగు" ననుచు
దండంబుపెట్టిన తరి విచారించి
అతనికి కాలంబు నంతియెకాన
భావించి చూచి యా బ్రహ్మనాయకుడు
భుజముల ముద్రలు పెద్దగాపెట్టి
గోపుకు తా బాలగోపాలదాసి
నామంబు చెవిలోన నయమారచెప్పి
శిష్యగా చేసి దోసిటిలోన తాను
నిండ ప్రసాదంబు నియమించి పెట్ట
గోపు సంతోషించి కూర్చుండె నంత
భోజనంబందరు పొసగంగ చేసి
పండుటాకులు మంచిబాగాలు వడియ

గట్టిన సున్నంబు కప్పురంబులను
చేర్చి తాంబూలమ్ము చేయుచుండగను
బ్రహ్మన్న మాడుగుల బ్రహ్మిరెడ్డికిని
సరిగంచు పట్టుపచ్చడ మొక్కటియును
ఒనరగా తొడవుల నొసగి ఆపరుస
ఇంటివారికి గట్టనిచ్చెనందరికి;
నాయుడుల్లాసించినాడని తమకు
విన్నవింపగ నపుడు వినయమ్ముతోను
మల్లభూపతిచేత మన్ననబొందు
పల్నాటిలోపల ప్రభువులు రెడ్లు
అంతంతనాయుని నల్లనచేర
అందరిపంపున నందులో నొకడు
మ్రొక్కుచు కరములు మొగిడించిపలికె:
"వినుము! చెప్పెద నీకు విన్నపంబొకటి!
బలియు మాంధాతయు భరత ధర్మజులు
రాజ్యంబుచేయంగ రాజిల్లినట్లు
సిరిమీరి యుంటిమి చిత్తంబుగాగ
ఏమిటికొరత నీకేము కలుగంగ
నవనిధానంబులు నాయుడ నీకు
మూర్తిమంతంబులై మొనసియున్నవియు
జయమపజయమును చర్చించిచూడ
ఏవంకనొరుగునో యెరుగంగరాదు;
నలుడాదిగాగను నరనాథులెల్ల
పందెమ్ము కరమున పట్టుగా వేసి
శ్రీయును భూమియు చెడి యోడిపోరె?
కావున పందెంబు గాదు కార్యంబు
మానితివేనియు మల్లభూపతియు
రాజ్యంబులోనున్న రాజులందరును
ప్రజలును మిక్కిలి పరిణమింపుదురు;

ఏరీతిగానైన నీ కోడిపోరు
వలద"న్న నాతని వాక్యంబువినుచు
శీలమబ్రహ్మన్న చిరునవ్వు నవ్వి
"తప్పదు నీమాట తలపోసి చూడ
ఒప్పెదు నీమాటలోజమై మాకు
ఐననేనప్పుడు నట్లయ్యకొంటి
ఇన్నాళ్ళనాటికి నేతెంచునంచు
పత్రంబులోపల పలికించినాడ
నే నెల్లి గురజాలకేగి యెప్పటికి
పొంపైనకార్యంబు పూనిచేయింతు
తలపకుండుడు వేరె తలపేల"ననుచు
వారినందర నొడబరచి వీడ్కొల్పి
వీడుపట్టుకు పోయి విశ్రాంతుడగుచు
సుఖనిద్రచెంది విష్ణునిపోలె నొప్పె.
లోకబాంధవుడు విలోలుడై కోడి
పోరు చూడగదలచి పొసపొస రాత్రి
వచ్చుట యెరిగి కళలెల్లచెదర
ఎక్కడికైనను నేగుట లెస్స
అనుచందమున చుక్కలన్నియుగ్రుంకె;
కమలాకరమ్మునన్ గలిగిన వేడి
నిట్టూర్పులోయన నెత్తమ్మిపొరలు
మూతులు విచ్చంగ మునుకొని వెడలి
కొదమతుమ్మెదపిండు కోర్కెలు నిండ
ఎగురుచు ముదమున నేగె చిత్రముగ;
అంతట బ్రహ్మనాయుడు మేలుకొనుచు
కాలోచితములైన కర్మములుతీర్చి
తిరుమంత్రపఠనతో తిరుమణిహత్తి
కనుదోయి మోడ్చుచు కరములు మొగిచి
ఆదినారాయణు నాత్మచింతించి

పరగు మహాస్తోత్రపాఠంబు చేసి
ధ్యానంబు చాలించి తగదేర చూచి
తగిన శృంగారంబు తడయక చేసి
చీరల పెట్టెలు చేరదెప్పించి
బహుచిత్రవన్నెల పట్టువస్త్రములు
లెంకలనందరి లెక్కించి యిచ్చె;
ఇచ్చిన వస్త్రము లింపుగా తొడిగి
పందెంబు గెలువగా పంతమ్ముబట్టి
భక్తియై చనుదెంచి బ్రహ్మని చేర
పరిజనుల కాతండు పయనంబు చెప్పె;
మాన్యులు రెడ్లును మాడుగులప్రజలు
కాపులు కరణాలు కడుగారవమున
బ్రహ్మనాయుని వెంట బ్రహ్మరెడ్డియును
పొలిమేరవరకును పోయి వీడ్కొల్ప
ప్రజలకు నాయుండు పరిణమింపంగ
సరిచేసి కట్నముల్ చయ్యననిచ్చి
దశదిశల్ మ్రోయంగ తమ్మటధ్వనులు
శత్రులగుండెలు ఝల్లుఝల్లనగ
తనజెట్టిపులమెల్ల తగ సంతసిల్ల
కనురెప్పపాటులో గడచెనంతయును;

*గురజాలలో నాయకురాలు ఆర్భాటములను సిద్ధపరచి ఫౌజుల నేర్పరచి కోడిమేడమున కేర్పాట్లు చేయుట.*

అట గురజాలలో నా నాయురాలు
పోరు కేర్పాట్లన్ని పొసగచేయింప
మందడీలకును వా మరువక చెప్ప
'అవుగాక' యని పోయి రాశ్వికులుకణక;
లాయమ్ములును కడు లఘువైన మంచి
కొదమగుఱ్ఱంబుల కొమ్ముపల్లముల

సగతులు పల్లములు జతనంబుకాగ
పల్లించి మొగమున పక్కెరల్ వైచి
తెచ్చిరంతటిలోన తేజంబుకాగ;
సింగిణివింటితో చిత్రంపుతొనలు
అలఘుమయ్యంచుల నత్తళంబులును
అడిదంబులును బాకులాదిగాకలుగు
ఆయుధ సవరణ నధికులై తురక
రాహుతులందరు రవరవతోడ
వెనవచ్చి యా యారువెల్లినాగమకు
సరిసలామ్ చేసిరి సందడిగొనుచు;
రాజులు శూరులు రాహుత్తవరులు
ఆదిగాగల వారలందరుగూడి
చనుదెంచి యా నాగసాని కట్టెదుర
పొడచూపి నిలిచిరి పొసగంగ నపుడు
కోలలవారును గొనకొనిచేరి
సందడిగాకుండ చక్కగాతీర్చ
తొలుత నాయకురాలు తురకలచూచి
అలతినవ్వులరంగ నంత నిట్లనియె:
"రాళ్ళపక్షిని సాళ్వరాయుని మున్న
పోట్లాటలోనను పోరిచూడంగ
ఎన్నెన్నొవిధముల నెక్కెంగనేర్చు
మీర్ ఖాన్ సాహెబుకు మెచ్చంగనిండు;
చూడ సన్నము గాని చోద్యంబు దీని
జీవాళమింతని చెప్పంగరాదు
ఉరుములతోడుత నుల్లాసియైన
పున్నమచంద్రుని భోరునతెచ్చి
సారంగమల్లుకు చయ్యననిండు ;
రాహుతుల చిత్తంబు రంజిల్లచేయు
మోహారమ్మున తూలి మూర్ఛపోవగను

తెలసి రాహుత్తుల దేర్పంగగలదు
కాళ్ళజమ్నని వడి కన్నోజికిందు;
త్రొక్కిన చోట్లను త్రొక్కగ వీధి
బహుచిత్రగతులలో పరవళ్ళు త్రొక్క
పరదళమరసిన బలుమారు కాలు
త్రవ్వుచు చెలరేగు తమకంబుతోడ
కాలమేఘంబట్లు గడలుకొనంగ
సందడిగొన దాటి సకిలింపుపెట్టి
నడువీధి కేగ నుద్దేశించి కెరలు
బెదర దాజికి నిట్టి బిరుదుగలట్టి
కైరని బెల్లాడుఖానున కిందు :
లేచి పట్టగలేరు రేవంతులైన
తన యిచ్చవచ్చిన తగబాలునైన
జయము బొందగచేయు సరిచెప్పరాని
ద్రావిడదేశంపు తత్తడి నల్ల
పేర్రాజు ముల్కకు ప్రియముననెందు ;
ఒరపైన దేహంబు నొప్పాటమోము
మెరుగారు కన్నులు మిగుల సన్నంపు
చెవులును మిక్కిలి చెన్నొందు కురుచ
వాలంపు నెరితోడ వలనొప్పుచుండు
మాళవదేశంపు మన్నిలగొంగ
అమహాదుఖానుకు నడుగ నియ్యిందు ;
కళ్ళెంబుపెట్టిన గైకోదు రవుతు
నెక్కనియ్యక తిరుగు నెగసి యందంద
వెనుకదాటులు తరుచు వేయునుపెలుచ
మైలారునకు నొక మంచి దొడ్డయిన
బలుపైన కళ్ళెంబు బాగుగాబెట్టి
నరవియాళోబరి సాహెబుకిందు ;
మున్ను కయ్యముంబుల మొనసినది కాదు

కుటిలచిత్తయు కాదు గుణముల లెస్స
రౌతు లేవడియైన ఏణముకు నోపు
గేదంగిరేకును గిదురుకునిండు ;
పోట్లాట పొడగని పొంగించునొడలు
తూపులు నాటిన తూలిపోకెపుడు
శత్రుసంఘముమీద సరగున నురుకు
నడుమింటిడేగ నా నలినొప్పుచుండు
అకురుకునిప్పింపు డదియేపుమీర ;
చెలగింప గాళ్ళను చింతింపకాజి
అలుగులపై కురుకు నగ్గలికచేయు
పిరికిరాహుతునైన బిరుదుగాచేయు
నొరపెరిగి తిరుగు నొంటిగానైన
కస్తూరి నికరంబు గజదలకిండు ;
కాంభోజదేశపు గండుకోకిలము
చెలువమైయున్నది సిరివరుకిండు ;
త్రొక్కనిచోశెల్ల త్రొక్కుచునుండు
హంకారమున వచ్చి యాజిలో తిరిగి
వరలుచు చెంగటవచ్చు రాహుతులు
మెచ్చంగ ననిలోన మేలనిపించు
నెక్కిన రాహుతు కిచ్చువేగంబు
చంద్రునితేట నా జగహాకునిండు ;
ఇనపకోలల పోటు కేమియు సరకు
చేయదు రాహుతుచిత్తంబుకొలది
ఫౌజులపైనెక్కి పరిపరిగతుల
దయలేక యెప్పు డుద్దండతపోరు
చిక్కదు రిపులచే చిత్రమెయ్యెడల
బొడీలగొంగను బహులముకిండు ;
పూచినమోదుగ పోలిక కడిమి
నారాచనిచయంబు నాటిన గంటి

నెత్తురుబ్బుచు కార నెరిచెడదెట్లు
కయ్యములో చొర గమకింపుచుండు
దిట్టగుఱ్ఱము సింధుదేశపు జన్ని
పైనుండి యనిసేయ పందరాహుత్తు
పనికాదు, తొల్లి బర్బరభూమి
రాజు మాళవు డనుగురాజును కదిసి
సమరంబుచేయగా జనులెల్లమెచ్చ
మాళవుదళములు మరలించి చొచ్చి
ఏనుగుఘటముల నేపుమైయెక్కి
తోరంపుకత్తుల తునియలుచేసి
జోదుల పెక్కండ్ర ద్రుక్కణగించి
అనుగుభూపాలుని ఆఢ్యునిచేసి
మన్ననపొందిన మహితశూరుండు
రమజా నితనికిండు రమణముతోడ ;
లలిచూపినంతట లఘువునదాటి
కడగుఱ్ఱములచూచి కాలుత్రవ్వుచును
ఎలమి కయ్యంబున కేర్పడినిల్చి
జయమున వచ్చిన సంపెంగపువ్వు
లోకవిఖ్యాతిగా లూలూకు నిపుడు"
మరియును ఇప్పించి మరివేగరండు"
అని చెప్పి నాగమ్మ యానందమొంది
ఫౌజులుగా చేసి బహురాహుతులను
అబ్దులఖానుని నధిపతిచేసి
పదిలంబులందరి ప్రకటించి చెప్పి
వజ్రాంగి జోళ్ళిచ్చి వారికందరికి
పెంపొందుచున్న యా పెదవీరకాము
సాహిణి పిలిపించి "పయ్యన నీదు
లాయంబునందుల లఘువైనహారుల
రప్పింపు" మన్నంత రప్పించె, నాయు

రాలునుం జెంగటి రాజుల చూచి
"నలగామరాజుకు నమ్మినవాడు
బంధువు డెంతయు పాటించువాడు
పోరామిగలచోట్ల పోరానివాడు
మగతనంబున నసమానవిక్రముడు
పాంచాలభూమెల్ల పాలించువాడు
మార్తాండరాజును మన్నించి చంద్ర
శేఖరాశ్వంబును శీఘ్రంబ యిండు;
కాశ్మీరభూమిలో కాళింది యనగ
నొప్పెడు పట్టణంబొనర పాలించు
మనుజభూపాలుని మనుమండు వీని
మగటిమి శత్రులు మార్కొనలేరు
నాగవంశములోన నధికుడౌవాడు
జయచంద్రరాజు సౌరాష్ట్రభూమి
గెలుపున వచ్చిన కిమ్మీరి నిండు ;
అయోధ్యపురినుండి యనుగుభూపాలు
డీ భూమి కేతేర నింద్రపురంబు
రాజుకుమారుడీ రాజమన్మథుడు
కూడి యేతెంచెను కలశేఖరుండు
పాండురాయగజవిపాటకంఠీర
వంబన పరగెడువాడు ధరిత్రి
అతనికి హేమాద్రి నమరంగనిండు ;
బిరుదురాహుత్తుల బెబ్బులియనగ
కడుప్రసిద్ధుడు వీడె గౌళరాజన్య
సుతుడు బోద్రాజు చక్కనివాడు
జాజిబొట్లను నదె సారంగికొదమ
టప్పించి వీరు డా రాజున కిండు;
యాదవకులములో నధికప్రతాప
సంపన్నుడై భూమి సరిలేక యేలు

మగటిమెల్లనుతెచ్చి మంచిగా నజుడు
ఇరవుగా చేసెనా నింపారుచుండు
మున్నతుండైన యాయుదయరాజునకు
రాచమెచ్చగు పరుశురాముని నిండు;
సూర్యవంశమువాడు సుందరాకారు
డరిమర్దనుండు మహాబలయుతుడు
సింహంబుతోనైన చెయ్యిచ్చిపెనగు
మిన్నుపైబడ్డను మెదలక ప్రాణ
మొడ్డంగ చాలెడు నుత్సాహయుతుడు
పెక్కు భండనముల పేర్చు రాహుతుల
ఉక్కణగించిన యురుభుజోన్నతుడు
గండిరాహుతుల తలగుండుగండ
డొకపాటి గుఱ్ఱంబు లొదిగిరాలేవు
సౌవీరదేశంబు జనపతిచేత
వెలయనే నూటికి వెలగట్టుకొన్న
అతులితంబై యున్న యశ్వంబునిండు.
తెండ"ని కొన్నింటి తెప్పించి చూచి
రాజుల మరియును రప్పించి మంచి
వెలగల హయములు విడియంబులిచ్చి
పట్టణంబునగల ఫౌజులకెల్ల
కర్తగా చేసెను కాళిందివిభుని.
అట మున్ను నాయురా లానతిమీద
గరిడియు తమకమ్ము కడునేర్పుమీఱ
ఆయత్తపరచియు నంతయు తెల్ప
ఓజు తా నేతెంచి యొప్పుగాననియె :
"నా విన్నపము వినుము నాయకురాల !
ఆయుస్సు ధారవోసి యందంబుకాగ
ఏప్రతి చూచిన నేబదియారు
లక్ష్మీకరంబుగా లక్షణవంత

మగు కంబములెల్ల నమర నింగిలిక
మొప్పుగా పూయించి యొనరంగ నూట
ఇరువది కంబము లెసగనెత్తించి
వానికి నెనయైన బారపట్టియలు
సంగతియైయుండ సంధించి మీద
బాగుగా సున్నపుపనియు చేయించి
ఆమోదమమరంగ నరువదినాల్గు
కంబము లెత్తించి కమనీయమైన
బారవట్టెలు వానిపైనుండచేసి
అదియొక యంతరంబగు, మీదమరియు
ముప్పిరిగొనువేడ్క ముప్పదిరెండు
కంబము లెత్తించి కడుచిత్రమైన
యిండ్లు నాలుగుకట్టి యింపార నందు
ఒక్కొక్క యింటిపై నొలినైదైదు
పసిడికుండలునింపి భాసురంబైన
నడిమియంతరమున నలినొప్పునిండ్ల
ఎనిమిదిగా తీర్చి యొసగమధ్యమున
వెన్నెలబయలు కావించి నేర్పలర
చుట్టును జాలర్ల సొబగు చేయించి
ఈ రెండునిలువుల నిండులయందు
రామాయణానేక రాజితంబైన
పుణ్యంపుకథలెల్ల పొలుపుగావ్రాసి
ఒక్కొక్క యింటిలో నొక్కొక్క పట్టె
మంచంబు పరుపును మంచి తలగడలు
ఒదివిన వేడ్కతో నొప్పుగాపెట్టి
పెట్టయైతోచెడు విధముకాకుండ
దశధూపవాసనల్ తగుభంగిపెట్టి
ఆటకిందయంతరంబందుల చాల
చిత్రవన్నెల పట్టుచీరలు మేలు

కట్లును కట్టించి కలయ కంబములు
తమకులచే దృష్టి తాకకయుండ
కంబళిచీరలు గవిసెనకట్టి
గరిడిదగ్గర జముఖాణంబుపరచి
రమణీయమౌనట్టి రత్నముల్ పెక్కు
చిత్రవన్నెలు కల్గచేసిన పెద్ద
గద్దియ పెట్టించి కదియంగ నొరగి
యుండంగ చెలువంపు టొరుగులు తీర్చి
వర విప్రక్షత్రియవరులును వైశ్య
శూద్రులు కూర్చుండ చోట్లేరుపరచి
ఈ మేడదగ్గర నిరువుగా పెద్ద
గరిడిచేయించి యా గరిడీకిచుట్టు
ఉక్కుకంబంబుల నొరయంగ నిలిపి
ఆచుట్టు తమకంబు లాయత్తపరచి
జతనంబు చేయించి చనుదెంచినాడ"
అని విన్నవించిన నా నాయురాలు
ఒప్పైన యొక యూరు నుడుగర కిచ్చె.

*నలగామని పనుపున నరసింగరాజు బ్రహ్మన్నను ఎదురు వుత్తెంచుట: నలగాముడు, బ్రహ్మన్న గరిడికి వచ్చి పుంజులను విడివించి పోరించుట: పోరులో నలగామని పుంజు చనిపోవుట: నాయకురాలు బ్రహ్మన్నను మారుపందెమున కొప్పించి, నలగామునికి ధైర్యము చెప్పుట.*

ఒయ్యన నలగాముడు దొప్పమీరంగ
మెయినిండ నలదిన మించు పరిమళము
మందపవనునివలన మగుడివేగంబు
సుడిగొని నలుగడల్ సోడుముట్టంగ
కచభరంబుననున్న కల్హారవిరుల

తావికి తుమ్మెదతండంబు కవియ
మాణిక్యముల కంఠమాలిక యొప్ప
హారంబు లరుతను నమరంగ, చూచు
జనులకందరికి నాశ్చర్యంబుపుట్ట
అక్కున చేర్చిన నతులితంబైన
పతకంబుపైనున్న బహురత్నకాంతి
దినమణికాంతితో దీటుకొనంగ
కెంపుల మెరుగులు కిక్కిరిసియున్న
హస్తకంకణముల నంచముల్ చింద
వ్రేళ్ళను తొడిగిన వివిధముద్రికల
మీద వజ్రంబుల మెరుగులు పొలియ
పొల్పుగా వీనుల పొందించియున్న
పోగుల నీలముల్ పొలిపారియుండ
నిటలభాగంబున నిడిన విభూతి
భూతికి నాధారభూతమైయొప్ప
చుట్టిన తలపాగ శోభిల్లుచుండ
కాముని యభినవకాయంబనంగ
భూషణాలంకార భూషితుండగుచు
నవయౌవనుండగు నలగామరాజు
వందిమాగధసూతవైతాళికులును
వరుసకై వారముల్ వారకచేయ
కొలువున కేతెంచ కొమరొప్పగాను
లలిత వరాళి వేతాళికురంజి
నాదనామక్రియ నాటకురంజి
ఆహిరి ధన్యాసి యాదిగాకలుగు
రాగంబులన్నియు రంజిల్లునట్లు
పటుతాళగతులన్ని పాటించి మరియు
స్త్రీ పురుషరాగ విశేషంబు లెరుగ
మిత్రంబులును వాని మిత్రముల్ తెలిసి

అధికంబు, హీనంబులై యుండకుండ
పరికించి 'సరిగమ పధనిస' యనుచు
సప్తస్వరంబుల సంగతికూర్చి
మద్దెల తాళంబు మానుగా నెరిగి
లయలు మిశ్రమ్ములు లఘువులు గురులు
ధాతుస్వరంబులు ధాతుమారులను
ఆహతములను ప్రత్యాహత గమక
జాతులు జోడించి చతురత మెరయ
తాళమానంబుల తగుపాటి నడపి
జంపెయు మట్టెయు జతియును ధ్రువయు
పరగు కైతాళంబు బంధంబులెన్నొ
పంచమస్వరమున బాగుమీరంగ
తుంబుర నారదాదులభంగి పొంగి
పాటకు లింపుగా పాడిరి మిగుల;
"ఎండినమ్రాకైన నిగురెత్తు"ననుచు
పొగిడిరి రసికులు పొందుగా వినుచు
కవివరులంతట కడుసంతసమున
అలరశృంగారవీరాద్భుత కరుణ
హాస్య బీభత్స భయానక రౌద్ర
శాంతరసంబుల చక్కట్ల నెరిగి
భావంబు ఛందంబు బంధంబు మరియు
హేతువు ప్రాణంబు నెసగు సహోక్తి
శ్లేషయు మొదలుగా చెప్ప చోద్యంబు
వస్తురూపంబును వర్ణనమీరి
కావ్యలక్షణములు కలిగి చెన్నారు
ప్రాకృత సంస్కృత పైశాచకముల
భాషల క్రొత్తలై భావంబులలర
కృతు లొప్పుగాచేసుకొని వారు కామ
ధరణీనాథున కంకితంబులుచేసి

చదువుచు నొప్పుగా చర్చించువేళ
వింతలమాటలు వినుచు నా రాజు
కరుణించి వారికి కట్నంబులిచ్చె ;
నాయురాలేతెంచి నలగామునకును
ఎరగుచు విన్నపమిట్లని చెప్పె :
"అప్పుడు మీరు నాకానతి యిచ్చి
నట్లనే తమగము లాయత్తరపరచి
కోడిపోరని నేడు గురజాలలోన
జనులెల్ల వినునట్లు చాటంగపంచి
నాయకులందరు నానావిధముల
కోడిమేడము చూడకూడియున్నారు
మాడుగుల్విడిచి దీమసమెంతొకల్గి
లెస్సగా బ్రహ్మన్న లెంకలు గోపు
కన్నమ జెట్టీలు కాల్బలముతోడ
వచ్చుచున్నాడు వసుమతీనాథ
వినుమ"ని నాయురాల్ విన్నవింపంగ
నాయుడు వచ్చుట నలగాముడెరిగి
ఏగువాద్యంబుల నెదురువ త్తేర
నరసింగరాజుతో నయమొప్పచెప్పి
గరిడిచెంతకు తాను గ్రక్కున చనియె ;
నరసింగరాజు తా నాయునికదిసి
కొలిచియేతేరగా గురజాలచొచ్చి
మేడలంతరములు మేలిమితోడ
కనుగొని వింతగా కట్టినందులకు
మెచ్చుచు నలగామమేదినీశ్వరుని
గరడికి తడయక కడువేగనరిగి
ప్రతియంతరంబున బహుజనశ్రేణి
కొలువంగ, గద్దెపై కూర్చుండె బ్రహ్మ ;
ఎంతయో మగతన మెంతయో యొప్పు

శత్రుల గుండెలు ఝల్లుఝల్లనగ
మ్రోయు చందంబున మ్రోయరవంబు
అందెయు డాకాల నందమైయుండ
హనుమంతుకాసెతో నలవడబట్టి
చీరవిలాసంపు చెన్నగలింప
పట్టెయొడ్డాణంబుపైనున్న రత్న
రాజి దీప్తులు బాగ రాజిల్లుచుండ
మేనెల్ల నిండార మెలదిన జాతి
కస్తూరి దిక్కుల కలయంగ నడుత
పెట్టిన వనమాలపేరు, పెంపార
కీర్తిపోలిన వజ్రకీలితంబైన
హస్తకంకణములు నటు బాగుమీర
తిన్నగా జాదిన తిరుమణికాంతి
వదనారవిందమ్ము వరలుచుండంగ
చెవులకు వ్రేగుగా చేర్చిన మంచి
పోగులు తేజంబు పొలుపారియుండ
జడయల్లి చౌల్లెంబు సంధించిమీఁద
చుట్టిన తలపాగ చూపరులెంచ
శిరసుపైనుంచిన చేమంతిబంతి
శృంగారములకెల్ల శిఖరమైయొప్ప
కొంతంబు డాచేత కొమరొప్పుచుండ
సెలగోలబిరుదాంక సింహవిక్రముడు
చెవులగోపకుమారు చేనిచ్చియున్న
చిట్టిమల్లన తను చేరరప్పించి
తనయంకమున నిడి తామ్రచూడమును
ఈకెలు ననువుతో నిరవుగా తీర్చి
ఒడలెల్ల నిమురుచునుండగా చూచి
ప్రజలెల్ల తమలోన పలికిరిట్లనుచు :
“ఈ రూపు ఈరేఖ నివిరిచూడగను

ఈ లావు ఈ వన్నె నీ మించుకెంపు
ఏ పుంజులందుఁగ నెరుగ మేభూమి
కరువయే కోడియై కలియుగంబునను
జనియించెనో కాక, జగములోనిట్లు
పుంజులుకల్గునే పొలుపారుచుండ
ఈ రాజ్య మీయెడ నేమిచేయంగ
పొడమినదో, యిట్టిపుంజులు కలవె!"
అనియని జనులెల్ల యద్భుతమ్మొంద
నాయకురాలంతట నలుదెసల్ చూచి
"నల్లమల్లని మేము నమ్మితి మిపుడు
పుంజును తెమ్మ"న్న భోరున చింత
పల్లిరెడ్డి ప్రియభాషణములను
నల్లమల్లని తెచ్చె నగుమోముతోడ;
నలగామరాజును నాయుడు మరియు
ఆర్వెల్లినాగమ యతిముదంబునను
"పుంజులు విడిపించి పోరనిండ"నిరి,
గోపును రెడ్డియు కోళ్ళను పట్టి
"గరడిలో డగ్గర కట్టెదమ"నుచు
పోరుకు విడిచిన పుంజులు రెండు
పొంగుచు రెక్కలు పొరిపొరినార్చి
కనుల నిప్పులురాలుకైవడి నవి
ఉగ్రంపుదృష్టిని నొండొంటిచూచి
కులగిరు లదరంగ కూయుచుచేరి
ముక్కుముక్కున చేర్చి మొనసిరోషమున
మెడయీక లుబ్బగా మెడవంచి రెండు
ఉప్పరం బెగయుచు నురవడితన్ను
తన్నిన తూలక దట్టంపు గోళ్ళ
మిట్టిమీదికి నెగసి మీరుచుతన్ని
కరవంగవచ్చిన గతిచూచి బరిని

వలయంబుగా వచ్చి వడి తన్నుటయును
చిరచిరతిరుగుచు చేరి యాలోన
ఉరవువ్రేయగచూచి యొక్కపైయుబ్బి
రెక్కల పెల్లార్చి రేగి మొత్తంగ
పెంధూళి యెగసియు పెంపగుచుండ
సంగ్రామకేళికి సంతసంబంది
ఊకించి తన్నగా నురములనాటి
రక్తంబు దొరగంగ రాగంబునొంది
తన్నుట తాకుట తమకు నొచ్చుటయు
తలపక మగటిమి తలకొని రెండు
తలపడె నట దేవతలు చోద్యపడగ.
వృత్రాసురుండు దేవేంద్రుండు, మరల
వైరముల్ పొడమగా వాలి యీపగిది
రూపులుమార్చి యారూఢివిక్రములు
కయ్యంబు చేయంగ కణగిరోయనగ
పుటపుట డయ్యుట పొరలుట పడుట
ఘటితంబు లాదిగాగల చిత్రగతుల
కంటికి వేడుకల్ కలిగింపచూచి
భూమిలో ఈపాటి పుంజులపోరు
చెప్పగా వినియును చేయ చూచియును
ఎరుగ మెన్నడు ననుచు నెల్లవారలును
వెరగంది పోరెడు విధము కన్గొనిరి.
వడి చిట్టిమల్లుకు బలమగ్గలించె
నలగాము పుంజుకు నళియించెలావు ;
తరుగుట నెరిగి ప్రధాని నాగమయు
"బ్రహ్మనాయుడ ! పుంజు పట్టింపు చాలు !
మరిచూచుకొందము మాపటివేళ"
అనవిని బ్రహ్మన్న యలతినవ్వలర
"మరి మన మీ పోరు మాన్పంగవలదు

పోరాడి పోరాడి పోరక డస్సి
సరిగాక యొకపుంజు చచ్చినదాక
పట్టిగా వల దొండు పల్కలేద"నిన
నాగమ్మ విన్ననై నగవెల్ల మానె
నోడక నాపుంజు లొకరూము పోర
కామభూపాలుని కరిపుంజు చిక్కె;
మైలమకాముని మనసు కలంగె
వేగ నాగమమోము వెలవెలపోయె;
గరుడుండు బాలనాగము వ్రేయుభాతి
సివ్వంగి లేడిని చేకొన్నకరణి
సింహంబు మదకరి చెనకినభంగి
శరభంబు సింహము జంకించుపోల్కి
గండభేరుండము క్రమమున నుండి
శరభంబుచేరిన చందంబుభంగి
తోరంపు కోపంబుతో నర్ధనారి
చిట్టిమల్లడపుడు చిరచిరలాడి
నల్లమల్లని చేరి నానావిధముల
నేరుపు పచరించి నిటలంబు తన్ని
మెడతన్ని యటకొన్ని మెరవడి తన్ని
చుట్టును తిరుగుచు జూటంబు తన్ని
గరిడెల్ల తానెయై గాసిలచేసి
వలయంబుగా వచ్చి వడి కూసి కూసి
ఒకపరి చెలరేగి యూకించి తన్న
ముక్కున నెత్తురు మునుకొనివచ్చి
గుడ్లును వెలికురికి కూతపెట్టుచును
భుగులున నెత్తురు భూమిపై కక్కి
తలతెగి యట్లంత ధరణిపై పడియె.
పడుచున్న పుంజును పరికించుచుండ
గాములపాటి నాగమ దేహమదరి

అటునిటు తూలుచు నవనిపై కొరిగి
దిట్టమై మొగమున తెలివితెచ్చుకొని
"పందెమొక్కటి కాదు బ్రహ్మనాయకుడ!
గోవులేనుగులను గుజ్జుముల్ ధనము
లాదిగా గురిచేసి యాడెదమ"నిన
నాయు డా మాటలకు నవ్వుచు ననియె:
"వెరపిడు మాటల వెరవంగనేల
ఇంతి! నే నిచ్చెద నేపందెమైన
పెట్టుము నీ కింత ప్రియమయ్యెనేని
అడితప్పెదవేని నాడలేన"నిన
నాయురా లుబ్బుచు నలగాముచేరి
"చెక్కిట చెయ్యేల చింతింపనేల
నిట్టూర్పు నీకేల నీవగపేల
తలయొంచ నీకేల తలపోతలేల
ఏనీకు కలుగంగ నేటికి చింత?
తలగుట రాజుకు ధర్మమా చెపుమ!
తలపులొండులు మాని తాలిమి కొంత
పట్టిన నీవిపుడె పందెంబుగెల్తు
గెలుపు గైకొనునట్టి కిటుకు నే కంటి
కంటివే నామాట కదులుమో రాజ!
రాజాన యిప్పుడే బ్రహ్మనాయకుని
సామదానంబుల చతురుపాయముల
నింద్రజాలంబుల నెరవులుపన్ని
మగుడ గెల్చినగాని మరి నీవు నాదు
మతివిశేషంబుకు మరి సంతసించ"
వని దుఃఖశమనంబు లప్పుడు పల్క
కామరాజామాట గైకొని కదలె;
భటులు రాహుత్తులు పడవాండ్లు దొరలు

గరిడికడ నిలచి గజిబిజియణచ
నాయురాల్ పోయెను నరనాథుకూడి;

*నాయకురాలు బ్రహ్మన్నకు విషాన్నము పెట్టించగా అత డది భుజించి యెప్పటివలె నుండుట: ఆమె తన కుట్ర విఫలమగుటచే, కట్టుబోతులను పిలిపించి, మంత్రతంత్రాదులచే బ్రహ్మనపుంజును చంపుడని ప్రోత్సహించుట.*

మునుపటి మొల్లల ముత్తసానింట
బ్రహ్మనేనికి వీడుపట్టుచేయంగ
నాయురాల్ విషమును నానావిధముల
కూర్చి వంటకములు కూరలం గలయ
పాకంబుచేయించి బ్రహ్మినాయునికి
భోజనంబులు పంపె భోజనవేళ.
ఆ పదార్థములపై నడపకేదాసి
తొలుత పావనముగా తులసితీర్థములు
చిలకింపుటయుచూచి శీలమబ్రహ్మ
తన ప్రజలును తాను తగనారగించి
విడియంబు చేయంగ వేగులుపోయి
నాయురాల్ వినగను నగుచు నిట్లనిరి :
"కాలకూటము తన కంఠంబునందు
నరవితో నించు నా సర్వేశుభంగి
తులావతనంబున దుర్యోధనుండు
పెట్టిన విషముకు బెగడకున్నట్టి
భీముని పగిది నీ పెట్టిన విషము
నిర్విషమునుచేసె నీలవర్ణుండు
హరిదాసు లిటువంటి యక్రియలందు
నుడివడరెమ్మెయి స్రుక్కరు"నంగ
వెఱగొంది నాయురాల్ పెడవెడనవ్వి

గురజాలలోపల కొరలున్నయట్టి
కట్టుబోతులనెల్ల కణకరప్పించి
తనదగ్గరకు పిల్చి ధైర్యంబుతోడ
నేకాంతముననుండి యేర్పడచూచి
"కోడిపోరున భూమి కోలుపోయితిమి
నలగాము మిమ్మునే నమ్మియున్నాడు
మీరు తక్కగ దిక్కు మేదినిలేరు
నేడు తప్పిన నిచట నిలువంగలేము
శీలమనాయుడు చేకొని మనల
దేశంబు వెడలింప తిరుగుచున్నాడు
మమ్మువలసినవారు మది నంటలేక
మంత్రతంత్రాదుల మాయల నేడు
నెరితత్త్వముంజూపి నెగడంగవలయు
మరియు నీ రాజ్యంబు మగుడనిప్పించి
నలగాము కృప చూపి నా పట్టభద్రు
చేసితిరేనియు చెన్నునియాన
రాజ్యమంతయు మీకు రంజిల్లనిత్తు"
అనుటయు మిన్నంది యా కట్టుబోతు
లెల్ల నాగమ చూచి "యేర్పడ వినుము
వాకట్టు మరకట్టు పణకెడుకట్టు
పొట్టపొంగెడుకట్టు పొంగులకట్టు
కూతపెట్టెడుకట్టు కోపించుకట్టు
ఎండిపోయెడుకట్టు ఎగిరెడుకట్టు
వీధిబారెడుకట్టు బెగడెడుకట్టు
కాళ్ళను చేతులు కదలనికట్టు
ఎక్కసక్కియకట్టు నేడ్చెడుకట్టు
కుంది కందెడుకట్టు గుడికొనుకట్టు
ఓకిలింతలతోడ నొరలెడుకట్టు
ప్రాణంబు వోయెడి బలువైనకట్టు

కట్టనేర్తుము మేము కలయప్రాణములు
పెద్దకొండలనైన ప్రేల కట్టుదుము
పారెడియేరైన పారకయుండ
మంత్రింపగలమమ్మ మన భూమినెరుగ
మునుకొని మేము సముద్రంబునైన
నింకింప చాలుదు మీ మంత్రమహిమ
జీవంబుగలహాని చెప్పంగనేల
జాములో చంపుదుము జనులెల్ల హడల
ఏము కల్గంగ నీకేల బొమ్మ"నిన
కట్టుబోతుల కెల్ల కర్తయైయున్న
దయ్యాల మల్లయ్య తా ముందుకొచ్చి
"మును చందవోలులో మున్నూరుమంది
నెండకట్టితి నేను ఇలయెల్ల నెరుగ
నిక్కంబుగా నటు నెల్లూరులోన
నొక్కనా డొక వేడ్క నొక యంత్రమందు
నిన్నూటి చంపితి నిక నేమిచెప్ప"
అనవుడు నామాట లన్నియాలించి
గాములపాటి నాగమ యిట్లులనియె
"కట్టుబోతులలోన ఘనులైన మీరు
ఒనర నాముందర నొక్కటిచేసి
మీవిద్దె కలదెల్ల మెరసి నాయెదుట
చూపుడా దృష్టంబు చూచెద"ననుచు
కోడిపుంజులు రెండు కూడ తెప్పించి
"ఈ పుంజు నాయుని దీ పుంజునాది
బ్రహ్మనాయుని పుంజు ప్రాణంబు విడువ
కట్టుడా మీనేర్పు కానంగవచ్చు"
అని రెండుపుంజుల నచట పోరింప
కట్టుబోతులు పుంజు కనలుచు చూడ
అంతట నాపుంజు నవనిపై త్రెళ్లె;

ఈరీతి పుంజుల నెక్కడెక్కడికి
మునుకొని పోరించి ముమ్మాటు విడువ
తను కోరినటువలె తార్కాణమైన
కట్టుబోతులచూచి కడుగారవించి
కామరా జెదుటను కణకతో తెచ్చి
"రవుతులేటికి నీకు రాజు లేటికిని
పరివారమేటికి పడవాళులేల
ఏనుగులేటికి నేల నాయకులు
వీరు మువ్వురు మన వీటిలోనుండ
ఇంతకాలముదాక నెరుగముకాని
ఎరిగితిమేనియు నీ పట్టుతగిలి
ఇలనున్న పగవారి నేలంగ గలము"
అనివారి కొనియాడి ఆ రాజు నెదుట
కోడిపుంజుల రెంటి కొనితెచ్చిమున్ను
వాదించినటువలె పరుసతో విడువ
కట్టుబోతులు పుంజు కట్టిన చచ్చె;
నలగామరాజంత నానందమొంది
మూడు వేలొసగె నా ముగ్గురికపుడు
ఒసగిన వారును నుబ్బియిట్లనిరి:
"మమ్ముచూచితి కాదె మైలమరాజ:
బ్రహ్మనాయుని వీడుపట్టున నిపుడె
చావంగ కట్టుదుమొ; చాల దైన్యమున
వేదుపై గుంజాలవీధులలోన
పరువులు పెట్టుచు పలుమాటలాడ
కట్టుదుమో, యటు కడువడి బెగడి
మహాదేవిచర్లకు మగుడిపారంగ
మంత్రింతుమో చూచి మరల రాకుండ;
అదియును కాదేని ఆ చిట్టిమల్లు
సరగున నిప్పుచే చావకట్టుదుమొ

ఇన్నిటిలోపల నెయ్యది ప్రియము
దేవ నీచిత్తము తెరగించు"
మని పెక్కుపంతంబులాడంగ కట్టు
పోతులమాటలు పోలంగవినుచు
మైలమకాముండు మది సంతసిల్లి
"యంత్ర మంత్రాదుల నెంతవారైన
అందరు మీసాటి అవనిలో కలరె
మీమంత్రజాలముల్ మిథ్యలుకావు
ఇటువలె చేసిన నిలలోనివారు
కట్టించి చంపిరి కల్లరియనుచు
నాడు మరొకమాట అదియేలమనకు
గరిడిలోపుంజులు కయ్యంబుపట్టి
పోరాడుచుండంగ పొలుపొందగాను
నెలకొనిచేసిరా నిందలులేవు"
అని కట్టుబోతుల నటనుండిపంపె.

*బ్రహ్మనాదులు కూర్చుండుటకై నాయకురాలు గరిడి దగ్గర నొక యపుటి తమగము కట్టించి దానిక్రింద పాతర త్రవ్వించి యందు నారసములనుంచి, మన్నుతో కప్పించుట. నలగామునిపుంజుతో పోరాడుచున్న చిట్టిమల్లుని కట్టుబోతులు అక్షంతలు చల్లి చంపుట. నాయకురాలు దుర్న్యయము నెరింగి గోపన్న ఆమెను దూషింపగా, నలగాముని లెంకలు అతనిపై బడుట.*

నాయురాలంతట నాయుని తమగ
మూడ్పించి క్రొత్తగా నూహించి బాగ
ఏవంక నెక్కిన నెక్కిన దెసను
గెంటెడునట్లుగా కీలుపన్నించి
తప్పుజాలెలుపెట్టి తమగంబుకింద
పాతర త్రవ్వించి పలునారసములు

శూలాలు సీసెలు సురియలు నిలిపి
కలయంగ పాతించి కప్పుపెట్టించి
కోటపై పాలెము క్రొత్తగాకట్టి
ఇటు పట్టణంబున నేమరకుండు
నట్లుగా లావుగా నాలుగు మొనలు
నరసింగరాజొద్ద నయమునపెట్టె.
కామభూపాలుడు కదలుచునుండి
నాయుని పిలిపించ నయమున నతడు
చనుదెంచ గరిడికి చయ్యనవచ్చి
మేడలో కూర్చుండె మేదినీశ్వరుడు;
నాయురాలంతట నాయునిచూచి
"వింటివా నా మాట వేయునునేల
ఈమరి పందాన నెవ్వరమైన
గెలిచినవారమే గెలిచినవార
మోడినవారమే మోడినవార
మింతియె యీమాట నిక త్రిప్పమ"నుచు
నాయుని నొడబరచి నాయకురాలు
చాటించె నామాట జనులెల్ల నెరుగ;
రాజును వీడ్కొని బ్రహ్మనాయకుడు
అరుగ తమగముచెంత కంతకు మున్నె
నడిచి తమగము కూర్చ నలుదెసల్ చూచి
గోసంగి కన్నమ కోపంబుతోడ
కపట మార్గంబుల కలయగ్రహించి
తమగంబు కడనున్న దళములతోడ
"మేముండు చోటను మీరుండుటెట్లు
మా తమగంబుపై మానిసిపేర
ఎవ్వరు వచ్చిన నీ గొంగవాలు
కత్తితో నడిమికి ఖండింతు వినుడు
ఎవ్వడు వలదంచు" నేర్పడ తాను

కన్నమ తమగంబు కడ నుండునంత
కోటల గొంగయు కుంచె శ్రీరాము
డడప కేదాసియు నా తమగంబు
నెక్కిరి యంతలో నెక్కుచునుండ
నెమ్మెయి నెవ్వరు నెరుగ రాకుండ
కట్టుబోతుల తమగంబు క్రిందపెట్టి
"మీ సత్త్వములు నమ్మి మెరమెరమాని
పందెము నేనాస పట్టినదాన
నెల్లైన తోడ్పడి యీ బారి మాకు
వెడలంగ చేయుడీ విద్యలమెరసి"
అని కట్టుబోతుల కప్పటప్పటికి
పెక్కు తెరంగుల ప్రియములు పెట్టి
గాములపాటి నాగమ వద్ద నిల్వ
ఒనరం వాద్యంబులు నొక్కటై మ్రోగె;
గోపును రెడ్డియు కోళ్ళనుతెచ్చి
విడిచిన రెండును వెస తన్నులాడి
పక్షవిక్షేపణ పవనాంతరముల
పెనసి పెల్లెగసియు పెంధూళి కప్ప
గరిడిలో నేమియు కానరాదయ్యె;
పుంజులరూపులు పొడ కానరాక
గాములపాటి నాగమ తాను బెగడి
"దయ్యాలమల్లయ్య ! తగువగునీకు
నమ్మితి మీమాట నమ్మితిజుండి
పుంజులరూపులు పొడ కానరాదు
మన పుంజు చిక్కెబో మాట లింకేల
ఈవేళ చెల్లిన నెరుగంగరాదు
చల్లు దక్షింతలు చయ్యనదాక
యంత్రించు మంత్రించు యంత్రించు మ"నుచు

ఆతురపడి వాని నటు వేడుకొనగ
తెరలి లోపలినుండి తెగి కట్టుబోతు
మంత్రించి యంత్రించి మంత్రాక్షతలను
గరిడిలోపల చల్లగా నర్థనారి
చిట్టిమల్ల డపుడు చిరచిరతిరిగి
కాళ్లను ఒడలును గజగజవణఁక
కుత్తుకయెండుచు కుయ్యిడలేక
చూచెడి ప్రజలెల్ల చోద్యపడంగ
వదనంబు తెరచుచు వసుధపైకూలె;
"ఓడెపో బ్రహ్మ నేడోడెపో యకట
బాలరాజులు తన్ను పట్టిరి నమ్మ
తను తక్క నన్యుల తలవని వారి
చెరిచెపో యంతట సిద్ధంబుకాగ"
అనుచు నా జనులెల్ల నాడికొనంగ
నలగామరాజుకు నగుమొగంబయ్యె;
దొడ్డనాయునిపట్టి తూలుచు పుంజు
చచ్చుటయు నెరింగి చలనంబులేక
తమగంబు దిగ కామధరణినాథునకు
పొడచూపి నాగమ్మ పొంగియిట్లనియె :
"దొడ్డనాయునిపుత్ర ! దోర్బలఘనుడ !
పందెమ్ము గెలిచితిమి ప్రజలెల్ల నెరుగ
బలవంతమున భూమి బాసిపొమ్మనుచు
తడవంగ వెరతుమే తరికై ననిన్ను
నీవును నెట్లయిన నిజమాడవలయు
తప్పనివాడంద్రు ధరణిలో నిన్ను
నిండి మీరుండంగ నిశ్చయంబునకు
మాచర్ల కడకు మా మనిషియేరాడు
కావున మీరలే కదలిపోవలయు"
అని పల్కగా నాయుడటుచూచి తిరిగి

నలగామరాజుతో నగుచు నిట్లనియె :
"ఓరాజ ! వినవయ్య ! యొనరంగ మున్ను
నీతోడనాడిన నిజము నేతప్ప
వేగిరపడనేల వెరవంగనేల
ఏనాళ్ళనాటికి నీభూమి విడిచి
కదలిపోయెద మట్లు గాన నీ వపుడు
తోరణకట్టుకో దొరల పుత్తెమ్మ
మాచర్లక" నిన నా మాటలు వినుచు
బంగారుకోరతో బ్రహ్మనాయునికి
విడియంబులిచ్చుచు వీడుకొల్పుటయు
నతడును మ్రొక్కుచు నరుగంగనపుడు
ఎల్లవారలకును నెరిగింపవలసి
కన్నమ తమగంబు కదిలించి త్రోవ
కడసీల కీలూడ్చి గ్రక్కున విడువ
పడియెపో శూలాల పాతరలోన
పడిన నా కన్నమ పకపకనవ్వి
"గోపు ! యీ నాగమ కుటిలత చూడు !"
అనుచు నాయునికూడి నరుగంగ గోపు
కపటవిద్యలనెల్ల కని వెరగొంది
గాములపాటి నాగమ చూచి పలికె :
"కుటలంపుజీవి ! యో కొండేలమారి
కలపనగంప ! యో కలహాలమూట
మానని పెనురోగి ! మాయలజోగి
అలజళ్ళ పెదదుంప ! అంగడిగంప !
నీరులోపలిగంట ! నీచులపంట !
నయమాడి యిల్లేల నాయకురాల !
కట్టుబోతులచేత కట్టించినేడు
దిట్టవై నాకోడి తిట్టితి కాక
కాకున్న మాపుంజు కయ్యంబులోన

ఊరకోళ్ళలు చంపనోపునే తలప
నలగామ భూపాల! నాయకురాలు
తాను తీర్పరియయ్యె తగపాపమునకు
పాపంబులెల్ల నీపాలనే వచ్చె
వచ్చుట ఎరుగవా వసుమతీనాథ
వాలిమర్దనునకు వావిరిమాని
నగరినుండి విషము నమ్మించి పంచె
తమగంబు వడిపన్ని ధర్మంబు మరచి
ఆ క్రింద పాతర నలుగులు నిలిపి
తోడిపోతులచేత ద్రోహంబుచేసి
కపటత నాపుంజు కట్టి చంపించె;
ఇట్టి యధర్మంబు లెరుగ వేమిటికి
స్త్రీబుద్ధి వినువాడు చెడును తథ్యంబు
నామాట తలపోసి నలగామరాజ!
మీదు విచారించుమీ. యీమె మాట
మాటగా వినకుమీ మైలమకామ!
ఆడుతీర్పరి మాట లాలకింపకుము"
అనిన నాయకురాలు అతిరోషమొంది
గోపుతో నిట్లనె కోపంబుతోడ
"పడుచు మాటల కెగ్గు పట్టరటంచు
మున్ను నీవు ననేకములు బల్కి తౌర!
మొగమోడి యుండవు మూర్ఖుడ వీవు
నోటికి తగినట్లు నుడువుచున్నావు
ఇంతగా మదమెక్కి ఛీలరా నీకు
కనుల కావర మెంత కప్పెరా యోరి!
బ్రహ్మనాయుడు రాచపట్టులలోను
నెవ్వరంపెననుచు నిచ్చె పత్రంబు
నిచ్చియు తెచ్చిన నిదియును తప్పె
పత్రమ్ములో మున్ను పలికించినట్టి

పందెంబు కాదని పలుపంత కూడి
కామభూపాలుని కంటి యెదుటనె
అలుగు రాహుత్తుల నరవీసమునకు
పోకుండ నాడెదు పొంగిపోయెదవు
మందెమేలంబున మైలమకాము
నెగ్గులిగ్గాడంగ నెంతటివాడ
వీ నీకు సిగ్గైన నించుకలేదు
బంటుతనంబున పట్టిచూడంగ
మాపురిలో నొకమాలనిపోల
వ"నిన నాగోపన యతికోపుడగుచు
"ఆడుదానవు నిన్ను ననియెడిదేమి
మగటిమి మాటలు మాటిమాటికిని
చెప్పంగ నేటికి చేసిచూపెదను
మగుడజుమీ"యంచు మందుచులేచె.
తమగము పయినుండి తమకంబుతోడ
కోపించి లెంకలు గొదకొని యురికి
కాలాగ్నిలోపడి కాలెడు లేళ్ళ
కైవడినప్పుడు కామాయలెంక
పెందేల యెరలెంక పెదపోతులెంక
వీరాదిలెంకలు వెసమూగగాను
అడవిలోపలనున్న ఆబోతుభంగి
గోపన మెయిపెంచి గొంత మంకించి
లెంకల దెసచూచి లెక్కించియపుడు
నలగామరారాజు నగరిలోపలను
భోజనంబులుచేసి పోతరింపుచును
కయ్యంబు చెయ్యనే కాలుద్రవ్వెదరు
నెరరణంబులయందు నిపుణులేమీరు
భీతాత్ములను చేతు పెద్దలుమెచ్చ"

అని గోపుమిన్నంట నార్పులుపెట్టె;

*గోపన్న నలగాముని లెంకలతో పోరాడి పెక్కం డ్రను హతమార్చుట : అరె జోగన గోపన్నను నేల కూల్చుట : అతడు బ్రహ్మనను చూచుటకై కొన యూపిరితో నిరీక్షించుట.*

అంతట తనమీద నరవాయిగొనక
తమకించి లెంకలు ధట్టించిరాగ
భీకరంబుగ నురికి పెళపెళనార్చి
వీరకామయమీద విసురునపోయి
తల తెగపొడిచియు ధరమీద కూల్చె ;
యముని పాలికి నేగ నాభీములెంక
పెద్దగా నంకించి పృథ్విపైకూల్చె ;
సంగడించిన పెద్ద జన్నాయలెంక
క్రేడించి పొడిచిన కీళ్ళులు సడలి
నెత్తురు క్రక్కుచు నేలపైపడియె ;
అట్టహాసముచేసి యతని తమ్ముండు
బిరుదులెంకల నెత్తి పిడుగనువాడు
మీసాలుదువ్వుచు మేలు మేలనుచు
నబళంబు ఎగవైచి సంధించిపట్టి
గొంతంబుమీదను గొబ్బున పొడిచె ;
పొడిచిన్న కోపించి "పోకుపోక"నుచు
నరుక నుద్రేకించి నందేలగోపు
వచ్చిన యాతని వక్షంబు పొడిచె ;
పొడిచిన నెర్లెంక పోరిగొనరాగ
గోపన్న యంతట క్రోధంబుతోడ
నడువీపున వెడల నాటించి నేల
పడదోసి యార్చగా పసిగాపులెంక
"యిక్కడ నేనుండుటెరుగవా" యనుచు

బొమ్మలు ముడివడ బొబ్బరించుచును
పరపెంచి యంతట పయివారి పొడవ
గుండుబోయనిపట్టి గొనకొని యురికి
"ఏమంద నెక్కడ కీవు పోవంగ
కాచితి నింక నీ కరకులు మాను
నీలెంక లందరు నేలపై కూల
మూకలపై కురికి ముదలించి పొడుతు
బ్రహ్మనాయునియాజ్ఞ బరిదాట వెరచి
నలగాముపయి గోపునడువడుగాక"
అని పెక్కు విధముల నాతని పొడిచి
లెంకల మర్దించె లెస్సగా నపుడు
కినియుచు నాగమ కెలకుల చూచి
"ఓ పరివారమా ! యురవడిమించి
మాటలాడంగను మరిచితిరోరి
గోపు మిమ్మాడిన కొరగానిమాట
లెన్నైన కలవని యెన్నంగనేల
వాలియున్నాడటు వలసినరీతి
సేయుండు మన్నియ సెలవు మీక"నిన
"మాకంటె లెంకలు మరి హెచ్చు మున్న
గోపుతో రణమును గుదియించు పెరిగి
నిలిచి యుంటిమి కాక నీవింతలేసి
మాటలాడగనేల మము దూరనేల
సమయించి వత్తుమో సంగ్రామ భూమి
బరపుదుమో వానిపని యెంత" అనుచు
పరివారమంతయు బంటుపంతముల
సింహంబు పొడివిన సింధురఘటల
చాడ్పున పయినెత్తి చనుదెంచుటయును
బ్రహ్మన్న తన మనఃపద్మంబునందు
గుండెబోయనిపట్టి గురుతుగాపెట్టి

ప్రళయకాలమునాటి భైరవునిభంగి
పురములు కాల్చిన భూతేశుపగిది
నేర్పడ వారితో నిట్లనిపలికె :
"నలగామరాజుకు నమ్మినబంట్లు
భండనశూరులు బలుమావటీలు
వచ్చిరా రారండు వరుసపెట్టెదను"
అనుచు నామొనమీద నతిరోషుడగుచు
పిడుగుపడ్డట్లుగా పెళపెళనార్చి
బిట్టుదాకుటయును భీతిమూర్ఛిల్ల
నెమ్ములు తునియలై యిలమీదరాల
పిక్కలు మోకాళ్ళు పృథివై పడగ
కొందరి మడమలు కుదియంగచేసి
ప్రేగులు గుండెలు పృథివై పడగ
కొందరి సమయించి కొందరిపరపె;
"గొల్లవాడింతేల క్రొవ్వెరా"యనుచు
నలగాముబంటులు నలుదెసల్ క్రమ్మి
బిరుదువీరులనెల్ల పేర్కొని వారి
అభిమానములమీద నానలుపొడిచి
గోవుపై పురికొల్పి కొట్టపంపుటయు
తమలావునకు దేవతలు మెచ్చుచుండ
బోయినపోకలు బోయెమారులును
చందురువంకలు చల్లజంపులును
పొట్టలపొంగులు పుణ్యతీర్థములు
ఎరిదైవములు పిల్లియెనుకలిర్వులును
ఒకపెక్కునమ్ములు ఒకపోకలును
తామరకూనలు తల్లిమెరగులును
చీకటిమిణుగుర్లు చివురుగుండెలును
గుండెలుభీతిల్లు కూతపెట్టులును
కత్తికవీపులు కుప్పికోలలును

మొదలైన మంచియమ్ముల దొనలందు
సంధించి జోదులు సవరణ మెరయ
నమ్ములు నారులు నతివేగగూర్చి
"ఒకరితో నిందర మొనరపోట్లాడ
తగవుకాదని మేము తలగియుండంగ
పటుభీతి నొందించు బాసలాడితివి
మందిమేలంబున మమ్మమార్కొనుట
యమునితో కయ్యంబులాడినయట్లు
కోపించి శేషుని కోరలనడుమ
చెనటియై వెరవక చేచాచినట్లు;
మాపేరు చెప్పిన మహిమీద చెనక
ఎవ్వరువెరచుట నెరిగియు నీవు
పోరాడవస్తివి బుద్ధిగాపోక
కాచితి మిత్తరి కామరాజాన"
అనుటయు గోపు తానలతి నవ్వలర
"కాచిననేమయ్యె కలయికలేల
పందమాటల నిట్లు పందెముల్ పెట్టి
అడ్డంబుగా నాడి యతిభీతులగుచు
పారిన నేనేల పారంగనిత్తు
ఎదిరించి నాతోడ నించుక తడవు
నిలిచి పోరాడిన నిశ్చయంబుగను
మిమ్ములనందరి మేనకాదిసుర
కామినీలోకంబుకడ కన్పువాడ
ఇక్కడి సుఖమునకేల నాసింప
చావులెన్నటికైన జగతినిక్కంబు
కావున మీరొండు గైకొంటమాని
పురహరుశూలంబు పొలుపుదీపించు
నాదు కొంతమునకు నమ్మి ప్రాణంబు
లర్పించుటదె మేలు అరయఁగామీకు

ఇహమును పరమును నెసగ సిద్ధించు"
అనుచు కొంతముమీద నంకించి యార్చి
సోమినాయుని మొన సుడివడ తాకె;
తాకిన జోదులు తడబడి తెలిసి
గోవుపై నమ్ములు కుప్పలుకాగ
కురియుచు నార్చుచో గోవన్న మేఘ
పటలంబుకప్పిన పర్వతంబయ్యె;
విలుకాండ్ర కరముల వీకతోనున్న
చాపంబులే యింద్రచాపమ్ముకాగ
తరిమి పారెడి యంపతండంబులెల్ల
తారకాపంక్తులై తనరియుండంగ
జోదులకింపారు చూపులగములు
తొలకరి మెరుపులై తోచుచునుండ
అప్పటప్పటికిని యదలించి యాడు
మాటలు పిడుగుల మరపించుచుండ
శిరమున నొసలను చెవులరంథముల
చెక్కులముక్కున చేతులమెడను
ఎడదను పక్కల తొడల మీగాళ్ళ
మోచేత పిక్కల మునుకొని పాద
తలముల కన్నుల దట్టంబుగాగ
కొండపై వానలు కురియుచున్నట్లు
ఏసి యార్చుచు జోదులెంతయు నుబ్బ
నాటిన క్రూరబాణమ్ములు పెరికి
నెత్తురు మేనెల్ల నిండిపారంగ
జేవురు కొండన చెలువు దీపింప
ఓడక పారక నుడుగక గండ
బిరుదు ప్రతాపంబు పేర్చి యాగోవు
నీలవర్ణుని మది నిలిపి యంతంత
ఆలపై బెబ్బులి యుఱిమినయట్లు

కదిసి యా మొనలపై కళవళపర్చి
పక్కలు నాటించి బరులు చెండాడి
తలలను తెగపొడిచి దట్టించి తన్ని
కల్లలాడిన నోళ్ల గము లగ్గ పొడిచి
మెయి మెరవులు వ్రచ్చి మెడల నాటించి
ఒరపులు చెండాడి యొరలంగచేసి
నారులు విండ్లను నలయంగ పొడిచి
దొనలు దేహంబులు తునకలు చేసి
గొడుగులు పడగలు కుంభినిమీద
తడబడ వరపించి తనపేరువాడ
సమ్మోన కలతయై నతిభీతి పొంద
వడ్డ పీనుంగులపై త్రొక్కుకొనుచు
"నిలువుండు నిలువుండు నిలువుండు వీడె
చెవుల బోయనియింటి సింహంబువచ్చె
పోయిన నికనేల పోవంగనిత్తు
పట్టుబడినవారి బలియిత్తుగాక
గుడిజాలలోనైన కొంతంబునకును
సెలవు చేయుదున"న చెచ్చెరమూగి
"ఇంక పారగనేల నీ మీద మనకు
మానంబు కోల్పోవు మన గడ యేల
గొల్లచే లజ్జలు కోలుపోయితిమి
పోయిన నాగమ పుడుకకునైన
గైకోదు మనలను కంటకాలాడి
జీతంబు పెట్టుక చిందుగాచేయు
గోపనలుగునైన కొంతంబునైన
పడి ప్రాణమిత్తము పదమద"మనుచు
మొలనుండి యమ్ములు మును పెరికికొంచు
గోపుకొంతముమీద కూలెదువారు
ఒకచెయి తెగిపడ్డ నొకచేత సురియ

చాలించి యెదిరించి చచ్చెడివారు
ఒకచేత తలయొడ్డి యొరపుకు డించి
ఒకచేత పొడువ నుద్యోగించి గోపు
సబళంబుపై పడి చచ్చెడివారు
ఒకకాలు దునిసిన నొకకాలు దాటి
పరుస కొంతముమీద వ్రాలెడువారు
పీనుగుల్ త్రొక్కుచు పెళపెళనార్చి
ఎదిరించి కొంతాన నీల్గెడువారు
మరియును పెక్కండ్రు మడియంగ నంత
చెవులగోపకుమారసింహవిక్రముడు
పెద్దమూకలు నిల్పి బిరుదులుమాన్పి
జోదులసోముని చూచి "యింటాక
ఎక్కడనుండితో యే నిన్నుకాన
బిడుగుల చంపితి పలువుర నిపుడు
నిలువుము చూపెద నీనేర్పులావు
ఎరిగెద"నని యాతడెక్కిన హయము
మొగమున నాటించి మదలించి యతని
వక్షంబునాటించి వడినార్చుటయును
బెదరి గుజ్జము వాని పృథివిపైపైవ
తాటిపోతన పట్టి తప్పించి విడిచి
వీథుల వలినేని విముఖునిచేసి
జలరాశి గల చిన్నశైలంబుపోలి
కలమొనల నన్నియు కలగంగచేసి
తరిమిన నావేళ తత్తరపడుచు
మొనలెల్ల తలకుచు మొగికోడి గరిడి
చాటుకు పారిన జయశీలుడగుచు
గోపన్న పిలువగా గోవులభంగి
దళములన్నియు నొక్కతలకు నేతెంచె;
కోడిమేడము తల గోపాలదాసు

నిష్కళంకముగను నిలిచి యిట్లనియె :
"పంతంబు వచ్చెను బవరంబులోన
బంట్లను చంపుదు పటు సాహసమున
కన్నెకయ్యము నాకు కలిగె నే డిపుడు
ఒచ్చెంబు లెరుగను ఒరపుల నెరుగ
నింతకు మిక్కిలి నేమియు" నన్న
నలగామరాజంత నగుమోముతోడ
"చూచితే నాగమ చూచితే గోపు
పడుచువాడని నీవు పలుమారు లతని
గైకొనకాడుదు కంటివే నేడు
వాడు పోట్లాటలో వాడనిభంగి
పంతంబుమాటలు పలికెడు వాడు"
అనుటయు నాయురా"లవధారు దేవ !
పడుచుగా కేపాటి బంటయో వాడు
నీవు చూచుచునుండ నిమునమాత్రమున
నరికింతు తునెలుగా ననుగురాజాన"
అని కోపమున దిక్కులదరుచు చూచి
ఫౌజుకు కర్తయై బలయుతుండైన
జోగరాహుతుమీద చూడ్కులు నిలిపి
"కానిమాటల నిన్ను గైకొన కాడె
ఆజిని పగదీర్ప నదనయ్యె నిపుడు
చెవులగోపన చంప సెలవు నీక"నిన
ఫౌజులో తనరారు బంట్లనునేర్చి
మీనుటెక్కెంబులు మిన్నంది చెలగ
తరి ధమామీలును తమ్మటధ్వనులు
గిడికొన్న డోలులు కిమఠకోవులును
కాసెలు గొనకొని కడుమ్రోతలెగయ
సింజినీరవములు సింహనాదములు
ఓంకారరవములు నొక్కపైమ్రోయ

హయములు సకిలించి యాజికి నడువ
ఖురతాడనంబున కుంభిని యదరి
ధూళి పెల్లెగయంగ తోలె రాహుతుల;
గోపు ఫౌజును ముట్టుకొన్న నాతండు
కోపంబు ముప్పిరిగొన నడిదంబు
ఝళిపించి హయమున చంగునదాటి
గుండుబోయని పట్టి కూడంగముట్టి
అడిదము వ్రేయగా నల్లననొరిగి
శీలమబ్రహ్మన శ్రీపాదయుగము
కనుగొను వేడ్కను తా కనుమూయుచుండె.

*బ్రహ్మనపై దుమికివచ్చెడి నలగామునిసైన్యమును కన్నమ నలినలి చేయుట; అతని పరాక్రమమును చూచి గురజాలపౌరులు పరిపరి విధముల అడలుట.*

గోపుచంపితిమంచు గుబ్బంబు దళము
లార్చుచు బ్రహ్మపై నడుగుదేరంగ
ఆ రవంబాలించి యా బ్రహ్మనీడు
"వెనకనార్పులుపుట్టె వెగ్గలంబగుచు
గోపు చిక్కెడు కదా గోసంగికన్న!
అటు విచారింపుమా" యనినను వాడు
చాలఘనుండారె జోగనచేత
గోపుస్రుక్కుట విని గొనకొనియంత
ప్రకటకోపాటోపబలయుతుండగుచు
వడివచ్చి మొనల తా వారించి నిలిపి
తొలుతరోషంబున దుమ్ములో చెవుల
గోపు చంపినవాని కొట్టంగ తలచి
ఫౌజులోపలనెల్ల బలవంతు డారె
నారి జోగరవుతు వడిచూడ కదిసి

"రణములో పెక్కండ్ర రవుతులచేత
అలయించి మాగోపు వసువుల గొంటి
ఇక మాటలేటికి నిదె చావుమను"చు
వేటారు తునకలై వికృతుడై పడగ
ఖండించె నప్పుడు కన్నమనేడు
ఆరెజోగన చచ్చుటందంద వినుచు
అతని ఫౌజుననున్న ఆరెరాహుతులు
చచ్చెజోగన యని చలము దీపింప
"మనముండి యిటుపేరు మరువంగనేల
నీపగతీర్చెద మిత్తరి"ననుచు
కనలుచు హయముల గజములమీద
కదలించి వడితోల ఘనుడు గోసంగి
కన్నమనేడును కదలక నిలిచి
ఫౌజురాహుత్తులు పైబడ చూచి
"గోపుచంపిన చూచి కోపించి యారె
జోగని చంపితి జనులెల్ల మెచ్చ
చావుకు సరిచావు చంపినపనికి
మీకు రాపనిలేదు మిన్నకపొండు
పోకమీరిప్పుడు పోతరముతోడ
వచ్చిన నీగొంగవాల్కత్తి నరుక
జోగన పోయిన చోటికే పోదు
ర"నుటయు రాహుత్తు లలవడగొనుచు
"తను విచారింపక తగువుపోవిడిచి
మాలవాడంతేసి మాటలుపలికె
గోపుపోయినత్రోవ కోరెడుగాక
కాకన్న నిట్లేల కల్లలు పలుకు"
అని గుఱ్ఱములచేరి హత్తించి యతని
తలవ్రేయ చూచిన తనచేతనున్న
హనుమంతునరిగెచే నావ్రేటణంచె

పెడదారి నొకరౌతు పెట్టిద వాడు
యముచేరబోయెను ఆశ్చర్యముగను
అంతట నేగుర నవనిపైకూల్చి
పక్కెరలొడగూడ బ్రమ్మినతోళ్లు
తెగగొట్టి గుఱ్ఱాల దేహముల్ చెండి
గండుపక్కెరలెల్ల ఖండించివైచి
సెలకట్టెవాండ్లకు చిక్కక కదిసి
పైనున్నజోళ్ళను పరియలు చేసి
బొమిడికంబులు డుల్ల బొడుచుచు వచ్చి
పండ్లు విరుగగొట్టి పడద్రోసి మరియు
నలుగుర నేగుర నజ్జుగాకొట్టి
కరములు తునకలుగా చేసివేసి
భుజములు నేలపై బ్రుంగుడుపరచి
తొడలను మెడలను తునకలుచేసి
జెబ్బలు ప్రేగులు చెక్కగాకొట్టి
పెక్కంద్రరవుతుల పెక్కుమార్గముల
వికృతరూపముచేయ వినుతధీరుండు
జోదులుకోపించి "శూలాలుగ్రుచ్చి
కన్నమనేనిని కదలింపుడ"నిన
బండుల బోయలు పగ్గాలువదలి
అదలించి బండ్లెల్ల నటు తోలునపుడు
ఆర్పులతోకూడి నధికంబులగుచు
భేరులు దారలు పృథివి కంపింప
ఉరువడి పారంగ నొక్కెడపారు
శకటసంఘంబుల సందడిచేసి
అవని పెల్లగియుచు నాకాశమెల్ల
పెంధూళి కప్పిన బెదరి కన్గొనుచు
తనమీద వచ్చిన దండితారాతి
ఘనబలోదగ్రు డగణ్య సాహసుడు

గోసంగి కన్నమ కోపించిచూచి
'జోదులపోరుకు చొరనేల' యనుచు
బండ్లు రొప్పెడివాండ్ల పార నదలించి
'గోహత్యయయ్యెడు కొరగాదు నాకు
ఎడ్లను చంపగనేమిటి' కనుచు
మునుపడ నావెంట మ్రోకులునరికి
పలుపులు తెగకొట్టి పగ్గాలుతెంచి
నొగల కొట్టియును పీనుంగుల చేసి
కడసీల లూడ్చియు కడుబ్రద్దలేసి
కండ్లు తునకలు పడగా చేసి తోసి
ఇరుసులు ఖండించి యేపగ్గలించి
కదలకుండెడు నట్లుగా చేసికొన్ని
బండ్లు కొన్నిటిపట్టి భస్మంబుచేసి
ఘూలాల బండ్లను సుడివడచేసి
ఆర్చిన బెదరుచు నంతట నెడ్లు
సందడికాకుండ చంగునదాటి
కొమ్ములు తాటించుకొనుచు క్రేళ్లురికి
తోకలు పైకెత్తుకొనుచును తొలగి
కత్తులుదాచిన ఘనత పక్కెరలు
తమ దేహములనొప్ప తలలెత్తుకొనుచు
నవరాలకొమ్ములు నరితూలియాడ
మూకల కూడుక ముదముతో నపుడు
గుట్టలు కొన్నింటి కుంటలుచేసి
కొన్నింటి మెట్టల కొమ్ములు చిమ్మి
చెదరంగ వైచెను చిదరలై పడగ ;
రవుతుల కనుగొని రణమున కూల్చి
కడిమిమై తన్నుచు కనలి కొందరిని
తొడలును పిరుదు పెందొడలును పట్టి
కాళ్ళను పాదముల్ కరములు వ్రేళ్ళు

పేగులు నరములు పెదవులు మరియు
కణతలు చెక్కిళ్ళు కర్ణనాసికలు
పెడతలు తలలును పిక్కల యెడలు
నుదురులు మొదలుగా నునుకనుబొమలు
తన్నియు పొడిచియు తరిమి త్రొక్కియును
చెవులు నిక్కింపుచు చెర్లాడివచ్చి
ఫౌజులలో చొచ్చి పంతంబుచేసి
పక్కెర లాకకొన్ని పగులంగ పొడిచి
జలనిధినుండిన జలచరావళుల
చాడ్పున నెడ్లును సమరంబు సల్పి
మట్టుచు చిమ్ముచు మలయుచునుండె ;
అంతట మదయుతమై యేపుమీరు
దంతుల ఢీకొల్ప తమలావు మెరయ
పంత మింతట నంచు బలవంతులైన
జోదులంతంతకు జోకతో మెరసి
కణిది శస్త్రమ్ములు కన్నమమీద
వ్రేయంగ నేయంగ వెసనొడ్డుకొనుచు
ఒకయేనుగుమీదకు నెక్కంగ వలసి
అదిరి అంతట నది నవనిపైపడగ
కత్తి మొలను దోపి కనలుచు కదిసి
దోర్బలశక్తితో తొండంబుపట్టి
వెనుకకు షోనొత్తి విడిచి యంతంత
ఎత్తినతొండంబు నేపుతోపట్టి
కదలించి పారుట కాదని మాని
తొండంబు చాపగా త్రొక్కిమీదెక్కి
కుంభస్థలంబును కుదురుగాబట్టి
మదమును చీరుట మగటిమియనుచు
వాని చే నున్న యావజ్రాంకుశంబు
తా పుచ్చుకొని వాని ధరణికిత్రోచి

ఒరనున్న యాబాకు నొనరసంధించి
ఊరక తోటలో నుండక పారి
వంటిల్లుచొచ్చిన వరుస నుందేళ్ళ
వండ చెండిన భంగి వంచనలేక
చిడిముడి ఖండించి చెక్కులుచెక్కి
కాళ్లుతునకలు కాగ కడువేగమొత్తి
గాత్రముల్ చెండాడి కడుపులుచీల్చి
ముక్కులు తెగకోసి ముఖములు చనిమి
నాభీతలంబులు నజ్జుగా నరికి
శిరములు నుగ్గాడి చేతులుకట్టి
కోపించి రంపాన కోసినమాడ్కి
గొడ్డంట పగలంగ కొట్టినపోల్కి
అందుపై జోదుల నరిమురిచేసి
చూచినవారికి శోకంబుభీతి
కలిగించి గోసంగికన్నమనేడు
పల్లనకట్టిన బలుపటిమోకు
లన్నియు తెగమొత్తి యంత వేగమున
ఏన్గుల పైపల్లములమీద ద్రొబ్బి
ఒక కొమ్ముపైనుండి హుంకించి యపుడు
కొండలమీదికి కుప్పించిదాట
సింహంబులాగున చేరువనున్న
ఏనుగుపైకురికి యేకాంగసీరు
డార్చిన బెగ్గిలి యందుండు జోదు
లందరు దిగజారి రా తురమంది;
జారినదెస చూచి సంగడినున్న
గజముపైకురుకంగ ఖండించుటయును
జోదులు తమ తమ శూరత లుడిగి
మానంబు దిగవెట్టి మహికి లంఘించి
పారంగ నేనుగుల్ ప్రజలునుంగలిసి

తొండాల నెనమండ్ర తొలుతను తరిమి
పదుఁ పన్నిద్దర బలువుగామట్టి
పట్టి భూతలముతో చాలరాదివిసి
కొందఱ నెగవేసి కొమ్ములనొడ్డి
జర్జరితముచేసి సత్త్వముమెరసి
వీపులుమీదుగా వెనుకకువైచి
కొందఱ పదఁద్రొక్కి కొందఱఁజంపి
కొమ్ముల పొడిచియు గుదెలనుగ్రుచ్చి
తొండాల కొని వ్రేసి తొట్రువపరచి
విచ్చియు నొదిగియు పెరచియు మొనల
చట్రాతిపోకల చందంబునొంది
పారంగ శూలాల బండ్లనుచూచి
మదములు కారంగ మడిసె నేనుగులు;
కన్నమనే డంత కడుసంతసమున
బండ్లను బండ్లతో పగలంగమొత్తి
నొగలును చిలుకల నుగ్గుగావించి
బండ్లపైనున్నట్టి బహుశరచయము
తునకలుగాచేసి తొలగంగడేసి
నుడివడ జోదుల నొరిది చెండాడి
లోహంపు తొట్లలో లొగ్గడిచేసి
ఫౌజులచేరిన పైనున్న రౌతు
లందరు తమలోన నాతురమంది
కడుపెక్కుదళములై కదసినచూచి
హయముపై రవుతుల నంటంగపట్టి
చిరుకొట్టి ధరణితో చేరంగకొట్టి
చీరి నఖంబుల చీకాకుపరచ
తరిమి కొన్నింటి యుదరములు దునిమి
కొన్నింటి నజ్జుగా కొట్టి చెండాడ
ప్రజలెల్ల కొనియాడి భ్రమసి యిట్లనిరి

"కట్టుబోతులచేత కట్టించి నేడు
తనకోడి చంపించె ధరయెల్లనెరుగ
అంతట పోనీక నవినీతిచేసి
గోపు చంపించె తా కుటిలంబుచేసి
తను చంపపుత్తెంచె తగవు పోవిడిచి
అనుచు నాగమవలన నలిగి యప్పటికి
శీలమనాయుండు శీలంబుమాని
మాచెర్ల కరుగక మగుడి కోపమున
మనవీటిలో గల మనుషులనెల్ల
చంపెద నన వీడు జయుడునుపోలె
చనుదెంచి హయముల చక్కగా మొత్తి
ఆరెజోగని చంపెనపుడు కోపమున"
ననుచును జనులెల్ల నటునిటు చూచి
"ఇదెవచ్చె బ్రహ్మనీడెక్కడచొత్తు
మెక్కడపోదు మింకెక్కడనునికి
గురజాల చొరరాదు కోటవాకిళ్ళ
తలుపులన్నియుమూసి తాళాలుపెట్టి
వాకిళ్ళనుండు నావసుధారినాగు
ఏలాగు మనలావు లిట్లయ్యె"నుచు
గండుమీనుల గని కలగి మత్స్యములు
చెల్లాడి పారిన చిత్రంబుతోప
బెబ్బులి గని లేళ్ళ భీతి పోలేక
వెలవెలనై యున్న విధముదోపంగ
తలచీర వెడలగా తలకి యాప్రజలు
సుడిపడి దిశలకు నోకుచు పార
వారిమాటలు విని వడిగ నేతెంచి
నలగామరాజుతో నాయురా లనియె :
"నగవులకై నను నాయుడు బొంక
డని కొనియాడితి వప్పుడు చాల;

ఇన్నాళ్ళనాటికి నిలయెల్ల నీకు
నిచ్చెదనని యపుడిచ్చకాలాడి
సత్యంబుతోడుత సత్యంబుచేసి
భూమి వెళ్ళగలేక పోరాడతలచి
మనదళమంతయు మడియించి వేగ
నినుపట్టి తొలగించి నీలవర్ణుండు
గురజాల తానయి కొని యేలుననుచు
ప్రజలాడుచుండెడు పలువార్తవింటి;
ఆడుచు తమలోన నలజడిపొంది
కలగబడుచున్నారు కామభూపాల!
కోటలో పడుటయే గుణమగుగాని
ఇచ్చట నీవుంట నికనీతికాదు
కదిసెనేనియు కార్యఖడ్గముల్ తప్ప
ముందట విచ్చేయు మొగసాలకడకు
మనదళమంతయు మట్టంపుమొనలు
చేయించి ప్రజలెల్ల బెదరిపోకుండ
పదిలమై వచ్చెద; బ్రహ్మనాయకుడు
అల్లైన మనతోడ ననిచేయలేక
తిరిగిపోయిన మరి తెలియంగచెప్పి
భూమి వెళ్ళింతము పొందైనభంగి"
అనిన నా నలగాము దటులగా తెలసి
చేరదేశపు మంచిసింహపు కొదమ
అను నొక సామ్రాణి యల్లన నెక్కె;
ఈరీతినుండంగ నిచ్చటివారు
బ్రహ్మనాయుని కని పరువిడుచున్న
గుబ్బున చెదరిన గురజాలప్రజలు
ఏనుగు లేడును నిట్టట్టుపోక
త్రొక్కగా దళమెల్ల తొట్రుపడంగ
బొమిడికములు జోళ్ళు బొందడములును

అత్తెము లీశెలు నత్తడమ్ములను
అమ్మలపొదులును నలరెడువింట్లు
బిరుసులు పతగలు బిరుసుగొడుగులు
ఆదిగాగల వెల్ల నక్కడక్కడనె
కుప్పలుగా వైచి కోటలోపలికి
చొచ్చినవారిని చూచియు భ్రమసి
వెళ్ళి పట్టణమంత విచ్చి యాకోట
లోని కేగెదమంచు లోగిళ్ల విడిచి
దిటతప్పి కానక తిరిగెడువారు
ఇండ్లలోపలి సొమ్ము లెడలించితెచ్చి
పదిలంబుకాదని భావింపలేక
పెంటబూడిదలోన పెట్టెడువారు
తమవార లని భీతి తలపంగలేక
ఒకతెరవువారల నింటికిపిలిచి
'కోటలోనికిపోయి గురుతుగాదాచు
మ'ని వారిచేతికి నాయింతులిచ్చి
ఒకకొంతసేపున కొయ్యనతెలిసి
తమవారు గాకున్న తల్లడమంది
దారి కానకపోయి తనరెడువారు
'కంతలనన్నింట కడుసందడయ్యె
గలభకారులు కలరు గాసిచేయుదురు
కోటలోనికి సొమ్ము కొనిపోవరాదు
బ్రహ్మనాయునివార్త బరవశమయ్యె
నేమిచేయుద' మంచు నెంతయు తలకి
పెట్టినతావున పెకలించి ధనము
బలువుగా మూటలు బంధించికట్టి
నూతులలోపల నూకెడువారు
'బ్రహ్మనాయుడు వచ్చి పట్టె తన్నెడిని'
అనుచును కాలాడ కటెనిల్చువారు

తత్తరమును బొంది తారుమారాడ
పాతినసొమ్ములు పాటింపలేక
తప్పత్రవ్విన నెడ ధనములేకున్న
'ఇచ్చటిధనమెల్ల నెవ్వరో మరగి
కొనిపోయిర'నుచును కుందుచు నాది
తెలియక లోగిళ్ళ తిరుగాడువారు
"సొమ్ములు కానక సుడివడనేల
బ్రహ్మనాయుడు గన్న పట్టిచంపెడిని
ప్రాణంబుకలిగిన బలుసుటాకైన
తిని బ్రతుకగవచ్చు తెలియుడీపలుకు"
అనుచు బిడ్డలును తా మరిగెడువారు
"బ్రహ్మనాయు డెదురుపడువారి గాని
చంప డెవ్వరినైన సత్యమీమాట
వెరవనేమిటి కిండ్లువెడలంగ నేల
ఇటుచూడు డీ వార్తలిన్నియు కల్ల
లయ్యెడునని వార లలజడిపడక
ఊరక నిండ్లలో నుండెడువారు
"నిజముగా కోపించి నీలవర్ణుండు
ఈ పురిమీదికి నేతెంచెనేని
కోటలగొంగని గోమేల నిలుచు
గురజాలనుండుట కూడునే" యనుచు
పల్లెలకై తెగపారెడువారు
హయముల చయ్యన నట్టలువిడిచి
కుక్కలం కట్టిన గొలుసులువిడిచి
ఇండ్లలోపలి సరుకులెల్ల వెళ్ళించి
ఆడువారలనెల్ల నతివేగనంపి
"ఇండ్లు వదలిపోవుటెట్లకో మనము
ఓదైవమా!" యని యుండెడివారు
ఇబ్బంగి పట్టణం బింతయు వచ్చి

గవనులపైనెక్కి కడ కానరాక
నలగామరాజును నాగమ్మ యపుడు
కొంతబలంబుతో గురజాల చొరగ
"రాజు ముందరపోయె రండురండింక"
అనుచు తామందరు నతిరయంబునను
పొంగు నేరులభంగి పొరలుచు రాగ
ఫౌజులు శూలాలబండ్లు గుఱ్ఱములు
గవనులకూడి వెక్కసమైన కోట
లోనికి పోరాక లోగుచుప్రజలు
చింతించి యొండొంట చేయంగలేక
"ఎవ్వరైనను వచ్చి యేమైనచేసి
పోనిమ్మ"టంచును పొగులుచు మదిని
తలలు చిందరచేయ దైవంబుదూరు
భావంబు చూపట్ట పల్కెడువారు
"సందడి లోనికి చనవల దను"చు
అదలించి యదలించి యలసటపడుచు
ఆయాసమునకోడి యటుచూచువారు
సత్త్వము కలుగంగ సందడిచొచ్చి
పడుపాట్లు పడనేల బ్రహ్మనాయకుడు
వచ్చినా డతడు మన వంకకురాడు
దాటిపోదము రండు తడయనేల"నుచు
కోట చేరగలేక కూలెడువారు
తమలోన నాగరుపుల్ దట్టంబుకాగ
కాలూనలేకయు కలవరపడుచు
పట్టంగనోస యే పట్టునలేక
అగడతలో పడి యడలెడువారు
"చింతింపగానేల శీలమబ్రహ్మ
పేరులమీదనే బిడ్డలపేళ్ళు
పెట్టినవారము పెక్కేండ్లనుండి

పసుపడియుండగా బ్రహ్మనాయకుడు
మనలను చూచిన మన్నించుగాని
గాసి సెయ్యండ"ని కదలనివారు
ఈరీతి నాపద లిట్లుండగాను
కోటలోపలివారు గుజగుజయనుచు
తలపోసి రిట్లని దైన్యభావమున
"వెడలరా దీకోట వెలుపల నదిగొ
పొదలుచు వాకిళ్ళ బోనుల నొగ్గి
దాడియున్నది చూడ తల్లడపడక
వాకిళ్ళదరి జొచ్చి వనజసంభవున
కైనను చొరగ రా దతిసాహసమున
కొమ్మల మోకులు కుదురుగాకట్టి
జారంగవచ్చు విచారించిచూడ
ఈపసిబాలుర నీయాడువారి
నిట డించి పోవంగ నెట్లు కాళ్ళాడు
మరి యుపాయములేదు మనకు చూడగను
జమునిల్లు జొచ్చిన జంతులగతిని
బ్రహ్మనాయుని చేత పడగలమయ్యొ !
ఆడుతీర్పరిచేత నాపద రాక
మానునే ప్రజలకు మాటలింకేల
కోడిపో రిట్లేల కోరిపెట్టించె
తన బలములచేత ధర్మమార్గంబు
మీరి యాగోపు నేమిటికి చంపించె
ఎందుకు మదినెంచ కీల నాయురాలు
దొమ్మిగా చేయించి దురములో బ్రహ్మ
చంపనెంచెను నీతిచాణుక్యుడైన
నాయుడు కోపించి నలగాముమీద
మానునే రాకుండ మగవాడుకాడె
ఎందాక సహియించు, నీ నాయురాలు

కల్లలు తానాడి గదియుట తగునె
తగునుపో; తన కీర్తి తడవుగా నిల్వ
వచ్చునా యిచ్చట వలదనువారు
బ్రహ్మనాయుండును బలములతోను
గురజాలనగరును కొట్టకమున్నె
బ్రహ్మనాయుం డను పాథోధిలోన
గురజాల యను పుట్టి క్రుంగకమున్నె
బ్రహ్మనాయకుడను పటువజ్రహతిని
గురజాల యను కొండ కూలకమున్నె
అరయుడు ప్రజలార అనువగుచోటు
అణగుడు పొండ"ని యాడకాడకును
ఒఱియుచు నొండొరు లొదిగెడువారు
"ఈబారి గడిపిన నింటింట నొక్క
వేటను బలియిచ్చి వీటిలోపలను
వాసంతమాడించి వరుస జాతరయు
ఒప్పుగా చేయింతు ముపహారములను
గురజాలగంగకు కోరికెలలర
మోదంబుతోన"ని మ్రొక్కెడువారు
"శీలమనాయుని చేత తప్పినను
చెలువార చేతుము చిత్తంబులలర
వీధి పోతురాజ ! వినుమయ్య నీకు
గావులు పెట్టించి కలవారమెల్ల
గైకొని కొలుతుము కడుభక్తి"ననుచు
మోదమ్ము తోడుత మ్రొక్కెడువారు
దిగ్దైవతములార ! ధీరతతోడ
బ్రహ్మనాయుని బారి పడకుండునట్లు
చేసితిరేనియు శీఘ్రంబె మీకు
ప్రియముగా రంగంబు పెట్టింతు మిప్పు
డ"ని పెక్కుమాటల నాడెడువారు

బ్రహ్మనాయుం డిట రాక మాచర్ల
పోయెనేనియు పాలపొంగలి పెట్టి
బ్రహ్మేశ్వరస్వామి ! పాటించి యెల్లి
నెరవుగా నావుల నేతులతోడ
వెలయు నఖండముల్ వేవేల నెత్తి
పదిపుట్ల బియ్యమ్ము బాగ వండించి
కోరికతో నీకు కుంభమ్ము పోసి
పొందుగా వారికి భోజనాల్ పెట్టి
అనువుగా నర్పణ లటు చేతుమయ్యా
ఆపద మాన్పవే" యని మ్రొక్కువారు
"కలయర్థమెల్ల నాగమతోడ మున్నె
జోస్యుల భీమన్న శోధించిచెప్పె
చెప్పిన మాటలు చెవి పెట్టమైతి
మతని మాటలు తప్పవ"నియెడివారు
"పదినాళ్ళముందట పసిడిపులుంగు
శకునంబు చెప్పె నా శకునాల కాము
'మనయూరి మనుజులు మరిచెడి కొంత
మదమెక్కి కలహమై మడియంగ గలరు
పట్టంబు బెదరెడి ప్రజలు పోవుటకు
తెరువుండదనె యది తెల్లంబులయ్యె
అతని పల్కెక్కువ' యనియెడువారు
ఉన్నచోటు విడిచి యూరెల్ల కాకు
లరచుచు తిరుగాడె నదియునుకాక
నెత్తురు గుడికట్టి నెరయుచున్నట్లు
ప్రతిసూర్యు డట తోచె ప్రజలెల్లనెరుగ
అయిదారు దివసమ్ము లట్లుగా జరిగె
ఈ శకునములెల్ల నీకోడిపోరు
కై కానవచ్చె పొమ్మ"ని యాడువారు
ఈరీతి నాడగా నింతలో కోట

వెలుపలి జనమెల్ల వెగడును పెంచి
బెదరంతకంతకు పెదవులెండింప
సందడిపడి కోట చయ్యన చొచ్చె
నాయురా లప్పుడు నాల్గుగవనుం
తలుపులు బిగియించి తాళాలువేసి
పేరొక్కని యందర పిలిచి యిట్లనియె:
"బ్రహ్మన్న వచ్చినా బ్రహ్మవచ్చినను
తత్తరపడకుడీ తమ్ములు ! మీరు
భయము లేద"నుచును భద్రంబుచెప్ప
నిక్కంబు తమ తమ నెలవుల నిలిచి
చొక్కచివ్వల నేర్పు చూపెడువారు
అరిగెలు దాటించి అదలించువారు
"పారకో నాయుడ ! పదపద బ్రహ్మి !
అరయంగ నీకోట అలవియే నీకు
రానేల శీలమ బ్రహ్మినాయకుడ
వచ్చిన చత్తువు వలనొప్ప నీవు
అలవిగా దీ కోట అమరులకైన
ఈ కోటలో మేముండు టెరుగవా నీవు
మా పాలెముకు రాక మగుడుమ"నువారు
"వచ్చి గెలువలేడు వాహినిచేత
మాచేతి వడిచూచి మరలునుగాని
అడ్డుపెట్టగ నేల" ననియెడువారు
కాచిన అంబళ్ళకడవలం బొదివి
కొనిపోయి యా కోట కొమ్మలసందు
పెట్టి బల్ మాటలు ప్రేలెడి వారు
"మా కోట డాయంగ మగుడి పోలేడు
ఏవంక మెలసిన నిలయెల్ల మెచ్చ
వ్రేలుచూపిన తెగవేతు"మనువారు

మరియును పెక్కేంద్రు మన్నీలవారు
కాసియుండిరి కోట కామునిబలము.

*నేలకొరిగిన గోపన్నను జూచి బ్రహ్మన వగచుట : గోపన్న తులసితీర్థము సేవించి బ్రహ్మరంధ్రమున ప్రాణములు విడుచుట : బ్రహ్మన అతని శవమును మాచెర్లకు కొంపోయి అగ్నిసంస్కారము చేయించుట.*

అచ్చట కన్నమ అరుగుదెంచియును
గోపు పరాక్రమగుణములు మరియు
అతడు నేలను పడుటావిధమంత
బ్రహ్మన్న కెరిగించి పల్కె నిట్లనుచు :
" నాయకురాలును నలగామరాజు
కపటవిద్యలనెల్ల ఘటియించుటయును
సొలియుచు వారల స్రుక్కంగనాడి
స్వామికార్యంబుకై జగడంబులైన
తలగక నిల్చుట ధర్మమే' యనుచు
' చెన్నకేశవుమూర్తి శీలమబ్రహ్మ
కోపించ మీరెంత కోటననెంత
పంతమ్ము కుంతంబు పట్టి కోపింప
తిరిగెనేనియు భూమి తిరుగుడుపడును'
అనుచు కొంతముపట్టి యా వీరగోపు
చేసెను నే డాజి చిత్రమయ్యెడిని "
అన విని నాయుండు ఆగోపు దలచి
తన మదిలో కొంతతడవు చింతించి
అతడు పడియున్న యచ్చోటుచేరి
చూచి చూడగలేక స్రుక్కి యిట్లనియె :
" ఏమందు గోపన్న యేమందు నిన్ను
ఏమందు పతులతో నేమందు నేను

ఈయెడ దారమ్మ కేమందు నింక
అయ్యెడ పడవాలు కేమందు నేను
నీవంటి శూరుని నీవంటి హితుని
ఎవ్వని నే నెరుగ నింతకాలమున;
వీరవిక్రమ ! నిన్ను విత్తులు దాచు
చందమున నిన్నటు చనుదేంనీక
'మగుడి పొమ్మ'నగను మలయుచు వచ్చి
విధి నిన్ను ప్రేరేప వినవైతి వకట !
గుఁజాలముందటు కోడిమేడంబు
వ్రాసిన నేలగా వచ్చితి నేడు
దురదుర వచ్చుచు దురములో కూలి
పొలసితే దేహంబు పొలుపు నశింప
కూలితే పగరచే కొండవిధమున
ఇలలోన నీ వటులింపుతోడుతను
చెదరకయుండిన జముని కంటికిని
భ్రాంతియై నినుచేరఁ రప్పించుకొనెను"
అనుచు చింతిల్లగా నా గోపు పల్కె :
"నిన్ను నా మనసులో నిజముగా నిలిపి
మొగతనము బాయక మొనలు చూచుచును
అంత కంతకు బలము లరయుచురాగ
పారక చెదరక బవరంబులోన
ఎదిరించి నిలచితి ఓనకులేశ్వరుడ !
నీతోడ మాట్లాడి నిను చూచుదాక
ప్రాణాలతో నుంటి వదలంగలేక
ఇంక సహింపరా దేటికి తడవు
నాటిన బాణముల్ నాయుడ పెరికి
పుణ్యలోకమునకు పుచ్చుము నన్ను
మాతల్లి దారమ్మ మహిత విక్రమకు
'వగవకు'మని చెప్పవలయు జుమ్మ'నిన

నాయుడు దుఃఖించి నానావిధముల
గోపుకు నాటిన క్రూరబాణములు
మెలపున పెరికి యా మేనిపై నొరగి
విలపించి కన్నీటి వెల్లువ ముంచి
తులసితీర్థము భక్తితో మూడుమార్లు
కుత్తుక దిగబోయ 'గోవింద' యనుచు
నారాయణాంకిత నామంబు తలచి
బలుపుగా నప్పుడు పరమయోగమున
బ్రహ్మరంధ్రంబున ప్రాణముల్ విడిచి
దేవకాంతలు కొల్వ దేవేంద్రుపురికి
గోపన వేంచేసె కోరికలలర
నాయు డాతని లావునకు చోద్యమంది
గోపు పరాక్రమ గుణములు వినుచు
కోడిని గోపును కూర్మితో పైడి
యందల మందున నతిభక్తి నుంచి:
మహదేవి చర్లకుమగుడి యేతెంచి
కన్నమదెస చూచి "కడు వేగ నరిగి
యీ వార్త రాజుల కెరిగింపు"మనిన
కొలువయి కూర్చున్న కువలయేశ్వరున
కడకేగి మ్రొక్కుచు కనలుచు నిలువ
కన్నమ్మ యింగితాకారవేషంబు
లన్నియు కనుగొని యదిపుడిట్లనియె:
"ఏమిరా కన్నమ ! యెరిగింపునాకు
తగు మాటలేమియు తరుచుగాలేవు
మీరు ఓడరుకదా, మీకు బోట్లాడ
కాదుకదా, నేడు కదనరంగమున
వరుస నందరు చావరుకదా బ్రహ్మ
నాయుని కెంతయో నమ్మినబంటు
గోపు చావడు కదా కోడి కయ్యమున"

అనుటయు నామాటలన్నియు వినుచు
తలవంచి కన్నమ దైన్యభావమున
"అనుగుభూపతిపుత్ర ! యఖిలైకమిత్ర !
పెదమల్లభూపాల ! ప్రేమతో నిపుడు
వినవయ్య నామాట విశదంబుగాను
బ్రహ్మనాయుడు తొలుత పందెంబు గెలువ
ఆర్వెల్లి నాగమ్మ అతి నేర్పుతోడ
మరు పందెమును పెట్టి మాయలుపన్ని
కపటంపు విద్యలు ఘనముగా నేర్చు
కట్టుబోతులచేత కట్టించి పుంజు
గరడిలో చంపించి క్రమ్మర మరియు
కల్లలు చేయంగ కణగి గోపన్న
ఎండిన నడవుల నేపారు కాల్చు
నగ్గి దేవరపోల్కి నరసి మూకలను
భస్మంబు కావించి పదపడి నీకు
నిచ్చెను ప్రాణంబు నిండిన భక్తి"
అనుటయు మల్లిదేవాఖిలేశ్వరుడు
తమలంబు నమియుచు తలను వంకించె;
చిత్రరూపులభంగి చేష్టలు తక్కి
అచట నాయకులెల్ల నడలుచునుండ
ఆవార్త పురిలోన నందంద ప్రాకె.
అప్పల చెల్లెండ్ర అత్తకోడండ్ర
మరదళ్ల వదినెల మామల సఖుల
అన్నల తమ్ముల నాప్తుల బంట్ల
ఏడ్పులు మిన్నందె నేమి చెప్పెడిది !
దారమ్మ కావార్త తలవని పిడుగు
పాటుగా మూర్ఛిల్లి వసుధపై వ్రాలె;
మూర్ఛిల్లి కనుదోయి మోడ్చియుండంగ
అచ్చటివారెల్ల నాదరమ్ముగను

శైత్యోపచారముల్ చేయంగనంత
“కులమున నెంతయో గుణములకుప్ప
నా ముద్దుపాపని నను చేర దేరె
చూపరో నాకిటు చూపరో వేడ్క
వలయ తా నెట్లున్న వాడకో గోపు
ఎక్కడ నున్న వాడెరిగింతురేని
ఒయ్యన బోయెద నోయక్క”యనగ
విమలచారిత్ర యా విజ్జలదేవి
వంకిదేవియు నెదుటి వనితలందరును
శీలంబు కలిగిన శీలసానియును
కారుణ్యవతి గండు కామసానియును
ఉపలాలనముచేసి యుచితంబులాడి
దారమన్ తోడ్కొని తడయక కదలి
గోపున్నచోటుకు కొంపోయి రపుడు;
అందరు గోపుకు నన్నిచందముల
వగవగా దారమ వదనంబు నురము
తెగవ్రేసుకొనుచును ధీంతలేక
చేతులు భూమిపై చేరంగ నూది
కూర్చుండి దుఃఖంబు గుదిగొనుచుండ
“గోపు ! నాతో పల్కకూడదా నీవు
పలుకరా యొకమారు పలుకరాయన్న
ననుతేరి చూడరా నాముద్దు కుఱ్ఱ
కోడిపుంజులపోరు గోపన నీకు
కావచ్చె నాయన్న కటకట”యనగ
పట్టణమ్మున గల పలువురు జనులు
పెద్దవారును చేరి పెక్కుచందముల
దైన్యంబు తొలగగా ధైర్యంబు చెప్పి
అంతట గోపుకు నగ్నిసంస్కార
ములు చేసిరందరు పొగడుచుండంగ,

# అరణ్యవాసము

## కథాసంగ్రహము

గోపన్న కగ్నిసంస్కారము చేయించి, ఆ మరునాడు బ్రహ్మన, మలిదేవుని కొలువున కేతెంచి పందెమున నోడి పోయినందులకు వగచుచుండిన నాయకుల నూరడించి, వారిని శాంతపరిచి మాచెర్లరాజ్యమును వీడి వలసపోవుటకు ముదల యిమ్మని మలిదేవుని కోరెను. మలిదేవుడు అందుల కియ్యకొని వలసకు ఆయత్తపడెను. అంతట బ్రహ్మన చెన్నకేశవుని సందర్శించి యాతని ప్రార్థించి దేవునిభూషణములనెల్ల నొక కంట్లపుగోడ్డపై నెత్తించి, మలిదేవాదులతో, అంతఃపుర స్త్రీలతో, వీరనాయకులతో మాచెర్లనుండి కదలెను.

మలిదేవాదులు మాచెర్ల విడిచి వలసపోవుచుండుట సహింపలేక మాచెర్లప్రజలు దుఃఖితాత్ములై తాముకూడ, వారివెంట వచ్చెదమని బయలుదేరిరి. కాని బ్రహ్మన అందుల కంగీకరింపక, తాము ఏడేండ్లు గడువుచెల్లించి మాచెర్లకు తిరిగి వచ్చెదమనియు, నంతదనుక ఎట్లో ఆపదలకోర్చి ఉండు

డనియు చెప్పి వారిని సమ్మతింపజేసెను. బ్రహ్మన పురమును విడిచి వలసలు నడిపించుకొనుచు కృష్ణను చేరెను. అంత ప్రొద్దుగూకెను; బ్రహ్మనాగు లట నొక తోటలో విడిసిరి.

మలిదేవునిబంట్లు ఆ తోటలో ఆలమందలను మేతకై విడిచిపుచ్చిరి. అంతట నొక పెద్దపులి కంట్లపుకోడెపై పడెను. అది చూచి లంకన్న విల్లునుపూని దానిని వేయబూనగా, ఆపెద్దపులి మనుష్యభాషణముతో తన కతని చేతిలో చావు లేదనియు, బ్రహ్మన్నను తీసికొని రమ్మనియు చెప్పి వెనుకకు పంపించెను. లంకన్న యావృత్తాంతమును బ్రహ్మన్న కెరింగించెను; బ్రహ్మన అటకేతెంచి, పెద్దపులిని ఖడ్గముతో వ్రేసెను; వ్రేటుతిన్న పెద్దపులి తన రూపమును వీడి ఆకాశపథమున గంధర్వరూపమున నిలిచి తన పూర్వజన్మవృత్తాంతమును బ్రహ్మన కెరిగించి గంధర్వలోకమునకు పోయెను.

పిమ్మట బ్రహ్మన కంట్లపుకోడెను పెద్దపులి చంపగా చూచిన పాపకర్ముడని లంకన్నను నిందించి, యతని భీరుత్వమునకు కినిసి, మగతనము వీడి మందలో నుండుమని అతని నాజ్ఞాపించెను. బ్రహ్మన యాజ్ఞను కైకొని లంకన్న నాటి నుండి పురుషభావము వీడి, ఆడకట్టును కట్టి యాడకొప్పును బెట్టి యాలమందను కాయుచుండెను.

ఆ మరునాడు బ్రహ్మన తనవారితో, అటనుండి కదిలి కృష్ణానదిని దాటుట కుద్యమించెను; నదీగర్భమున ఒక కారు మొసలి కలదనియు, అది మున్ను పెక్కండ్రను కబళించెననియు మలిదేవు డాతనిని హెచ్చరించెను. కాని ఆ వింత

ఏమియో చూచెదనని బ్రహ్మాన, పడవలో కూర్చుండి నదిని దాటుటకు ప్రయత్నించెను. బ్రహ్మాన నదిని ప్రవేశించినంతనే, ఆ కారుమొసలి ఆతనిని పట్టుకొనగా అతడు దాని నొక దెబ్బ వేసెను ; అది నీట మునిగెను ; బ్రహ్మాన నదిలో దూకి దానిని వెంబడించి ఖడ్గముతో ఖండించెను. అంతట మొసలి తన రూపమును వీడి, ఒక గంధర్వస్త్రీగా మారి తన పూర్వజన్మ కథను అతనికి వినిపించెను. ఆకథ యిది : మయనిర్మితమైన మధురాపురమున నొక గంధర్వనాయకు డుండెడివాడు. అతని పేరు సుందుడు ; అతని భార్య సుంద. సుందాసుందులు కామాంధకారముచే కన్నుమిన్ను కానక, యింద్రియ చప లమున వివశులై ప్రవర్తించుచుండిరి. ఒకనాడు దుర్వాస స్సంయమీశ్వరుడు మధురాపురమున కరుగగా, కామలోలు రైన వారు, ఆయనను ఆదరింపరైరి. అందులకా సంయమీశ్వ రుడు కోపించి, సుందాసుందులను భూలోకమున వ్యాఘ్ర మకరములై పుట్టుడని శపించెను. శాపదగ్ధులగు ఆ గంధర్వ దంప తులు, తమ శాపవిమోచనమునకు తగు తరణోపాయమును సెలవిండని దుర్వాసుని ప్రార్థించిరి. వారి ప్రార్థన మన్నించి దుర్వాసుడు, 'కలియుగమున ఆదివిష్ణువు బ్రహ్మానగా అవతార మెత్తుననియు, అతనిచే వారికి శాపవిముక్తి కలుగు' ననియు శాపాంతమును దెల్పెను. ఇట్లు దుర్వాసుని శాపవశమున వ్యాఘ్రరూపమెత్తిన సుందుడును మకరియై పుట్టిన సుంద యును బ్రహ్మానచే నిహతులై తొల్లిటి తమ రూపములను దాల్చిరి.

ఈ కథనంతయు సుంద, బ్రహ్మాన కెరిగించి తన గంధర్వ లోకమునకు తానరిగెను. బ్రహ్మాన ఆనందపరవశమున సుందాసుందుల వృత్తాంతమంతయు విని, నదీతీరమునకు విచ్చేసి ఆ మరునాడు మలిదేవాదులను పడవలపై నదిని దాటించి, మండాది చేరుకొనెను. అట వారు స్థిరనివాస మేర్పరుచుకొనిరి. కాలచక్రము గిఱ్ఱున తిరుగసాగెను; మూడేండ్లు ఇట్టే గడచి పోయెను.

*బ్రహ్మన్న తన ఓటమి నెరిగించి మలిదేవాదులతో మాచెర్లవీడి వలసకు బయలుదేరుట: మాచెర్ల ప్రజలు తాము బ్రహ్మనతో వచ్చెదమనుట: వారి నాతడు సమ్మతింపజేసి పురముననే నిల్పుట.*

మరునాడు కొలువుకు మలిదేవువెంట
కొంకక బ్రహ్మన్న గొబ్బునవచ్చి
చనవుగ కోపితుల సమ్మతిపరచి
వగచుచుండెడివారి వగపెల్లతీర్చి
"ఓడితి పందెంబు నోరాజులార
ఓడిన భూమిలో నుండుటకాదు
నలగామరాజును నాయకురాలు
పదిలుడౌ భట్టును పంపకమున్నె
మాచర్లవిడిచియు మనము పోవలయు"
అనవిని వీరనాయకు లందరపుడు
"మన పురాకృతమింక మనకుపోరాదు
కాక యెవ్వరికైన గడుపంగ వశమె?
ఇటనుండుదు మనుట కిక నేమి తగవు!"
అనవుడు విని బ్రహ్మ యా మలిదేవు
జనపాలకునకును చయ్యనపల్కె:
"అనుగుభూపతిపుత్ర! యభినుతగాత్ర!
మునుకొని వలసకు ముదల యిమ్మనఘ!"
ఆమాటవిని రాజు లనిరొక్కమాట;
"ఓ మహాత్మక! సర్వ మూహింపనీవె!
అరయగా నీకన్న అధికులున్నారె!
నీపత్ని మాతల్లి! నీవు మాతండ్రి
వే యన్యదైవంబు నెరుగ మెన్నడును

వేదంబులును నీవె ! వేద్యుడవీవె !
ఆదిపరబ్రహ్మమైనను నీవె !
నీవె దేవుండవు ! నీవె చెన్నుడవు !
ఘనముగా వనముల కడుసంభ్రమమున
మించి నీకృపచేత మెలగెదమయ్య !"
అన విని నాయుండు అతి సంభ్రమమున
"అవుగాక" యనుచును అతివేగముగను
చనుదెంచి చెన్నునికి సాష్టాంగ మెరిగి
ముకుళితహస్తుడై ముందు తానిలిచి
"అకట ! పలసలవెంట నరుగుదు"మనిన
చెన్నుడూరకయుండె; చిత్తంబులోన
మిన్నక తలపోసి మించి బ్రహ్మన్న
పొదివి యాచెన్నుని భూషలనెల్ల
కొదలేక కంట్లపుకోడెపై నెత్తి
నిండిన మాచర్ల నిజపురి కదలె.
అపుడచ్చటి ప్రజలందరు వచ్చి
"ఒప్పుగా వినవయ్య ! యోదేవదేవ !
నమ్మితి మక్కట నాయుండ నిన్ను
నమ్మిన మమ్మును నట్టేటముంచి
బాగొప్ప మామీద భ్రమలు పోవిడిచి
ఏగుచున్నాడవు ఏగతి మాకు ?
నీవె దిక్కని యిందు నిలిచియుండంగ
వేవేగ మమ్మును విధికప్పగించి
పోదగునే ? మమ్ము పొమ్మనబోకు !
నీవెంట వత్తుము నిలవలే మిచట
కాదన్న చత్తుము గ్రక్కున నిపుడె"
అనిన నాయుడుపల్కె నందరచూచి
"ఎనసి మీరే దేండ్లు నేరీతినైన
అందరు నొకటిగా ఆపదలకోర్చి

యుండిన దైవంబు ఒకదరిచేర్చు
నామాట వినకున్న న్యాయంబుగాదు
ఏమగుడునందాక నిందుండుడయ్య
పూనివచ్చెద మనుట పొందుగాద"నుచు
ఆనపెట్టెను బ్రహ్మ యయ్యలమీద
ఆయానవిని ప్రజలట్టె సమ్మతించి
మగిడిపోయిరి వారి మాచర్లపురికి.

*బ్రహ్మన కృష్ణను దాటి తనవారితో నొకతోటలో విడియగా నొక పెద్దపులి కంట్లపెద్దును చంపుట : మందను కాపెడి లంకన్న పెద్దపులిని బాణముతో వేయబూనగా అది తనకు లంకన్న చేతిలో చావులేదని చెప్పి బ్రహ్మనను తీసికొనిరమ్మనుట : బ్రహ్మన దానిని వ్రేయగా అది శాపవిముక్తిని బడసి ఒక గంధర్వుడుగా మారుట : లంకన్న ధీరుత్వమునకు కినిసి బ్రహ్మన అతనిని మగతనమువీడి మందలో నుండుమని కట్టడిచేయుట.*

నాయుడా వలసలు నడిపించుకొనుచు
పోయి కృష్ణనుచేరి ప్రొద్దుగ్రుంకగను
తడయక యెల్లిపోదమని పెందోట
విడిసి నాడుండిరి వీరు లచ్చోట;
మందల నావులు మలసిమేయంగ
ముందర విడిచిరి ముదమొప్పగాను
కందువధేనువుల్ కసవుమేయంగ
పెందోట లోపల బెబ్బులి యొకటి
గొదకొని కంట్లపుకోడె పట్టంగ
అది చూచి లంకన్న అత్యుగ్రుడగుచు
విలుగొని పరితెంచి వేయబూనంగ
పొలుపారగా పెద్దపులి యిట్టులనియె :

"నిలునిలు ! లంకన్న ! నీచేతిమీద
కలగక నేచావ కట్టడిలేదు
నీయన్న నాయుని నిటకు కొనిరమ్ము
ఆయనతో మాటలాడంగవలసె
పొమ్మ"న్న లంకన్నపోయి బ్రహ్మనకు
నెమ్మది వినిపింప నీలవర్ణుండు
చనుదెంచి బెబ్బులిన్ చయ్యనవ్రేయ
వినువీధి కెగసి తన వృత్తాంత మెల్ల
వినిపించి నాయుని వినుతులుచేసి
తనపురి కేగె గంధర్వరూపమున.
అంత నాయెడ బ్రహ్మ యా లంకపోతు
నెంతయు కనుగొని యిట్లని పలికె :
"పులి యట్లు ధేనువున్ పూనిచంపంగ
పొల్పడ చూచిన పాపకర్ముడవు
కోరి శీలము యింటి కూరాకు నీరు
వారక త్రాగిన వారలకెల్ల
కలుగు శూరత్వంబు కడపట నీవు
పొలుపొంద పందవై పోతివి కాన
మొరబెట్టుకొను చీవు ముదిత చందమున
అరయ నాయింటికి నపకీర్తి తెస్తి
ఇక నీకు మగతనం బెందునలేదు
ఒకరీతి మందలో నుండుట మేలు !"
అన విని లంకపో తది సమ్మతించి
తనదు నేరమి కొంత తడవు చింతించి
వలనుగా పురుషభావము మాని మిగుల
పలుమారు నాడురూపము తాల్చి చాలి
ఆవు తల్లియు తనకు నాబోతు తండ్రి
కావించి మందలో కదలకయుండ

అంత శీలమనాయు డచ్చోటుబాసి
సంతసంబున వలస చయ్యనచొచ్చె.

*బ్రహ్మన కృష్ణను దాటుచుండగా అతని నౌక మొసలి మ్రింగ చూచుట : మొసలి శాపవిమోచనము : పెద్దపులి మొసలుల పూర్వ వృత్తాంతము : బ్రహ్మన మలిదేవాదులతో కృష్ణను దాటి మండాదికి వలసపోయి అచ్చట మూడేండ్లు గడుపుట.*

మరునాడు బ్రహ్మన్న మలిదేవు చూచి
"పరగంగ వలసలు పడవలమీద
నురువడి నడిపించుమోరాజ !" యనిన
ధరణీశు డతనితో తద్దయుపలికె :
"నాయుడ ! నట్టేటి నడుమను మకరి
పాయక పెక్కండ్ర భక్షించె మున్ను ;
ఆ కథ వినియుందు వది యేమి అగునొ
నీకె తెలియును సుమ్ము నీరజనాభ !"
అన విని నాయుండు "అది యెంత నాకు
కనుగొనియెదు గాని కదలి విచ్చేయు
మ"నుచు సకలంబును నచట దాటింప
పుట్టిలలోనుంచి పోవంగ బుద్ధి
పుట్టినంతనె మకరి భూపాలకులను
పట్టనుంకించిన బ్రహ్మనాయకుడు
ధట్టించి మకరిని డాచేతకొట్టె ;
అది మునిగిపోయిన నావెంట వేగ
పదిలుడై మునిగెను పద్మనాయకుడు ;
అప్పుడు నాయకు లదిచూచి "యకట !
తప్పదు నాయుండు తగనస్తమించె"
అని దుఃఖితాత్ములై యయ్యలచ్చోట
అనువొంద బహురోదనంబులు చేయ

విని శీలసానెమ్మ వేగంబె వచ్చి
మనసిజ జనకుని మర్మమెంతయును
తెలిసియున్నది కాన తేటతెల్లముగ
పలికె నప్పుడు వీరప్రముఖులు వినగ :
"మీకేల శోకింప మీకేల చింత
నా కుమారుం డాదినారాయణుండు
మక్కువ నుండుడు మరణంబు లేదు
ఇక్కడి తలపోత లివె నిక్కమైన
పుడమిలో తూర్పుగా పోయెడి కృష్ణ
పడమరముఖముగా పరగంగవలయు
కలసి రవి చంద్రులు గతి తప్పవలయు
ఇలమీద తారక లిక రాలవలయు
ఎన్నాళ్ళు నుండిన నిం దేమిశంక
వన్నెమీరగ బ్రహ్మ వచ్చుచున్నాడు
ఈమాట సత్యంబు ఇది తథ్యమయ్య
నామాట నమ్ముడీ నాయకులార !
అన విని నిశ్చయం బని సమ్మతించి
వినయసంపన్నులై పౌరులందరును
మదనజనకుని రాక మాటిమాటికిని
ఎదురుచూచుచునుండి రెల్లవారలును.
అంత శీలమబ్రహ్మ నా కారుమొసలి
వింతగా నెత్తుక వేగంబె పోయి
మునుకొని నదిగుండముల త్రిప్ప త్రిప్ప
కని బ్రహ్మనాయుడు గ్రక్కున కినిసి
ఘనమైన మకరిని ఖండించగాను
అదియును పైకెగసి యంతరిక్షమున
ముదమొంది మదిలోన; ముదితయై నిలిచి
"మనసులో సంతోషమందితి; నీకు
వినిపింతు నా పూర్వవృత్తాంతమంత

మయనిర్మింతమైన మధురాపురమున
నయశాలి గంధర్వనాయకుం డనెడి
సుందుండు నా పతి; సుందను నేను;
కందర్పమోహాంధకారుల మగుచు
కండగర్వంబున కడు తేజరిల్లి
యుండంగ నచటికి నొకనాడు వేగ
తనవెంట కొందరు తపసు లేతేర
చనుదెంచి దుర్వాససంయమీశ్వరుడు
వచ్చినప్పుడు మేము వారి కైకొనక
ఎచ్చి మత్తులమగుచు నేమున్న జూచి
అమ్మహామునిచంద్రు డాగ్రహంబునను
మమ్ము వలికెను దురితమగ్నుల 'నోరి
సుందుడ ! కందర్పసుఖమెల్ల నుడిగి
పెండోటలోపల బెబ్బులి వగుము;
సుందరి ! నీలోన సొంపెల్ల తరిగి
అందంద మకరివై యందుండు మ'నుచు
శాపంబు పెట్టె నో జగదేకవీర !
ఆ పుణ్యమునితోడ నంటి నొకమాట :
'దుర్మదాంధుల దయతో జూచి శాప
నిర్ముక్తిగావింపు నిఖిలశరణ్య !'
అనవుడు 'నా శాప మది తప్పరాదు
విను ! మీకు నిర్ముక్తి విధము చెప్పెదను
ఆదట కలియుగమాది పల్నాట
ఆదివిష్ణువు బ్రహ్మ యవతారమెత్తు;
అతనిచే మీ శాప మణగిపోగలదు.
ప్రతిలేని మీ తొంటి భాగ్యంబుకల్గు
బొమ్మ'న్ననీరీతి పుట్టె పెక్కండ్లు
ముమ్మరంబున పాపమున కొడిగట్టి
అతడు బెబ్బులియై యడవుల తిరుగ

ఈతీరు మకరినై యిందుంటి నేను;
పెంపుతో పుణ్యుల పెద్దల ఘనుల
చంపితింటిమి మేము చాలకాలమ్ము
నీ పుణ్యమున పుణ్యనిలయ మందితిమి
ఓ పుణ్యచారిత్ర ! యో పరంధామ !"
అనిన శీలమనాయుడా కథనంత
వినియెను సంతోష వివశత్వమునను;
ఆవేళ సుందుండు నటకు నేతెంచి
తా వేగ సతిసమేతంబుగా నరిగి
చెచ్చెర సంతోషచిత్తుడై మరలి
అచ్చోటకును యోడ లంపెను చాల;
అంతట బ్రహ్మన్న ఆ నదినడుమ
వింతగా పడవలు విచ్చేసియుండ
మచ్చికతో నెక్కి మలిదేవుకడకు
విచ్చేసి వలసలో వేగనిల్చుండ
అప్పుడు చనుదెంచి యయ్యలందరును
ఒప్పుగా కౌగిట నుంచి రాతనిని;
ఆపూట నందుండి యా మరునాడు
ఏపార మండాది కేగి రంతటను
అచ్చోట నిల్చిరి యాత్మ లొప్పంగ
చెచ్చెర మూడేండ్లు జరిగె నచ్చోట.

# మందపోటు : లంకన్న విరుగు

## క థా స ం గ్ర హ ము

మలిదేవాదులు మండాదిలో సుఖులై విశేష ప్రాభవముతో నున్నారని విని, నాయకురాలు సహింపలేకపోయెను. ఒకనాడామె నలగాముని చేరి, మలిదేవాదులు మాచెర్లలో కంటె మండాదిలోనే బలసియున్నారని, యా బల మేపాటిదో కనుగొనవలెనని బోధించి, వారి యాలమందను త్రోలి తెచ్చుటకు అర్థవీటినున్న వీదుల పలినేడనువీరుని మండాదికి పంపుమని ప్రోత్సహించెను. నలగాము డామె మాటను పాటించి, పలినేనిని రమ్మని లేఖవ్రాయగా, నతడు సంతసించుచు గురజాలకేతెంచెను. వచ్చిన పలినేనిని కూర్చుండబెట్టి మర్యాదచేసి, కర్తవ్యమును బోధించి మండాదికి కదులుమని నలగాము డాన తిచ్చెను. ఆతని యానతి నౌదలదాల్చి పలినేడు సైన్యసమేతుడై మండాదిని సమీపించి యట నొక తోటలో విడిసి, మండాదినగర,యాలమందల రహస్యముల నరసి రమ్మని ముగ్గురు వేగులను పంపించెను.

ఆ వేగులు హరిదాసులవలె వేషములుదాల్చి మండాది నున్న వాడలన్నియు తిరుగుచు జాడలనరయుచు మెల్ల మెల్లగా కోటను సమీపించిరి. కోటచెంత తారాడుచు హరినామ సంకీర్తనము చేయు వేగులను చూచి హరిభక్తులని భ్రమించి శీలమ్మ, వారిని లోనికి తీసికొనిరమ్మని తన దాసియగు కొండమ్మను పంపించెను. కొండమ్మ హరిదాసులను లోనికి తీసికొని వెళ్ళెను. శీలమ్మ వారిని చూచినంతనే కలరూపు గ్రహించి "మోరి, వేగుల మల్లాయ! నీవటరా" యని పేరు పేరున ముగ్గురను పిలిచి, వచ్చినపని యేమియో చెప్పుడని ప్రశ్నించి యంతయు తెలిసికొని, ప్రాణభిక్ష నర్థించెడి యా వేగులను కరుణించి పొమ్మనెను.

అంతటితో తిన్నగా తమ దారిని తాము పోక, ఆ వేగులు ఆలమందల రహస్య మరయుటకు లంకన్నకడకేగి తాము మాధవలింగని బోయీలమనియు తమ పశువులు కొన్ని, మలిదేవుని మందలో కలసిపోయినవనియు చెప్పి, వాటిని వెతకి త్రోలుకొనిపోవుటకై యనుజ్ఞ యిమ్మని వేడుకొనిరి. లంకన్న సమ్మతించెను. వేగులు మందచొచ్చి నలుమూలల కలయ వెతకి యావులజాడల నరసి పలినేనికడకు పోయి మండాది వీరుల మందబోయిల పరాక్రమమును వర్ణించి వారితో పోరాడి గెల్చుట అసాధ్యమనియు, వెనుకకు మరలుట క్షేమమనియు తెలియచేసిరి. వారి మాట లాలింపక పలినేడు తన సైనికులతో తరలివెళ్ళి మంద సమీపమున పొంచుండి యదనుకై నిరీక్షింపసాగెను.

ఇంతలో ప్రొద్దుగ్రుంకెను. ఆవులు అరబాయని యరచుచుండెను. 'వేళయినది; పాలుపితుకుడ'ని లంకన్న గొల్లల కానతిచ్చెను. ఆవులను వేరువేరున పిలిచి గొల్లలు పాలుపితుకుచుండగా, పొంచున్న పలినేడు అదనుచూచి వారిపై పడెను. నలగాముని సైనికులకును, మలిదేవుని గొల్లలకును సంకుల సమరము జరిగెను. సమరమున లంకన్న విజృంభించి యొక్క వ్రేటున పలినేని తలత్రుంచెను; కాని నలగాముని సైనికులతనిని చుట్టుముట్టి బాణములు కుప్పించిరి; లంకన్న నేలకొరిగెను.

లంకన్న నేలకొరగుట చూచి నలగాముని సైనికులు మరింత విజృంభించి యటునిటు పరుగిడుచున్న యావులను పట్టుకొని గురజాల త్రోవకు మళ్ళించిరి. ఆ వార్త విని బ్రహ్మన యావులను మరలించి తెచ్చుటకై కన్నమను పంపెను. కన్నమ వారిని మధ్యమార్గమున నడ్డగించి హతముకావించి, గోవులను మందాదికి మరల్చి తెచ్చెను.

*మండాదినున్న మలిదేవుని ఆలమందను తోలి తెచ్చుటకై వీధుల పల్లెసేడను వీరుని పంపించెదమని నాయకురాలు, నలగామునిప్రోత్సహించుట: నలగాము డందుల కియ్యకొని అర్ధవీటినున్న వీధుల పల్లెనేనిని రమ్మని లేఖ వ్రాయుట.*

శ్రీ అంతట నలగాము డా పలనాడు
సంతోషమున నేకచక్రంబుగాను
పరిపాటితప్పక పాలనచేయ
ధరణీశులంద రాదట చేరి కొల్వ
హితులు మంత్రులు పురోహితులు నాశ్రితులు
చతురత మెరయ నా సమయంబులోన
మాయల నయగారి మందులమారి
రాయగయ్యాళి తీరని పాతజోలె
చనుదెంచి నిల్చియు చాల దుర్బుద్ధి
"అనుగుభూపతిపుత్ర ! యమితచారిత్ర !
విను కామరాజ ! నా విన్నపం బొకటి
మలిదేవరాజులు మాచర్లకంపె
బలియించుకొని బాహుబలములచేసి
యున్నారు మండాది నుద్ధతితోడ;
మిన్నకుండగరాదు మితిమీరుదాక
ఒకట రెంటను వారి యురుశక్తి యెంతొ
అకలంక ! తెలియగా నదనయ్యె నిపుడు;
మండాదినున్నట్టి మందను పొడువ
వీధుల పల్నేని వేగరమ్మనుచు
అర్ధవీటికి లేఖ నతివేగపంపు
అతని ధాటకు కాని అణగడు బ్రహ్మ

మన్నీల పశువుల మర్దించు శక్తి
మరి యొరులకు లేదు మామాట వినుము!"
అన విని నలగాము డధిక మోదమున
వీధుల పల్నేడ! వీరపుంగవుడ!
'నీబాహాంబలమును నిజముగా తెల్ప
రాచకార్యము వచ్చె రయమున రమ్ము
తడవుచేయగ నీకు తగదుసుమ్మం'చు
కరణమును పిలిపించి కమ్మ వ్రాయించ
కాలారి లేఖను కడుభక్తితోడ
కండ్లనద్దుకొనుచు కదలె వేగమున;
కంభాలపాడును గండికనుమయును
మట్టివేములయును మరికొన్ని యూళ్లు
ముటుకుల గడిచియు ముదమొప్పగాను
త్రిపురాంతకమ్మును తెరగొప్ప దాటి
మారకాపురమున మళ్లియు త్రోవ
అర్ధవీటికి పోయె నంత కాలారి.

*నలగాముని లేఖనందుకొని పలినేడు అర్ధవీటి నుండి గురజాల చేరుట: నలగాము డతనికి కర్తవ్యము బోధించి మందాడికి చనుమని విడియమిచ్చుట.*

వీధుల పల్నేడు వీటికి బయట
వాహ్యాళికింబోవ వానిని చేరి
కాలారి అతనికి కమ్మ నందించె;
అందుకొనుచు లేఖ కందందె మ్రొక్కి
ఏమియో యావార్త నెరిగెదమనుచు
ఆకు చదువుకొని యనుజునితోడ
"వీథుల నాగన్న! వీటిలో నిపుడు
పదిలమై నీవుండు బలము సగముంచి
పట్టణంబు చొరర నీకు పాడియు కాదు

ఎదురుగా దళమును గుండ్లకమ్మకును
పంపుమా తమ్ముడ! పని కల్గునేమొ!
తానెంత యోచనో తగని కార్యంబు
కదలిరమ్మని వ్రాసె కామభూవరుడు"
అని వ్రాని పల్లె నే దండలంబెక్కి
నఫిరీలు తమ్మెటల్ నాగస్వరములు
ముందుగా నడుగక మ్రోయంగ వెడలి
గురజాల పట్టంబు గొబ్బున చొచ్చి
కొలువెల్ల చూడంగ కొలువుకేతెంచి
కామభూవరునకు కడుభక్తిమ్రొక్కె;
దండంబు బెట్టగా ధరణీశ్వరుండు
కర్పూరవిడియంబు కరుణతోనిచ్చి
"కూర్చుండు పలినేడ! కూర్మితో నీవు
కార్యమొక్కటి వచ్చె కదనవిక్రముడ!
మనలకు భూమోడి మలిదేవరాజు
పాడూళ్లు మనకిచ్చి ప్రజల కొనిపోయి
చేరువ నున్నాడు "చెరచెద"ననుచు
మన భూమి ప్రజలెల్ల మండాది పోయి
ముదముతో నతనికి మ్రొక్కుచున్నారు
మలిదేవరాజులు మండాదినుండ
మనకు భద్రతలేదు మగిడించవలెను;
మనవీటి నున్నారు మన్నెనాయకులు
పోరులో గెల్తురు పోటుమన్నీలు
మండాది నున్నట్టి మందను పొడిచి
పశువులతెచ్చి నీ భక్తిని చూపు
పల్నాటి పౌరుషము ప్రకటించి మీరు
మన్నీల పశువులను మర్దించి వేగ
మలిదేవు నటనుండి మరలించవలెను"
అని యానతిచ్చిన నత డిట్లు పల్కె:

"అనుగుభూపతిపుత్ర ! యఖిలైకమిత్ర !
హరిహరాదులు మెచ్చ నందరుమెచ్చ
నలుదెసల బొనని నా పేరు[మోయ
మందాడి నున్నట్టి మందను పొడిచి
వీరుల చంపెద వినుము నామాట
బ్రహ్మయే కాదు ఆ బ్రహ్మవచ్చినను
తెగువతో రణములో తెగటార్చువత్తు
మా తండ్రి దామినేసి మర్యాదతప్పి
సంహరించె నతడు సమరమ్ములోన
నాటికి పిన్నను నరనాథ నేను
పగదీర్చుకొనెదను పంతంబుపట్టి
పట్టిమాట లికనేల పంపుము నన్ను"
అని యార్భటముచేయు నతనికి రాజు
"వేగపొమ్మ"నుచు తా విడియంబు నిచ్చె:

*పలనేడు సైన్యసమేతుడై గురిజాలనుండి[బయలు దేరి మందాడి సమీపమున నొక తోటలోవిడిసి నగర రహస్యములను కనుగొని రమ్మని వేగులను పంపుట : దాసరివేషమున నగరిముందు తిరుగాడెడి వేగులను పిలిచి వారి రహస్యమెరింగి, శీలమ్మ వారిని మందలించి పంపివేయుట.*

వీధులపల్నేడు వింతగా నపుడు
ధట్టీని సవరించి దర్పమున్ చూపి
ఇను చుట్టు మన్నీలు తనుచేరి కొలువ
కలబలమ్ములతోడ కదిలి ధైర్యమున
ఏతెంచి కడువేగ యేలేశ్వరముకు
గంధపుష్పాక్షతల్ ఘనముగా నపుడు
నదిలోన దిగవిడిచి నదికిని[మొక్కి :
"మలిదేవు పశువుల మరలించి యిపుడె

మగిడిరావలె మేము మమ్ము దీవించు
కోళలు గొఱ్ఱెలు కొనితెచ్చి నీకు
అర్పణజేసెద మంబరో"యనుచు
తెప్పల కొనితెచ్చి తెగువతో దాటి
కా్రేవుకొండను గజిబిజిపడక
అలికిడి కాకుండ నంతయు దాటి
"వచ్చెను మండాది వచ్చితి"మచును
దూరాన చింతలతోపులో విడిసి
ముగ్గురవేగుల ముదమొప్ప చూచి
"వేగుల దామినేడ! వేగులపల్ల!
వేగుల మల్లయ్య! వెరవక మీరు
మండాది నిపుడున్న మన్నీలు ఎవరొ
సొమ్ముల కడనున్న శూరులు ఎవరొ
చూచిరం డిచటకు చూపించి నేర్పు"
అనిన వేగులవారు అతిప్రీతినొంది
తలపెంద్రుకలు విప్పి తగినట్లుచుట్టి
అందంద పుష్పాల నమరంగపెట్టి
పన్నెండు నామముల్ బాగుగా దిద్ది
నీర్కావిధోవతుల్ నిండారకట్టి
సరగున మండాది చతురత చొచ్చి
"హరిహరీ శ్రీహరీ హరిహరీ" యనుచు
బ్రాహ్మణవాడలు బలిజవాడలును
కుమ్మరివాడలు కోమట్లవీథి
దేవాంగవాడలు తెలికలసందు
ఎఱ్ఱగొల్లలవాడ ఎరుకలపేట
మున్నూరు వాడలు మురియుచు మసలి
తీర్థప్రసాదముల్ దీవించియిడుచు
వెసలు పరికించుచు తిరుగుచునుండ
శ్రీహరివాక్యముల్ శీలమ్మ వినుచు

"వలసలు కదిలించి వచ్చినదాది
ఇటువంటి దాసర్ల నెన్నడు కనము
ఎటనుండి వచ్చిరో యీ భక్తు లిటకు
పిలిచిరమ్మ"ని దాసి ప్రియముననంపె;
పంపిన కొండమ్మ పరుగునవోయి
అయ్యల కనుగొని యతిభక్తిమ్రొక్కి :
"అమ్మ పిలిచెను రండు : హరిదాసులార !"
అనగానె యా దాసు లప్పుడిట్లనిరి :
"నగరులో చొర మాకు నాయమ్మ కాదు
అమృతపడి తెమ్మ మీ యమ్మతో చెప్పి
హరిదాసు కెటులైన నరమరలేదు"
అన విని కొండమ్మ అయ్యల కపుడు :
"ఇచ్చటి కమృతపడి యెవరు తేబోరు
అట నగరుకు రండు హరిదాసులార !
మీకు దండముపెట్టి మిమ్ము పూజించి
ఏ మిచ్చునో యమ్మ యెవ్వరి కెరుక !
వెరవక రండ"ని వెలది చెప్పంగ
"హరిహరీ" యనుచును హరిదాసులంత
నాతితో బోయిరి నగరిలో కపుడు
వారిని పొడగని వనిత శీలమ్మ
దండంబు బెట్టక దయచేయు డనక
మదితలచి యేమేమొ మనసులో నవ్వి
"దాసుళ్లు పాపము దయతలచినారు
ఏయూరి యయ్యలో యెక్కడివారొ
మాయూరు వచ్చిరి మమ్ము దీవింప"
అనిన వేగులవార లతిభీతినొంది
ఒక్కరొక్కరి మొగము లొకరొకరు చూచి
"ఓరుగల్ మాయూరు ఓతల్లి ! మేము
తిరుపతికి పనివిని తిరిగిపోయెదము

'నీ సుతుడు బ్రహ్మాన నీలవర్ణుండు
భాగవతులమీద భక్తిగలాడు
దాసులనంగనే దయజూపు' ననుచు
చెప్పంగ జనులెల్ల చెవులార వినియు
కన్నులారగ చూడ కదలి వచ్చితిమి"
అనిన నా శీలమ్మ యంతయు తెలసి
"వేగుల మల్లాయ! వేగుల పల్ల!
వేగుల దామినేడ! వెఱ్ఱులై మీరు
నాయురాల్ మాటలు నమ్మివచ్చితిరి
వచ్చిన పనియేమొ వణకక నాకు
చెప్పుడా!" యని పల్క చెప్పిరి వారు:
"'మాచర్ల పనికాదు మండాదిసొంపు
ఏ తీరునున్నదో యెరిగి రమ్మ'నిన
కాముని యానతి కాదనలేక
చనుదెంచి నా మమ్మ చయ్యన నిటకు
ఈసారి వచ్చిన నిలువేల్పులాన!
కరుణించి పొమ్మన్న కదలిపోయెదము"
అనుచు మ్రొక్కుచువేడ నతివ తా నపుడు
"పడవాలు వీరన్న బాహువిక్రముడు
వచ్చెడివేళాయె వలదు మీరుండ
చూచెనా యిక్కడే చీరించి మిమ్ము
గ్రద్దలకువేయును కలతలు రేగు
పలుపాట్లు పడకుండ పట్నమ్ము విడిచి
తొలగుడు మీరుండ దోషంబువచ్చు"
అనిన వేగులవార లతిభీతినొంది
కాళ్లు తడబడంగ కంపమ్ముతోడ
నడిచియు నెట్టెట్లొ నగరును విడిచి
ప్రాణముల్ గుప్పెట పట్టుకువేగ
ఊరును దాటిరి 'యుసురుసుర'నుచు

*వేగులు గొల్లలవలె వేషము ధరించి, ఆలమందను పరిశీలించుట: వారు తామరసిన వృత్తాంతము పల్నే నికి చెప్పి మందను పొడుచుట అసాధ్యము కాన, మరలిపోదమనుట. పలనేడు వేగులనలహా పాటింపక పోవుట.*

అంతట పోవక ఆ మందమతులు
గొల్లల పగిదిగ కొప్పులుముడిచి
తలపాగ చెవికమ్మ ధరియించి బాగ
'మందను చూచియు మగిడివచ్చెదము'
అనిపోయి రప్పుడు నటనుండివేగ ;
గుదిలేటిచెంతను గోవులతోడ
నట్టావుపోతన్న నాగబోయిండు
పించము సీతన్న పిన్నబోయిండు
గోరివి రామన్న కొండబోయిండు
తోడేటిసోమన్న దోరబోయిండు
బుచ్చిరామనబోయి పొట్టిబోయిండు
నిలుగాళ్ళ నిమ్మన్న నిడుదబోయిండు
మడగాళ్ళ మల్లన్న మాచన్నబోయి
పెయ్యల పెన్నడు పెద్దబోయిండు
కొలువుదీర్చి మిగుల కూర్మితో నుండ
మూల జూదంబాడు ముష్టిగొల్లలును
ఊసులాడెడువారు నుపొంగువారు
గుమ్మెటల్ వాయించు గొల్లలు మరియు
అటుపోవు నావుల సదలించువారు
పెయ్యల దామెనల్ పేనెడివారు
చెయ్యెచ్చి పెనగుచు చెర్లాడువారు
కోడెలు కోరాడ కొనియాడువారు
పులుల వేటకు పోవ పురణించువారు

ఇబ్బంగి మందలో నిట్లుండగాను
అంత వేగులవార లచట కేతెంచి
మ్రొక్కగా లంకన్న ముదమొప్ప చూచి
"ఏమందబోయలో యెరిగించు" డనిన
వినయమ్ముచూపుచు వేగు లిట్లనిరి :
"మాధవలింగని మందబోయలము
మా పశువులు కొన్ని మామందవీడి
గుదిలేటికాడను కూడి మేసియును
మరలిరాకుండ మీ మందను కలసె"
అన విని లంకన్న "యట్లైన మీరు
వెడలి మీసొమ్ములు వెదకికొనుడ" నగ
"అవుగాక" యనుచును అటనుండి వారు
మార్గమ్ము పట్టిరి మందను చూడ.
భీముని చెరువులో బినుకురాళ్ళదరి
సాగుడుతిప్పల సానువుల్ దిగువ
గద్దెరాళ్ళదరిని గంగలకడను
మామిడితోటల మఱ్ఱులక్రింద
పలుదిక్కులను తిరిగి పచ్చికమేసి
ఆయాయి తెరవుల నావులు రాగ
చేరి వేగులవారు చెలరేగిచూచి
లంకన్నకడ కేగి లజ్జయేలేక
"లేవు మాపసుల" ని లెస్సగాపల్కి
పరుగుపరుగున పోయి పల్నేని చేరి
"వీధుల పల్నేడ ! వినవయ్యనీవు
మనకు శక్యముగాదు మండాది పొడవ
బ్రహ్మన్న పల్నాడు బాయుటవలన
సిద్ధించె నతనికి సిరియు సంపదయు
ఏమని వర్ణింతు మేమి చెప్పెదము

పొగడ నలవికాదు భుజగేంద్రుకైన
పర విప్ర క్షత్రియ వైశ్య వర్ణులును
కాపులు బలిజలు కమ్మర్లు మరియు
కుమ్మర్లు ఉప్పర్లు గొల్లలు అచట
అన్ని జాతులవారు అలరుచున్నారు;
బహు చిత్ర వన్నెల పట్టువస్త్రములు
కస్తూరి జవ్వాది కర్పూరములును
ముచ్చట కొల్పెడి ముత్యంపుపేర్లు
అమ్మెద రచ్చటి యంగళ్ళలోన;
కాలందెలు గలట్టి కాలిబంటులును
పదును చురియలవంటి పలుసాహసులును
పోరును మెచ్చెడి పోటుమన్నీలు
మలిదేవు గరడిలో మసలుచున్నారు;
మందను పొడుచుట మన వశముగాదు
మందలో కలరయ్యా మన్నెనాయకులు
గోవులమేపెడి గొల్లలు కారు
పోరున మించెడి బోయలుకాని
అస్త్రశస్త్రమ్ముల నన్నివిధముల
కాచుచు మందను కడు మించి యుండి
రచటకు పోవంగ నాపదల్వచ్చు
వేగమే మరలుదుము వెనుకకు" అనిరి.

*గొల్లలు పొలువితుకుచుండగా, పల్నేడు సైన్యాముతో ఆలమందపై పడుటః యుద్ధమున అంకన్న పలినేనిని చంపుట; చెంచులు, పట్టర్లు, అంకన్నను నేల కూల్చుట.*

వీధుల పల్నేడు వినక యా మాట
ఇనుపకోలలవారు సీసెలవారు
అరిగెలవారును నడిదాలవారు

సురియలవారును శూలాలవారు
చెంచులు పడవాళ్లు చెంత నిల్వంగ
పోయి పొంచుండెను 'పొడిచెద' ననుచు;
ఈరీతి పల్నేడు ఇక్కడనుండ
అక్కడ మందలో నా లంకపోతు
ఆవు 'లంబాయని' యరచుట వినియు
తనబోయలను పిలిచి తా నిట్లు పల్కె :
"వేళాయె వాటికి వేగమేపోయి
పితుకుడు పాలను ప్రియమున మీరు"
అన విని గొల్లలు "అవుగాక" యనుచు
"చల్లనితల్లి యో చంద్రిక రావె!
లేతమామిడి రావె! లేతోట రావె!
కల్పవృక్షమ రావె! కనకాంగి రావె!
కామధేనువ రావె! కమలాక్షి రావె!
మలిదేవుగోవ యో మహాలక్ష్మి రావె!
నాయుని గోవ యో నళినాక్షి రావె!
ఆకాశగంగ యో యలివేలు రావె!
చిత్రవన్నెల చిక్కె చిన్నారి రావె!"
అని పేరుపేరున నావుల పిలిచి
పితుకంగ పాలను ప్రియమున వారు
మఁదను చేరియు మన్నెనాయకులు
అంబులవర్షంబు కురిపించగాను
పాలు నురుగులుగట్టి ప్రవహించసాగె;
మందలోపలనున్న మలిదేవు వీరు
లందరు తమతమ యాయుధాలంది
పట్లపై పడియు పవనవేగమున
నడుములు కాళులు నటునిటు నరికి
ప్రక్కలు తెగపొడిచి బాహువుల్ త్రుంచి
చీకాకుపరచగా చిత్రముగ నంత

వీధుల పల్నేఁడు విల్లు సంధించి
ముంగెరపాపని ముంచె బాణముల
పాపడు నేలను పడుటయుచూచి
ముత్యాల పెదమల్లు ముందుకురాగ
నలగాము జోదులు నల దెసల్ గ్రమ్మి
కూలంగ కొట్టగా కుంతములతోడ
సింగన్న బోయడు శీఘ్రంబెవచ్చి
పట్టర్లసోముని పడపొడిచి మరియు
మన్నీల నొకనొకని మడియంగచేయ
పొంచుండి చెంచులు బోసీక వాని
తల తెగవేసిరి తత్తరపడక
నెత్తురు కాల్వలై నేల పారంగ
ఆవులు బెదురుచు నరుచుచునుండ
అప్పుడు లంకన్న అదరంటనార్చి
కుంతంబు పుచ్చుక గొబ్బునవచ్చి
వీధుల పల్నేని వ్రేటున చంపె;
చెంచులు పట్టర్లు చెచ్చెరవచ్చి
కత్తికగురులును కుప్పెకోలలును
చీకటిమిణుగుర్లు జిగురు గుండెలును
మిన్నంటనార్చుచు మెండుగా వేయ
మాచెర్ల చెన్నుని మదిలోన తలచి
ఆదినారాయణు నాత్మభావించి
శీలమనాయుని చిత్తమందుంచి
కూలెను లంకన్న కుంభినిమీద.

*ఆలమందను తోలుకుపోయెడి పలినేని బంట్లను దారిలో కన్నమ అడ్డగించి వారిని నలినలిచేసి పట్టరి నొకనిని బంధించి బ్రహ్మనకడకు తెచ్చుట: బ్రహ్మన తాను పగతీర్చుకొనుటకై గురజాలపై దండెత్తెదనని*

*పలికి పట్టరిని పంపివేయుట: నేలకొరిగిన లంకన్నను చూచి బ్రహ్మన వగచి వానిని పుణ్యలోకమునకు పుత్తెంచుట.*

అత్తరి పట్టరు లధికమోదమున
"పంతమ్ము తీరెను భళిభళీ" యనుచు
గోవుల త్రోలుకు గురజాలత్రోవ
పట్టగా నా వార్త బ్రహ్మ తా నెరిగి
సుంకరికన్నమనూరుని పిల్చి
"మన మంద పొడిచియు మన్నెపట్టర్లు
గ్రక్కున చేరిరి గద్దెరాతికనుమ"
అడగించుము వారి నకలంకధీర!
అన విని కన్నమ్మ అత్యుగ్రుడగుచు
గద్దెరాతికనుమ కడువేగ చేరి
పశువుల కొనిపోవు పట్టర్లచూచి
కరులపై సింహంబు కదసినయట్లు
బెబ్బులి లేళ్ళను పెనకొనునట్లు
నలగాముబంట్లను నలినలిచేసి
మందను విడిపించి మన్నీల దునిమి
పట్టరి నొకనిని పంతమ్ము పట్టి
కొనిపోయి వానిని కోర్కెలు మించ
పడవేసె నాయుని పాదమ్ముచెంత;
అంతట బ్రహ్మన్న యా బంటు చూచి
"వినరోరి! పట్టరి! వివరంబుగాను
నలగామరాజును నాయకురాలు
మామంద పొడిపించె మన్నీలనంపి
మర్యాద కాదిది మండలేశునికి
ఆవుల పొడిచియు నంతటపోక
బోయిల చంపిరి పోతరింపుచును

బానికై గురజాల దండెత్తివత్తు
ఏమరకుండుడీ ఎల్లవార"నుచు
విడియంబు నిప్పించి వీరుని పంపి
మందలోనికి వచ్చి మదనుడు బ్రహ్మ
వాలిన మన్నీల వరుసను చూచి
వగచుచు లంకన్నవద్ద కూర్చుండి
"ఒరిగితివి లంకన్న ! యొంటిగా నీవు
ఏమని చెప్పదు నేమనిపోదు
ఏలిక ముఖము నే నేమనిచూతు
సుతునిగా భావించి శూరుడ ! నిన్ను
పెంచుకొంటిని నేను ప్రేమతో నెపుడు
మందలో నిన్నిట్లు మడియంగచేసి
కదలంగ నా కెట్లు కాళ్ళాడగలవు
పలుకరా ! నాతోడ పంతమ్ము విడిచి
వగతుర నణచి నీ వగనుదీర్చెదను"
అనవిని లంకన్న యా బ్రహ్మ చూచి
మ్రొక్కుచున్నట్లుగా మొగము తా వంచి
"వినవయ్య నాయుడ ! వీరపుంగవుడ !
పెందోటలోపలి బెబ్బులివచ్చి
కంట్లపుకోడెను కరచిననాడు
అలుగుచు నాతోడ నంటివి యిట్లు:
'పులి యట్లు ధేనువున్ పూనిచంపంగ
పాల్పడచూచిన పాపకర్ముడవు
చేరి శీలమువారి చేతిక్రిందుండి
కలినీళ్లు త్రాగిన కలుగు మగతనము
ఇంతటి శూరుండ విప్పుడువచ్చి
మా ముందు మొరబెట్ట మగపాడికాదు
మందలోనుండుము మగువవలె"ననగ
ఆడకట్టును కట్టి యప్పటినుండి

ఆడకొప్పును బెట్టి యా మందనుంటి;
సురభుల కవగుణము సోకిననాడు
అమ్మవారికి నేను నడలుచు మ్రొక్కి
భక్తినిపెట్టితి పూజలు చేసి
పచ్చికబీడులు పాడుపడంగ
సొమ్ముల నెన్నడు స్రుక్కంగనీక
ఏలుకొంటిని నేను ఏ యాకా కోసి;
వానలు కురియక వాగులెండంగ
పశువులకు బెట్టితి బావుల నీళ్ళు
గోవుల నీ రీతి కొల్చి కొన్నాళ్ళు
నాదు పాపము తలచి నగరికిపోయి
'చేసినపాపమ్ము చెరగు టెట్లనుచు
బ్రాహ్మణోత్తము నొకని భక్తితో నడుగ
కంట్లపుకోడెను కరచిన పులిని
దునుమక చూచిన దోషమ్ము ఘనము
పగవారు గోవులన్ పట్టనుంకించ
వాటిని కాపాడ వాలంగ నిన్ను
త్రొక్కినన్ ధేనువుల్ తొలగు దోషంబు'
అని యానతిచ్చెను ఆ విప్రవరుడు;
నాటి దోషము బాసె నాయుడ ! నేడు;
ప్రక్కల నాటిన పంట్రకోలలను
పిక్కల నాటిన పిన్నకోలలను
గుండెల గ్రుచ్చిన క్రూరబాణములు
పెరికి నన్నంపుము ప్రేమతో" ననగ
నాటిన బాణముల్ నాయుడు పెరికి
పుణ్యలోకమునకు పుత్తెంచె నతని.

# గురజాల యుద్ధము

## కథాసంగ్రహము

నలగాముడు తమ మందను పొడిపించి లంకన్నను చంపించెనని బ్రహ్మన్న, తోకత్రొక్కిన త్రాచువలె మండిపడుచు తాను గురజాలపై దండెత్తెదనని ప్రతిజ్ఞ పట్టెను. బ్రహ్మన్న ప్రతిజ్ఞవలన ఏమి కీడు మూడునో అని మలిదేవుడు వెరచి యుద్ధమున తన అన్నలనుమాత్రము సంహరింపవలదని ఆతని నభ్యర్థించెను. బ్రహ్మన్న అట్లే అని మలిదేవునకు మాట యిచ్చి ఎందరు చెప్పినను వినక గురజాలను జయించుటకు తానొక్కడే సంసిద్ధుడయ్యెను.

ఆ వార్త విని విద్యలదేవి బ్రహ్మన్నను రావించి మున్ను బ్రహ్మన్న వ్యాఘ్రముకరముల నెదిరించునపుడు ఆతని జయమపేక్షించుచు తాను మాచెర్లచెన్నునికి మ్రొక్కుకొని, కనక భూషణములు చేయించితినని వాటిని కొంపోయి స్వామికి సమర్పింపుమని కోరెను. బ్రహ్మన్న అట్లే అని కనకభూషణము

లను తీసికొని తన తల్లికడ కేగి దీవింపుమని మ్రొక్కెను శీలమ్మ బ్రహ్మనను దీవించి ఏ యే వేళల యుద్ధము చేయ కూడదో, యుద్ధమున ఎవరెవరిని చంపరాదో బోధింపగా ఆతడు వాటెని పాటించెదనని తల్లికి వాగ్దానమొనర్చి మండాది నుండి మాచెర్లకు చేరెను.

మాచెర్ల, పూర్వపు కళదప్పి వెలవెలబోవుట చూచి బ్రహ్మన పరిపరివిధముల వగచుచు చెన్నకేశవుని సందర్శించి 'ఇపు డింత చేసితివి; ఇకముం దేమి చేయుదువో!' అని మొర పెట్టుచు పలురీతుల ప్రార్థింపుచుండగా స్వామి కరుణించి బ్రాహ్మణరూపమున ఆతనిని సమీపించి "నీ విటకు వచ్చు టకు కారణమే"మని ప్రశ్నించెను. బ్రహ్మన తాను విద్యల దేవి మ్రొక్కు చెల్లింపుటకు కనకభూషణములు చెన్నునికి సమర్పింప వచ్చితినని తెలియచేసెను. అట్లయిన గుడికివచ్చు భక్తునికి, చేత ఆయుధ మెందులకని ఆ బ్రాహ్మణుడు బ్రహ్మన నడిగెను. నలగాముని దుశ్చేష్టితములకు ప్రతీకారముగా తాను అతనితో యుద్ధముచేయ గురజాలకు పోపుచుంటినని బ్రహ్మన సమాధాన మిచ్చెను.

'నీకు జయమగుగాక' యని ఆ బ్రాహ్మణుడు బ్రహ్మన నాశీర్వదించి అతడు తెచ్చిన భూషణములు తన కిమ్మని కోరెను. చెన్నునికి సమర్పింప తెచ్చిన భూషల నడుగుట పాడికాదని బ్రహ్మన పలుకగా 'ఎవ్వరైన నేమిలెమ్ము; ఇమ్ము నా'కనుచు ఆ బ్రాహ్మణుడు చెన్నుడై చెంగట నిల్చెను. బ్రహ్మన, దేవునిమ్రోల చక్కజాగిలపడి స్తుతించుచు ఆతనికి

భూషల నర్పించెను. చెన్నుడు వాటిని చేకొని అంతర్ధానము కాగా బ్రహ్మన మాచెర్లను వీడి మాడుగులు దాటి రేవంతు బైళ్ళకు చేరెను.

అట భూతరూపమున ఒక కొట్టుపై నున్న కొత్తివీరు డనియెడువాడు బ్రహ్మనను చూచి, ఆతనిని బెదరించుటకై రంకెలు వేయసాగెను. బ్రహ్మన వానిఅరుపులను లెక్కచేయక అతనిని సమీపించి 'నీ వీ కొట్టుపై నుండుటకు కారణమే'మని ప్రశ్నించెను. కొత్తివీరు డాతనిని బ్రహ్మనగా ఎరిగి తన వృత్తాంత మతనికి వినిపించెను. అతని వృత్తాంత మిది : కొత్తివీరుడు ఆతతాయి ; వేశ్యాలోలుడు. దారులు కాచి, బాటసారులను కొల్లగొట్టుట ఆతని వృత్తి ; ఇండ్లను దోచి, చేత చిక్కించుకొన్న ధనమును వెలయాండ్రకై వెచ్చించుట ఆతని జీవిత పరమావధి. గజదొంగఅని ప్రసిద్ధికెక్కిన కొత్తివీరు డొకనాడు చందవోలుకోటను దోచుకొనెడి తలంపుతో అక్కడకు పోయి ఆరాజును మచ్చిక చేసికొనెను. రాజు గోకర్ణుడు ఆతనిని విందునకు రమ్మని ఆహ్వానించెను. కొత్తివీరుడు విందుకుపోక తన వారిని పంపి కోటను దోచుకొనుటకు ఆయత్తపడెను. విందు జరుగుచుండెను;కోటలోనివారందరు ఎవరిపనులలో వా రుండిరి. కొత్తివీరు డదే సమయమని లోనికి ప్రవేశించి ధనమును కొల్లగొట్టుచుండెను. రాజభటులు వానిని పట్టుకొని నిర్బంధించిరి; కాని అతడు వారిని అణచి గురజాలకు పారిపోయెను.

కొత్తివీరుడు గురజాలకు వచ్చినాడను వార్త విని నలగాముడు వానిని పట్టించి చంపుడని భటుల కాజ్ఞాపించెను.

*నలగాముడు తమ మందను పొడిపించి, అంకన్నను చంపించెనని బ్రహ్మన కోపించి తాను గురజాలపై దండెత్తెదనని ప్రతిజ్ఞ పట్టుట: మలిదేవు డాతని నుపశమింపచేసి యుద్ధమున నలగామాదులకు కీడు తలపెట్టవలదని బ్రహ్మనను కోరుట. బ్రహ్మన రాజు నొప్పించి తాంబూలము గైకొనుట.*

క్రాముని కీల నోడి కలహంబు మించి
రామచంద్రుని గతి రాజులు తాను
మండాదినుండంగ మందను పొడిచి
తనవాని చంపిన తలవంపులాయె
నని బ్రహ్మనాయుండు నాత్మలో గుంది
తల్లికి మ్రొక్కడు తన మదిలోన
తలచడు చెన్నుని తన రాజు గొనడు
కొడుకు బాలునిమీద కృప యింత లేక
పళ్ళెమున గుడువడు పగలును రేయి
పలుమారు లెంకకై పలువరింపుచును
గురజాల పొడుతునని క్రోధంబుతోడ
భారమౌ వ్రతమును పట్టి నాయుండు
పగగొన్న సింహంబు భాసిల్లుభంగి
కైలాసబండపై కడు మించియుంత
మన్నించి యప్పుడు మలిదేవరాజు
పులిగోరుగొల్లెన పొసగ నెత్తించి
జముఖాన మమరించి జతనంబుమీర
తగ పట్టు పరుపును తలగడదిండ్లు
దోమతెరమంచంబు తోడ పట్టించి
బ్రహ్మన్న కచ్చట పరుపు పరిపించె;

పాలసంద్రముమీద పరమేశుభంగి
పాన్పుపై పవళించ బ్రహ్మన్న కపుడు
నిజభక్తితో మ్రొక్కి నిల్చుండి, చెంత
'ధరలోన పిన్నన్న దైవమ'నువారు
'భువిలోన నిటువంటి పురుషుని నెచట
పొడగానమ'నుచును పొంగుచు చేరి
కరములు ముకుళించి కావుమనువారు
'హనుమంతు డా రాము నానతిచేసి
నీళ్ళలో నొకగ్రాహి నిర్జించినట్లు
జలములోపల మొసలి చంపె చూడంగ
అత డితడు గాబోలు'నని పొగడువారు
'ఆడుమాటలు విని యా కామరాజు
ఒరిసిన పుండును నురుకోలతోడ
కదలించె నిబ్భంగి కావరమ్మ'నను
అనెడి మాటలు విని యా బ్రహ్మనేడు
సంతోషచిత్తుడై చయ్యన నపుడు
పల్లకి నెక్కిన పట్టిరి గొడుగు ;
పడిగెలు నరిగెలు పరగంగపట్టి
సరసులు జాణలు సందడికొలువ
బ్రాహ్మణుల్ దీవించ భట్లు కీర్తించ
ముదమొప్ప నేతెంచి మొగసాలకడకు
పడవాలు కైదండ పట్టగా నంత
తన యందలము డిగ్గి, తగిన ముత్యంపు
పేరును నతనికి ప్రేమతోనిచ్చి
నడుతెంచి కొలువుకు నాయుడుచేరి
మలిదేవభూపతికి మన్ననతోడ
దండంబుపెట్టిన ధరణీశ్వరుండు
విందువేడుకతోడ నిట్లని పలికె :
"మాపాలి వేల్పు ! యో మల్లికార్జునుడ !

నీపాలివార మో నీలవర్ణుండ ।
అనుగయ్య మా తండ్రి అస్తమించంగ
అన్న కాముడు మమ్ము నపహరించినను
పాల్గొని మాచర్ల పట్టంబు కట్టి
ఏలించితివి రాజు లెల్లను కొల్వ
క్రోధియై నాయురాల్ కోడిపోరునను
ఈవు చూడగ కోడి నింద్రజాలమున
కట్టించి చంపెను ఖండించె గోవు
మన లంకపోతును మందబోయిలను
వధియించి కాముడు వాలియున్నాడు
ఇకనేమి చేయునో యెరుగంగరాదు”
అన విని నాయుండు ఆ రాజు కనియె :
“నీవేల తలరెదవు నేనుండగాను
నీ వెరుంగవు నన్ను నిఖిలంబు లెరుగు
కావరుడయ్యె నా కామభూవరుడు
కాముని నణతును ఘనుడ । నీ యాన
పోవలె గురజాల పోటుకునేను”
అన విని భీతిల్లి యయ్యోధ్యరాజు
“వినవయ్య చెప్పెద విన్నపం బొకటి
పోరిన రాజులు పోరచే సమసి
పోవలెనని నీవు బుద్ధులుచెప్ప
పోరాని నిటువంటి పోరాయె మనకు;
పదిలమై మండాది బలుసాకు తినుచు
ఒదిగియుండుట మనకు నొచ్చెంబుకాదు
నాయకుల్ మన్నీలు నమ్మినబంట్లు
హత్తుకయున్నారు అన్నను నచట
అంతకంటెను దళము లధికముగ గూర్చి
అంతట పల్నాటి కరుగుదువు గాని”
అని రాజు పల్కిన నత్యుగ్రుడగుచు

"గొనకొని మీయన్న కొండగాచేసి
పలికెద నయోధ్య పట్టవర్ధనుడ !
అవుల పోటుకు నరసి గురజాల
కోట సాధించెద కుంభిని యదుర
రాజుల దొరలను రౌతుల నెల్ల
లెంకకై కాముని లెంకల నెల్ల
పొంక మణచెద నెల్లి ప్రొద్దున" ననగ
విని రాజు ఊరకె వివశుడై యుండె ;
అనె గండు కన్నమ అందరు వినగ :
"ఏము నీవను కల్ల నేల నీతలపు ?
అది గురజాల కా దమరలోకంబు
సాధింప నీ పూట సాగబోద"నెడి
బావమాటలు విని బ్రహ్మన్న నవ్వి
"భావింప కిదియేల పలికితి విపుడు
అది యెంత పెద్దగా నాడెద వీవు
అది ఒకటె సాధించి యమృతము తేదె
విను ! వైనతేయుని విధమున నేను
అమరలోకంబైన నాజిలో గెల్తు
సమరమున నాతోను సరివారు లేరు"
అన విని మలిదేవు డా బ్రహ్మ జూచి
వెరగంది యప్పుడు వినుమని పల్కె :
"అన్న ! గురజాలకు నరిగితివేని
తోడ నల్గురి నీవు తోడ్కొనిపొమ్ము
అడుగుమీ యిప్పుడు నరువదేగురుని"
అన విని బ్రహ్మన్న యా రాజుతోడ
"పరగంగ తోడానపడుదునా ధరను
ఎవ్వ రెవ్వరు నాకు నెరిగింపుమ"నిన
"గర్విత రిపురాయ గజసింహు డనగ
గర్విత నాయుండు గండభైరవుడు

గొనకొని గుండారగుడిని యుద్ధమున
ధరియించె బిరుదులు ధర యెల్ల నెరుగ
గండు కన్నమ యొకడు కదన విక్రముడు
నీ మరదియగు వాడు నిచ్చలపు బంటు
విక్రమార్కునివంటి వినుత శూరుండు
ప్రళయకాలుం డతడు బవరంబులోన
కోటకు డగ్గరి కోయని యార్చి
యుద్ధము లోపల నుఱువడి కాము
నీ యెడ రాకుండ నిలుపగలాడు
దక్షుండు సుంకరి దామెనే డొకడు
దళ మెంత వచ్చిన తలకనివాడు
తనరార గెలిచెను దండి బిరుదులను
నలుబదివేలపై నడువగలాడు
ఆవాల బండారి అతి నిపుణుండు
మనసున బెగడఢు మగసింహ మతడు
పన్నుక వచ్చిన పగనాయకులను
దండించి చంపు నుద్దండ వీరుండు
అరువదేగురు వీరు లాజిలోపలను
కూల్చి నొక్కెడె శత్రుగుండె తల్లడము
వీరును నీవును వేగంబె చొచ్చి
సాధించు డా కోట సమరంబులోన ;
'వీరును వారును విను మొక్క రూపు'
అనుచు యుల్లడపెట్టె ననుగయ్య మమ్ము
అలనాటి మా యయ్య యనుగుభూవరుని
ఆనతి మరువకుమ"ని పల్కె రాజు
ఆ మాటలను విని యప్పుడు బ్రహ్మ
చిరునవ్వు మోమున చిందులాడంగ
"అన్నదమ్ముల మనుచు నయ్యోధ్యరాజ !
వింతగా పలుకంగ విన వేడుకయ్యె ;

నీళ్ళ నడుమను వ్రేయ నీళ్ళు రెండగునె ?
'చురకత్తి పొడిచిన చుట్టాలె మేలు'
అనుచు పల్కితి వీవు అనియెడిదేమి
అట్లనే కాయుదు నన్నదమ్ములను"
అన విని ఖామీందు డాత్మనుప్పొంగి
పచ్చకర్పూరంపు బాగాలు పెట్టి
"విచ్చేయుమ"ని పంపె వీరనందనుని.

*విద్యులదేవి బ్రహ్మనను పిలిపించి మాచెర్ల చెన్నునికి తన మ్రొక్కు చెల్లింపుమని కనకభూషణము లతని కిచ్చుట: బ్రహ్మన వాటి నందుకొని తల్లికడ కేగుట: శీలమ్మ అతనికి యుద్ధమున పాటింపదగు నీతిని బోధించుట: తల్లి దీవన పొంది బ్రహ్మన మండాదినుండి మాచర్ల చేరుట.*

వీర విజ్జలదేవి విని వింతవార్త
పిన్నన్న పిలిపింప ప్రియమున వచ్చి
"అమ్మరో ! యొకమాట యానతిమ్మ"నుచు
నిశ్చలచిత్తుడై నెనరున పలుక
అంత విజ్జలదేవి యతని కిట్లనియె :
"అలనాడు పులిజంప నరుగంగ నీవు
'పులిచేత చిక్కక పొందుగా బ్రహ్మ
కలసిన చాలునని కడుభక్తితోడ
చెన్నునికి పులిగోరు చేయించినాము
వసుధేశుపై మొసలి వచ్చిననాడు
కడిమిమై నద్దాని ఖండించ నరిగి
ఏడు ఘడియలు నీ వెటు కానకున్న
నాడును నీకుగా నల్లనియన్న
వేడుకొన్నంతనే వేడ్క చెన్నుండు
నిన్నును కృపజేసె నిఖిలంబు లెరుగ

కనకపద్మంబును కడుభక్తితోడ
పసిడిపిల్లనగ్రోవి పసిడిపుట్టమ్ము
పుత్తడినామమ్ము పొందుగా మేము
చేయించినారము చెన్నుని కపుడు
అర్పించు పిన్నన్న యా దేవు" కనిన
చెలువార చెన్నునికి చేయించినట్టి
పసిడిపిల్లనగ్రోవి పసిడిపుట్టమ్ము
పుత్తడి నామమ్ము పొందుగా నంది
ఆ విజ్జమాంబకు నతిభక్తి మ్రొక్కి
"నీ యాజ్ఞ తలపోసి నీ కృపతోడ
కొనిపోయి చెల్లింతు కోరిక మించ
పనివినియెద"నని పల్కి బ్రహ్మన్న
పల్లకీ యెక్కిన పట్టిరి గొడుగు ;
ఎక్కువ మగధీరు లిరుదెస నడువ
వీధినడుమను రాగ విద్యలవారు
పరగంగ నలుదెసల్ ప్రస్తుతిచేయ
వాద్యము లన్నియు పరుసతో మ్రోయ
వచ్చె నింటికి బ్రహ్మ వసుధ కంపింప;
గరిగెమాడచియును కలవారలెల్ల
హారతు లీయగా నందలము డిగ్గి
అడపకేశవుమీద హస్తంబు చాచి
వీరనాయకులను వీడ్కొల్పి యంత
తల్లి శీలమ కడకు తనయుడు బ్రహ్మ
అరుదెంచి మ్రొక్కిన నతని కిట్లనియె :
"మహి శత్రురాజుల మర్దించినావు
అప్పనమ్ములు కొంటి వా కాలమందు
ఎప్పటివలె కాక యేలయ్య నేడు
నీకు కోపముకల్గె నీలవర్ణుండ ?"
అని తల్లియడిగిన ననియె నాయుండు:

"తనరార వెనుకను తప్పులు మూడు
కాచిన నెరుగడు కామభూవరుడు
పసులకాపరులను పరగ లెంకలను
ఖండించి మదమున కానకున్నాడు
దండించి గురజాల తరిమి నే పొడుతు
పొడిచెదనని వేడ్క పృథివీశుచేత
విడియమందితి నేను వేగ పోవలయు"
అన విని శీలమ్మ "హరి హరి" యనుచు
"విను మిటు దోషంబు వీరనందనుడ!
అంతకంతకు డాగి అధములై యున్న
కట్టెమోపులవారి కలగూరవారి
పశులకాపరులను బలుసు కూరాకు
తిని యడవులలోన తిరిగెడువారి
మగువుల గోష్ఠిచే మానంబు తప్పి
యెదు రేమియును లేక యింతులు తాము
తమ గృహంబులలోన తమకించి చాల
తడబాటుచేతను దాగినవారి
చెన్నారు గుళ్ళలో చేరినవారి
మనసున దయలేక మగపాడి విడిచి
చంపుట దోషమ్ము జగములోపలను
తగవును ధర్మము దయయును విడిచి
చలమున కోటలు సాధింపరాదు!
తనరార గురజాల సాధించువేళ
చెప్పుమా?"యని యడుగ శీలమ్మసుతుడు
"సమయింతు గురజాల సందేహమేల
ఏపార వేళ మా కేటికే యమ్మ!
అన విని శీలమ్మ యతని కిట్లనియె:
"వినవయ్య బ్రహ్మన్న విశదంబుగాను
జపముకై బ్రాహ్మణుల్ చనియెడువేళ

వేగుజామున పొడువ వేగిరపడకు
పదమని ప్రొద్దున్న పాడిధేనువుల
పాలకై సతులను పరగ నురుత్రాళ్ల
తలకోలలను పట్టి తనరార పితుక
ఆవేళ కోటపై నార్చినగాని
అగ్ని వాయువుచేత నా పట్టణంబు
భస్మమ్ముగా కాలి పసులు సమసినను
అటువంటి దోషమ్ము లణగ వెన్నటికి
పగలెల్ల పొలమున పనిపాటుచేసి
మగడు ధాన్యము కొని మాపట చేరు
నను నాస బిడ్డలు నతని కులసతియు
ఎదురు చూచుచు నుందు రిండ్లలోనుండి
అర్ధరాత్రి పోటు అదికాదు వినుము ;
ఆవేళ కోటపై నార్చిన నీవు
నిద్ర తెలియక యపుడు నిలుపునులేక
తత్తరపడి భీతి తమ యాయుధముల
నేమరి నిను చూచి యెల్లవారలును
పోరకున్నను వారి పొడువ దోషమ్ము
అన్నన్న ; వారల నావహంబునను
అనుజులుగా చూడు మతివేడ్కతోడ
పరగ వారిని పొడువ పాపంబు వచ్చు
వలవ దా వేళల వాలిమర్దనుడ ;
తెంపున గురజాల తెగటార్చువేళ
వినవయ్య చెప్పెద విజయసమాన ;
బ్రాహ్మల భక్తుల భట్ల దానుళ్ళ
సొంపార జంగమ జోగుల నెల్ల
పేర్మి రాకుండని ప్రియమున చెప్పి
కరమర్థి కామిని కలబలంబులకు
వెలయ రాహుత్తుల వెలమ నాయకుల

జారుల వీరుల పరగ లెంకలకు
రాజితుడై నట్టి రాజుకామునకు
నెరుగ చాటించియు నేడు గడియలకు
తిరముగ గురజాల తెగటార్చితేని
వెల్లనై నీకీర్తి వెలయు లోకముల"
అన విని యా బ్రహ్మ యతిభక్తితోడ
"తల్లి ! నీ యానతి తగచేతు"ననిన
శీలమ్మ యాతని శిరమును నిమిరి
ముడివిప్పి వెంద్రుకల్ ముదమొప్ప జార
సంపెంగనూనెయు చక్కగా రాచి
జలకమార్చెను బ్రహ్మ సంతోషమొంద;
దంతపు పీటపై తగ కర్ణువలెను
పొందుగా కూర్చుండ పురుషరత్నమును
అడుపవా ర్వెంద్రుక లార్చంగ నంత
పంద్రెండు నామముల్ బాగుగాతీర్చి
ప్రేమమీరగ తులసిపేరులు వైచి
డగ్గరి చెన్నునికి దండంబుపెట్టి
"ఆరణిగండ్లలో నంత సైన్యమును
గెలిపించితివి నీవు గిరిధర ! నాడు
ఆ రీతి నిప్పుడు నమరులు మెచ్చ
కరుణతో గెలిపింపు కరిరాజవరద !"
అనుచు ప్రార్థించియు నా దేవునకును
నివ్వాళి యిచ్చెను నీలవర్ణుండు;
చెలువార పీటల చేరి కూర్చుండి
అన్నదమ్ములగూడి యంతభుజించి
జగదేకవీరుండు సయ్యన మేన
గంధము కస్తూరి కలయగా నలది
కడువేడ్కతోడ తా కాసె బిగించి
పెంపైన ముత్యాలపేరులు వైచి

డాకాల నందెయు తనర పెంపొంద
పాయని భక్తితో పరగ తల్లికిని
దండంబుపెట్టిన తనయుని చూచి
"నీ ముఖకాంతిని నిఖిలంబు లెరుగ
భావించి హరిహరబ్రహ్మాదులైన
తేరి చూడగలేరు ధీరుడ ! నీవు
కొరత యేమియులేక కోట పొడిచెదవు"
అనుచు దీవించగా నా బ్రహ్మనేడు
"పరగ తల్లివె నాదు పాలి దేవతవు
నీదు నానతి చేసి నిఖిలంబులెరుగ
గొబ్బున పొడుతు నే గురుజాల"ననుచు
కదలి తా చేరియు గండ్రకోటకును
అనుగురాజుపల్లె నతివేగ దాటి
చెన్నుని పొగుడుచు చేరె మాచర్ల.

*మాచెర్ల పూర్వపుకళతప్పి వెలవెల బోవుట చూచి బ్రహ్మన వగచుట : చెన్నుడు బ్రాహ్మణరూపమున వచ్చి అతని రాకకు కారణ మడుగుట: బ్రహ్మన తన రాకకు గల కారణ మెరిగింపగా, చెన్నుడు నిజ రూపమున ప్రత్యక్షమగుట : బ్రహ్మని చెన్నునికి భూషల నర్పించి విద్యులదేవిమ్రొక్కు చెల్లించుట.*

ఆ పురవీధుల నందమ్ముబాసి
ఏపున తుప్పలు నెంతయో పొదవు
పెరిగి యంతటను పెనగొనియుండ
కోరాడి తిరిగెడు కొమ్ముపందులను
పారెడి ఎల్గుల పరగంగచూచి
చింతిల్లె బ్రహ్మన్న చెన్నుని తలచి;
"నిండిన భక్తితో నీ కప్పగించి
పోయి యున్నేండ్లకు పురముకు రాగ

నీ విల్లు చేస్తివి నెనరును తప్ప;
కాహళల్ డోళ్ళును కంచుతాళములు
మద్దెళ్ల తాళాలు మరి పిల్లనగ్రోవి
వెలయ రాగములు వేవిధముల మ్రోయ
వేడుక కొల్వంగ వెన్నుడ నీవు
ఆనాటి వైభవము నంతయు బాసి
అడవుల తిరిగెడి యా జంతువులనె
కోరితివా ఎల్లుగొడ్డుల కొల్వు?"
అని పెక్కువిధముల నాత్మలో వగచి
తడయక విచ్చేసి తన వటారునకు
మనుబోతు లుండంగ మగిడించి వాని
మరుగు లోపలనున్న మరి చమురుకుండ
పుచ్చుక బ్రహ్మన్న పురమును గడచి
చెన్నుని గుడికి తా చేరంగ నచట
పారెడి పులులను పరగంగ చూచి
తల్లి చెప్పిన మాట తన మది తలచి
'వెరవకుడు మీమీద వేటకేరాను'
అనుచును తన చేతి యాయుధం బంత
గరుడకంబమునకు కడువేడ్క చేర్చె;
పట్టుశాలువ చించి పరమపావనుడు
దట్టముగ వత్తులు చుట్టి చమురునను
తడిపి యా కుంతాన తడయక పెట్టి
కడుభక్తితోడుత కరములు మొగిచి
"విశ్వంబు లెరుగగా విశ్వేశ్వరుండ!
నిండిన కృపతోడ నీవు ఆనాడు
ఆజిలో గెలిపించ నపుడు నను మెచ్చి
ఇచ్చిరి శస్త్రంబు లింద్రాదిసురలు"
అని పల్కె హాయుండు అన్ని కత్తులును
తగ దీపములవలె ధగధగమండె;

అంతట బ్రహ్మన్న యటనుండి కదిలి
చంద్రవంకకు బోయి స్నానంబు చేసి
పురితోటలో చొచ్చి పుష్పముల్ కోసి
అరటియాకున బొదవి యటు వేగ గొంచు
మనమార చెన్నునిమంటపంబునను
సరములుగా కట్టి చెన్నుని చేరి
ఆ దేవు కంఠాన నలరింపచేసి
"కరివరద ! పరమేశ ! కలుష సంహార !
వేదమూర్తివి నీవె ! వేదముల్ నీవె !
పరమాత్ముడవు నీవె ! బ్రహ్మంబు నీవె !
గుణపరుడవు నీవె ! గురుడవు నీవె !
గణుతింప నిను బోల గలరె దైవములు
కోడిపోరగుటయు గోపన పడుట
నీ మాయ కాదె యో నీలవర్ణుండ !
మొనసి పులి కవయుట మొసలి జలనిధిని
నిలిచి నను పట్టుట నీ మాయ కాదె
మందలో లంకన్న మంద బోయిలను
నిలువక చచ్చుట నీ మాయ కాదె
మాపాలి చెన్నుడా ! మమ్మింతచేసి
మాచర్లనుండియు మగిడించినావు
ఇక నేమిచేతువో యెరుగంగరాదు !"
అని పెక్కుభంగుల నాత్మ చింతిల్ల
చిత్తముప్పొంగగా చెన్నుండు అపుడు
పట్టె వర్ధనములు ఫాలమున మెరయ
ముదుసలి బాపడై మూల్గుచు వచ్చి
బ్రహ్మిని పరికించి ప్రశ్నించె నిట్లు :
"ఈవేళ వచ్చుట కేమి కారణము ?
నే వినగోరెద నీ వచ్చురాక !"
అన విని బ్రహ్మన్న అప్పు డిట్లనియె :

"వినవయ్య! మాతల్లి విజ్జలదేవి
చేకొని పులిని నే చెండాడునపుడు
నాకును జయముగా నాడు చెన్నునికి
పసిడి పిల్లనగ్రోవి పసిడి పుట్టమ్ము
పసిడి తిరునామమ్ము పసిడి పతకమ్ము
పొందుగా చేయించి పుత్తెంచెనయ్య
అర్పింప వాటిని నరుదెంచినాడ"
అనిపల్క నయ్యవా రల్లన నవ్వి
"కుంతమ్ము పుచ్చుక గుడిని చేరంగ
వింతగా తోచెను వీరపుంగవుడ!
ఎందు పోయెదవొ నాకెరిగించుమ"నిన
బ్రహ్మన్న విప్రుతో పల్కె నిట్లనుచు:
"మండాది నుండంగ మందను పొడిచి
మావాని చంపించె మైలమ్మసుతుడు
కోరి లంకనపగకు గురజాలకోట
సాధింపవలెనని సంభ్రమంబునను
పొదివి యీ ప్రొద్దు నే పోవుచున్నాడ"
అన విని యయ్యవా రప్పు డిట్లనిరి:
"గురజాల చొచ్చి యా కోటను పొడువ
తలపోయె నొరులకు తరముకాదయ్య
తేరి చూడగలేరు దేవతలైన
సాధింప రా దిప్పుడు సందేహ మేల"
అన బ్రహ్మనాయుండు అగ్రహంబంది
"హరుడు త్రిపురముల నణచినక్రియను
గురజాల పొడిచెద కోరికమించ
అగణితంబైనట్టి యా కురుసేన
చేకొని యర్జునుడు చెండాడుగతిని
కాముని సేనల గర్వంబు నణచి
వచ్చెద నా సరి వసుధలో కలరె

ఎరిగెదుగాక న న్నెల్లి చూచెదవు"
అన విని విప్రుండు ఔగాక యనుచు
"ఎల్లి ప్రొద్దుపొడువ నేడుగడియలకు
బలసూదనుడు మెచ్చ బలముల నెల్ల
చలమున పోరిగొని సమరాంగణమున
చేకొనుము జయమ్ము చెన్నుని కృపను"
అనుచు నా భూసురుం డాశీర్వదించి
బ్రహ్మన్న కడనున్న "పసిడి పుట్టమును
పొందుగా నిచ్చిన పోయెద"ననియె;
ఆ మాట కా బ్రహ్మి యాశ్చర్యమొంది
"చెలువార చెన్నునికి చేయించినట్టి
పసిడి పుట్టము నడుగ పాడియే"యనగ
"ఎవరైన నేమాయె నిమ్మునా క"నుచు
చెన్నుడై విప్రుండు చెంగట నిల్చె;
నంతట బ్రహ్మన్న యతులితభక్తి
చక్కజాగిలిపడి సర్వేశుమ్రోల
"ఓ యాదవాన్వయ! యో పరమాత్మ!
ఓ పరమపురుష! యో పరంధామ!
పాలసంద్రముమీద పవళించు దేవ!
నీ మహిమ యిట్లగుట నే నెరుగనైతి
ఈ సొమ్ములన్నియు నిరవుగా తాల్చి
కాచి రక్షింపవే కరివరద నన్ను
పనివిందు నా స్వామి! పట్టమ్ముదాక"
అని పల్కి భూషల నర్పించ చెన్ను
డంది యంతర్ధానమయ్యె నాక్షణమె.

*బ్రహ్మన మార్గమధ్యమున కొత్తివీరుని కలిసి అతని వృత్తాంత మరయుట: కొత్తివీరుడు బ్రహ్మనచే బంధవిముక్తుడగుట.*

ఆలయమ్మును వీడి యా బ్రహ్మ నేడు
కుంతమ్ము సవరించి గొబ్బున కదలి
కంబముపా డంత గ్రక్కున దాటి
మంచికల్లును మరి మాడుగుల్ గడచి
రేవంతుబైళ్లకు లీలతో రాగ
కొల్లుపైనున్నట్టి కొర్తిపీరుండు
'వెరవక యేతెంచె నెవ్వడో వీడు'
అనుచు కోపించియు నాకాశమంట
అబోతుక్రియ రంకె లందందవేయ
గంభీరు డారంకె గైకొక నడచి
"వెరపించ నీకు నే వెరతునా యోరి
వెరవక నిలువు నీ వేషంబుతోడ"
అని పల్కి తనచేతి యడిదంబు చూప
"కలకంఠుడో యితడు కాలభైరవుడో
ఈవేళ నామీద నెదిరించి నిలచె"
అనుచును నా వీరు డప్పుడు మెచ్చి
వినయమున కరములు వేడ్కతో మొగిచి
"ఏమయ్య నీ మహిమ యెరుగ నే నిపుడు
నెరి నాకు కోపంబు నీమీద రాదు
వస్తివి నీవెంత వాడవో చెపుమ!"
అన విని బ్రహ్మన్న యంతయు చెప్పి
ఏపనిచేయ నీ కీ పాటుగల్గె?
ఏవిధంబున వచ్చె నెరిగించుమ"నిన
"వెరవక చెప్పెద వినవయ్య నీవు
పెద్దల కడుపున పెనుకంచిలోన
పుట్టితి నే నొండుబుద్ధుల నెరుగ
పరసతీమణులపై భ్రమపుట్టి మిగుల
పడుచుగా తిరిగితి పడుచులతోడ
కూరతోటల చొచ్చి కూరగాయలను

పెరుగుకొని వత్తును పేరెమున నేను
అదిగాక పురినిండ్ల నన్నింట చొచ్చి
అటకలమీదను అటు దాగియుండి
గట్టి సొమ్ముల నెల్ల ఘనముగా నేను
సంధ్యల కొనితెచ్చి సతులకు నిత్తు
కన్నగాండ్రను గూడి కన్నంబుపెట్టి
కన్ను దనియగ తెచ్చి కాంతల కిత్తు
అదిగాక తెరువాట్ల నందంద ద్రొత్తి
వెలయ ధనముల తెచ్చి వేశ్యల కిత్తు
ఈరీతి నుండియు నీయేటిదాక
ఈచందవోలుకు నెలమితో పోయి
గుండము గోకర్ణు కొనియాడ నంత
న న్నోరగాపిల్చి నయమున నతడు
వెయ్యి నూరుపదార్లు వెలయంగ నిచ్చి
ఈ రాత్రి నా పంక్తి 'నిందరు మీరు
భోంచేయవలె'నని పొందుగా చెప్ప
వెంట వచ్చినవారి విందుకు పంపి
నేను మాపటివేళ నేర్చినవిధము
కుక్కల వాకట్టి గొంకికత్తియును
సొక్కుల వీభూతి చొప్పగోలయును
పదిలంబు చేయించి పట్టుకవేగ
దృష్టిబంధనముచే తెలివిలేకుండ
అష్టదిక్కులు కట్టి యా మేడచొచ్చి
కొల్లగొట్టి ధనమ్ము కొంపోవునపుడు
రాజభటులు చూచి రయమున పోయి
గోకర్ణు కెరిగింప కోపాన నతడు
పట్టించి కొట్టించి పదిలంబుచేసి
తన నగరికిపోయె తగు నవసరమున
తెలవారినదాక తెలివితో వాని

మనుజుల నావద్ద మసలకయుంచి
వేకువనను లేచి వితరణమతిని
గోకర్ణు డేతెంచి 'కొర్తివీరుండ!
ఏమి కావలె నీకు నెరిగింపుమ'నుచు
మాడలు కస్తూరి మంచి కప్పురము
పచ్చలు కడియాలు బాహుదండలును
ఇచ్చిన గైకోక నిట్లంటి నేను:
'నా పంత మవధారు నరనాథచంద్ర!
నీకు గల దళముల నీ యశ్వములను
అణగించి పోయెద నటు నన్ను చూడు
మ'ని పల్కి బలముల నపుడు నే చూచి
అలరుచు నార్చుచు నా బలము తగిలి
చలమున శత్రుల సాహసం బణచి
గురజాలకును నేను గొబ్బునవస్తి
గోకర్ణుడంతట కోపించి మిగుల
అంతయు నెరిగించ నా రాజు అపుడు
నను చంపు మన్నను నలగాము చూచి
"న్యాయమా నను చంప నరనాథచంద్ర
నీకు నొప్పుము సేయ నీ రాజ్యమునకు
పరభూమిలో తెచ్చి బ్రతుకుచున్నాడ"
అని పల్కగా నాగు అప్పు డిట్లనియె:
'మాకు చేసిన కీడు మరియేమిలేదు
నాయుడు వచ్చెనా నాయునిమీద
సెలవిచ్చి విడుతుము చెండాడి చంపు
పల్లె నొక టిత్తుము బ్రహ్మన్న కొరకు'
అన విని నే నంటి నా నాగుతోడ:
'నా వ్రయమునకుగా నాగమ్మ నీవు
భావించి నే డిచ్చు పల్లెలు తరమె
ఒకపూట దప్పికి నొగిపోయలేవు

పోటుమాటలె కాని పొసగ దీమాట
ధట్టించి నీకు కల దళముల తోలి
పట్టవగలే నిన్ను బందెపెట్టెదను'
అన విని నాయురా లా రాజు జూచి
'వినవయ్య ! యో రాజ ! వీని గర్వంబు !
పట్టి గోకర్ణుడు బందిపెట్టించ
బలముల నందరి పారంగదోలె;
బాహులు కట్టించి పదిలంబుచేసి
వ్రేయించుమీ వీని వేవేగ కొరత"
అని లెంకలను పిలిచి యా నాయురాలు
'కొరతవేయుడు వీని కొంపోయి యిపుడె'
అనిన నందరు గూడి యా కొరతలోన
వ్రేయంగ యీ పురి వీరుడనైతి;
ఇటువలె భూతంబునై యుండగాను
బాటను పోయెడి బ్రాహ్మణుం డొకడు
నేనున్న విధమున నెరిచూచి యంత
పలికెను నా భాగ్యవశమున నిట్లు :
'ఈ కోటకై నాయు డేతెంచగలడు
నవబ్రహ్మలపేర నటియించు నతని
పాదము కొఱ్ఱుపై పరగ దాకినను
కలుగు స్వర్గము నీకు గడమ లేకుండ'
అని చెప్పి వెడలగా ఆ నాటినుండి
గొనకొని నీ రాక కోరుచునుంటి
వచ్చితి విప్పుడు వసుమతీనాథ
ఇచ్చి రక్షింపవే యింద్రలోకంబు"
అన విని నాయుడు అబ్బురంబంది
"ఓరి ! నీలావుకు నొనర మెచ్చితిని
కడువేగ దిగుమ"ని కరములు బట్టి
కరముతో నుదకంబు కడువేగ వాని

పైజల్లి "నీపేరు పలుమారు నేను
వినవలె నాకును వివరంబుగాను
వినిపించుమ"న్నను వీరు డిట్లనియె :
"కొమ్మడు నాపేరు కోటవారెల్ల
కార్తివీరుండని కొలిచిరి నన్ను"
అన వాని సత్యమును ఆత్మలో మెచ్చి
'కొమ్మడు కా డితడు గోపాలదాసి'
అనుచు తా నాపేరు అతనికి పెట్టి
వానికి తిరుమణి వలనొప్ప దిద్ది
కడు వేడ్క మంత్రమ్ము గరపె చెవిలోన;
అంతలోపల వాడు ఆ కొట్టు వెడలి
బ్రహ్మకి మ్రొక్కి తా పలికె నిట్లనుచు :
"ఆచార మెరుగని యజ్ఞాని నేను
ఆచారవంతుని అటు చేస్తివయ్య
నీకు శిష్యుండను నీకు దాసుడను
ముందు త్రిమూర్తులు ముదమొప్ప నీకు
కార్యమపూడిలో కలనిమధ్యమున
ప్రత్యక్షమౌదురు పాటించి వినుము
వీరుల నన్నొక వీరుని చేసి
నా పేరు మరువకు నాయుడ నీవు"
అని పల్కి వా డరిగె నటనుండి వేగ.

*పూజారి కొమ్మయ్య గురజాలకు బ్రహ్మన వచ్చెనని కలగని అతనిని తరిమివేయుదునని గుడికి బయలుదేరుట: బ్రహ్మన వానికి బుద్ధిగరపి తాను వచ్చిన వార్త నలగామున కెరిగింపుమని పంపుట; కొమ్మయ్య ఆ వార్త నలగామునకు తెలియ చేసి గురజాలలో చాటింపువేయుట.*

అంతట బ్రహ్మన్న యచ్చోటు కదలి

గురిజాల కేతెంచి కోరిక మించ
కామేశ్వరుని గుడి గ్రక్కున చొచ్చి
గుడిమంటపములోన కుంతంబు నిల్పి
కరములు ముకుళించి కట్టెదుట నిల్చి
"సర్వలోకారాధ్య ! సర్వేశ !"యనుచు
మన మలర కనకమున మరియు పూజించి
విఘ్ననాయకునకు వీరభద్రునకు
దండంబు పెట్టి తా తడయక యపుడు
పరివార దేవతల ప్రార్థించి యచట
నిద్రింప తొడగెను నీరజోదరుడు;
అర్ధరాత్రి గడువ నా పురిలోన
తనయింట నిద్రించు తంబళ్ల పెద్ద
కలత నిద్దురలోన కలగని యరచి
'నాయుడు గురజాల నడివీధి కేగి
నాయకుల నశ్వముల నలినలి చేసి
పగగొని నలగాము పట్టుకపోయె
వేగ నాయుని తగిలి వ్రేయంగవలయు'
అని త్రుళ్లిపడిలేచి యాలిని పొడిచి
అలసట వచ్చియు నామె కౌగిటను
వల నొప్ప నదుముకొని "వనితరో ! నాకు
దేవరపూజింప తెల్లమి యయ్యె
పోవలె జాగంట బోనకావడియు
అందియ్య"మని పలక నా గొల్లసాని
"ప్రొద్దెరుంగవు ఇంత ప్రొద్దున్నదయ్య
వేగమె పోవంగ వేగిరపడకు
మాపటి జామున మండాది విడచి
ఏపార నాయుడు ఏతెంచె ననుచు
అడకొడకు ప్రజ లాడుచున్నారు
విడువవు నీ ధూర్తవిధము లెన్నడును

నాయుడు వచ్చెనా నాగభూషణుకు
తెచ్చెరా నాపాలి దైవంబటంచు
పొందుగా నిన్నువ్రేయ పోవలద"నిన
కోపించి పెండ్లాము కోలను మొత్తి
బోనకాపడి గంట పొందుగానంది
"నన్నెరుంగవు నీవు నాలావు కొలది
పసచెడ నాయుని పారదోలుదును
ఇంట పదిలమ్ముగా నింతిరో యుండు"
అనుచు కొమ్మడు వీధి కల్లన వచ్చి
కదలి నడువగ గంట గ్రక్కున దాక
"అదియు శకునంబు గా దయ్యరో"యనిన
ఇటువంటి శకునంబు లీ తంబళికిని
మంచివని కదలెను మార్గమ్మువెంట
అట తూర్పు గవనికి అతఁడు వచ్చి
"దేవుని పూజింప పోవుచున్నాడ
దిడ్డి తీయింపుడీ తెలవారవచ్చె
అను మాటలకు భటు లప్పు డిట్లనిరి:
"వినవయ్య ! కొమ్మయ్య ! వేగిరపడకు
వీరుడు బ్రహ్మన్న వెలపట వచ్చి
యున్నాడనుచు చెప్ప నూరివారెల్ల
పదిలమై యున్నాము బలములతోడ"
అనిన కొమ్మ జియ్య రల్లననవ్వి
"వినరయ్య! నాయుడు వెలినుండెనేని
పరువడి తలపడుదు పరివారమాన
నాయుని పిడికిట నలినలి చేతు"
అన విని పరివార మందరు నవ్వి
"వీని ప్రల్లదములు వినవలద"నుచు
ఆతని మెడబట్టి యావలత్రోయ
వెనక మరలిచూచి వెలవెలపోయి

చంద్రునిపై మొగులు సరిగొని కప్ప
తత్తరపడి కొంతతడవు నిల్చుండి
సుందర వృక్షంబు మొదలును కదల
కనుగొని కొమ్మయ్య కదలకయుండె;
కొమ్మయ్య యంతట గుడికిని వచ్చి
మంటపమ్మున నేవా మంటలక్రియను
మండంగ జూచియు మగుడి పోదలచి
కదలంగ వెరచియు కండ్లు చికిలించి
'ఇట కేలవచ్చితి నెరిగెరిగి నేను
అలిమాటలు వినక నధముడ నైతి;
వలదని పరులైన వారింపరైరి
ఎరుగక వచ్చితి నీ ఫలము గుడువ
గరళకంఠుని మాయ కాబోలు'ననుచు
అట భేరి కడకు తా నల్లనవచ్చి
భీతి కావడి డించి భేరి మ్రోయించె;
ఆ మ్రోతవిని నాయు డల్లన నొదిగి
గంటలు మువ్వలు కదలంగనీక
కుంతంబు నొకమూల కుదురుగపెట్టి
కంబమ్ము చాటున కదలకయుండె;
అంతట సజ్జయు నంగనాల్ బిందె
పుచ్చుక కొమ్మయ్య పూదోట చొచ్చి
పూజకు పత్రియు పూవులు కోసి
నీటను బిందెను నిండుగా ముంచి
కుడిభుజంబున బెట్టి కూపంబు వెడలి
కడుభక్తి నేతెంచి కరకంఠుకడకు
శిరసుపై పత్రిని చేతను తుడిచి
అభిషేక మొనరించి యభవుని కపుడు
బాగుగా శిరసున పత్రియు పెట్టి
కరములు ముకుళించి కరకంఠు పొగడె;

బ్రహ్మన్న యుంచిన పసిడిపూవులను
నందికడ నున్నట్టి నాల్గుమాడలను
అటు పుచ్చుకొని వాడు ఆశ్చర్యమొంది
'ఇటువలె పూజింప నీ భూమిలోన
కన్నడ బ్రహ్మయె కాక చోడండొ
కన్నప్పరాయడొ కరికాలచోడొ
సృష్టిలో వెలసిన చరితొండనంబొ
ఘనుడు శీలమబ్రహ్మి కాక కనకంబు
అభిషేక మొనరించి యరిగెడువారు
ఈ భూమిలో లేరు ఈ పురి లేరు'
అని మనంబున వాడు ఆశ్చర్యమొంది
ఆ నందివాహను కతిముదంబునను
చేకొని భక్తితో చేతులు మొగిచి
"పలనాడు నంతయు పాడుచేయంగ
పంతంబు పట్టెను బ్రహ్మినాయుండు;
నాయుడు రాకుండ నన్నేలు స్వామి!
కలహించి మన కోట ఖండించ చూచు
వియ్యపుగండువారి పెడలంగతోలి
సుంకరుల ముగ్గురి సుడియంగనీక
వంకిదేవిరాజులు వాలుమన్నీలు
పలనాడు చొరనీక పారంగతోలి
ఎలమితో నీ రాజు నేలించు భూమి"
అని మంత్రపుష్పముల్ హరుమీద బెట్టె;
అంతట బ్రహ్మన్న యాగ్రహుడగుచు
"ఏల తిట్టితి వోరి! యెలుగు చెడంగ
తల తరిగి నిన్నిపుడె దండధరుపురికి
పంపెద నెక్కడ పారెద వోరి?"
అన విని కొమ్మయ్య యదరిపడి జడిసి
"బ్రహ్మరాక్షసి యను పెనుభూత మిచట

ఉన్నదనుచు జెప్ప నొగివిందు నేను
అది యేమొ'యని భీతి యడలి వెందిరిగి
బ్రహ్మని కనుగొని భయముతో ననియె :
"ని న్నేల నిందింతు నీలవర్ణుండ
తిట్టుదునా నిన్ను దీపింతు కాని
నీకు బ్రీతుండను నియతితో నేను
నీ చిత్తమెట్లున్న నే నట్లు నడతు
మును నీవు పూజించు మూడుకాలములు
శివపూజ చేతును శీలమబ్రహ్మ !"
అన విని నాయుడు అతనిని చూచి
"విఘ్నేశు విశ్వేశు వీరభద్రేశు
పరివార దేవతల బ్రార్థించు"మనిన
"సర్వలోకారాధ్య ! సర్వేశ వినవె !
పతి కామరాజును పారంగదోలి
అరువదేగురు వీరు లధికులచేయు
నమ్మిన నా స్వామి నాయుని నేలు
ధర్మాత్ము డితనిచే ధరణి నేలించు"
అనుచు పూజించియు నా కొమ్మ దంత
పరమభక్తుండై బ్రహ్మతో పల్కె :
"అభవుని కృపచే ననంతకాలమ్ము
ఏలుము పలనాడు ఎదురులేకుండ"
ఆ మాట విని నాయు డతని కిట్లనియె :
"వినిపించు రాజుల కే వచ్చు విధము
ఏడుఘడియల బ్రొద్దు ఎక్కిన వెనుక
గురజాల పొడవంగ కోరి నే వస్తి
అని పల్కు రాజుతో పట కేగి నీవు"
అనిన వా డిట్లనె నా నాయునకును
"అయ్య ! నీ యానతి నటువలె చేతు
అరిగెద నే నిపుడె యానవా లిమ్ము"

అన విని బ్రహ్మన్న ఔగాక యనుచు
వ్రేలియుంగర మిచ్చి విచ్చేయు మనిన
జాగు సేయక వాడు సయ్యన కదలి
చనుదెంచి యా రాజు సన్నిధి చేరి
"వినవయ్య యోరాజ! వివరంబుగాను
పగబూని మనమీద బ్రహ్మన్న తాను
కుంతమ్ము ధరియించి గుడినుండె నిపుడు;
ఏడుగడియల ప్రొద్దు ఎక్కిన వెనుక
సాధించు నట కోట చాటు మన్నాడు
నా రాక నెరిగించు నలగాము కనుచు
ఆనవా లిచ్చినా డా బ్రహ్మనేడు"
అని పల్క ప్రశ్నించె నా రాజు నతని:
"బాదరాజు ముగురు బాలరాజులును
ధీరులు ఆ వంకిదేవిరాజులును
వీరులై నట్టి యా వెలమనాయకులు
శూరులు ముగ్గురు సుంకరులతోను
వచ్చెనా? ఒక్కడే వచ్చెనా బ్రహ్మ?"
అన విని కొమ్మయ్య ఆ రాజు కనియె:
"భూమీశ! త్రిపురముల్ పురహరుడు మున్ను
సాధించ వచ్చిన చందమున నేడు
ఏకాంగివీరుడై యిటువచ్చి బ్రహ్మ
పొరలిన కోపమున పొంగుచున్నాడు
వేట లాడుదునని వీరకామునికి
వినుపించుమని చెప్పి వీటిలోపలను
నాయుడు చాటుమని నా కానవాలు
ఉంగరమ్మిచ్చె తా నుర్వీశ యిదిగో!"
అని చెప్పి యుంగర మ్మారాజు కిచ్చి
"పురమున చాటుదు పోయి నే నిపుడె
సెలవిమ్ము ఓ రాజ! శీఘ్రంబె నీవు"

అన చాట సెలవిచ్చె నా కామరాజు
విన చాటె కొమ్మడు వీధివీధులను.

*బ్రహన యుద్ధముచేయవచ్చినాడనెడు వార్త విని, నాయకురాలు అశ్వికులను సిద్ధపరచుట; బ్రహ్మన నలగాముని సైనికులను చీకాకు పరచుట; బ్రహ్మన బారి పడకుండ నలగాముని గంగగుడికి పంపి, నాయకురాలు అతనిని రక్షింపుడని విప్రులను ప్రార్థించుట.*

నలగాము డంతట నాయురాల్ చేరి
ఎంతయు భయపడి యిట్లని పలికె :
"బ్రహ్మనాయుడు వచ్చె బవరంబు సేయ
కావడు బ్రహన్న కరుణించి మనల
సింహ మేనుంగుల చీరినయట్లు
కల బలంబుల నెల్ల కదనరంగమున
చెలరేగి నాయుడు చెండాడి చంపు
మమ్ము్మను పొరిగొని మడియించి నిన్ను
సమ్మదంబున తాను చను తన పురికి"
అన విని నాయు లా రాజుతోడ
"మండాది చౌరకుండ మరి బ్రహ్మనేని
పంతమున గెలుతును పలుకు లేమిటికి
గజము లశ్వమ్ములు గజ శూల బండ్లు
ఆయత్తపరపించి యనిచేతున"నుచు
బండ్లబోయిల పిలచి పలికె నీ రీతి :
"కలిగె కయ్యము మనకు ఘనులార ! మీరు
పన్నుడు బండ్లను పదిలంబుగాను"
ఆ మాట విని బోయి లాయత్తపరచి
తెచ్చిరి బండ్లను తేజంబు మెరయ;
అంతట నాయురా లశ్వరక్షకుల

"ఆయితపరచుడీ యశ్వమ్ము" లనగ
పక్కెరల్ వైచియును భద్రంబుగాను
పేటుగల హయముల పెక్కింటి చూచి
మొగసాల కడకును ముదముతో తెచ్చి
నిలిపిరి వారెంతొ నెమ్మదుల్ పొదల;
వసిగొయ్య వడిసెలు వాలు దొంకెనలు
గసికెలు దూలాలు గాలిదుందుభులు
ఎలమితో నా కోట కెత్తించి వేగ
కాచిన కలయంపి కాగుల నింపి
ఆయత్తపెట్టించె నా నాయురాలు;
అంతట తెలవారె నర్కు డుదయించె
గుడినుండి బ్రహ్మన్న కోటను చూచి
తలయూచి పంకించి తలపోసి యేమొ
ముఖమార్జనము చేసి మ్రొక్కి దేవునికి
ఏడుగడియల ప్రొద్దు ఎక్కినవెనుక
గురజాల సాధింప కుంతంబు పట్టి
సాగెను పురముకు సాహసవృత్తి;
అప్పుడు నాయురా లా బ్రహ్మచూచి
పటుగతి శూలాల బండ్లను బంప
అంతంత బండ్లవా రదరంటనార్చి
కదసి బ్రహ్మన మీద గజనారసములు
చిత్తవర్షము భంగి చెలరేగి వేయ
కోపించి నాయుడు కుంతమ్ముతోడ
చిద్రుపల్ చేసియు చెచ్చెర పోయి
కసిమసగి సింహంబు కరుల చెండాడు
విధమున నడుములు విరుగంగ పొడిచి
బండ్ల నాగమనేని పడగొట్టి పట్టి
శూలాల బండ్లన్ని చూర్ణముల్ చేసె;
కొందరు రౌతులు కోపించి యార్వ

గజరాజు తురగమును గ్రక్కున చంపి
మాళవపతి శిరము మరి విరగపొడిచి
వీరసింగాళుని విరఘంటు సోము
కంఠముల్ వ్రేటున ఖండించె బ్రహ్మ;
బూరుగపూవులు భువి రాలు భంగి
భూపాలు రౌతులు భూమిపై నొరుగ
అరసి నాయకురాలు అతి చోద్యమొంది
"కోటపై నుండెడి కోలలవార!
పాయక మీరు మీ పాశేలనుండి
వేయుడీ శస్త్రముల్ వేగంబె" యనిన
వసిగొయ్య వడిసెలు వాలుచొంకెనలు
తోరంపు కోలలు దొడ్డ యీటెలును
గసికెలు దూలాలు గాలిదుందుభులు
పటుగతి బ్రహ్మపై పడవేసి రపుడు;
అంతట నాయుడు అటనుండి తాను
ఆకాశమంటంగ నార్వంగ 'బ్రహ్మ
వెనుతగిలి వచ్చునని' వెస కామవిభుడు
మంత్రి నాగమ చూచి మరి యిట్లనియె:
"కటకటా! బ్రహ్మన్న కయ్యముల్ పెక్కు
పటుగతి గెలిచిన ప్రళయాంతకుండు
అతని గెల్వగరాదు ఆవహంబునను
మమ్మును నాయుడు మన్నించ డికను
నిన్ను నన్నును చంపు నిక్క మీ మాట"
అనపుడు నాయురా లా రాజు చూచి
"కలదు ఉపాయమ్ము కామభూనాధ!
నీ వేల తలకెదవు నే నుండగాను
కడువేగ గురజాల గంగకడ కేగి
విడువక యుండుము విప్రులగొంచు
వత్తు ప్రాణము గాచి వా రడ్డపడగ"

అని రాజు నొడబరచి యటనుండి కదలి
ఘనవేగమున వచ్చి కదసి విప్రులకు
కరములు ముకుళించి కడుభక్తి ననియె :
"క్రూరుడై నాయుడు గురజాల కోట
ఖండించి బలముల కదిసె రాజులను
ఒండేమి చేయునో యో విప్రులార !
కదిసి రక్షింపరే కామభూవరుని
మలినేడు మొదలుగా మహి కృష్ణవేణి
సాక్షిగా మీ కిత్తు సర్వమాన్యములు"
ఆ మాటలను విని ఔగాక యనుచు
సారది విప్రుల పెద్ద సోమయాజులును
మూడకడుపు సోమన దొప్పవఝ్ఝలును
కుడుముల గంగన్న కూర లబ్బయ్య
బూరెల భీమన్న పులుసు సుబ్బయ్య
గుంటుక లన్నయ కూచి మలిభొట్లు
పెసర పప్పుఅనంతు పెదిభొట్లుగారు
చతురువేదులవారి సర్వన భొట్లు
మొదలైన విప్రులు మునుకొని వేగ
కదలి యేతెంచిరి గంగగుడి కడకు.

*నలగామని రక్షింపుమని అంతఃపురస్త్రీలు బ్రహ్మనను ప్రార్థించుట : నలగాముడు గంగగుడికి పారిపోయెనని విని బ్రహ్మన అటకు పోవుట.*

అంతలో నాయుడు అగడత దాటి
పటుగతి కోటపై పక్షివలె నురికి
బలములను వీక్షించి బాగుబాగనుచు
గమిగూడి నడచిన గమిగాండ్ల బొడిచి
నలగాము లెంకల నడుములు త్రుంచి
చేకొని బలముల చెండాడు నపుడు

కోట వీడెను రాజు క్రుంగుచు మదిని;
నరసింగుదేవియు నలగామరాజు
కులసతి సుతులతో గొబ్బున వచ్చి
శీలమబ్రహ్మికి చేతులు మొగిచి
"కావవే రాజును కదన విక్రముడ!
కావవే మము నీవు కరుణాంతరంగ!
నాయురాల్ మాటలు నలగామరాజు
ఎరిగియు నెరుగక యేమేమొ చేసె
దొసగు లెంచుటకాదు దొడ్డతనంబు
దోషమ్ము గాయుట దొరతనము గాని
పంతమ్ము విడువుము బ్రహ్మన్న" యనిన
వీరుడు కరుణించి వీడ్కొల్పి వారి
వచ్చెను గవనికి వసుధ కంపింప;
పోయిన కాముని పొడగానలేక
కోటంత గాలించి క్రోధంబుతోడ
గవని వెడలి రాగ కనియె కోమటిని;
వెరచి వెనుకకు బార వెసకొమ్మిసెట్టి
రయమున కూడంగ రణ విజయుండు
భీతిల్లి కోమటి పృథివిపై పడియు
"నా తెరగు జెప్పెద నాయుడ! వినుము
ఉప్పుగద్దెమునకై యూరికోమట్లు
జరిగిరి యందరు చయ్యన నిపుడు
మెస పెద్దవాడనై వెనుక చిక్కితిని
తగ నడ్డ మేతెంచు తప్పు క్షమించు
నాయెత్తు ధనమిత్తు నన్ను పోనిమ్ము"
అన విని నాయుండు "అటులనా" యనుచు
"రాచబంటవు నీవు రాజులపోక
ఏ చందమో మాకు నెరిగింపు" మనిన
"చెప్పెద వినుమం"చు చెప్పె కోమటియు

"అటు నిల్చి నీవపు డాశ్వంగ బెగడి
చేసిన దోసగుకు చింతిల్లి మిగుల
గురజాల గంగను కొల్వంగ రాజు
అశ్వంబు తా నెక్కి యరిగెను గుడికి"
అన విని బ్రహన్న యటు చనె వేగ;

*నలగామునికి గంగాదేవి అభయమిచ్చి, అతనిని క్షమింపుమని బ్రహనను కోరుట; బ్రహ్మన నలగాముని క్షమించి మండాది కేగుట.*

అప్పట కామరా జశ్వమ్ము డిగ్గి
గంగగుడిని జేరి కరములు మొగిచి
"శరణు! శరణ్యద శాంభవీదేవి!
ఆదిమహాశక్తి అఖిలైకమాత
వేదగుణాన్విత వేల్పువు నీవు
అనుదినము రక్షించ హరుడును నీవు
అనుగయ్య మా తండ్రి యర్థితో దెచ్చి
గొనకొని గురజాల కోటలో మున్ను
భక్తి ప్రతిష్ఠించె పావని నిన్ను
అదె వచ్చె నాయుడు అటు కావుమమ్మ!"
అని పల్కె గంగయు నా రాజు కెదుట
అష్టభుజములతోడ నటు వచ్చి నిలచి
"వెరవకు నీవు నా వెనుకకు రమ్మ
నిలిచి నాయుని కెదుట నిన్ను బ్రోచెదను"
అని యభయమీయగా నా రాజు దాగె;
అంతట బ్రహ్మన్న యరుదెంచ దేవి
"రాకోయి నాయుడ! రాజు నా వెనుక
చేకొని యున్నాడు చేరకుము" నిన
కనలుచు బ్రహ్మన్న కణకతో పల్కె:
"తొలగవే యోగంగ! ద్రోహి యా రాజు

దళములను బంపించి ధర్మంబు విడిచి
మా బంట్ల జంపించె మంద పొడిపించె
ఏది ధర్మమొ వాని కెరిగింపవలెను
అడ్డుపడగ నేల నటు తొలగవమ్మ"
అన విని యాదేవి అతనిని గాంచి
"నాడు నీతిని దప్ప నలగామరాజు
నీవు ధర్మము దప్ప నీతియే నేడు ?
శరణని చేరిన శత్రువునైన
దయతోడ జూతురు ధర్మజ్ఞు లెపుడు
నీ వెరుంగని దేది నీతి కోవిదుడ
కావవే బ్రహ్మన్న కరుణతో నతని
కారెమపూడి యా కలనిలోపలను
నీ మాట చేసెద నియమంబుతోడ"
అన విని బ్రహ్మన్న యా రాజు గాంచి
"వెళ్ళిరమ్మన్న"ను వెలవెలబోయి
నిలిచి గజగజ వణకి నేలగూలగను
అంతలోపల విప్రులందరు వచ్చి
"ఓ నీలవర్ణుండ ! యో రామచంద్ర !
భావింప కలియుగ భార్గవ రామ !
ఓ కాలరుద్రుడ ! యో నారసింహ !
కలియుగంబున దాన కర్ణావతార !
శీలమ వరతనయ ! చిరతపపుణ్య !
వసుధలో నీసరి వర్ణింపగలమె
కాచి రక్షింపవే కామభూపరుని"
అనుచు ప్రార్థించగా నా బ్రహ్మనీడు
విప్రులకును మ్రొక్కి వినయంబుతోడ
మాడలు కప్పంబు మన్నించియిచ్చి
కామభూపతి జూచి కరుణించి మిగుల
కడువేగ వడమటి గవని కేతెంచి

జనులు జయపెట్టంగ జగదీశ్వరునికి
అభయ పట్టముగట్టి యప్పు డిట్లనియె :
"అనుగుభూపతి మృతుడైనది మొదలు
కట్టితి పట్టంబు కామభూపాల !
ఎల్ల రాజు లెరుగ నేలిస్తి భూమి
తమ్ములన్ నొగిలించ తప్పు గాచితిని
మదమున మునుకొని మాచర్లకొరకు
కోడిపోరును బెట్టి క్రోధంబుతోడ
కట్టుబోతులచేత కట్టించి కోడి
మీదు పరికించక మిగుల జేసితివి;
గోపనన్ జంపిన కోపంబు లేక
మాచర్లపట్టంబు మాన్యమ్ము లిచ్చి
మందాడి పోవంగ మంద పొడిపించ
ఏమనుకొంటివి యినకులేశ్వరుడ !
ఏలుము బుద్ధిగ ల్గెంతయు నీవు
వేగ పోవలె నేను విను బంటు నొకని
ఇమ్మ"న్న నా రాజు ఇట్లని పలికె :
"బ్రహ్మన్న ! నీకుగా భయపడి ప్రజలు
చెల్లాడి పోయిరి చేర రెవ్వరును
రమ్మన్న వచ్చెద రమణతో న"విన
దయగలిగి నాయుడు తనలోన వగచి
"భూమిపాలక ! నీవు భూమి పాలించు !"
అని చెప్పి విప్రుల కతిభక్తి మ్రొక్కి
కదలెను అటనుండి కడు జవంబునను;
కంబముపాడును గాద్దెలవాగు
మాచర్లపురి దాటి మళ్ళియు త్రోవ
అనుగురాజుపల్లె నతి వేగ దాటి
కడు మోదమున వచ్చి గంద్రకోటకును
చేరెను మందాడి శీలమబ్రహ్మ.

# అలరాజు రాయబారము

## కథా సంగ్రహము

నలగామునకును, తమకును మచ్చరము పెరుగుటచే బ్రహ్మన యిక మండాది నుండుట మంచిదికాదని భావించి, మలిదేవాదులతో మేడపికి వలస పోయెను. వారచట కొన్నేండ్లు నిలిచి, వలస గడువును చెల్లించిరి. గడువు తీరెను కనుక, మలిదేవునకు రావలసిన రాజ్యమును తిరిగి యిమ్మని అడుగుటకు బ్రహ్మన అలరాజును గురజాలకు రాయబార మంప నిశ్చయించెను.

రాచమల్లుడను బిరుదు వహించిన అలరాజు మలిదేవుని బావమరది అగు కొమ్మరాజునకు పుత్రుడు; నలగామునకు అల్లుడు. అటు వారికిని, ఇటు వీరికిని దగ్గరవాడగుటచే అలరాజు వలన కార్యము చక్కబడునని బ్రహ్మన ఆశించెనుకాని, కొమ్మ రాజు తన పుత్రుని కేమి ఆపదవచ్చునో అని భయపడి, ఆతనిని నలగాముని కడకు రాయబార మంపుటకు అంగీకరింప

వయ్యెను. బ్రహ్మన అలరాజునకు ఏ అపాయము వాటిల్లదని నచ్చచెప్పి, అతనికి మారుగా తన పుత్రుడు బాలచంద్రుని కొమ్మరాజు కడ నిల్లడపెట్టి, ఆతని భయమును పోగొట్టెను. 'అట్లయిన అలరాజు తల్లి చల్లమాంబ అనుజ్ఞను గైకొను మ'ని కొమ్మరాజు బ్రహ్మనను కోరగా, ఆత డామె అనుమతిని బడసి అలరాజునకు వయనము చెప్పెను.

అలరాజు బ్రహ్మన యానతి నొదలదాల్చి ప్రయాణోద్యుక్తుడై తన తల్లి కడకేగి దీవించి పంపుమని ఆమెకు మ్రొక్కెను. తల్లి తనయుని దీవించి మామగారియింట భుజింపక అట బస చేయక అప్రమత్తుడనై మెలగుమని ఆతనికి హితము గరపెను. అలరాజు అటనుండి కదలి బ్రహ్మన కడకు ఏతెంచి తాను గురజాలకు పోవుచుంటిననియు, రాజ్యమీయక నాయకురాలు తిరుగబడినచో ఆమెను బంధించి నేడపికి గొని తెచ్చెద ననియు పలుకగా, బ్రహ్మన ఆతని నా విధముగా చేయవలదని సరసముగా సంధిమాట్లాడి రమ్మని ఆనతిచ్చి 'గోసంగి కన్న మను ఆతనికి తోడిచ్చి గురజాలకు పంపెను.

అలరాజు రాయబారము నెరపుటకై గురజాల వచ్చినా డనెడు వార్త విని నలగాముడు కొలువుతీర్చి కూర్చుండెను. అలరాజు కొలువున కేతెంచి మామకు మ్రొక్కి తాను వచ్చిన కార్యము ఆతని కెరింగించి 'నీకు అల్లుడను; ఆ పుడను; నా మాట మన్నింపుము; దాయల భాగము దాయలకిమ్మ'ని మరిమరి చెప్పెను. కాని నలగాముడు అల్లుని మాటలు చెవినిపెట్టక ఒకసారి పందెమున ఓడిపోయిన రాజ్యము మలిదేవునకు మరల ఎట్లు వచ్చునని ప్రశ్నించుచు

వారు యుద్ధమునకు తలపడుచో వారి నెదిరించుటకు తనకు కావలసినంత బలగమున్నదని బీరములు పల్కెను. అలరాజు అతని బెదరింపులను లక్ష్యపెట్టక బిరుదువీరు లెందరైనను తనకు సాటి కారనియు గురజాల దళములన్నింటిని హతము చేయుటకు పెద్దన కన్నమ లిద్దరు చాలుదురనియు బదులు చెప్పెను. ఇట్లు మామయును అల్లుడును వాదించుకొనుచుండగా కొలువున కూర్చున్న చింతపల్లి రెడ్డి లేచి మలిదేవుని రాజ్యము మలిదేవుని కిమ్మని నలగామునకు హితము చెప్పెను. నాయకురాలు ఆతని మాటల కడ్డమువచ్చి మలిదేవుడు ఏనాడు రాజ్యమోడిపోయెనో ఆనాడే ఆతని రాజ్యము చెల్లిపోయినదనియు మరల రాజ్యమిమ్మని రాయబార మంపుటకు ఆతని కండకావరమే కారణమనియు అహంకరించెను. ఆమె అహంకారము చూచి అలరాజు 'ఈ కలహమున కంతకు నీవె మూలకారణమ'ని మండిపడి లేచి ఒరనుండి కత్తిదూసి ముందుకురికెను. నాయకురాలు నలగాముని ప్రక్కకు తొలగి వ్రేటును తప్పించుకొనెను. అలరాజు ఎత్తిన హస్తము క్రిందకు దింపక ఎదుట నున్న కంబమును కత్తితో వ్రేసెను. నలగాము డంతటితో ఊరకొని విడిదికి రమ్మని అల్లుని బుజ్జగించెను. కాని అలరాజు ఇక అట నుండుట కిష్టపడక కొలువు కూటము వీడి కన్నమను కలసి గురజాలనుండి బయలుదేరి చెర్లగుడిపాడును చేరెను.

కత్తి వ్రేటును తప్పించుకొన్న నాగమ్మ ఆ మరునాడు అలరాజును చంపించుటకు విషము కలిపిన పూలచెండును కట్టించి దానిని ఆతని కిచ్చిరమ్మని కొమ్మ జియ్యరును పంపి

చెను. కొమ్మాజియ్యరు ఆ పూలచెండును అందుకొని చెర్ల గుడిపాడు చేరి అలరాజును భ్రమింపచేసి దానిని ఆతని కిచ్చి గురజాలకు మరలివచ్చెను. అలరాజు ఆ పూలచెండు నా ఘ్రాణించి అశ్వముపై నిలువజాలక కన్నమను పిలిచి తనను క్రిందకు దింపుమని కోరెను. కన్నమ అతనిని క్రిందకుదింపి ఒక చెట్టునీడకు చేర్చెను. అలరాజు ఆఘ్రాణించిన విషము అంత కంతకు తలకెక్కగా ఆతడు విలవిల తన్నుకొనుచు కడసారి చూచుటకు తన భార్యయగు పేరాదేవిని తోడ్కొనిరమ్మని కన్నమను గురజాలకు పంపెను.

పేరాదేవి ఆ వార్త విని పలువిధముల దుఃఖించుచు విషము పెట్టించి తన భర్తను చంపించినందులకు తన తండ్రిని శపించి చెర్లగుడిపాడుకు అరిగెను. అలరాజు ఆమె నోదార్చి తన మరణకాల మాసన్నమగుట ఎరిగించి తన బిరుదులన్నియు తీసి, కన్నమను పిలిచి వాటిని బాలచంద్రున కిమ్మని అప్పగించి శివుని ధ్యానించుచు ప్రాణములు విడిచెను పేరాదేవి అతని శవమును పల్లకియందు పదిలముచేయించి మేడపి సమీపము నకు కొనితెచ్చి అచట పల్లకి దింపించి మలిదేవునకు అలరాజు మరణవార్త వినిపింపుమని కన్నమను పంపించెను.

కన్నమ మేడపి కేగి జరిగిన వృత్తాంతమంతయు మలి దేవున కెరిగించెను. అలరాజు మరణవార్త విని, ఆత్మబంధు వులు, స్నేహితులు, పురజనులు మిక్కిలి దుఃఖించుచు ఆతని శవమును మేడపికి గొనితెచ్చి రాచరావుల కడ చితిపేర్చిరి. పేరాదేవి, వగచెడి తన అత్త మామలను, ఆత్మబంధువులను

ఓదార్చి, తాను తన పతితో సహగమనము చేయుట కాయత్త పడెను. కొమ్మరాజు శివపూజలు చేసి, శివుని ధ్యానించుచు తన కొడుకునకు దిష్టితీసి, అతని పాదములు కడిగెను. అంతట అలరాజును చితియందు పరుండపెట్టగా పేరాదేవి తన భర్త పాదములకు మ్రొక్కుచు ఆతని పజ్జను చేరెను. అగ్నిహోత్రుడు ఆ దంపతుల దేహములను ఆహుతిగొనెను. ఆ జీవులు జంటగా కైలాసపదమున కేగిరి.

*బ్రహ్మన్న కొన్నియూళ్లను గుత్తకుపుచ్చుకొని మలిదేవాదులతో మండాదినుండి మేడపికి పోయిఅట గడువు చెల్లెడిదాక ఉండుట: మలిదేవాదులు తమ రాజ్యము తమ కిమ్మని నలగాముని కడకు అలరాజుచే రాయబారమంపుటకు నిశ్చయించుకొనుట: అలరాజు తల్లిదండ్రులు బ్రహ్మనమాటమీద అందుల కియ్యకొనుట.*

గురజాల సాధించి కోర్కెచే మించి
పంతమున లంకన్న పగతీరె ననుచు
వింతవేడుక పొందె వీరపుంగవుడు;
మరునాటి కొలువున మలిదేవరాజు
వంకిదేవులు మరి వాలునాయకులు
కొలువుండి రావేళ కొలువు దీపింప;
అంత నక్కడ బ్రహ్మ యాయత్తపడుచు
సర్వభూషలు దాల్చి సవరణతోడ
కేశవనామంబు కీలించి నొసట
పన్నెండ్రు పుండ్రముల్ బాగుగా తీర్చి
బంగారు పాలకి బరువడినెక్కి
ఎలమితో గొడుగుల నెత్తిరి మరియు
హనుమంత పడిగెలు ఆకాశమంట
వరుసతో రణభేరి వాద్యముల్ మ్రోయ
బ్రాహ్మణులు దీవింప భట్లు పొగడంగ
రాజు కొలువుకు వచ్చె రసికతమీర
పల్లకీ దిగి బ్రహ్మ బలువేగమునను
దండప్రణామముల్ తగ నాచరించి
"వినవయ్య మలిదేవ ! విభవదేవేంద్ర !
మీ యన్న కాముడు మిగుల క్రోధమున

మగువ మాటలు విని మహా నింతచేసి
చలపట్టి మనమీద జగతీశ్వరుండు;
ఇచ్చట నుండుట యిది బుద్ధికాదు
మచ్చరమ్ములు కలవు మనకు వారలకు
అటు గోలివారి యూళ్లందరు నెఱుగ
గురువుదేవరసీమ గుత్తగాచేసి
పన్నెండు వేలకు పట్టపురాజు!
మరి యియ్యకొని వస్తి మరియాద నేను;
మేడపి విచ్చేయు మేదినీశ్వరుడ!"
అనిన నాయుని మాట లాలించి రాజు
చాటించె మండాది జను లెల్ల వినగ;
పన్నెండు వాడల ప్రజలెల్లవారు
కరణాలు కాపులు కదలి మండాది
వేగ మేడపికిని వెడలి రంతటను:
రాజులు మొదలుగా రాచదేవులును
అరువదేగురు వీరు లా పుణ్యసుతులు
వేడుక తోడుత వెడలి యేతెంచి
శృంగపురరేవుకు శీఘ్రమున వచ్చి
తివిరి దాటిరి నదిని ధీరత మెరసి
కవులు విద్వాంసులు గాయకోత్తములు
మేడపి విడిసిరి మేదినీశ్వరులు;
విడిసిన పురమున వీధులేర్పరచి
చుట్టుకొల్లారముల్ చుట్టుగోడలును
నవరంగ మిండ్లును నడుమ చవికెలును
రాజులు కొలువుండ రతనాలసాల
వీరులు కొలువుండ వీరమొగసాల
ఇబ్భంగి పట్టణ మెల్ల కట్టించి
అంగళ్ళ వస్తువు లవి యేరుపరచి
ఎదురు లేకుండిరి యెల్లసంపదల;

సకలభాగ్యమ్ముల సంపూర్ణులగుచు
ప్రజలును దొరలును పరిగ పెద్దలును
పాలింపుచుండె నా పట్టణము రాజు.
క్రమముగా నేడేండ్లు గడువు చెల్లించి
మలిదేవు కొలువుండ మదనుడు బ్రహ్మ
దివ్యభూషణములు దివ్యాంబరములు
పద్మాల పతకంబు పరగ ధరియించి
జాణలు సరసులు సందడి కొలువ
బ్రాహ్మణుల్ దీవింప భట్లు పొగడంగ
పాలకి దిగివచ్చి బాలరాజులకు
దండంబుబెట్టి యంతట నిట్టులనియె :
"వినవయ్య ! మలిదేవ ! విన్నపం బొకటి
అన్న కామునితోడ ఆడిన మితులు
ఏడేండ్లె కాక మరి యేడునెలలాయె
మనభూమి నడుగంగ మర్యాద యిపుడు
రాయబారము పంపు రాజ ! నీ వని"న
విని పల్కె మలిదేవు వెస బ్రహ్మతోడ :
"విన్నపం బిటు విను విమలసత్కీర్తి !
మా తండ్రనుగురాజు మహితవిక్రముడు
సోమవంశమునందు సొంపైనరాజు
వితరణ సురరాజు విఖ్యాతబలుడు
మరణవేళను నీకు మమ్మొప్పగించి
ఇల్లడగా చేసి యిహమును బాసె;
అంతనుండియు మమ్ము అరయుచుండితివి
బలువైన రాజ్యమ్ము పాళలుచేసి
మమ్ము మా పాలిలో మరి నిల్పితయ్య
ఏ కొదువ లేకుండ యేలించితయ్య;
కోడిపోరున మన మోడిపోవుటయు
నిండిన పట్టమ్ము పండిన భూమి

వదలి మండాదికి వలసవచ్చుటయు
మండాదినుండగా మరినాయుడాలు
వీధులపల్నేని వెన నంపి మంద
పొడిపించు టాదిగా పోల చూడంగ
దుర్విధి చలమున తొలగక వెంట
తరుముచుండె నటంచు తలతు నెమ్మదిని;
ఇచట మేడపినైన నింతంతనుండి
కాలమ్ము గడుపుట కార్యమ్ము మాకు
మాకేడ రాజ్యంబు ? మాకేడ భూమి ?
మాచెర్లపట్నమ్ము మాకేలవచ్చు ?"
అన విని నాయుడు అతనితోననియె :
"వినవయ్య మలిదేవ ! విన్నపంబొకటి
విధిమాటకేమి వివేకియౌవాడు
పూనిసేయవలయు పురుషకార్యమ్ము
రాయబారముకట్టి రాచకార్యముకు
ఎవ్వరు గురజాల కేగవలె చెపుమ"
అనిన నాయునిమాట లందరు వినియు
విరుల కధికుడౌ వరుండు గండు
కన్నమ లేచియు కరములు మొగచి
"వినవయ్య బ్రహ్మయ్య విన్నపంబొకటి
ఎవ్వరి నంపిన నేగెదమయ్య
గురజాల కడకేగి కువలయాధిపుని
మాటనేర్పులచేత మనభూమి నడిగి
తిరుగ రాజ్యము బడసి ధీరత మెరసి
రాగల నిపుణుని రయమున నిపుడె
అంపుము బ్రహ్మన్న అనుమానమేల"
అనిన వారలతోడ ననియె మలిదేవు
"సామవాక్యములతో శత్రువులనైన
మెప్పింపగలవాడు మేటిశాంతుండు

అదిగాక యా వీటి కల్లుండు రాచ
మల్లు డాతని సతియు మగువ పేరమ్మ
ఆ వీటనుండుట ఆప్తుడందరకు
కొమ్మభూపతి యాజ్ఞగొని మల్లు రాయ
బారమ్ము పంపుట భావ్యంబు మనకు"
అనిన నాయుడు మెచ్చి యా మాటలకును
కొమ్మభూపతి జూచి కూర్మితోననియె
"వినవయ్య యొకమాట వీరశేఖరుడ!
సోమవంశమునందు శోభిల్లురాజ!
ముక్కంటి నినుచూచి మోదంబుతోడ
జంగమై నిత్యమ్ము సరిబంతికొచ్చు
భక్తవత్సలుప్రేమ బడసిన రాజ
అరయ నీ కొమరుడౌ అల రాచమల్లు
రాయబారము పంపు రాజు సెలవయ్యె
పంపుమ"న్నను రాజు పలికె నాయునికి
"రాజు లెన్నండేని రాయబారములు
పోయిరే నాయుడా! పొసగ దీ మాట
తగునయ్య యిట్లాడ ధర్మమా నీకు
బ్రాహ్మడు పోవలె భట్టుపోవలెను
నా కొమారుని బంప న్యాయమా నీకు
మా తండ్రితోడనే మడసెద మనగ
ఏమని నమ్మించి యేల తెచ్చితివి
నీళల ముంచిన పాల ముంచినను
నీ భారమేకద నీలవర్ణుండ"
అనిన నాయుడు పల్కె నందరు వినగ
"నా కొడుకు బాలుడు నమ్మగలవాడు
బాలుడు కా డతడు పగతులవైరి
నీ కుమారుని రీతి నీకు వశవర్తి
నీకు నిల్లడ యిత్తు నిజముగా నమ్ము"

అనుచు బాలునితెచ్చి యా రాజు కిచ్చె;
ఇచ్చిన కొమ్మరా జిట్లని పలికె :
"న న్నేల దూరెదు నాయుడ ! నీవు
చెలియలి కొకమాట చెప్పుమీ" యనిన
అవుగాక యనివేగ యటనుండి కదలి
వంకిదేవి నగరికి వచ్చెను బ్రహ్మ;
వచ్చుట తగ నెరిగి వనిత చల్లమ్మ
పసిడి పళ్ళెముతోడ పరగ నివాళి
ఇంతులు పట్టుక నెదురుగా రాగ
అడ్డతెర పట్టించి యర్ఘ్యపాద్యములు
నివ్వాళి యిప్పించె నీలవర్ణునికి
గంధము కస్తూరి కలయ నిప్పించి
అతిభ క్తితో పలికె నన్న కిట్లనుచు :
"ఎన్నడు మా నగరి కేతెంచు టెరుగ
వ స్తిరి మా భాగ్యవశమున మీరు
ఏమాన తి స్తిరి ఎరిగింపు మాకు"
అనిన బ్రహ్మన పలికె నా రమణితోడ
"విను చల్లమాదేవి వినుము నీ సుతుని
రాయబారము కొరకు రాజు కోరంగ
పంపుమని వచ్చితి పణతిరో నేను
ఆనతి యిమ్మ"న్న అదరిపడి జడిసి
పెనుదుఃఖమును పొంది వెలవెలబోయి
వజ్రాయుధముమీద పడిబడినట్టి
క్రమమున మూర్ఛతో కాంత తా నొరిగె;
ఒక కొంతసేపున కొయ్యన తెలసి
పలికె చల్లమదేవి బ్రహ్మతో నపుడు
"తరుణి మా యత్తకు తనయు లేగురును
ఏగురి కొక్కడే యెలమి నా సుతుడు
కల్యాణ మేలుచు ఘనుడు మా మామ

లింగైక్యమందగా లీలతో రాజు
మీలోకి వచ్చెను మిగుల బెరుగామె
నమ్మి వచ్చినవారి నడుపవలెగాక
మహిలోన గూల్చెడి మహిపతుల్ కలరె
ఏసురి కొక సుతు నేమని యిచ్చి
ఏ దేశ మే భూమి కేగెదమయ్యా
నా కుమారుని పంప న్యాయమా నీకు
వెనుక దిక్కెటులేదు వెదకి చూచినను
నీ వెరుంగని యట్టి నియతులు కలవె ?"
అనిన బ్రహ్మన విని యప్పు డిట్లనియె :
"నీకు దుఃఖంబేల నీరజనేత్రి
రాయబారము పోవు రసికుల నెల్ల
ఎరుగచెప్పెదనమ్మ యెలమితో వినుము
రమణికై రాముండు రావణాసురుడు
పోరాడువేళల పూని యంగదుడు
రాయబారము పోడె రాచకార్యముకు
ద్వాపరయుగమందు తనర పాండవులు
దుర్యోధనునితోడ తొడరిన యపుడు
కృష్ణుండు రాయబారిగ పోవలేదె
అటుగాక నీ సుతు కపరాధమైన
నా కొమరుని బాలు నరపతికొరకు
ఇల్లడ నిస్తిని యిందరిలోన
అంపు చల్లమదేవి ఆలస్యమేల
భూములు తెచ్చెడి పుణ్య మెట్టిదియొ ।"
ఆ మాటలాలించి యన్నను చూచి
కడుభక్తి తోడుత కన్నులు మొగిచి
"నీ వెరుగుదువయ్యా నీలవర్ణుండ !
నీమాట కెదురాడ నేర నేననుచు
వచ్చిబాగాలును పండు టాకులును

బంగారు కోరతో భక్తిమై నిచ్చి
వీడ్కొల్పె బ్రహ్మని విమలేందువదన.
మలిదేవుకొల్వుకు మరియేగుదెంచి
కట్టెదుట పులితోలు గద్దె కూర్చుండి
వలపలి తావున వరస కొలువున్న
అల్లుమల్లును చూచి యాబ్రహ్మ పలికె:
"ఆయత్తపడి రమ్ము అల్లు మల్లన్న!
రమణతో గురజాల రాయబారమ్ము
పోయి మన రాజ్యమ్ము పొందిరావలెను"
అనిన గొబ్బునలేచి యారాజు చెలగి
తన నగరి కేతెంచి తగవారి ననిపి
జలకంబులాడి తా సంతోషమొంది
శివపూజ లొగిచేసి శివునకు మ్రొక్కి
ఆరగించెను వేడ్క నతి సంభ్రమమున:

*రాయబారమునకు పోవుటకై అలరాజును ఆతని తల్లి అప్రమత్తుడవై మెలగుమని బోధించుట: అలరాజు కన్నమతో గురజాలకేగి, తాను వచ్చిన వార్త నలగామున కెరిగించుట.*

సాటి శత్రువులకెల్ల సమరంబునందు
గుండెదిగులను బిరుదుపెండెంబు పెట్టి
తాత వీరసోము తనకిచ్చినట్టి
మణుల కిరీటంబు మరి ధరియించి
పసిడిపల్లము పట్టుబాసికము నొసట
కత్తుల కళ్లెము కనక శోభితము
సవరాల జమనికె సరగ పన్నించి
తెచ్చిన యశ్వమును తేకువ చూచి
ఎక్కియా యలమల్లు ఎంతొ వేడుకను
తల్లి చల్లమచేరి దండంబు పెట్టె

దండంబు పెట్టిన తనయునిచూచి
నివ్వాళి పళ్లెంబు నిండు టుల్లమున
నిచ్చి కుమారుని కిట్లని పలికె ;
"భావించి కార్యసంపన్నుఁడ వగుము
ఆవీటి కే తెంచి యా నాయురాలు
మాయల కేవేళ మది నుబ్బకయ్య
నాయురాలిని నీవు నమ్మకుమయ్య
విందు ఒప్పకు మయ్య విడిదికి చనకు
అందున నే వస్తు వందకు మయ్య
తాల్మిమై కార్యసంధానంబుచేసి
మాయయ్య వేగంబెమరలి రావయ్య"
అని పంపగను వేగ నా యల్లుమల్లు
తల్లియానతి గొని తడయక బ్రహ్మ
నాయుని కడకేగి నయముతో మ్రొక్కి
"నీవు చెప్పినరీతి నేరుపుతోడ
మనభూమి యడిగెద మరి వారు మెచ్చి
అడిగిన దిచ్చిన అది తగవగును
తివిరి నాయకురాలు తిరుగంగబడిన
పట్టి తాళ్ళను విరిచికట్టి నీ కడకు
తెత్తు నా పంతంబు తెరగొప్ప వినుము"
అనురాజు పల్కఁల కా బ్రహ్మ యనియె :
"ఇటువలె చేసిన నిలలోనివారు
నవ్వెదు రా పని న్యాయమ్ముకాదు
పంచి యిచ్చిన భూమి పరగంగ వారు
నెరయలే దనినను నే మనగలము
మారుమాటాడక మగిడి రావలయు
సరసంబుతోడుత సంధిమాట్లాడు
పొమ్మ"ని విడియంబు పొందుగా నిచ్చి
కడుపేర్మి గోసంగు కన్నమను బిలచి

"అల్లిమల్లునితోడ నరుగంగవలయు
ఆయత్తపడి రమ్మ అతివేగమునను"
అనిన కన్నమ నేడు ఆయత్తపడియె ;
బిరుదు టందెల గండపెండెంబు తొడిగి
వరగంగ కుడిచేత భైరవకత్తి
ఎడమచేతను పెద్ద యీటెయు బట్టి
మోచేత నొక జల్లి మోకాల జల్లి
వీపున నవరాల వింజామరంబు
సవరించి యాత్మలో సంతోషపడుచు
దిండుతిరుగుచు వచ్చి ధీరతతోడ
మలిదేవరాజుకు మరిమ్రొక్కి నిలువ
"అలరాజు గురజాల కరుగంగవలసె
ఎప్పుడు నతనిని నేమరకుండు"
మని రాజు కన్నమ కప్పనచేసి
విడియంబు తగబెట్టి విచ్చేయు మనిన
కన్నమనేడును కాల్బలంబులును
అశ్వంబుపై నున్న యలరాజుతోడ
కదిలె గురజాలకు ఘనముగ నంత;
పాఠకుల్ మంగళపాటలు పాడ
శంఖముల్ కాహళుల్ సన్నరుంజలును
తమటముల్ తప్పెట్లు తగ బోరుకలుగ
గొడుగులు పడిగెలు కొదువలేకుండ
కన్నమ రాజును కదిసి కొల్వగను
నవరాల గొడుగును సవరణతోడ
సమకట్టి జల్లులు సవరించి మరియు
అరుదైన కరచూరి ఆయుధంబులును
గట్టి అమ్ములపొదుల్ గజశరాసనము
అక్షీణ మెరుపుల అమ్ముల పొదులు
బిరుదు టమ్ముల యందె భీకరంబుగను

గుఱ్ఱము డాకాల కుదురుగాబెట్టి
ప్రజలు సన్నుతిచేయ పట్టంబువెడలి
ఇసుక త్రిపురవర మిరవొప్పదాటి
మఱ్ఱివేములు దాటి మండలేశ్వరుడు
పడమట కంబముపాడు చేరగను
కాపు లెదురుగవచ్చి కానుకలిచ్చి
వీడుపట్లకు తెచ్చి విడియించి రెలమి ;
అంతలోపల సూర్యు డస్తాద్రి కరిగె ;
అచ్చోట నా కాపులందరు కూడి
విందులు గావింప వేవేగ రాజు
జలకంబులాడి తా సంతోషపడుచు
శివపూజ లొగిచేసి శివునికి మ్రొక్కి
ఆరగించెను వేగ అతి సంభ్రమమున
తగ చేతులను వార్చి తాంబూలమొంది
ఆ రాత్రి నిద్రించె నట తెల్లవారె;
ఘనభేరి వేయించి కదలి మరునాడు
కోలేరుదాటి యా కువలయాధిపుడు
రెంటాల గడిచి యా రేవంతసముడు
అదె యిదే గురజాల యనునంతలోన
పటహ కాహళభేరి ప్రముఖ వాద్యములు
మ్రోగించె దిక్కుల బోరుకలంగ
కాముడు నాయురాల్ కళవళపడిరి.
అందరు కోటపై నాయత్తపడియు
ఆతురపడుచున్న నంత లోపలను
అలరాజు తన భట్టు నతివేగనంపె ;
భట్టు కొలువుకు వచ్చి పతికామరాజు
కనుగొని పలికెను కడుసంతసమున
"రాజాధిరాజ ! యో రాజ దేవేంద్ర !
అనుగుభూపతిపుత్ర ! యయోధ్యరాజ !

రాయబారము వచ్చె రాజు మల్లన్న"
అని చెప్పివచ్చెను అలరాజు భట్టు;

*నలగాముడు అలరాజుసంధివాక్యములను త్రోసిపుచ్చి, మలిదేవునకు రాజ్యమెట్లువచ్చునని ప్రశ్నించుట : చింతపల్లిరెడ్డి నలగామునకు హితము చెప్పుట : నాయకురాలు మలిదేవుని దూషింపగా, అలరాజు ఆమెను వ్రేయబూనుట : నాయకురాలు అలరాజును చంపుటకై విషముతో నొక పూలచెండును కట్టించి, కొమ్మ్రజియ్యరుచే అతని కిప్పించుట.*

ఆ రాజు కొలువుండు టంతలో నెరిగి
గడియారమొగసాల కడకు నేతెంచి
పల్లకీదిగి రాజు పావాలు తొడిగి
రాజుకొలువుకు రాగ రాచదొరలెల్ల
దిక్కుల రాజులు దిగ్గున లేచి
కరములు మొగిచిరి కడుభక్తితోడ;
కూర్చుండు డని మల్లు కూర్మితో పలికి
మామను చూచి తా మర్యాదతోడ
పట్టుశాలువ తెచ్చి పాదాలమీద
పెట్టి దండముపెట్టి ప్రియములు చేయ
నలగాము డల్లుని నయమొప్ప మెచ్చి
కడుమంచి రుద్రాక్షగద్దెమీదటను
కూర్చుండు మన్నపుడు కూర్చుండ రాజు
అల్లుమల్లన చూచి యడిగె నొకమాట
"ఏమని పుత్తెంచె నెరిగింపుమ"నిన
మామకు తగ మ్రొక్కి మల్లు డిట్లనియె :
" 'ఏడేళ్ళు మితిదాటె నెరుగవే రాజ
ఏడునెలలు మీకు నెక్కువయయ్యె
మాభూమి మాకిమ్మ మైలమ్మ సుతుడ !'

అనిచెప్పి పంపిరి అవనీశ ! వినుము
అల్లుడ నీకు నే నాప్తుడ నుమ్మ
నా మాట మన్నించి న్యాయమ్ముగాను
దాయల భాగమ్ము తడయక యిమ్ము
కాదన్న నీ ప్రొద్దె కదలిపోయెదను"
అనవిని నలగాము డగ్నివలె మండి
"మీ భూమి యెక్కడ మీకిచ్చు టేడ
కోడిమేడములోన కోల్పోయి రెపుడొ
అప్పుడే మా వశమయ్యె భూమెల్ల
పంచి యిచ్చుటలేదు భ్రమయింతలేదు
పోరి గైకొన మీకు బుద్ధియగునేని
మీతోడ సమముగా మీరి పోరుటకు
మున్నూరు శూలాలు ముద్రగజములును
ఇరువది నాల్గువే లెసగు కాల్బలము
అరయ పండ్రెండు వే లశ్వమ్ములుండె"
అన బల్కె అలరాజు అందరు వినగ
"దళములు కలవని దర్ప మాడితివి
ఏడువేల్ గుఱ్ఱము లేకమైనపుడె
బాదరాజొక్కడె పట్టి సాధించు
మున్నూరు శూలాలు ముద్రగజములకు
ముగ్గురు సుంకర్లు మదమొప్ప సాటి ;
ఇరువది నాల్గువే లెసగు బంటులకు
ఏడ్గురు గోసంగు లెలమితో సాటి ;
అధిక బిరుదుల కెల్ల నలరాజు చాలు
అరులకు నంకుశ మ్మల్లు మల్లన్న"
అని కొల్వు కలయగా నరయుచుండంగ
చింతపల్లి రెడ్డి శీఘ్రమ్మె లేచి
"జగడ మేటికి నీకు జగతీశ్వరుండ !
భూ మీయ నందు వే భూపతియైన

నీకు నర్పింపగా నేర్పరి యౌనె"
అనినను నాయురా లా రెడ్డితోడ
"కోడిపోరున భూమి కోల్పోయి వారు
పత్రంబులో నున్న పలుకులుపట్టి
వలసపోవుట పోయె వారి రాజ్యమ్ము
పనివడి యీ రాయబారమ్ములేల
కావరమ్మున రాజు కనడింత" యనిన
కడకంట వీక్షించి గడు నుగ్రుడగుచు
కనలి యలరాజు ఆ కాంత కిట్లనియె :
"నీవు వచ్చినమొదలు నీతి బో విడిచి
అన్నదమ్ములలోన నతిపోరు బెట్ట
కన్నార చూచెను కామభూవిభుడు
కాకనే వచ్చిన కార్యసంగతిని
చేకూర్చి పంపక చెప్పెర నీవు
జుణిగిన పోనీను చూ చెద"ననుచు
గణుతింప తనచేతి ఖడ్గంబు బెరికి
పుడమి గడగడ వణక భూరివిక్రముడు
పిడుగు చందంబున బెడిదమ్ము సేయ
కొంకుచు రాజుమరుగుకు నేగె నామె
'వ్రేయనెత్తిన పూన్కి విడువరాద'నుచు
కట్టెదుటియొక యుక్కుకంబమ్ము వ్రేసి
నడిమికి రెండుగా నరికిన పిదప
విడువక నొరలోన వేసి యడిదంబు
బిసదురౌతుల నెత్తిపిడు గల్లుమల్లు
కడకు శాంతించియు కాముని కనియె :
"మధ్యవర్తులవద్ద మర్యాద యున్న
దటుగాన ఓ రాజ ! యణకువ వలయు
నేను కోపించిన నేర మెంచకుము"
అన విని నలగాము డల్లునితోడ

"జాగు లేమిటి కయ్య చయ్యన నీవు
వేగంబె విడిదికి వేంచేయు మ"నిన
"వినవయ్య యో మామ విన్నవించెదను
మునుకొని యా కార్యమునకు నే వచ్చి
ఒనరంగ విడిదిలో నుండగారాదు
పోయివచ్చెద నేను భూపాల" యనుచు
గోసంగి కన్నమ గొబ్బున పిల్చి
చెర్లగుడిపాటికి చేరెను రాజు;
చేరుచో నప్పుడు చెలి నాయురాలు
'అలరాజు చంపింతు' నని యాత్మదలచి
మునుకొని యేకాంతమునకు నేతెంచి
కనుగొని పలికె "నో కామభూపాల!
అలరాజు మనవీటి కల్లు డటంచు
నెలమితో వినయంబు లెంతచేసినను
మనసున కపటంబు మానకపోయె
పెనుపొంద పెనుబాము పెంచినయట్లు
విందు తా నొల్లక విడిది గైకొనక
అందంద తా నేగె నదిగాక మరియు
కొంక కిప్పుడు విందు కొలువులో నన్ను
పొంకంబుగా వేయ పూనె నవ్వేళ
గ్రక్కున నీ యెదుటి కంబంబు కతన
తక్కక శిరసు న త్తరి గాచె గాక
లేకున్న శిర మవలీల ఖండించు;
పగవాడు గాక యే పట్టుననైన
తెగునె యింతటి పనికి తెలియు మో రాజ!
ఏ తెరంగున నైన నే త్రోవనైన
అతని మదగర్వ మణగింతు న"నిన
విని నలగామభూవిభు డిట్లు లనియె:
"విను నాయురాల! వివేక శూన్యంబు

రాయబారము వచ్చె రాజు మల్లన్న"
అని చెప్పివచ్చెను అలరాజు భట్టు;

*నలగాముడు అలరాజుసంధివాక్యములను త్రోసి పుచ్చి, మలిదేవునకు రాజ్యమెట్లువచ్చునని ప్రశ్నించుట : చింతపల్లిరెడ్డి నలగామునకు హితము చెప్పుట : నాయకురాలు మలిదేవుని దూషింపగా, అలిరాజు ఆమెను త్రోయబూనుట : నాయకురాలు అలరాజును చంపుటకై విషముతో నొక పూలచెండును కట్టించి, కొమ్మజియ్యరుచే అతని కిప్పించుట.*

ఆ రాజు కొలువుండు టంతలో నెరిగి
గడియారమొగసాల కడకు నేతెంచి
పల్లకీదిగి రాజు పావాలు తొడిగి
రాజుకొలువుకు రాగ రాచదొరలెల్ల
దిక్కుల రాజులు దిగ్గున లేచి
కరములు మొగిచిరి కడుభక్తితోడ;
కూర్చుండుడని మల్లు కూర్మితో పలికి
మామను చూచి తా మర్యాదతోడ
పట్టుశాలువ తెచ్చి పాదాలమీద
పెట్టి దండముపెట్టి ప్రియములు చేయ
నలగాము డల్లుని నయమొప్ప మెచ్చి
కడుమంచి రుద్రాక్షగద్దెమీదటను
కూర్చుండు మన్నపుడు కూర్చుండ రాజు
అల్లుమల్లన చూచి యడిగె నొకమాట
"ఏమని పుత్తెంచె నెరిగింపుమ"నిన
మామకు తగమ్రొక్కి మల్లు డిట్లనియె :
"'ఏడేళ్ళ మితిదాటె నెరుగవే రాజ
ఏడునెలలు మీకు నెక్కువయయ్యె
మాభూమి మాకిమ్ము మైలమ్మ సుతుడ !'

అనిచెప్పి పంపిరి అవనీశ ! వినుము
అల్లుడ నీకు నే నాప్తుడ సుమ్మి
నా మాట మన్నించి న్యాయమ్ముగాను
దాయల భాగమ్ము తడయక యిమ్ము
కాదన్న నీ ప్రొద్దె కదలిపోయెదను"
అనవిని నలగాము డగ్నివలె మండి
"మీ భూమి యెక్కడ మీకిచ్చు టేడ
కోడిమేడములోన కోల్పోయి రెపుడొ
అప్పుడే మా వశమయ్యె భూమెల్ల
పంచి యిచ్చుటలేదు భ్రమయింతలేదు
పోరి గైకొన మీకు బుద్ధియగునేని
మీతోడ సమముగా మీరి పోరుటకు
మున్నూరు శూలాలు ముద్రగజములును
ఇరువది నాల్గువే లెసగు కాల్బలము
అరయ పండ్రెండు వే లశ్వమ్ములుండె"
అన బల్కె అలరాజు అందరు వినగ
"దళములు కలవని దర్ప మాడితివి
ఏడువేల్ గుఱ్ఱము లేకమైనపుడె
బాదరాజొక్కడె పట్టి సాధించు
మున్నూరు శూలాలు ముద్రగజములకు
ముగ్గురు సుంకర్లు ముదమొప్ప సాటి ;
ఇరువది నాల్గువే లెసగు బంటులకు
ఏడ్గురు గోసంగు లెలమితో సాటి ;
అధిక బిరుదుల కెల్ల నలరాజు చాలు
అరులకు నంకుశ మ్మల్లు మల్లన్న"
అని కొల్వు కలయగా నరయుచుండంగ
చింతపల్లి రెడ్డి శీఘ్రమ్మె లేచి
"జగడ మేటికి నీకు జగతీశ్వరుండ !
భూ మీయ నందు వే భూపతియైన

నీకు నర్పింపగా నేర్పరి యౌనె"
అనినను నాయురా లా రెడ్డితోడ
"కోడిపోరున భూమి కోల్పోయి వారు
పత్రంబులో నున్న పలుకులుపట్టి
వలసపోవుట పోయె వారి రాజ్యమ్ము
పనివడి యీ రాయబారమ్ములేల
కావరమ్మున రాజు కనడింత" యనిన
కడకంట వీక్షించి గడు నుగ్రుడగుచు
కనలి యలరాజు ఆ కాంత కిట్లనియె :
"నీవు వచ్చినమొదలు నీతి బో విడిచి
అన్నదమ్ములలోన నతిపోరు బెట్ట
కన్నార చూచెను కామభూవిభుడు
కాకనే వచ్చిన కార్యసంగతిని
చేకూర్చి పంపక చెచ్చెర నీవు
జుణిగిన పోనీను చూచెద" ననుచు
గణుతింప తనచేతి ఖడ్గంబు బెరికి
పుడమి గడగడ వణక భూరివిక్రముడు
పిడుగు చందంబున బెడిదమ్ము సేయ
కొంకుచు రాజుమరుగుకు నేగె నా మె
'వ్రేయనెత్తిన హూన్కి విడువరాద'నుచు
కట్టెదుటియొక యుక్కుకంబమ్ము వ్రేసి
నడిమికి రెండుగా నరికిన పిదప
విడువక నొరలోన వేసి యడిదంబు
బిరుదురౌతుల నెత్తిపిడు గల్లుమల్లు
కడకు శాంతించియు కాముని కనియె :
"మధ్యవర్తులవద్ద మర్యాద యున్న
దటుగాన ఓ రాజ ! యణకువ వలయు
నేను కోపించిన నేర మెంచకుము"
అన విని నలగాము డల్లునితోడ

"జాగు లేమిటి కయ్యా చయ్యన నీవు
వేగంబె విడిదికి వేంచేయు మ"నిన
"వినవయ్య యో మామ విన్నవించెదను
మునుకొని యా కార్యమునకు నే వచ్చి
ఒనరంగ విడిదిలో నుండగారాదు
పోయివచ్చెద నేను భూపాల" యనుచు
గోసంగి కన్నమ గొబ్బున పిల్చి
చెర్లగుడిపాటికి చేరెను రాజు;
చేరుచో నప్పుడు చెలి నాయురాలు
'అలరాజు చంపింతు' నని యాత్మదలచి
మునుకొని యేకాంతమునకు నేతెంచి
కనుగొని పలికె "నో కామభూపాల!
అలరాజు మనవీటి కల్లు డటంచు
నెలమితో వినయంబు లెంతచేసినను
మనసున కపటంబు మానకపోయె
పెనుపొంద పెనుబాము పెంచినయట్లు
విందు తా నొల్లక విడిది గైకొనక
అందంద తా నేగె నదిగాక మరియు
కొంక కిప్పుడు విందు కొలువులో నన్ను
పొంకంబుగా వేయ పూనె నవ్వేళ
గ్రక్కున నీ యెదుటి కంబంబు కతన
తక్కక శిరసు న త్తరి గాచె గాక
లేకున్న శిర మవలీల ఖండించు;
పగవాడు గాక యే పట్టుననైన
తెగునె యింతటి పనికి తెలియు మో రాజ
ఏ తెరంగుననైన నే త్రోవనైన
ఆతని మదగర్వ మణగింతు న"నిన
విని నలగామభూవిభు డిట్టు లనియె:
"విను నాయురాల! వివేక శూన్యంబు

నీతి విరుద్ధంబు నిఖిలలోకముల
ఈతరి వినగూడ దీ కార్యమ"నిన
ఆ నాయురా లిట్టు లనియె రాజునకు
"భూనాథ ! నీవు నా బుద్ధి వినవయ్య
ఎక్కడి అల్లుడు ఎక్కడి నీతి
గ్రక్కున సర్పంబు గరచిన వ్రేలు
ఖండితంబుగ దాని ఖండింపవలయు"
అనఘ మా రుత్తరం బానతి వద్దు
అనుగుభూపతి పాదమూన నీక"నిన
అరుదంది నలగాము డా యానమీద
ఉరవడి తలపోయుచున్న యవ్వేళ
ఆయెడ సంతోష మంది తా వెడలె;
తెలతెలవారంగ తెలివొంది వేగ
తనమది చెడుబుద్ధి తలచి నాగమ్మ
చెనటి తంబళ కొమ్మజియ్యరు బిలిచి
చెచ్చెర పువ్వులచెండు దెప్పించి
ఆఘ్రాణమొనరించు నట్టివారలను
ఆ క్షణంబున చంపు నౌషధక్రియలు
వీక్షించి చెండ్ల ప్రవేశంబుచేసి
మంత్రదేవతలను మాటియందునను
యంత్ర తంత్రంబుల నా లోన నునిచి
కొమ్మజియ్యరునకు గొబ్బున నిచ్చి
"అలరాజునిం చేరి యవలీల మొరగి
ఈ చెండు వాని చే నిచ్చి యాఘ్రాణ
మొనరించునట్లుగా నొనరించితేని
ఇచ్చవచ్చిన మెచ్చు లిచ్చెద ప్రాలు
మాలికతో నీవు మరలితివైన
నడుమ తునుకలుగాను నరికింతు నిన్ను
తడయక చనుమ"న్న తమ్మల జియ్య

రూహించి చెడుకార్య ముపదేశమిచ్చె
ద్రోహి యెంతటి పనికి దొరకొనె నకట
ఇచ్చిన పాపంబు యీ కుంటినైన
చచ్చుట దానిచే సర్వదా నిజము"
అని మది తలపోసి యాత్మలో వగచి
చెర్లగుడిపాటికి చెచ్చెర చేరి
మునుకొని యారాజు ముందరనుండి
ఎదురుగా వచ్చిన శ్లేగుచుండగను
మదినుబ్బి యలరాజు మమత లింపొంద
సమ్మదంబున ప్రియోత్సాహంబుతోడ
కొమ్మజియ్యరు జూచి ప్రియముతో ననియె ;
"ఓ కొమ్మజియ్య ! నీ యుద్యోగమేమి
ఏకార్యమున కిందు కేగుదెంచితివి
వినిపింపు" మనవుడు వినతుడై నిలచి
వినయపూర్వకముగ వినిపింపదొడగె
"విను ! విక్రమాటోప ! వినుతప్రతాప !
ఘనపుణ్యచారిత్ర ! కమనీయగాత్ర !
మాన దుర్యోధన ! మహిత భూభరణ !
దానార్థి రాధేయ ! ధర్మవిధేయ !
తపనకులాధీశ ! దళితప్రకాశ !
కపటారిమదభంగ ! కరుణాంతరంగ ;
కొమ్మభూపతి పుత్ర ! కువలయనేత్ర !
అయ్యరో వినవయ్య యీ నాయురాలు
పుడమి పీడ్కొని మీరు పోయిన పిదప
పొదలుచు తన దేవపూజకు గాను
దినదినంబును పూలు తే బంపు నన్ను
పోకుంటినేని యప్పుడె చంపు గాన
అలయుచు నేపోయి యందందు తిరిగి
పొలుపొంద పూలు గొంపోవుచుండెదను

ఈనాడు గొంపోదు నీ సజ్జ పూలు"
అని చాల దుఃఖించ అలరాజు పలికె :
"మన భూములకు మేము మరలిన యపుడె
నిన్ను నెప్పటియట్ల నిలిపి యగ్గలిక
మన్నింతు మ"నుచును మరి చేరపిలిచి
"పొగడొందు దేవతాపూజలాదిగను
ధర్మకార్యంబులు దాని కెక్కుడివి"
అనుచు పువ్వుల సజ్జనంది గైకొన్న 480
కని కొమ్మజియ్యరు గ్రక్కున మరలి
వచ్చి యా గురజాల వలనొప్ప చొచ్చె.

*కొమ్మజియ్యరిచ్చిన పూలచెండును ఆఘ్రాణించి అలరాజు మూర్ఛిల్లి తనభార్య పేరాదేవిని తోడ్కొని రమ్మని కన్నమను గురజాలకు పంపుట : పేరాదేవి తన పతికి విషము పెట్టినారనెడు వార్త విని, నలగాముని శపించుట.*

అంతట అలరాజు ఆ పువ్వు సజ్జ
బంతుల నొక చేతబట్టి యందున్న
విడిపువ్వు లెల్లను విడదీయునపుడు
ఒరపుగా కన్నమ యూహించి పలికె
"అలరాజ వినవయ్య ! అపుడు నీతోడ
నెలమితో. మనయమ్మ యేమనిపల్కె
అది తలపోయవు ఆత్మలోపలను
మది నమ్మరాదు నా మనసు కలగెడివి" 490
అన విని యలరాజు అపుడు కన్నమను
కనుగొని తనకును కాలపక్వంబు
చేరువయైనను చిత్తంబుతోన
తోరమై తన బుద్ధి తోచక పలికె:
"సొనగంగ గురజాలపువ్వు లివికావు

ఈ చెర్ల గుడిపాటి యీపలి తోట
పువ్వు లింతియె కాక పోల జియ్యరుకు
మనయెడ మిక్కిలి మర్యాద కలదు"
అనుచు పువ్వులబంతు లధిక మోదంబు
మనమున పెనగొన మక్కువతోడ
గ్రక్కున విప్పి యాఘ్రాణంబుచేయ
అంతలో నందులో నమరియున్నట్టి
కాలకూట కఠోర ఘన విషవహ్ని
బోలిన విషవహ్ని భుగభుగ నెగసి
మంత్ర తంత్రములతో మరి తలకెక్క
అలరాజు భ్రమగప్పి యశ్వంబుమీద
నిలువజాలక వాజి నిలిపి యిట్లనియె :
"కన్నమ నామేను గడగడ వణకె
తిన్నగా చేయిచ్చి దింపి నీడకును
పట్టించు బొందిలో ప్రాణంబు నిల్వ
ద"నిన కన్నమనేడు అడలుచు వచ్చి
చెంతలో తంగేటిచెట్టునీడకును
పట్టించి కన్నమ బహువిధంబులను
నెట్టన వగచుచు నెమ్మి యిట్లనియె :
"ఓయయ్య అలరాజ ! ఒనరగా నీవు
ఆయెడ నీతోడ ఆ బ్రహ్మనేడు
క్రమ్మి చెప్పినబుద్ధి గైకొనవైతి
అమ్మ చిలుకకు జెప్పి నటువలె నీకు
దీటుగా చెప్పిన తెలుసుకోవైతి
పాటించి నాయురాల్ వగదీర్చెనయ్య
ఏమి చేయుదుకార్య మేది గతి యింక
ఏమని తలపోతు నేమని వగతు
నరవరాగ్రణియైన నాయు డా బ్రహ్మ
ఇరవంద సెలవు నా కియ్యకపోయె

గాక యీ గురజాల కలయంగ నార్చి
రాకుండునే నాయురాలి రాజులను
దీకొని పట్టక దిగమ్రింగి విడుతు
ఈషైన సెలవు నా కిప్పింపు మిపుడు"
ఆమాట లాలించి అల్లుమల్లన్న
"పంపుపెట్టక మనము పనిచేయరాదు
నా మాట చేకొను నన్ను మన్నించి
ఆ మాట మాను నా యాన నీ కింక
మతిపూని నీవు నా మాట గైకొనుము
అతివేగమున నీదు అక్కనుచేరి
అబ్జాక్షి దోడ్కొని యటు వేగరమ్మ
నాబొంది ప్రాణమందాక నిల్పెదను
బొమ్మన్న" కన్నమ పొగులుచు నేగి
నెమ్మది కొలువున్న నృపు నుగ్రదృష్టి
చూచుచు నగరిలో చొచ్చె నవ్వేళ
పూచిన తంగేడు పొలుపు దీపింప
రమణీయమైన పేరాదేవి తోడ
కరమెత్తి యేడ్చుచు కన్నమపలికె :
"ఇత్తరి శృంగార మేమి చేసెదవు
ఓ తల్లి! యెరుగక యున్నావు నీవు
ఇక నేటి వ్రతములు ఏమి సల్పెదవు
అక్కటా ముద్దరాలైన మా యమ్మ!
ఏ చేటు కానవు ఇంతిరో నీవు
అటు సంధి కొరకునై అలరాజు రాగ
నలగామరాజును నాయకురాలు
కమ్మబూవులబంతి గరళంబు నించి
తగబెట్టి పంపిన తంబళ్ళజియ్య
మాయలుపల్కుచు మనరాజు కొసగె ;
అది రాజు మూర్కొని యట మూర్ఛనొంది

తెప్పిరి తమ కిది "తెలియంగచెప్పి
రమ్మ"న్న వచ్చితి రాజాస్య మరియు
"నిన్నుచూచిన దనుక నెమ్మి ప్రాణంబు
కన్నుల నుంచెను కదలి రమ్మ"నిన
ఆమాట లాలించి యాదేవి యపుడు
కాముని చేతకు కవకవ నవ్వి
వేవేగ నగరు తా వెలువడివచ్చి
భూవిభు వొడగని భుగభుగమండి
ప్రాకటంబగు మోహపాశంబు విడిచి
దాకొన్న కోపాగ్ని దరికొన పలికె
"ఓ పాపకర్ముడ ! యో దురాత్మకుడ !
నిన్ను గనుగొనరాదు నిను చేరరాదు
పన్నుగా దశమహాపాపచిత్తుడవు
అకట ! యీ భువనంబునందు నెందైన
అల్లుని చంపిన అవనిపాలకుల
కానము వినము నే కథలలోపలను
పూనుక యపకీర్తిపొందితి వీవు
అలరాజుపై కోప మధికమై యున్న
నొలవక నన్నైన చూచుకోవైతి ;
తలపోయగా రాచధర్మంబు విడిచి
పొలుపేదగా మోసపుచ్చి చంపితివి
కదనరంగంబున ఘనుడవై నీవు
దూకొని పోరాడి దునుమలేవైతి
కన నాయురాలు నిక్కము చుప్పనాతి
దానిచే చెడిపోయె తలప నీబుద్ధి
అటుగాన నీవు నీ యపకీర్తి కోర్చి
కుటిలంపునీతి గైకొంటివి గాన
నీదు బలముల్లెల్ల నిర్మూలమగుచు
పోవును కారెమపూడి యుద్ధమున"

అని శపియించె నా యబ్జాయతాక్షి;
ఆ మాట లాలించి యా యయ్య యశ్రు
కణములు దొరుగ బల్కకయుండె నపుడు.

*పేరాదేవి నేలకొరిగిన తన భర్తను చూచి శోకించుట : అలరాజు తన భార్య నూరడించి తన బిరుదులను బాలచంద్రుని కిమ్మని కన్నమ్మకు ఒప్పగించి ప్రాణములు విడుచుట. పేరాదేవి అలరాజు శవమును మేడవి గొంపోవుట : అలరాజునగ్ని సంస్కారము : పేరాదేవి సహగమనము.*

అంత పేరాదేవి యచ్చోటు బాసి
రంతుగా పెక్కేంద్రు రమణు లేతేర
పరువు పరువునను పడతి యేతెంచి
కడువేగ నలరాజు కనుగొని యచట
పుడమి జాగిలి మ్రొక్కి పురపుర బొక్కి
భక్తి నాతని పాదపద్మముల్ చేత
పలుమారు నొత్తుచు పతి మస్తకమున
కెలమితో తన తొడ నెత్తుగాపెట్టి
ముంగొంగు చెరుగున మొగము తుడుచుచును
అంగన యిట్లని యడలుచు పలికె
"అలరాజ ! సకల విద్యా ప్రసంగముల
తులతూగ నీ సాటిదొర లెందు లేరు
విలసిల్లు నా తెరపేట కయ్యమున
ఇలలోన డెబ్బది యేడందలముల
మనుజనాధుల నిముసమాత్రాన చంపి
ఘన శౌర్య సంపద గంటి వదిగాక
తక్కక నీవు హోదాటి కయ్యమున
ఒక్కడె గెలిచిన యురుబలాఢ్యుడవు
తగిన కులమున పుట్టి తగని యీ చావు

మీకెట్లు సిద్ధించె మేదినిమీద
అట్టి సాహస మెందు అణగెనో రాజ !
ఎట్టి యౌదార్యంబు లింకెనో రాజ !
అందుకే వగచెదనయ్య నేనింక"
అనినను అలరాజు అపుడు కనువిచ్చి
తన దేవి వదనంబు తనివోవచూచి
"ఇన్నిసాహసములు ఎన్ననేమిటికి
పన్నుగా హరిహర బ్రహ్మాదులకును
తమ లలాటము వ్రాత తప్పింపనగునె
కొమ్మరో తలపోత కూడదు వినుము
నీవు వచ్చిన దనుక నిలువచాలితిని
భావింప ప్రాణంబు భరియింపరాదు
కడువేగ ముందరి కార్యసంగతులు
తడయక కల్పించు తడవేటికనుచు
తనుచేర కన్నమను దగ్గర పిలిచి
"ఈ బిరుదులన్నియు నిలమీద నేడు
నాకు చెలికాడును నమ్మినవాడు
నాతోడునీ డతడు నాయుని సుతుడు
బలువైన బిరుదులు బాలునికిమ్ము
ఎనయంగ వీరులు నిందరు నెరుగ
నవరాల గొడుగును నయ్యైన నిమ్ము
బాలుడు మామేలు పాలించు" ననుచు
తన బిరుదులన్నియు ధరమీదబెట్టి
కాళము దగ్గర కదసిన నంత
నాసికమెత్తనై నాడిలో దాగె
తెలివు డిగి కన్నులు తేలగా బడియె
'శివ శివ'యనుచును శివుని తలచుచును
భవునిపురి కేగె నల్లమల్లన్న.
చూచి పేరాదేవి శోకించి మిగుల

వేగమె రాజును వెరవునతెచ్చి
పల్లకిలోపల పదిలముగనుంచి
గుఱ్ఱము తా నెక్కి గుడిపాడు వెడలె;
మిరియాల గడిచియు మిట్టలుదాటి
కంబాలకను మంత గ్రక్కున దాటి
వేగమునను మఱ్ఱివేముల విడి
ముటుకుల విచ్చేసి ముదితతానపుడు
పల్లకి దింపించి పతిమోము చూచి
కన్నీరు కార్చుచు కన్నమను పిలచి
"మన మేలువార్తలు మలిదేవునకును
నా మామగారికి మరి వీరులకును
ఎరిగింపు కన్నమ ! యేమిచేసెడిది"
అనిన కన్నమ నేడు అ క్షణమె కదలి
మేడపికిని వచ్చి మేదినీ విభుని
కట్టెదుటను నిల్చి కరములు మొగిచె;
కన్నమ యింగితాకారభావంబు
లన్నియు కనుగొని యధిపుడిట్లడిగె
"ఏమిరా కన్నమ ! యిట్లున్నవాడ
వాగి సంతసపుపల్కు లేమియు లేవు
అల్లు మల్లన యేడి అందరు ఏరి ?"
అన విని కన్నుల నశ్రువులుక్రమ్మ
ధరణీశుతోపల్కె దైన్యభావమున
"పెదమల్లుభూపాల ! ప్రియవాక్యలోల !
మీరుచెప్పిన బుద్ధి మీ యన్నతోడ
నాడి మన భూభాగ మడిగితి మంత
"ఎంతచెప్పిన భూమి యెక్కడిది మీకు
యియ్యన"ని పలికిన నిలనాథుతోడ
మర్యాదతో నాడి మగిడి రాగాను
నాయురా లంతట న్యాయంబుతప్పి

తనమది చెడుబుద్ధి తలచి యూహించి
విరజాజి సంపెంగవిరుల జాజులను
చెండుగా కట్టించి చేర్చి విషమ్ము
కొమ్మజియ్యరు కిచ్చి గొబ్బున పంప
మాకడ కేతెంచి మాయ తంబళియు
పూచండ నిచ్చెను పుడమీశునకును ;
కేల పువ్వులబంతి కేరుచు పట్టి
మూర్కొని మది ప్రేమ ముప్పిరిగొనగ
మందుల మహిమచే మడసి అలరాజు
పువ్వులెనొరగె నో భూపాలతిలక !"
అని చెప్పగా వీరు లయోధ్యరాజు
తములమ్ము లుమిసిరి తమ్ములు తాను
కోపంబు శోకంబు గొదగొనుచుండ
కొల్వు గొబ్బున లేచె కొమ్మరా జపుడు ;
సోదరుల మొగముల సొంపెల్లపోయె
చోళరా జంతట శోకంబునొందె
తమ్ములు నన్న లుద్దండవిక్రములు
అల్లు మల్లన కడ కందరు నేగి
వగచిరి ఆ రాజు వదనంబు చూచి;
వంకిదేవరాజు వరపుత్రు చూచి
"యేమని దూరుదు నేమందు విధిని
బిరుదు రౌతువు నీదు బిరుదు లెటుపోయె
నమ్మించి నిన్నిటు నాయకురాలు
చెనటి జియ్యరు పంచి చంపించె నకట !"
అని వగచి విమాన మాయత్తపరచి
పసిడివిమానమ్ముపై పసిడికుండ
పసిడికుండలమీద పడగలెత్తించి
ఆ విమానముమీద నలరాజు నునిచె;
పట్టిరి విమానమున్ ప్రమథులందరును

భేరీలు దారలు పెద్ద బూరలును
మిన్నంది వాద్యముల్ మించిమ్రోయగను
మేడపిముందర మేలైనచోట
రాచరావులకడ రాజును తెచ్చి
దించి విమానమ్ము స్థిరముగానిల్ప
ఆ పురమంతయు నడలుచువచ్చె ;
వీరవిద్యలదేవి వెలది శీలమ్మ
వర వంకిదేవమ్మ వర సాదరమ్మ
కొండపీడ్గోపమ్మ కొలది సుబ్బమ్మ
పెంపైన పెనుమాల పెంబసానమ్మ
అక్కలు చెల్లెండ్రు అత్తలొదినెలును
పట్టణంబునగల భామినీజనులు
అల్లుమల్లన కడ కడలుచు రాగ
ఏడ్పులు మిన్నందె నేమనిచెప్ప;
తల్లి చల్లమదేవి తగ నార్తిపడుచు
వణకుచు మైదూలి వసుధపై వ్రాలె;
లే దీగెయును పోలె లేమ చల్లమ్మ
మూర్ఛిల్లి కనుదోయి మూసియుండగను
శీతోపచారముల్ సేయంగలేచి
"కొడుకును చూపరే గుణములకుప్ప
చూపరే నాపట్టి చూపరే వేగ
ఎక్కడనున్న వాడెరిగింపరమ్మ
ఒయ్యెన పోయెద నో యక్కలార
ఏమని శోకింతు నేమని వగతు
పలుకవు నాతోడ పాడియే తండ్రి
అతివేగ పల్కరా అల్లుమల్లన్న
తల్లు లడలంగను తనయుడ నీవు
ఊరికె యొరుగంగ నుచితమా తండ్రి"
అనియని దుఃఖించి యాచల్లమాంబ

వేరి భూతలముపై చెయ్యూదుకొనుచు
తనయుని మోముపై తనమోము మోపి
"విధి నిన్ను భూమిలో వెదకెనో యన్న
భాగ్యంబు నీతోడ బాసెపో నేడు"
అని పెక్కుభంగుల నాడుచుండగను
అచ్చటివారెల్ల నా ఖేదమరసి
"ఒరల నేటికి నీకు ఓ చల్లమాంబ!
వగవంగనేటికి వాపోవనేల
స్వామికార్యమునను సంగ్రామమునను
ప్రాణమిచ్చిన మరి పరితపింపుదురె
ప్రాప్తంబు దప్పింప బ్రహ్మకు గాదు
కాన నీ వీలాగు కడు తూరనేల"
అని యూరడించిరి ఆ దేవినపుడు
రాజబింబాస్యయౌ రమణి పేరమ్మ
అడలెడు వారల కప్పు డిట్లనియె
"అవసరమ్మన ప్రాణ మరవాయి గొనక
యిచ్చిన వారికి ఇకనేల వగవ
చావులలో లెస్స చావయ్యె వేగ
నా ప్రాణనాధుని నన్నును గూర్చ
శతి సంతసమ్మున నందరు"ననిన
అయోధ్యరాజును నరువదేగురును
పిల్వుడని జంగాల పిలిపించెనంత
మెండుగా వచ్చిరి మిండ జంగములు;
కొమ్మరాజప్పుడు కోడె జంగముల
పెదమట జంగాల పెద్దల బిలచి
పిడిగంట నాదముల్ పృధివి కంపింప
శివపూజలనుచేసి శివుని తలచుచును
భూతి రుద్రాక్ష విభూషితుడైన
సుతునికి రక్షగా సురశించివైచి

పన్నీట కస్తూరి పదములు కడగె;
అట దేవదుందుభు లందందమ్రోయ
వెలది కప్పుడు విన్నవించిన ప్రేమ
వెలలేని సంతోష వివశురాలగుచు
ఆత్మలో ప్రియమంది యడుగుల కెరగి
భువనేశు పాన్పుపై పొసగంగ మున్ను
పవళించు విధమున పవళించి యంత
పతిబుద్ధి దప్పక పతిమస్తకంబు
దిట్టమై తనదు సందిటలోన నునిచె.
అప్పుడు నల్గడల నగ్నిహోత్రంబు
ఒప్పుగా సంధింప నొగి ప్రజ్వలించి
భుగభుగ నెగడియు భూ నభోంతరము
ధగధగ జ్వాలలు దరికొని మండె;
అపుడు పేరాదేవి హరహరా యనుచు
పతి గూడి కైలాస పదమునకేగె.

# కల్లు ప్రతిష్ఠ

## కథా సంగ్రహము

నలగాముడు మలిదేవుని రాజ్యము మలిదేవున కిచ్చుటకు నిరాకరించుటయే గాక తన కడకు రాయబారిగా వచ్చిన తన అల్లుని సైతము చంపించెనని మేడపినున్నట్టి వీరనాయకులు మరింత కుపితులైరి. ఇక యుద్ధమునగాని తమ రాజ్యము తమకు లభింపదని వారు నిశ్చయించుకొనిరి; ఒక శుభ ముహూర్తమున మలిదేవుని కొడుకగు బిరుదురాజునకు పట్టముకట్టి బాలచంద్రునకు మంత్రిత్వమిచ్చి అనపోతునకు కరణకార్య మప్పగించి వీరనాయకులు యుద్ధసన్నద్ధులైరి. మలిదేవుడు పురోహితులను పిల్చి జయముహూర్తము పెట్టించెను; ప్రథమ - ఏకాదశినాడు (తొలి యేకాదశి) పయనము చెప్పి రణభేరి వేయించెను. వీరనాయకులు తమ తమ దళములనాయత్తపరచి ఉత్సాహభరితులై పౌరుషములు ప్రకటించుచు మేడపినుండి కార్యమపూడి యుద్ధరంగమునకు బయలుదేరిరి. ముందు వెనుకల సైనికులు బారులుతీర్చి నడిచి యేతేర మలి

దేవాదులు దళములను కదలించుకొనుచు త్రిపురాంతకమును చేరిరి.

త్రిపురాంతకమున బ్రహ్మనాయుడు తాను శివపురినుండి తెచ్చియుంచిన భూతరాట్కంబమును కార్యమపూడి యుద్ధరంగమున ప్రతిష్ఠింపదలచి 'యుద్ధమున నీవె సాక్షివ'ని చెప్పి గావు చెల్లించి కంబమును బండ్లకు ఎత్తించెను. సైనికులు కంబమును బండ్లపై తరలించుకొనుచు మట్టివేముల, గుమ్మడముపాడు మున్నగు గ్రామములు దాటి మేళ్ళవాగు చేరి అట దండు విడిసిరి. అంతట సూర్యుడస్తమించెను; నలుదెసల చీకట్లు క్రమ్మెను. ఆకసమున చుక్కలు పొడచూపెను. అర్ధరాత్రి బ్రహ్మన కన్నమను పిలిచి మున్ను అనేక యుద్ధములు జరుగుటవలన కార్యమపూడి, ఎముకల ప్రోగులతో బూడిదపెంటలతో భూతవితతితో అపవిత్రముగా నున్నదనియు దానిని తాను శుద్ధిచేయ దలచితిననియు చెప్పి కదనరంగమును కలయజూచి రమ్మని ఆతనిని పంపించెను.

కన్నమ కార్యమపూడి కదనభూమి కేతెంచి నలుదెసలు పరికించుచుండగా అక్కడ కాపున్న భూతపిశాచములు ఒక ఎరుకలసానిని వెంటనిడుకొని కత్తులు త్రిప్పుచు వాని నెదిరించెను. కన్నమ కాలాగ్నిరుద్రుఁవలె మండిపడుచు కదియగా, భూతపిశాచములు వాని పరాక్రమమునకు తాళలేక వెనుకకు తగ్గెను. అప్పుడు ఎరుకలసాని కన్నమను బ్రహ్మన భృత్యునిగా ఎరింగి బ్రహ్మన పాదధూళి సోకినచో కార్యమపూడి యుద్ధభూమి పవిత్రమగునని ఆతని రాకకు తాను ఎదురు చూచు

చుంటెనని చెప్పి అటనుండి వెడలిపోయెను. కన్నమ, బ్రహ్మన్న విడిదికేగి జరిగిన వృత్తాంతమంతయు ఆతనికి నివేదించెను.

బ్రహ్మన ఆ అర్ధరాత్రమున ఎవరికి తెలియనీయక తానొక్కడే కార్యమపూడి కదనభూమి కేతెంచి భూతపిశాచములను పారద్రోలి పీనుగు పెంటలతో నిండియున్న యుద్ధభూమిని శుద్ధిచేయుటకై వర్షము కురిపింపుమని హరిని ప్రార్థించెను. ఏకధారగా వానకురిసెను; పీనుగుపెంటలు కొట్టుకొనిపోయెను. యుద్ధక్షేత్రము పవిత్రమమయ్యెను. అంతట వర్షజల ప్రవాహములో ఒక పుఱ్ఱె తేలుచు బ్రహ్మన కడకువచ్చి తన వృత్తాంత మాతనికెరుకపరచి అవతారపురుషుడైన యాతని సందర్శనమువలన తన జన్మము పావనమయ్యెనని పలువిధముల బ్రహ్మనను స్తుతించి దివికేగెను. పిమ్మట వర్షము వెలసెను; యుద్ధాధిదేవతయైన మహాశక్తి బ్రహ్మనకు ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మన ఆ దేవతను సమరమునకు సాక్షిగానిల్పి అటనుండి మరలి తనవిడిదికి చేరెను.

ఆ మరునాడు మలిదేవుడు కార్యమపూడికి వచ్చి దండు విడిసి ఒక శుభలగ్నమున అచ్చట భూతరాట్కంబమును ప్రతిష్ఠించెను. వీరనాయకులు గంగధారయందు స్నానముచేసి నాగులేటి తీరమున లింగములు నిల్పిరి. సమరసన్నాహము లన్నియు పూర్తియయ్యెను. మలిదేవరాజును బ్రహ్మనయును నలగాముని యుద్ధమునకు రమ్మని చెప్పుటకు భట్టు నొకనిని గురజాలకు పంపించిరి.

భట్టు, నలగాముని కడకేగి మలిదేవుని సైన్యములు కార్యమపూడికదనరంగమునమోహరించియున్నవనియు

వారితో పోరాడుట తగదనియు యుద్ధము దేశ వినాశనమునకు హేతువనియు కనుక వారితో సఖ్యముగా నుండి సుఖియింపు మనియు పరి పరి విధముల ఆతనికి బోధించెను; భట్టు పలుకు లాలించి నలగాముడు నాయకురాలి ప్రోత్సాహమున ఉగ్రుడై మలిదేవుని శక్తి ఏపాటిదో తనకు తెలియుననియు వారికి ప్రాణములపై ఆశయున్నచో వెనుకకు మరలుట ఒక్కటియే మార్గమనియు చెప్పుచు తన బలము నుగ్గడించి భట్టును బెదిరించెను. భట్టు, బ్రహ్మనాదుల శక్తియుక్తులను పేర్కొని వెనుకటి గాథలను నలగామునకు జ్ఞాపకముచేసి 'వారు యుద్ధమున నిన్నును నీ బందుగులను శిక్షింపగలర'ని హెచ్చరించెను. ఆ మాటలకు నాగమ్మ అదిరిపడి లేచి 'భట్టువాడవు గాన బ్రతికితివి పొమ్మ'ని మందలించి ఆతనిని పంపివేసెను.

భట్టు, కార్యమపూడికి కదలి వచ్చి జరిగిన వృత్తాంత మంతయు మలిదేవునకు విన్నవించెను. నలగాము డాడిన కఠినవాక్యములు విని వీరనాయకులు గురజాలపై దండెత్తి పోవుటకు తమ కనుజ్ఞ నిమ్మని బ్రహ్మనను తొందరపెట్ట సాగిరి. 'నలగాముడు దండెత్తి వచ్చుచున్నాడు కనుక మనము గురజాలను చుట్టుముట్టుట ధర్మముకాద'ని బ్రహ్మన వారిని శాంతింపచేసెను.

అట నలగాముడు నాగమను పిలిచి తన సైనికులను సమీకరింపుమని ఆనతిచ్చెను. మలిదేవు నోడించుటకు తోడు రమ్మని మండలాధిపతు లందరికి లేఖలు వ్రాయవలసినదిగా నాగమ్మ నలగామునికి సూచించెను. నలగాము డట్లే అని 'మనమందరము ఒక్కుమ్మడిగా బ్రహ్మన్న నోడించి మన

సులో అరమరలు మాని ఏకభావమున భూములు నేలు కొనియెదము రమ్మ'ని వివిధమండలాధిపతులకు బాసపత్రము లంపెను. వారు ఆ బాసపత్రము లందుకొని నలగాముడు గెలిచినచో తామిక అప్పనములు కట్టనక్కరలేదని మురి యుచు తమ తమ సైన్యములను కార్యమపూడికి తరలించిరి. నలగాముడు తన సైనికుల నాయత్తపరచి గజాధిరూఢుడై నాగమ్మ నరసింగులు వెంటరాగా కార్యమపూడి యుద్ధరంగము నకు బయలుదేరెను. నలగాముడు తన తమ్ములతో యుద్ధము చేయుటకు బయలుదేరెనను వార్తవిని కొదమగుండ్ల ప్రజలు ఎదురేగి దాయాదులు కలహించుట మంచిదికాదనియు, యుద్ధములేకుండ రాజులు రాజ్యము లేలినచో ప్రజలు సుఖించెదరనియు హితుల మాటలు విని వెనుకకు మరలు మనియు ఆతనికి విన్నవించిరి. నలగామరాజు వారి విన్నప మాలింపక యుద్ధమున తనకు జయము తథ్యమనియు ప్రజలు నిష్కారణ భయముతో ఊరు విడిచిపెట్టక యిండ్లలోనుండుట మంచిదనియు వారికి నచ్చచెప్పి తాను తన బలములతో కార్యమపూడికి వచ్చి కనుచూపుమేర వరకును డేరాలనెత్తించి సైనికులను అందందు నిల్పెను.

నలగాముడట్లు తమకెదురుగా దండువిడియుట చూచి వీరనాయకు లిక సహింపలేక ఆతనిని కదియుటకు సెలవిమ్మని బ్రహ్మనను తొందర పెట్టసాగిరి. 'తొందరపడవలదు; సమ యము వచ్చువరకును సాహసింపరాదు; సహన మన్నిటి కంటె దొడ్డది.; దానివలన కార్యము లన్నియు చక్కబడున'ని బ్రహ్మన వారిని నెమ్మదిపరిచి అనువైన లగ్నముకొరకు

నిరీక్షించుచుండెను. అంతట కొమ్మరాజు 'నలగాముడు తన కెవరు సాటిలేరను నహంకారముతో డేరాల నెత్తించి కులుకు చున్నాడు. ఆతని కడ కొక శరమునంపి సాటి ఎవరో చూపెద న'ని తన గురువు బలభద్రరఘుపతి పేరున విల్లు సారించి ఒక బాణమును ఒదలెను. ఆ బాణము తొలకరి మెరుపువలె మెరయుచు నలగాముని గుడారములోనికి దూసికొనిపోయెను. గుడారము పడిపోయెను. పసిడికుండలు డుల్లెను. ఏనుగులు కట్లు త్రెంచుకొని పరుగులెత్తెను; రాహుత్తు లదలి పోయిరి. బంట్లు నలుమూలలకు చెదరిపోయిరి. నలగాముడు పడవాండ్ల నంపించి వారి భయముదీర్చి సైనిక శ్రేణులను కట్టుదిట్టము చేసెను.

ఇట బ్రహ్మనాయుడు కాలజ్ఞులను పిలిపించి సమరము చేయు టకై తగిన ముహూర్తము పెట్టుడని వారికి ఆనతిచ్చెను. జ్యోతిష్కులు అట్లే సుముహూర్త మొక్కటి చూచిపెట్టెద మని 'మీకు జయమగు' నని మలిదేవాదులను దీవించి తమ తమ నెలవుల కేగిరి.

శ్రీరఘు నాయకు చిత్తమందెంచి
శ్రీకంఠుపరమేశు శివు నాత్మ దలచి
పార్వతీదేవికి భావించి మ్రొక్కి
శివగణంబుల నెల్ల చింతించిపొగడి
ప్రాకటంబుగ విష్ణు ప్రార్థనజేసి
యిందిరాదేవిని నిచ్చలో నిలిపి
విష్ణుభక్తుల నెల్ల వినుతులుసేసి
జలజజు గొనియాడి శారద నెంచి
అఖిలవిద్యలకెల్ల ఆద్యుడైనట్టి
గజముఖువిఘ్నేశు ఘనతకీర్తించి
వీరభద్రునిశౌర్య విభవంబులెన్ని
మాచెర్లచెన్నుని మదిలోనదలచి
ఆంధ్ర కవీంద్రుల కంజలిచేసి
సంగీతసాహిత్య చాతుర్యకవిత
చెప్పనేర్చినవాడ చెలగి మాచెర్ల
చెన్నకేశవపాదసేవారతుండ
వలను భారద్వాజ వంశవర్ధనుడ
కవిసార్వభౌముడ ఘనతగన్నట్టి
శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ
శాశ్వతంబైనట్టి సద్గ్రంథ మొకటి
చెప్పబూని మనసు చెలరేగియుండ
అలరాజుబాకున కవతారమొంది
మలసి నూటొక్క బొమ్మలపెండెరంబు
చెలగి డాకాలనుంచిన మహాఘనుడు
చిలుకలపై కోర్కె జిక్కెడువాడు
చేకొన్ని మాచెర్ల చెన్నకేశవుడు
నా కలలోవచ్చి నయమొప్ప బలికె:

"వినవోయి సత్కవీ వేడ్క నామాట
మనమున నాకు సమ్మతమైన దొకటి" ;
అన విని "దేవ ! మహాప్రసాదంబు
దృఢముగ నానతి యిమ్ము నాకిప్పు
డ"న చెన్నకేశవు డపు డిట్లనియె :
"పలనాటివీరుల భాగవతంబు
ప్రకటితంబుగ నీవు రచియించి మాకు
అంకితం బొనరింప ననువొందుసూవె"
అనుచును శ్రీకాంతు డరిగినపిదప
మేల్కాంచి మనమున 'మేలయ్యె'ననుచు
విలసిల్లు పలనాటి వీరులచరిత
జనులెల్ల భక్తిచే చదువుటకొరకు
మంజరీద్విపదగా మన్నించి నేను
చెప్పబూనితి వచఃశ్రీ మెరయంగ
ప్రకటితంబైనట్టి పలనాటిలోన
భావింపగా విష్ణుభక్తిని మెరసి
నరనాథసింహంబు నలగామరాజు
మహితచారిత్రుడు మలిదేరాజు
ధారుణి నేలుచు తమలోన బోరి
కార్యమపూడి శ్రీకదనంబునందు
నరపాలచంద్రుండు నలగాము తాక
పంపిన బాలుండు బాహావిక్రముడు
తోరంపుగజములు తురగచయంబు
మన్నీలబలముల మహితశౌర్యమున
చెదరిపారగ బొడిచి చీకాకుచేసి
నలగాముతమ్ముడు నరసింగు నెదిరి
మర్దించి రణమున మడిసినవిధము
ప్రమరింతు వీనుల పండువగాను
గణుతింప తత్కథాక్రమమెట్టిదనిన

*బ్రహ్మనాదులు బిరుదురాజునకు పట్టముకట్టి బాలచంద్రునకు మంత్రిత్వమిచ్చి కార్యమపూడి కదన రంగమునకు కదలివెళ్లుట.*

అంత మేడపిలోన అలరాజుచావు
విని వెరగందిరి వీరనాయకులు;
వీరవిక్రమతచే వీరసాహసత
బరగిన నాయకుల్ బాలమల్దేవు
తలపోసి యేకమై ధైర్యంబుమెరసి
బిరుదురాజును తెచ్చి పృథ్వివెలయంగ
అనువైన లగ్నాన నా రాజుకపుడు
పట్టంబు కట్టిరి పరగ మేడపిని;
భూమీశతనయుని పుడమేల నిలిపి
భాస్కరసమతేజు బాలుని తెచ్చి
సచివకార్యమునకు సమ్మతిచేసి
అట కరణపుకార్య మనపోతుకిచ్చి
మాడచి యనునట్టి మగువనుతెచ్చి
రాణివాసము కావ రక్తితోనుంచి
ఆనందమును పొంది రంతటవారు
అటమీద భూమీశు డధికోత్సవముల
ఘనత కార్యమపూడి కదనరంగంబు
చేరబోవుటకునై చింతించి యపుడు
ప్రజలతో మేడపి పదిలమని చెప్పి
పట్టభద్రులు ముగురు పైనంబుగాగ
ఎలమి భూసుర పురోహితులెల్లపూని
జయముహూర్తము పెట్టి చనుడనిచెప్ప
ప్రథమ–యేకాదశి పైనంబు కొప్పి
రణభేరివెయించ రమణీయముగను
అతులసాహసవృత్తి నా దండు వెడలె ;

గొల్లెనల్ కట్టిన గొప్పలౌబండ్లు
బల్లానిపెట్టెలు పట్టెమంచములు
దండియౌపీటలు తమ్మపడిగెలును
జాలవల్లికలును చామరంబులును
వింతవర్గములతో వెలయు గొడ్గులును
కాశ్మీరకస్తూరి గంధకర్పూర
మాదియౌవాసన లమరుపెట్టెలును
బొక్కసంబుల బర్వు బోనగావళ్ళు
జవ్వాజిపిల్లులు శారికా కీర
జంత్రముల్ పట్టెడి జనసమూహంబు
కొట్టెగాం డ్లదలించి కొట్టెడియెడ్లు
పడివాగె తేజీలు పాలకీజోళ్లు
అష్టభాగ్యము లమ్మ నంగళ్ళవారు
సందడిపడి దండు చయ్యనకదలె;
పెంపైన పాలకి పెదమల్లుడెక్కి
ఇంపారగా వెడలె నీశ్వరునిరీతి
పినమల్లు కదలెను పృథ్వీశువెనుక
తమ్ముడు నడచెను దరణీశువెంట;
పచ్చల లింగముల్ పటువుగా చెక్కి
బాగుచేసినయట్టి పాలకియెక్కి
పలుమారు పుత్రుకై పలవరింపుచును
'కొలువులో నాయుడు కొనరెట్టబట్టి
కులపగదీర్ప నీ కొడు కితడంచు
పెట్టె నాచేతిలో ప్రియతనూజాతు
బాలుని తెగువ యేపాటిదో' యనుచు
కొమ్మభూమీశుండు గొబ్బునకదలె;
అల్లాణరాజులు అత్తోటనృపులు
అన్నలుదమ్ములు నందరుగూడి
సూర్యవంశమువారు సొంపుతోచనిరి.

వారికి వీరికి వరమంత్రియైన
నీలవర్ణుండును నియతచిత్తుండు
బ్రహ్మన్న కదలెను పాయనివేడ్క
పట్టిరిగొడుగులు పాలకినెత్తి
సూర్యాతపంబు పై సోకనియట్లు
పాలకీలకు నుభయపార్శ్వంబులందు
అందంబుగాపట్టి రరిగెలజోళ్ళు
వింజామరంబులు వెలయగా నెమలి
కుంచెలవారలు కూడివీవంగ
నాయుడు రాజులు నయముతో జనగ
ముందట భేరీలు మురజసంఘములు
బూరలు నఫిరీలు పోటుధారలును
కాహళవంకిణి గాలికొమ్ములును
శంఖసమూహముల్ సన్నాయిజోళ్లు
మురళిచయంబును ముఖవీణవితతి
నగరజాలలజోళ్లు నయమైనడోళ్లు
తమ్మటంబులు మరియు తగువీరణములు
ఘనమైనరుంజలు కనకతప్పెటలు
జాగంటలును తాళచయము గంటలును
ఘనమైనమ్రోతచే గగనంబుకప్ప
కుంభినివణకంగ కులగిరులెల్ల
ప్రతిరవమీనంగ భావముప్పొంగ
అవాలహరును ఆణెమువారు
కొండవీడునువారు గోవిందువారు
ముతసానివారును ముయ్యూరువారు
షర్మాలవారును నాయనివారు
పైడిచక్కల పాలపర్తివారలును
బలుమూరివారును పాలెమువారు
రేవనూళ్లలవారు రేచర్లవారు

అనుమగంటివారు అల్లమువారు
అట్లూరి మట్లూరి యాఖ్యలవారు
చెవ్వులవారును మరి చిల్లరవారు
గుర్తైన నాయకుల్ కూడియేతేర
గండువారేగురు కదిసినవేడ్క
చనిరి బిరుదులతో సాహసంబొప్ప
ఒప్పుగా నిందరు నొండొంటిబండ్లు
ఘోటకంబులు మేటి కుంజరావళులు
ఉత్సాహమున హుంటాహుంటినడువంగ
భట్టువారలు మించి బహువిధంబులను
బిరుదుపద్యంబులు పెల్లుగా చదువ
ఉద్దండమాస్టీలు నొనర నిర్వంక
భైరవకత్తులు పట్టుకరాగ
కరమర్థి కనుకుల కన్నమ నడిచె
సకలవీరచయంబు సంతతోత్సాహ
పౌరుషంబులుమీర బ్రహ్మ కిట్లనియె :
"మము చూడు బ్రహ్మన్న మాలావుకొలది
మము చూడు నాయుడా మాశౌర్యపటిమ
సింధురంబులమీద చెన్నుగా దుమికి
కుంభస్థలంబులు క్రుంగపొడిచెదము
కొదమసింగంబుల కూలద్రోసెదము
గండభేరుండాల ఖండితుమలుక
వాయువుబోనీక వడినాపగలము
జాతవేదునిపట్టి చమరివేసెదము
ఘనసముద్రముజొచ్చి కలచివిడిచెదము
కుంభిని కాళ్ళతో క్రుంగదన్నెదము
కులగిరులైనను కూలద్రోచెదము
గురజాల నేలెడు కువలయేశ్వరుని
కులపగకై పట్టి క్రొవ్వణగించి

చలమున విడువక చంపగాగలము"
అని పెక్కు పంతంబులాడుచు నడువ
చూచినవారలు చోద్యంబుమీర
పటువిక్రముల్ కదా పలనాటి వీర
వరులం'చు పలుకుచు వర్ణించి పొగడ
మలిదేవభూపతి మంత్రిబ్రహ్మన్న
కదలింప దళమెల్ల కదలి యావేళ
త్రిపురాంతకమునకు తిన్నగా వచ్చె.

*బ్రహ్మన త్రిపురాంతకమునకువచ్చి మున్ను తానచట శివపురినుండితెచ్చియుంచిన భూత రాట్కుంభము తరలించుట.*

అచ్చోట మహదేవు నతిభక్తి చూచి
మహితచారిత్రుడౌ మలిదేవరాజు
రాజులు మంత్రులు రసికులు దొరలు
సాష్టాంగదండముల్ చయ్యనచేయ
హస్తముల్ ముకుళించి అనియె బ్రహ్మన్న :
"గౌరీ మనోహర ! గంగోత్తమాంగ !
నాగకంకణ ! శివ ! నందివాహనుడ !
కాంచనగిరి చాప ! కంధితూణీర !
గరుడాసనాంబక ! ఖట్వాంగహస్త !
ఘనగజాసురభంగ ! కామభస్మాంగ !
లలితశితకంధర ! లయకాలకర్త !
సకలభూతేశ్వర ! శరభావతార !
ఫాలాక్ష ! భూతేశ ! పరమేశ ! యిపుడు
విన్నవించెద నేను విన నవధరింపు
శివపురిలోనుండి చేర్చినయట్టి
భూతరాట్కుంభంబు పొందుగా నునిచి
మితిజేసి చనితిని మీ నగరమున

మితివచ్చె నేటికి మీకృపచేత
కార్యమీడేర్పంగ కర్తలే మీరు
అనుచు ప్రార్థనజేసి యచ్చోటనున్న
కంబమును కనుగొని కడుభక్తిమ్రొక్కి
"ఇనుము పిత్తళి కంచు హేమ తామ్రముల
పంచలోహంబుల ప్రబలినదాన
నాలుగుముఖముల నయమొప్పమరియు
ఎనిమిదిముఖముల నెన్నికైనావు
ముగురుమూర్తులు నొక్కముఖమందునునికి
ఒకటను సిద్ధులు నొకటను మునులు
గంగయు దుర్గయు కాలభైరవుడు
నింగియు భూదేవి నీ యాననముల
గంధర్వవరులతో కాచియుండుదురు"
అనుచు ప్రార్థనచేసి యా బ్రహ్మ పలికె :
"ఘనత కార్యమపూడి కలనిమధ్యమున
నలగామురాజుతో నయముగాపోరి
మడియంగవచ్చిరి మన్నెనాయకులు
రణరంగపట్టపురాజువై నీవు
సాక్షివై యుండవే సర్వభూతేశ
భుక్తి నిచ్చెద నేను భూతేశుడెరుగ
దాహంబు తీర్చుకో తరచు రక్తమున"
కంబమున కీరీతి గట్టిగా చెప్పి
"ఇప్పు డాహారంబ ఇదుగొ కొమ్మ"నుచు
పెక్కువిధంబుల పిండివంటలును
పరమాన్నమన్నంబు పప్పుకూరలును
పానకంబును జున్ను పచ్చళ్ల నెయ్యి
ఖండశర్కర తియ్యకందయుగెనుసు
గొనితెచ్చి కుంభంబు కొండలపొడుగు
కస్తూరి కర్పూర కాశ్మీరసహిత

పరిమళగంధంబు బాగుగానలది
మైసాక్షి సాంబ్రాణి మంచిగుగ్గిలము
తోడుత లెస్సగా ధూపమర్పించి
ఘనమైనపోతుతో గావుజెల్లించి
ఆహార మీరీతి నర్పించి పిదప
కంబముంచినయట్టి ఘనమైన శకట
నిచయంబు తరలింప నిలిచి బ్రహ్మన్న
శకటచక్రంబులు సమ్మతిగావ
నాయకావళినెల్ల నయమొప్పపిలిచి
వితరణచతురుడై విడియంబులిచ్చి
"ఎనయంగ మనవీట నెసగు నెద్దులను
కనుగొని తెప్పించి కాండ్లకుకట్టి
చయ్యన బండ్లను సాగింపు డిపుడు"
అని వీడుకొలిపిన నంతంత వారు
పేరుపేరున నెడ్ల పిలిచి రీ రీతి :
"అందెల బసవన్న ఆదినాథుండ!
నందుల పిడిగంట నాగవాసయ్యా
గోవుల విటకాడ గోగు బయ్యన్న
వంటరి పులిజంక వరపెరుమాళ్లు
కట్టని కలుకోట కరినందిరంకె
అకలంకగాత్రుండ అంబుధిశయన
బిరుదుగరుత్మంత భీమునిగజమ
గోవర్ధనాచల గోపాలదేవ
కరినందిబసవన్న కంచివరదుండ
నెలబాలచంద్రుండ నీలవర్ణుండ
జల్లులధర్మజ జయకంఠనాద
వైకుంఠవాసుడ వాసుదేవయ్యా
పుట్టలభూపతి పెంజెల్లుపెద్ద
ఇంద్రునివజ్రమ ఉప్పగిరీశ

గోగుభైరవమూర్తి గోవిందరాజ
చెంచులయోబయ్య చెన్నమల్లయ్యా
కంచియేకాంబర కాళికానాథ
మధురాపురిప్రియా మహనందినాథ
కాముడ సోముడ కాయజవరద
రాముడ భీముడ రంకెలవలప"
ఇటువలె బిలిచిన నేపుమీరంగ
వచ్చిన యెద్దుల వరుసతోఁ జూచి
వన్నెలు గురుతులు వహిఁ జెప్పుకొనుచు
నెత్తురుకొమ్ముల నేపైనయెడ్లు
గణుపుతోకల మంచిగరుడబోలెడ్లు
అచ్చుగా కరివన్నె లమరినయెడ్లు
మూపురంబులతోడ మొనసినయెడ్లు
నుదుటచుక్కలుగల నునుపైనయెడ్లు
తెల్లనివన్నెల తెలివైనయెడ్లు
పచ్చనివన్నెల ప్రబలినయెడ్లు
ఘనమైనయెద్దుల కొండ్లగట్టించి
గంటలు గజ్జెలు గణగణమ్రోయ
మోకుల బంధించి ముందుగానపుడు
పంచవన్నెలకూడు పైఁ బారదివిచి
కంబము తర్లించె కమలనాభుండు.

*మలిదేవాదులు కంకణముపల్లెకు వచ్చి కంకణములుకట్టి మేళ్ళవాగు చేరుట*

మట్టివేముల దాటి మండలేశ్వరుడు
ఘూర్ణిల్లురవముతో గుమ్మడంపాడు
చేరి యచ్చటనిల్వ చిత్తంబుగొనక
గరికెపాటికి వచ్చి కాలూనకచట
కంకణంబులపల్లెకడను నాఘనులు

కంకణమ్ములుకట్టి కదిలి రావేళ
పట్టభద్రులు పైడిపాటికివచ్చి
పరగవీరుల కందు పయనమ్ముచెప్ప
మెరసినమన్నీలు మేటినాయకులు
ప్రభులును దొరలును బంధువర్గంబు
వీరవర్యులు గొప్పవిద్యలవారు
మించినబిరుదులు మేటిసాహసులు
కొలిబంటులు జెట్లు కలసియందంద
మేళ్ళవాగుననిల్చె మించినదండు;
అందరు గొల్లెన లమరంగనెత్తి
యుండిరి నాయకు లుత్తలపడక
అంతలో దినకరు డస్తాద్రి కరిగె
సాంద్రమై చీకట్లు జగమెల్ల కప్పె
విలసిల్లె చుక్కలు వినువీథియందు
గుమిగూడి పక్షులు గూళ్ళలో చేరె
గూబకదుపు మించి కూయంగసాగె
చక్రవాకంబుల సంతసంబడగె
ఘనచకోరంబులు కౌతుకంబందె
కలువలు వికసించె కమలముల్ మొగిడె
జారకామినులెల్ల సంతోషముసను
మగల నిద్దురబుచ్చి మనసులు చెదరి
కెరలి విటులను గూడ గృహములు వెడలి
మించి సాహసమున మేరలుమీరి
తోడికోడండ్రును తోటియేరాండ్లు
అత్తలు మామలు ఆడుబిడ్డలును
గురువులు బంధువుల్ గుర్తెరింగినను
నిందింతురను శంక నిలుపక మదిని
వాగుల వంకల వనములయందు
ఇసుకదిబ్బలయందు నిరువైనపొదల

కుంటినక త్తెలు కూడి కాపాడ
మనసుల తమిమించ మదను డా వేళ
పూబాణములు వింటబూని సంధించి
మర్మముల్ నొవ్వంగ మాటికినేయ
మంచిగంధము బూయ మనసుభీతిల్లి
పూవులుముడువను బుద్ధింత లేక
ఘననఖక్షతదంతఘాతలు మాని
బంధనై పుణియందు భావంబు వదలి
కొందరు శయనించి కొందరునిలిచి
కొందరు కూర్చుండి కొందరు మమత
బాయక యందంద బహువిధంబులను
కలయుచుండిరి మేన కంపంబులలమ ;
చోరులు సాహసస్ఫూర్తులతోడ
ధనికుల గృహములు తగ దెలిసికొనుచు
సాహసంబున దోచ సాగి రా వేళ.

*బ్రహ్మన కార్యమపూడి కదనరంగ మెట్లున్నదో కనుగొనిరమ్మని కన్నమను పంపుట : ఎరుకలసాని కన్నమ రాకను కారణమడుగుట: కన్నమ తమ రాకను కారణ మెరింగించి బ్రహ్మనకడకు వచ్చి అచటి విశేషములు తెలియచెప్పుట.*

అంతట బ్రహ్మన్న యా యర్ధరాత్రి
కనుకుల దాసుండు ఘనబాహుబలుడు
కన్నమయనువాని గ్రక్కున పిలిచి
"వెనుకటి రాజులు విక్రమస్ఫూర్తి
పోరాడి సమసిన బూదిదపెంట
ఇల భీమమైయుండు నెముకలప్రోగు
ఇటువంటి రణభూమి యెన్నికగాను
పావనంబుగజేసి బహుకాలమందు

కనిపెట్టియున్నట్టి ఘనభూతవితతి
దురములోపలనుండి తొలగింపవలయు
ఈ పొలికలనిలో ఈ రాత్రివేళ
ఎవ్వరెవ్వరు కాచి యెట్లున్నవారొ
అరసిరమ్మ"ని పంపె నా ఘనవీరు.
వాసిగా నురమున వనమాల కదల
కరముల గుజ్జరి కడియముల్ మెరయ
నేటైన పిడిగంట నెమలిసోగలును
నల్లనిదట్టిని నయమొప్పకట్టి
అర్ధనారీజల్లు లమరవీపునను
ఘోరభైరవకత్తి కోరమీసములు
ఎగుభుజంబులు మించు నెరజీరకండ్లు
ఘనమైనదేహంబు కాలిపెండెరము
వెరపైన యిటువంటి వేషంబుతోడ
కదలె కన్నమనీడు కదనభూమికిని
కాటుకకొండయు కదలినయట్లు
గిరిగొన్న చీకటి క్రిక్కిరిసినట్లు
హరిహరాదులమూర్తి యతనికిగలిగి
నడుకలని కేతెంచి నలుదెసల్ చూచె ;
అక్కడ కాపున్న యఖిలరాక్షసులు
గండభైరవమూర్తి ఘనభూతవితతి
గుంపులై యున్నట్టి కొరవిదయ్యములు
ఇరవున నున్నట్టి యెరుకలసాని
యున్నతావుకువచ్చి యుదురుచు ననిరి
"వింటివే వార్తలు విన విచిత్రంబు
గొల్లైన లచ్చట కుదురుగాచేసి
ఈ రుద్రభూమికి నీతడు వచ్చె
ఏమికార్యముగాని యెరుగంగరాదు
మదమునున్నాడు మము చూచి వీడు

తెలుసుకోవలె వీని తెరగెల్ల నిపుడు"
అని యుగ్రకోపాన నార్భులు నిగుడ
కత్తులు ద్రిప్పుచు కదసి కూయుచును
గట్టిగా నిలిచిరి కన్నమయెదుట
అంతట కన్నమ్మ అధికరోషమున
కాలాగ్నిరుద్రుడై కత్తినిదీసి
మేరుకైవడి నిల్వ మెచ్చి భూతములు
'తలకడు మనకింత ధైర్యంబుమీరి
ఎవ్వడేతెంచెనో యెరుగరా దితని
ఈ శ్మశానములోన నెసగు రుద్రుండో
బ్రహ్మయో విష్ణుడో పాకశాసనుడో
అగ్నిహోత్రుడో లేక యమధర్మరాజో
అల నైరృతుడో కాక అంబుధిపతియొ
పవనుడో ధనదుడో ఫాలనేత్రుండో
మునివితతికినెల్ల ముఖ్యుడోయేమొ
తెలియుద మంచును దిన్నగా ననగ'
ఇట్లనె నతనితో నెరుకలసాని
"ఎవడవురా యోరి యీ భూమిజొచ్చి
ఏమికార్యముకొర కేతెంచినావు
ఏరాజభటుడవో యెరిగింపుము"నిన
పలికె కన్నమనీడు పటుశక్తి మెరయ:
"సోమవంశంబున శోభిల్లుచున్న
అనుగురాజేంద్రున కంగనయైన
విద్యలదేవికి విభవంబుమీర
ముక్కంటి వరమున ముగ్గురుసుతులు
మల్లికార్జునుయొక్క మానసరూపు
లనగ జన్మించిరి అందులో మేటి
పెదమలిదేవుండు పృథివీశ్వరుండు
ఆ రాజునకు మంత్రి ఆదివిష్ణుండు

దొరసిన రేచర్ల దొడ్డనాయునికి
పడతి శీలమయను పద్మనేత్రకును
కలియుగకృష్ణుడౌ కారుణ్యమూర్తి
పుట్టెను బ్రహ్మన్న భూలోకమందు
అతనికి దాసుడనౌదును నేను
మాలలకును బుట్టి మాలనై పోక
విష్ణుపాదముబట్టి విశ్వంబులోన
తెప్పలినాయుడు తెరవయైనట్టి
వికచాబ్జలోచన పెమ్మసానికిని
శ్రీమించు మాచర్ల చెన్నుని మేన
పెంపొందు శ్రీతులసి పెదవనమాల
వరమున కన్నట్టి వరపుణ్యసుతుడ
కన్నమ నా పేరు కమలాక్షి వినవె
కాముని కెదిరించి కదనంబుగోరి
పగగల్గి దండెత్తి బవరంబునకును
వచ్చిరి మావారు వైభవంబలర
భండనక్రియ కిది పట్టైనచోటు
వెనుకటిరాజులు విక్రమస్ఫూర్తి
పోరాడి సమసిన పునుకులపెంట
తొలగించి శుచిచేయవలెనంచు దలచి
పరభయంకరమైన భండనభూమి
అరసిరమ్మని పంపె నవతారపురుషు
డైనట్టి బ్రహ్మన్న" యనుచు చెప్పంగ
విని యెరుకలసాని విస్మయంబంది
"ప్రళయకాలేశుడా పార్వతీశ్వరుని
పాదసేవకులైన ప్రమథులవారు
ఇపుడిటువచ్చుట నెసగెసంతుష్టి
మనసులో కోరిక మాకుసిద్ధించె
బ్రహ్మనాయుడువచ్చి భండనభూమి

పాదరేణువుచేత పావనత్వమ్ము
వెలయింపవలసినవేళ యేతెంచె
కడువేగరమ్మను కన్నమనేడ"
అనిన కన్నమ విని యా శక్తికపుడు
దండనమస్కృతుల్ తగచేసి మగిడి
బ్రహ్మనాయునిచూచి పదముల కెరగి
"కమలవల్లభ విను కంటినివింత
కంటి నెరుకలసాని కంటి దైత్యులను
జయమగు విచ్చేయు జలజలోచనుడ"
అనుచు నచ్చటి వృత్తమఖిలంబు చెప్పె;

*బ్రహ్మన ఆ యర్ధరాత్రమున కార్యమపూడి కదన భూమికేగి హరిని ప్రార్థించి వర్షముకురిపించి, పీనుగు పెంటలతోనున్న యుద్ధభూమిని శుద్ధి చేయించుట: వర్షజలప్రవాహమున ఒక పుఱ్ఱె తేలుచువచ్చి బ్రహ్మనకు తన వృత్తాంతము చెప్పుట: జగన్మాతయగు మహాశక్తి బ్రహ్మనకు సాక్షాత్కరించుట. బ్రహ్మన దేవిని కీర్తించి ఆమెను యుద్ధమునకు సాక్షిగానిల్పి తాను తన విడిదికి చేరుట.*

విని బ్రహ్మనాయుండు వీరధైర్యమున
పంద్రెండుసూర్యులు ప్రబలినరీతి
ఎవ్వరి కెరిగింప కేగె నావేళ;
పొలుపొంద నా రుద్రభూమి కేతెంచి
నాలుగుకరముల నాయుడు నిలిచె
ఆ రుద్రవసుమతి నపు డిట్టులుండె
కూడనిశల్యముల్ కురుచతుండములు
స్రుక్కిన చర్మముల్ చుట్టలై యున్న
ప్రేవులు నరములు పెంటలై యున్న
ఎండుమాంసంబులు ఎముకలు పగిలి
రాలిన మూలుగరాసులు తరుచు

మురిగి దుర్గంధంబు మొనసినమెదడు
గాలికి తూలెడు ఘనశిరోజములు
కాలికుప్పలుపడ్డ ఘనమైనబూది
చిమిడిన శవములు చెదరుకొర్వులును
నానావిధంబుల నటనలుసలుపు
భూతకోటులతోడ పొందికై యుంచె
తలకాయపుఱ్ఱెల తగబంతులాడ
శాకినుల్ మొదలైన సకలభూతములు
బెదరక వాదించు భేతాళచయము
పిల్లరిపాడెడు పెనుపిశాచములు
మిణుగుర్లు దిక్కుల మించిరాల్చుచును
కొమరొప్ప పరుగిడు కొరవిదయ్యములు
వేదమంత్రంబులు వెసచదువుకొనుచు
బ్రహ్మనాయుని చూచి భయసంభ్రమమున
ఆశీర్వదించుచు నలుకుచు తొలగి
ప్రక్కల కొదిగెడి బ్రహ్మరాక్షసులు
కనుచు బ్రహ్మన్నను కనినంతలోనె
భయమున పారెడి బలుదైత్యవితతి
ఇటువలె భయదమై యేపారుచున్న
రణభూమిలో చొచ్చి రహిమించు మతిని
ఈరీతి తలపోసె హృదయంబులోన
'ఎముకలపెంటయై యేహ్యమైయున్న
కార్యమపురి పుణ్యఖనియగునట్లు
కావింతుదేవతల్ కని సంతసింప
ధీరత శ్రీవీరతిరుపతి చేయ
వలెనంచు నూహించి వైరులపాలి
కాలమృత్యువువంటి ఘనుడు బ్రహ్మన్న
భయదమౌ రణభూమి పదిలుడై నిలచి
బలువైన బ్రహ్మాండపం క్తులనెల్ల

పుట్టింప రక్షింప పొలియింపనేర్చు
బ్రహ్మదేవుని విష్ణు ఫాలలోచనుని
ప్రార్థించి కీర్తించి ప్రణతులు చేసి
భువనరక్షణ చేయ బుద్ధిలోనిలిపి
పరమేశ్వరునిగూర్చి పలికె బ్రహ్మన్న
"ఓ చక్రధరసామి యో కంజనాభ
జలముపై పవళించు సర్వజ్ఞమూర్తి
ప్రమథావతారులు బలువీరవరులు
ప్రధనమేదినియందు ప్రాభవమొప్ప
ఇత్తుము ప్రాణమ్ము లీయవనినంచు
వచ్చియున్నారదె వైభవంబలర
వీరసింహంబులు వీరనాట్యంబు
చేయుదు రిప్పుడు స్థిరబుద్ధితోడ
పావనత్వము లేక పరగు నీభూమి
నీచేతి సంకున నీరంబు చిలికి
నంతనే పావనంబగుగాదె దేవ
నీచరణంబున నెరిజనియించి
పావనగంగనా పరగి లోకాళి
కడుపవిత్రము జేసెగద పూర్వమందు
ఆ జలరూపమై యమరుమేఘంబు
వర్షించి యీ భూమి పరమపావనము
కావించు దేవతల్ కని సంతసింప"
అనుచు బ్రహ్మన వేడ నాలించి హరియు
పరగ నాజ్ఞాపించి పంపె దేవేంద్రు
నతడు ప్రేరేపింప నా నీలమేఘ
మాకాశమెల్లను నల్లినట్లుండి
గాఢాంధకారంబుకప్పె భూస్థలిని
ఘూర్ణిల్లు ధ్వనులతో కుంభినిమీద
ఉరుములు పిడుగులు నొయ్యనబడగ

తళతళ మెరుపులు తరుచుగా మెరయ
వడగండ్లురాలంగ వాయువువిసర
వాగువంకలనీరు వరదలై పార
గుంటమిట్టనరాక కుంభినినెల్ల
ముంచె దేవతలెల్ల మూకలై చూడ
జలజనాభునిపాద జనితమైనట్టి
గంగ లోకమునంత క్రమ్మెనోయనగ
ఏకార్ణవంబుగా హెచ్చివర్షించె;
అప్పు డా జలమధ్యమందుండి యొక్క
పునుక జలముపైన పొర్లాడుకొనుచు
వడమరగా వచ్చి బ్రహ్మన్నవద్ద
నిలిచి పకపకనవ్వె నిష్కారణముగ
అప్పుడు బ్రహ్మయు నాదెస చూచి
తల పుట్టెతోననె దగువాక్యములను
"నవ్విన హేతువు నాతోడ చెపుమ
వీనులు చల్లగా వినగోరినాను"
అనిన నాయునితోడ నా పుట్టెపలికె
"శంఖ చక్రాంకిత సర్వలోకేశ
ఇందిరామందిర యినచంద్రనేత్ర
జలజసంభవజనక ! శార్ఙ్గశరాస
సకల వేదమయాత్మ శ్యామలవర్ణ
సకల ధర్మంబులు సమసెడు వేళ
తగిన రూపముదాల్చి ధరబ్రోతువెపుడు
దనుజేంద్రసంహార తార్క్ష్యవాహనుడ
ఎత్తితి వీరూపు నీయుగమందు
శోభిల్లు నీమేను చూడంగగలిగె
తక్కుసేయక విను తగుమనముంచి
దానవుడనుగాను దయ్యమ్ముగాను
భూరిభయంకర భూతంబుగాను

వాసిగా నాకాశవాణినిగాను
దక్షిణజలనిధి దండనున్నట్టి
జలనిధికోటయై చక్కగానున్న
రమపురమనుపేర రాజిల్లుచున్న
పట్టణంబేలితి బలమున ఘనుడ
జలధిసోముడనేను సర్వజ్ఞతిలక
ద్వాపరయుగమున ధైర్యంబుతోడ
బహుతరాక్షౌహిణుల్ బలములగూర్చి
ధూర్జటితోనెదిరి దురమొనరించి
కరులు గుఱ్ఱంబులు కాలిమానుసులు
హతమైనపిమ్మట నాలంబులోన
పడితిని పగవారి పంతంబుగెలువ
రణధూర్తుడనుగాను రాజునుగాని
సర్వసైన్యంబులు, సమసిన కలని
గతిగాన కీలాగు కాలంబుబుచ్చి
ఎదురుచూచుచునుంటి నెంతయు నేను
వీరాగ్రగణ్యత వెలసిన నీవు
కదనవిక్రముడవై కలనికివచ్చి
శోధించితివి వీరశూరధర్మమున
పరమాత్మ నాజన్మ పావనంబయ్యె
వైకుంఠపట్టణ వైభవంబెల్ల
కంటి నాయునిమూర్తి గన్నందుచేత
నీపాదముల ధూళి నెరసినకతన
పావనంబాయె నీ ఖండనభూమి
ఇటువంటి కలనిలో నేపునమీరు
కదన నాట్యముసల్ప కడుసంతసించి
శంకరుం డింద్రుడు సకలదేవతలు
ఎదురుగా చనుదెంచి యిత్తురిష్టములు
ఘనపవిత్రులుగాగ కలియుగమందు

వీరపుంగవులంచు వెలయంగగలరు
పడువడి షట్చక్రవర్తుల గలియ
దివికేగెదను నేను దేవదేవేశ"
అనిచెప్పి బ్రహ్మచే నంపించుకొనియె.
కరమొప్ప పండ్రెండు గడియలతడవు
కురిసి వర్షము వెలసె కుంభినియందు
నియతిచే భూతముల్ నిల్చిగొల్వంగ
కలనికి కర్త్రియై ఘనమైనశక్తి
ఘనుడు బ్రహ్మన్నను గాంచియు నిల్చె;
నిలచిన గనుగొని నీలవర్ణుండు
"ఓ విశ్వమయమూర్తి యో విశ్వకర్త్రి
ఓ లోకపావనీ యో జగద్భర్త్రి
ఓ శాంభవీదేవి యో జగన్మాత
సమరంబునకు సాక్షిశక్తి వీవ"నుచు
మగిడి తానటనుండి మళ్ళవాగునకు
వేగుజాముకువచ్చి విడిదిలో నిలిచె;
తెలవారెనంతట దివిజులుప్వొంగ
చుక్కలకాంతులు శూన్యమై యడగె
కలువల మిత్రుని కాంతులు తగ్గె
చీకటి గుహలలో చేరి దాగుండె
గూబకదుపు బెదరి గుంపులై పోయె
చక్రవాకంబులు సంతసంబందె
కమలముల్ వికసించె కలువలు మొగిడె
జారుల చోరుల సంతోషమణగె
తమతమ కార్యముల్ తగజేసికొనుచు
ఆనందమునుబొంది రఖిలభూజనులు
అర్ఘ్యంబులిచ్చుచు నఖిలభూసురులు
వేదమంత్రములచే వినుతులుచేయ
పూర్వపర్వత శిరఃపూజ్యాగ్రమందు

ఘనతరమాణిక్యఖచితసౌవర్ణ
కుంభంబువలె నిల్చి గురుతేజమునను
భానుండు దిక్కుల బ్రబలె నావేళ.

*మలిదేవరాజు సైన్యసమేతుడై కార్యమపూడి కేతెంచి అట గొల్లెన లెత్తించి భూతరాట్కంబమును ప్రతిష్ఠించుట: నలగాముని యుద్ధమునకు రమ్మని బ్రహ్మన భట్టుచే కబురంపుట.*

తరువాత మలిదేవధరణీశ్వరుండు
పొలుపొంద కార్యమపురి కేగదలచి
ఘనమైనదేరాలు కట్టినబండ్లు
ఇతర వస్తులు మోసి యేతెంచునట్టి
ఎద్దుల నొంటెల నెల్ల ముందుగను
సాగించి యంతట సంతోషమునను
కాలిబలంబుల ఘనఘోటకముల
మదమున విలసిల్లు మంచియేనుగుల
నాలుగుదిశలను నడువంగచేసి
వీరనాయకులెల్ల వెస చుట్టునడువ
తమ్ములు నాయుడు తన బంధుజనులు
తమ వాహనంబులు తగ నెక్కి మించి
వెంబడి రాగను విభవంబుమీర
తరుచు మాణిక్యముల్ తాపించినట్టి
పాలకీనెక్కక భట్లు పొగడంగ
ఇరువంక నరిగెలు నెత్తిక్రమ్మంగ
వెస బరాబరిచేయు వేత్రహస్తులును
"అవధారు రాజేంద్ర" యని హెచ్చరింప
పూజ్యుడౌ మలిదేవభూపతి చనియె;
ఐదువిధంబుల నమరువాద్యముల
నాకాశమంతయు నదరంగసాగె

సాంద్రధ్వనులు హెచ్చి సంతసంబొసగ
కదనరంగంబైన కార్యమపూడి
పుణ్యభూమినిచేరి పొందుగా దండు
విడిసెను వైరులు వెక్కసంబంద.
వేదశాస్త్రజ్ఞులౌ విప్రులందరును
అధిపు నాశీర్వాదమమరంగచేయ
చెన్నకేశవుదేవు శ్రీపాదజలము
దేవుని పూజారి తెచ్చుటచేసి
తులసిపత్రంబుల దొరగెడు తీర్థ
మచ్చోట చల్లించి యలరులగ్నమున
శంకుసంస్థాపన సమ్మతిచేసి
నిక్షేపముగ రత్ననిచయంబులుంచి
తెచ్చిన కంబంబు ధీరతతోడ
నడికలననెత్తించె నరనాథవరుడు.
కాశ్మీర కస్తూరి కర్పూరయుక్త
పరిమళగంధంబు బాగుగాబూసి
మైసాక్షిగుగ్గులు మహితధూపంబు
అర్పించియటమీద నారగించంగ
మృగముల మాంసంబు మెచ్చుగావండి
పంచామృతంబులు పాయసాన్నములు
పేరైనరసవళ్ల పిండివంటలును
భూతరాట్టున కప్డు భోజనంబిచ్చి
అఖిలభూతంబుల కాచారముగను
ఘనమైనపోతుతో గావుచెల్లించి
తరువాత సర్పాఖ్యతటి విలసిల్లు
ఘనగంగ తా వచ్చి కలసిన మడుగు
పొంతకు జని వీరపుంగవులెల్ల
తమతమ నామగోత్రము లుచ్చరించి
తానముల్ తగచేసి దరియందు నిలిచి

నిలిపిరి లింగముల్ నియమంబుతోడ;
తడయక మలిదేవధరణీశ్వరుండు
నాయునితోడను నదికి నేతెంచి
కాలోచితక్రియల్ కావించి, విష్ణు
నామ జపంబును నయమారజేసి
పటకుటీరమునకు పన్నుగావచ్చి
సకలనాయకవితతి సముఖాన కొల్వ
కొలువున గూర్చుండె కుధరారిరీతి;
అప్పుడు బ్రహ్మన్న అవనీశుతోడ
ఉచితవిచారంబు నొప్పుగాచేసి
చెలగుచు సమరంబు చేయగావలెను
తరుచైన బలముతో తరలి రమ్మనుచు
పొలుపొంద నలగామ భూమీశుకడకు
భట్టునుపొమ్మన్న పయనమై యతడు
వాయువేగముగల వాజిపై నెక్కి
బంగారుగుబ్బతో ఖాసిల్లుగొడుగు
పట్టుక ముందర భటుడొక్కడరుగ
విలసిల్లుజల్లుల వింజామరముల
నీవలావలచేరి యిద్దరువీవ
గురుజాలకేతెంచి కువలయేశ్వరుని
తావుకుముందర తగచెప్పిపంపె.

*నలగాముడు కొలువుకూటమున నాట్యప్రదర్శనములను తిలకించి ఆనందించుట.*

విని కామభూపతి విభవంబుమెరయ
కొలువు శృంగారింప కూర్చినవారి
పంపించ వారలు పరిచారకులను
రప్పించి తీర్చిరి రమణీయముగను;
కస్తూరిచేతను కలయంగనలికి

ముత్యాలతోడుత ముగ్గులుబెట్టి
కప్పురముదకమ్ము కలపియంతటను
జల్లిరి కలయంపి సత్వరమ్ముగను
శ్రీరామకథలును శ్రీకృష్ణకథలు
పన్నుగా వ్రాసిన పటములుతెచ్చి
కట్టిరి గోడలు కనుపడకుండ
మౌక్తికమంజరీమంజుపుంజంబు
వ్రేలాడుచుండెడి వివిధవర్ణముల
ఘనవితానంబులు కట్టిరిమీద
నిలువుటద్దమ్ములు నిలిపిరి దిశల
తంతుపటంబులు తగ క్రిందపరచి
వన్నెలపటములు వరుసతో మీద
పరచి యామీదట పంచవర్ణముల
రత్నకంబళములు రంగుగాపరచి
కాంచన నవరత్న ఖచితమైనట్టి
పీఠమొక్కటితెచ్చి పెద్దకొల్వునను
నిలిపిరి కాంతులు నిండుగాదిశల
చెలువుగా నిటువలె చేసినవార్త
వినినంత నలగామ పృథ్వీశ్వరుండు
సరసంపుపన్నీట జలకంబులాడి
ఘనశుచివస్త్రముల్ కటియందుదాల్చి
చిత్రాసనంబుపై చెలగికూర్చుండి
నిలువుటద్దముచూచి నేరుపుమీర
తిలకంబు నుదుటను తిన్నగాతీర్చి
సంధ్యాదికృత్యముల్ సమ్మతిజేసి
భుజియించి తరువాత పునుగుజవ్వాజి
కాశ్మీరరసమును కలపిన యట్టి
శ్రీచందనము మేన చెన్నుగాపూసి
తగటుకూసంబులు ధరియించి తలను

ఒకవింతయుష్ణీష మొప్పుగాబెట్టి
హారి రత్నపుబిళ్ళ నను వొందకట్టి
కర్ణకుండలములు ఘనముగా మెరయ
అఖిలరత్నములతో నమరికైనట్టి
పతకచయమ్ములు పైడిమాలికలు
మెడజుట్టి రొమ్మున మించివెలుంగ
భుజకీర్తులను రెండుభుజముల దాల్చి
మేనికి రక్షయై మించు తాయెతులు
దండచేతుల రెంట ధారణచేసి
మురుగులు గొలుసులు ముంజేతనొప్ప
పదివేళ్ళ ముద్రికల్ బాగుగాపెట్టి
నవరత్నఖచితంపు నడికట్టు తాల్చి
గండపెండేరంబు కాలికితొడిగి
తగటుదుప్పటి గప్పి తనపాదములను
బంగారుపావాలు పన్నుగాతొడిగి
కటికవారలు మ్రోల కనిపించి పొగడి
ఈవలావలచేరి హెచ్చరింపంగ
వేత్రహస్తులుగూడి విచ్చలవిడిని
సందడిదూరమై చనునట్లుచేయ
కొలువునకేతెంచి కుతుకంబుమీర
నిలచె శృగారంపు నేర్పగ్గలింప;
అంతట కింకరులతివేగమునను
తూలికాతూలంబు దూర్చినయట్టి
ముకమలుపరుపులు మునుకొనితెచ్చి
పరచి పీఠముమీద బాగైనదిండ్లు
ఉంచిన గనుగొని యుర్వీశుడైన
కామభూమీశుండు గద్దెపైనుండె
వెనుకను నరసింగవిభుడు కూర్చుండె
నాయురాలొకచక్కి నమ్రతనుండె

బంధుజనములు చుట్టు బలిసికొల్వంగ
పాకశాసనుకొల్వు వగిదినున్నట్టి
వేళనే తెంచియు విద్యాధికతను
వేదశాస్త్రజ్ఞులౌ విద్వాంసులెల్ల
ఆశీర్వదించుచు నాసీనులైరి.
సకలదేశాధీశసచివపుంగవులు
ముకుళితహస్తులై ముందరనుండ్రి
గణికసమూహంబు ఘనజోస్యవితతి
కవులును భట్లును కనుపెట్టియుండ్రి
వింతగా గాయకుల్ వీణలుపూని
తంత్రులు బిగియించి తగశ్రుతిచేసి
సరిగ మేళనమైన సప్తస్వరములు
ఆరోహణావరోహణ భేదములను
బహురాగసంస్ఫూర్తి పట్టుగాచేసి
సంచారిసంస్థాయి సరసభావముల
మృదుతరశబ్దార్థ మిళితమైనట్టి
ఘనతరాలంకార గతిపరంపరలు
మూర్ఛనల్ మొదలైన ముఖ్యధర్మములు
జంత్రగాత్రంబుల జంటకావించి
ఎండినమ్రాకులు ఇగిరించునట్లు
పాడిరి తమతమ ప్రౌఢిమీరంగ;
చెలగి నాటకజనుల్ చేరి జోహారు
గావించి నిలచిన కామఘావిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబుచేయ.
వరమృదంగము లెస్సవాయించు మేటి
కుడిభాగమందున కుదురుగా నిలచె
తాళమానజ్ఞుడు తగ నెడమదిశను
నిలచె నుత్సాహంబు నెమ్మదినిండ
ముఖవీణ వాయించు ముఖ్యతోకంఢు

రాగజాలముబాడు రమణులిద్దరును
నిండువేడుకతోడ నిలచిరి వెనుక
కంజలోచనయను ఘనమైనపాత్ర
మదనుపట్టపుదంతి మంజులవాణి
భరతశాస్త్రోచిత ప్రాణముల్ పదియు
గలిగిన యక్కాంత కంతుబాణంబు
వలె వచ్చి సభవారు వర్ణించిచూడ
నిలచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికి తగవినయంబు చూపి
అతడొసంగిన గజ్జ లతిభక్తితోడ
పదములగట్టుక పంచవన్నియల
కాసె గట్టిగ గట్టి కడుజవంబమర
మద్దెలతాళంబు మధ్యనిల్చుండి
ఓరచూపుల ప్రభు నొయ్యనచూచి
సమపాదయుతమైన స్థానకస్థితిని
అఖిలదేవతలకు నలరులతోడ
పుష్పాంజలియొసంగి పూనినాట్యంబు
ఆవెనుకసమకట్టి నతివలుపాడు
సంగీతనాదంబు సభయెల్ల క్రమ్మ
కై ముడికట్టుముల్ కనుపింపచేసి
వెలయంగ తొమ్మిదివిధములై నట్టి
భూచారి నాట్యంబు పొందుగాసల్పి
పదహారువిధముల పరగినయట్టి
ఆకాశచారియు నమరంగనాడి
అంగహారాఖ్యచే నమరు నాట్యంబు
విదితమౌ తొమ్మిదివిధములనాడి
గతిచారిభేదముల్ గనుపడునట్లు
భ్రమణసంయుతదీప్తిపటిమమీరంగ
పాణిభేదంబులు పదభేదములును

స్థానకసంచయ సంయోగమమర
పేరణిదేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగు బహుచారి
సప్తతాండవములు సరవిప్రకటింప
సభవారలాశ్చర్య సంయుక్తులైరి
తరువాత నిరుమేల తగు చెలులమర
సంయుక్త సంయుతా సంయుతహస్త
నానార్థకరములు నాట్యహస్తములు
శిరమునుచూపులు చెక్కిళ్ళుబొమలు
దంతోష్ఠకంఠముల్ తగచుబుకంబు
ముఖమును వక్షంబు మొదలుగానెన్న
అంగంబులారు ఉపాంగములారు
ప్రత్యంగసముదయంబారును కూడ
ఎనిమిదిపదియగు నెసగునంగంబు
లమరంగ నభినయంబాశ్చర్యముగను
మాచెర్ల చెన్నుని మహిమంబుతెలుపు
ఆంధ్రసంస్కృతభాషలమరుగీతముల
భావంబులెస్సగా ప్రకటనచేయ
చూచి రంభాదులు చోద్యంబునొంది
శిరసులువంచియు సిగ్గునుచెంది
రప్పుడు భూమీశుడాదరంబొప్ప
వస్త్రభూషణములు వారలకిచ్చి
భట్టును రమ్మని పంపించెనంత

*భట్టు, నలగాముని కొలువునకేతెంచి పోరు మంచిది కాదనిచెప్పుట; నాయకురాలు సంధికొడబడవలదని నలగామునకు చెప్పుట:*

తురగంబు నాభట్టు దుమికించుకొనుచు
వచ్చి కొల్వునుచేరి వాజిని డిగ్గి

భూమీశు నెదుటను పొందుగా నిల్చి
"రాజాధిరాజ విరాజితకీర్తి
రాజవేశ్యాభుజగ రంజితలోక
గండరగండాంక ఘనదానచతుర
ధైర్యనిర్జిత మేరుధరణీధరేంద్ర
శౌర్యవిక్రమకళా సంపూర్ణచంద్ర
భాస్కరసమతేజ ప్రౌఢగుణాఢ్య
మానదుర్యోధన మైలమ్మసుతుడ
అనుగుభూపతిపుత్ర అంచితగాత్ర
వీరకామనరేంద్ర విభవదేవేంద్ర
వినుము నా మాటలు వీనులనాని
రాయబారమునకు రాజుపంపించ
వచ్చిన అల్లుని వధియింపగాను
మనసున క్రోధించి మలిదేవరాజు
తమ్ములు బ్రహ్మన్న తనబంధుజనులు
వీరనాయకవితతి విఖ్యాతిమెరసి
ఖరదూషణాదులు గతమైనచోటు
శ్రీశైలభూమిలో శ్రేష్ఠమైనట్టి
కార్యమపురిభూమి ఘనపుణ్యరాశి
పటుతరవిక్రమ ప్రౌఢిమీరంగ
తగప్రవేశించెను దండుతోకూడి
అలరాజుతోడనే హతమౌదుమనుచు
చలమున క్రోధంబు సంవృద్ధిపొంద
వీరనాయకులును వేగిరపడగ
మలిదేవభూపతి మంత్రిబ్రహ్మన్న
నన్నుబుత్తెంచిరి నరనాథ వినుము
పగవృద్ధిబొందించు భ్రష్టులుగలరు
అణగింప నేర్పరు లవనిలో నరుదు
నరసింగభూమీశు నమ్మికమీర

తమ్ముడా మలిదేవధరణీశుకడకు
పంపించ నేకమై పగయెల్లనణగు
పలనాడు మొదలైన బహుభూములెల్ల
ఎదురెవ్వరునులేక యేలుడి సుఖిత
శృంగారయుతునిగాచేసి నరసింగు
పంపించు మలిదేవపతిని గలయంగ
ఘోరుమంచిదిగాదు భూమినెక్కుడను
పాడౌను దేశంబు పగమించెనేని
ప్రజలెల్ల నశియించి పారిపోవుదురు
బండారమునకును పైకంబులేమి
రాణువయంతయు రహిచెడియుండు
చేజీతగాండ్రెల్ల చెలగికోపించి
ఈయగల జీతంబు లిమ్మందురపుడు
పతిబంటు మేరలు పరిహార్యమగును
పంపినపనిజేయ పాలుమాలుదురు
పగవారివార్తలు పరికింపలేరు
తెలిసిన శాత్రవుల్ ధీరతవచ్చి
భూమెల్ల గొనుటకు బుద్ధిపెట్టుదురు
శారదనీరదశంఖడిండీర
పారదకౌముదీస్ఫటికోపలాద్రి
ఘనమరాళంబుల కాంతినిమించు
సత్కీర్తి వేగమే సమయునుభువిని
అపకీర్తి జగములో నధికమైయుండు
ఉభయులు మీరెల్ల నొక్కటైయున్న
సకలకార్యంబులు సమకూడివచ్చు
ప్రజలకు సుఖమౌను పంటలు పండు
ధనము సంపాదింప తగియుండునపుడు
సంపూర్ణకాములై సకలసేనలును
కాపాడుదురు మిమ్ము కనిపెట్టియుండి

పరరాజులనుగెల్వ పైకొనిపోయి
అదిమి కప్పంబుల నధికంబుగాగ
కొనవచ్చు ధర్మముల్ కూర్పంగవచ్చు
సత్కీర్తి జగముల సాంద్రమై నిలుచు
కలహించి వెనుకటి కౌరవులెల్ల
కదనంబులో బడు కథలెల్లవినమె
పగపెరిగించుట భావ్యంబుగాదు
ఉభయవాదులవార లొక్కటిగాన
నయమొప్పచెప్పితి నామాటవినుము"
అనుచు చెప్పిన నీతులాలింపకుండ
కామభూమీశుండు కనులెఱ్ఱచేసి
కోపంబుమించగా కొలువెల్ల చూచి
వింటిరా సభవారు వీరల తలపు
రాణువతో తాము రణభూమినిలచి
తమ్మునంపుమనుట ధర్మమా తమకు
విన్నవారెల్లను వెరగందగలరు
మగతనంబునబుట్టి మగకానెగట్టి
మగటిమి విడనాడి మానంబుమాలి
వారున్న తావుకు వచ్చుట తగవె
భటవృత్తివాడవై పల్కితివిట్లు
పూర్వకార్యంబుల పుట్టువుమరచి
ఇటువలె పలికితి వేమందు నిన్ను
అనరాదు వినగూడ దామాట విడువు
తమ భూమినిచ్చితి దక్కించుకొనగ
శక్తిగల్గిన చాలు సదయత నేను
ఇచ్చితి తమ భూమి యేలుకొమ్మనుము"
అనుచు వింతగపల్క ఆమాటలకును
భావంబుతెలియక పటురోషమంది
నవ్వుచు దగ్గరి నాయకురాలు

ఎవ్వరు వినకుండ ఏకాంతమునను
పలికె కామునితోడ ప్రౌఢిమమెఱసి
"విను నరనాయక విన్నవించెదను
బాలరాజులు తాము బ్రహ్మనాయకుడు
కలిగిన బలముతో కార్యమపూడి
కలను ప్రవేశించి కదనంబుచేయ
కాచుకయున్నారు గ్రక్కున మిమ్ము
రమ్మన్నమాటకు రామనరాదు
కలిగిన బలిమియు కలిమియువిడిచి
మగటిమి విడనాడి మానంబుదూలి
వంచి భూమిచ్చుట పంతంబు కాదు
కయ్యంబుచేయుటే ఘనవిచారంబు
ఇద్దరురాజులు ఏర్పడిరేని
అవనిలోపల నాజ్ఞ కమరికగాదు
సిరిపొత్తుచేయుట చెల్లురాజులకు
ఆజ్ఞపొత్తిచ్చుట అది నీతిగాదు
పాండవులకు భూమి పాలిచ్చిపిదప
కౌరవులేమైరి కార్యమర్మజ్ఞ
నీ వెఱుంగని నీతి నే నెరుగుటెట్లు"
అన విని భూమీశు డాత్మలోదలచి
భట్టును కోపించి పలికె నావేళ
"అలరాజుచావు కహంకారమొంది
పగతీర్ప తమకెంత బలిమియున్నదియొ
నాతోడ పోరాడ నరులెంతవారు
సేనాధిపతిలేడు సేనలులేవు
కరితురగంబులు ఘనముగాలేవు
ఏనెరుంగని బలమెక్కడవచ్చె
కూడిగుంపైనను గున్నయౌ చింత
క్రిందికిలేదు; ఈ కీలెరుంగుదును

మూకంత వరిమడి మూలకులేదు
ఏమివిచారించి యిటువచ్చినారో
బవరంబొనర్చిన పట్టిబంధించి
రణబలిపెట్టింతు రణభూమికెల్ల
ప్రాణముల్ వలసిన బాలరాజులను
తిన్నగాతోడ్కొని తిరిగిపొమ్మనుచు
బహుబుద్ధిగాచెప్పు బ్రహ్మనాయునకు"
అనిన కోపంబుతో నాభట్టుపలికె
"ఉత్తలమేటికి ఉర్వీశ నీకు
కాకిబలగమురీతి క్రమ్మియున్నట్టి
బలముచూచుక గర్వపడనేలనయ్య
సంధికేతెంచిన సరసుడల్లుణ్ణి
చంపినవారలు జగతిలోలేరు
ఆడుబిడ్డను చంపి యల్లునిచంపి
హింసకు రోయని హీనవర్తనుడ
వెరుగవా వీరుల నెరుగవా బ్రహ్మ
పగవారిగుండెలు బ్రద్దలుసేయు
పటుతరవిక్రమప్రౌఢిసంయుతుడు
పగరాజుల బోజుంగు బ్రహ్మనాయుండు
అష్టదిక్కుల రాజు లారణగండ్ల
కేతెంచి రణమున నెదిరినవేళ
కుంజరంబులమీద కొదమసింహంబు
దుమికినరీతిని దోర్బలమెసగ
కినిసి వారలనెల్ల గెలిచి యాలమున
దివిజుల మెప్పించి తివిరి వజ్రంబు
సమమైనకుంతంబు చక్కగా గొనియె
కువలయేశులవద్ద గొనె అప్పనములు
ఆదినారాయణు నవతారమతడు
కృష్ణ నీదెడువేళ కేరుమకరంబు

చంపవచ్చిన చూచి జంకింతలేక
ఖండించివైచిన ఘనశూరుడతడు
చుట్టునిప్పులయేరు శోభిల్లుచున్న
నెట్టన శివపురి నీరుగాచేసి
భూతరాట్కంబంబు పుచ్చుకొన్నట్టి
శూరుండు ధీరుండు సుమహితుడెన్న
చెడనాడ వారల చెల్లునా నీకు
లక్షకొక్కడు సరి లావునయందు
పదికోట్లనైనను బవరంబునందు
తెగటార్చు పుత్తురు ధీరతమించి
ఉగ్రకోపాఢ్యులు ఉరుబాహుబలులు
అసహాయశూరులు అరువదేగురును
భండనవిజయుల బాహువిక్రముల
కన్నులమదమెక్కి గర్వించిపొంగి
కానక నిందింప కలుగునా ఘనత
చిరునక్కక్రొవ్వున చీదరరేగి
చట్టుపై గంతులు సాగించుకల్లు
బలముచూచుక గర్వపడనేలనయ్య
ఎరుగుదు నీబలమెన్ననేమిటికి
ఏనుగు సింగము నెదిరింపగలదె
స్వాతికొక్కెరలెల్ల సాళ్వంబుకెదురె
అటుగాన జూచెదవందరిలావు
వెడలుము దండెత్తి వెడలకుండినను
నడతురు కోటకు నాయకులెల్ల
కరిచయంబు కొలను కలచినరీతి
గురజాలపురమెల్ల కోటతోగూడ
పెరికివైతురు మించి పెక్కుభంగులను
నిన్ను నీతమ్ముని నీకున్నవారి
నీదు నాగమ్మను నీకూర్మిసఖుల

శిక్షింతు రో రాజ సిద్ధమీమాట"
అని భట్టుపలికిన నందరు కినిసి
కోరమీసలు దువ్వి కోపించిరపుడు.
మంత్రిణి నాగమ్మ మండుచుపలికె
"భట్టువాడవుగాన పలికితివిట్లు
కామభూపతిపాదకమలంబులాన
కరిచేత తొక్కింతు గట్టిగానిన్ను
భట్టువాడవు గాన బ్రతుకనిచ్చితిని
దైవంబు నీపాల దయచేసినాడు
వీరులు ఘనులని వెరపింపరాకు
సమరంబులో వారు సమయంగగలరు
మశకముల్ తేనెలో మడసినయట్లు
మిడుతలు చిచ్చులో మిడిసిపడ్డట్లు
మాచేత చచ్చును మన్నీలబలము
వాజుల చౌరదోలి వడితోడపోరి
గొనకొని శిరములు కుప్పలుచేసి
మదగజములచేత మట్టించివిడుతు
వత్తుము దండెత్తి వడిపోయి నీవు
పారిపోవకయుండ పదిలమ్ముచేయు
మ"నుచు కట్నములిచ్చి ఆ భట్టునంపె
అనిపిన పురివెడలి అప్పుడే కదలి
కార్యమపూడికి గ్రక్కునవచ్చి
మలిదేవు పొడగని మన్నన వడసి
కాముడాడినయట్టి కఠినవాక్యములు
వీరులు నాయుడు వినుచుండగాను
విన్నవించిన రోషవివశులై వారు
కార్చిచ్చుభంగిని కనలి కోపించి
"గొబ్బున నీవేళ గురజాలకేగి
కోటలగ్గలు పట్టి కూలద్రోసెదము

పట్టణంబెల్లను పాడుచేసెదము"
అని పల్కగా నాయుడప్పుడిట్లనియె
"దండెత్తి వచ్చెడి ధరణీశుఁబిడిచి
తగదు కోటకు నడువ ధర్మంబుకాదు
వీరధర్మము తప్పి పెనగుటయేల"
అని బుద్ధిగాజెప్ప నట్లుండి రంత

*నలగాముడు సైన్యమును సమీకరింపుమని నాగమ్మకు అనతిచ్చుట; మలిదేవు నెదిరించుటకు తోడురమ్మని సామంతులకు లేఖలు వ్రాయవలసిన దిగా నాగమ్మ నలగామునికి సలహా నిచ్చుట.*

గురజాలలోపల కుంభినీశుండు
నలగామభూపతి నాగమ బిలచి
"మనవద్ద బంట్లును మన్నెవారలును
పంక్తుల నన్నంబు భక్షించువారు
రొక్కజీతంబుల రూఢులౌ వారు
క్షేత్రముల్ చేసుక జీవించువారు
పల్లెలుబుచ్చుక బ్రతికెడువారు
ఎలగోలుప్రజలకు నెల్ల రకిపుడు
పైనమ్ము కమ్మని పరగజెప్పించు
కరి తురగంబుల గదలింపుమనుము
బరువైనశూలాల బండ్లు తర్లించు
సాగించు నీవుండి జాగుచేయకుము"
అని యిట్లు చెప్పగా నామె యిట్లనియె
"వినుము చెప్పెద నీకు వీరకామేంద్ర.
కొంచెము దళముపై కోపమేలయ్య
అరువదేగురె కాని అధికులు లేరు
బలముల పిలిపించి పన్నిపోరాడ
వారికి బలమేది వట్టి గద్దనలు

బాలుర గొనివచ్చి బ్రహ్మనాయకుడు
భూమి  గొనెదనంచు పూనియున్నాడు
నీ బల్మికల్ములు నీ వెరుగలేవ
ఇంద్రుడైనను నిన్ను నెదిరించగలడె
వారి బింకములకు వంగువారెవరు
నీవు రాబనిలేదు నిఖిలేశ యిపుడు
నన్ను బలమునంపు నాయునిగెలిచి
మన్నీల వీరుల మగటిమిగూల్చి
మలిదేవరాజును మరల మేడపికి
పరువిడజేతు నా పంతంబు చూడు"
అనిన నాగమతోడ ఆ రాజుపలికె
"తనయుని చావుకై తగ కొమ్మవిభుడు
బహుఖేదయుక్తుడై పగతీర్చుకొనగ
బాలరాజులు తాను పట్టుగావచ్చి
ఉన్నాడు కలహింప నుగ్రతేజమున
నాకు లక్ష్యములేదు నాగమ వినుము
నీతిశాస్త్రంబుల నిర్ణయరీతి
పగవారి కొద్దిగా భావించరాదు
కొంచెపు ఫణినైన కొట్టెడికొరకు
ఘనమైనదండమే కావలెగాని
కూడదు చులకని కోలలగొట్ట
తప్పినా తమకాన తరిమికరచెడిని
హెచ్చైనబలముతో నేగుటమేలు
మరణమైనను చాలు మంచిదియనుచు
తగతెంపుచేతు రా దారిద్ర్యయుతులు
ఏల వేగిరపాటు ఎలనాగ మనకు
ధనధాన్యబలములు తక్కువలేవు
పట్టజాలవు నిండి భండారమిండ్లు
తరగవు గాదెలు ధాన్యంబుహెచ్చి

తంద్రినాటిబలంబు తక్కువలేదు
మానాడు గలయది మంచిబలంబు
బంధుమిత్రులు చాల పట్టుగలారు
అఖిలభూపతులు నాయాజ్ఞచేపట్టి
పనులనొనర్తురు భక్తితోనిపుడు
ఇటువలె మనలావు హెచ్చియుండంగ
మలిదేవుకార్యంబు మనసుకుగాదు
కార్యస్వతంత్రత కలగదాతనికి
భండారహైన్యంబు పగయధికంబు
ఉన్నవారి వ్యయంబులుడుగకున్నవియు
బలములగూర్చినన్ భక్షణలేదు
ఈవిలేకుండిన నెవరువచ్చెదరు
వచ్చిరా వారలు వశ్యులుగారు
ఒకనెల మించెనా యొవ్వరుబంట్లు
వౌరబంటు మేరలు తొలగుచునుండు
కార్యముల్ చెడిపోవు కలిమిలేకున్న
ప్రతిమల నాడగా బట్టినయట్లు
నాటకం బిటువలె నాయుడుచేసె
కదనరంగంబున గానగనౌను
మన్నీలువీరులు మనశక్తియెరుగ
వేగమే చని దండువిడియింపలయు
చుట్టుక వారల శూలాల బొడిచి
తురగరింఖలచేత దొక్కించుదనుక
నెరయ కన్నులనిండ నిద్రయేరాదు"
అనియిట్లుపలికిన ఆ రాజుతోడ
నాగమ పలికెను నయయుక్తితోడ
"మనకప్పనముపెట్టు మన్నెవారలకు
పంపించు లేఖలు బలములగూర్చి
పగతురశిరములు బలిమితోగొట్టి

రాలుపరచినయట్లు రణమునబరచి
భద్రగజములనెల్ల బంతిగాగట్టి
మట్టింపవలెన"న్న మైలమ్మసుతుడు
"అటువలె చేయింతుమ"నియె నావేళ.

*నలగాముడు వివిధమండలాధిపతుల సాహాయ్యా మపేక్షించుచు లేఖలు వ్రాయుట: లేఖలనందుకొని పెక్కంద్రురాజులు సైన్యసమేతులై తరలివచ్చుట.*

తరువాత నలగామ ధరణీశమౌళి
వ్రాయించె లేఖలు వసుధేశులకును
"బ్రహ్మనాయునివద్ద బలుపైన కుంత
మున్నదియని భీతి నుర్వీశులెల్ల
అప్పన లిచ్చినారడిగినయట్లు
ఏమును మీరును నేకమై యిపుడు
పటువిక్రమస్ఫూర్తిప్రకటంబుగాగ
బ్రహ్మనాయుని గర్వపటిమ దూలించి
పోరాడి శత్రుల బొరిగొనియెదము
మనసులో నరమరల్ మానియు మనము
ఏకమై భూముల నేలుకొనియెదము
శ్రీ గిరీశునియాన చెన్నునియాన"
అని బాసపత్రమ్ములంపె నందరికి;
మామగుండముకోట మనుజేశునకును
ధరణికోటపురికి దక్షుడైనట్టి
భీమదేవుండను పృథ్వీశునకును
కోలంకిరాజుకు ఘూర్జరపతికి
ఉరగసేనుండను ఒడ్డెభూపతికి
ఏడుమాడెములేలు నెరుకు కామునికి
పొన్నాడభూపతికి పొదిలెరాజునకు
కటకాధిపతికిని కలువరాయునికి

దేవాద్రి నేలెడు తెలుగుబిజ్జలుకు
పెదబాహుదేవుకు భీమసేనునకు
సూర్యకుమారుకు చోళభూపతికి
సంగ్రామవిజయుడౌ జయదేవునకును
జయసింగు నృపతికి చంద్రాద్రిపతికి
వీరప్రతాపుడౌ వీరసేనునకు
వీరభల్లాణునకు విక్రమపతికి
అరవసింగాణన కర్ణామమణికి
బంగాళపతికిని పంచపాండ్యులకు
మళయాళకర్ణాటమనుజేశులకును
మరియు దేశాధీశమండలేశులకు
వ్రాయించి పంపిన వారెల్లగూడి
చింతించి రిటువలె చిత్తంబులోన
"నలగామరాజును నాయనివారు
పగబెట్టుకొని పోరపయనమైనారు
తనకు సహాయులై తర్లిరమ్మనుచు
నయలేఖలంపించె నలగామరాజు
సవతిపుత్రులకిపుడు సమకూడె పోరు
తీరదందొకరైన తెగటారుదనుక
కాముడు గెలిచిన కలయప్పనములు
లేవని పంపెను లేఖలు మనకు
కదలుడీ దండెత్తి కామునికడకు
వీరకామునిగూడి వీరయుద్ధమున
బలమెచ్చనందరు బ్రహ్మనాయుణ్ణి
పొంగెల్ల నడగించి భూమేలవలెను"
అనుచు విచారించి ఆప్రొద్దెకదలి
భేరీధ్వనులు మించి పృథ్వివికంపింప
కరులు ఘోటకములు కాలిమానుసులు
ధ్వజములు పడగలు తగు గొడుగులును

వేల సంఖ్యలుగూర్చి వెడలి వేగంబె
దిక్కుదిక్కులనుండి తెంపునవచ్చి
తీరైనచోటున దిగియుండి రపుడు.

*నలగాముడుతనదళముల నాయత్తపరచియుద్ధ భూమికి పంపుట.*

అంతట నలగాము డధికమోదమున
కొలువునకేతెంచి గురురత్నమయత
అలరుపీఠంబున నాసీనుడగుచు
తనమంత్రివరులను తగినట్టిహితుల
పాలెగాండ్లను దొరల బంధువర్గమును
వడవాండ్ల నంపించి పరగ బిలిపించి
పయనము చెప్పించి భావమువొప్పంగ
రేవంతు సరివచ్చు దృఢశౌర్యయుతుల
రాహుత్తునిచయమున్ రమ్మనిచెప్పి
విజయున కీడైన విలుగాండ్లగముల
బంతిని భుజియించి పావాలుతొడిగి
గజ్జునతేన్పుచు కరములపైని
పికిలిపిట్టలు మెరయ పెద్దసావడికి
వచ్చి ఆసీనుడై వలిపెదుప్పటిని
సొగసొప్ప కప్పుక సూరెలనుండి
బొట్టెలు వీడ్యముల్ పొందించి యివ్వ
మీసముల్ మెలివెట్టి మీది కెత్తుచును
పిలిపించి వారికి ప్రియముచెప్పించి
పయనంబుకమ్మని ప్రభువు తాబలికె.
అంతట వారెల్ల అధికరోషమున
పంతముల్ మీరంగ బలువిడి మెరసి
సురియలు పరిఘముల్ శూలసంఘములు
ప్రాసముల్ కుంతముల్ పటుఖడ్గములును

ముసలముల్ గదలును ముద్గరచయము
పేరైనచక్రముల్ భిండివాలములు
పరశుపుల్ బల్లెముల్ బాకుకటార్లు
శార్ఙ్గముల్ ధనువులు శరధులుదాల్చి
నియతిచే నందరు నిలచి ముందటను
నలగామరాజుకు నమ్రులైచనిరి.
అటుమీద భూపాలు డానంద మొప్ప
తోడురాగలయట్టి దోర్బలఘనుల
పటుపరాక్రములను పార్థివేశులను
పిలిపించి వారికి ప్రియములుచెప్పి
"ఘనత కార్యమపూడికదనరంగంబు
చేరవలె మనమెల్ల సేనలతోడ
ఘనతర సుముహూర్తకాలంబునందు
భేరీనికరమును పెద్ద ఢమామి
నిచయంబు మ్రోయింతు నిఖిలంబునెరుగ
పయనమైరావలె పార్థివుల్ మీరు"
అనుచు పంపిన రాజు లరిగిరందందు;
ఇతరపరివారంబు లెల్లను వెడల
చయ్యన పురిలోన చాటగాబంపి
నలగాము డంతట నాగమతోడ
ఘనవాజిశాలలకడకు నేతెంచి
వాజుల నెల్లను వరుసను చూచి
సాహిణి జనముల సరవి బిల్పించి
"పరుగుగుఱ్ఱాలకు పక్కెరల్ వేసి
పయనమ్ము కండ"ని పలికెనంతటను
కాంచననవరత్న ఖచితమైనట్టి
పక్కెరల్ పైగట్టి బంగారుకుప్పె
కుచ్చులు జల్లులు కూడి వ్రేలాడ

శార్ఙ్గశరధిఖడ్గచయములు గట్టి
వజ్రముల్ రత్నముల్ వరుసతో మెరయ
ముఖమలుపట్టెలు మొగములగట్టి
అందెలు పదముల నమరంగచేసి
పుత్తడిగజ్జెలు పోలుపొంపుపేర్లు
కంఠదేశములందు కట్టి యీలాగు
సకలజాత్యశ్వాల సవరణచేయ
రౌతుల బిలిపించి రమణీయమైన
వజ్రాంగులిప్పించి వారల తలల
ధరియించ బొమిడికతతులనిప్పించి
వస్త్రచయంబుల వరుసనిప్పించి
వాజులరౌతుల వన్నెగాతీర్చి
కుంజరతతులను గుంపులుచేసి
పటుబొందులజోళ్లు బలుపైనయట్టి
అంకుశంబులుపట్టి అలరుమావటుల
కొప్పించి తర్లంగ నొయ్యనచెప్పి
ఘనమైన శూలాలుగట్టినయట్టి
శకటసమూహంబు సాగించిపిదప
పటకుటీరంబులు బరువులుదేను
ఎద్దులనొంటెల హెచ్చైనబండ్ల
వేసడంబులనెల్ల వే నియమించి
తర్లించుకొనిపోవ తగియున్నయట్టి
కొట్టెగాండ్లను బిలిచి గొబ్బునజెప్పి
తరువాత నలగామ ధరణీశ్వరుండు
జోస్యుల బిలిపించి సుముహూర్తమడిగి
భేరీదమామీలు పెల్లుగామ్రోగ
చేయింపుమని యపుడు చెప్పిపంపించె
వానిపై యధికార్లు వరశక్తిమీర

చరచినభేరుల సాంద్రనాదంబు
విన్నవారలకెల్ల వీనులుపగిలె
ఆకాశమంతయు నదరంగసాగె
ధరణీధరంబులు తల్లడంబంది
గుహలను నోళ్ళతో కూయంగసాగె
ఘనముగా భూమెల్ల కంపించసాగె
దిగ్దంతులుఘీంగె దిక్కూలుమ్రోసె
తపనుతురంగముల్ తప్పెమార్గంబు
ఎటువచ్చునోయని యెల్లదిక్పతులు
అనుకూలముగచేసి రాలోచనములు.

*నలగాముడు గజారూఢుడై యుద్ధభూమికి బయలు దేరుట: నాగమ్మ నరసింగుతో ఆతనిని అను సరించుట.*

అప్పుడు నగరునకరిగి యారాజు
కాలోచితములైన కర్మముల్ తీర్చి
పూసియు తొడిగియు పొందించికట్టి
సకలశృంగారంబు సమ్మతిచేసి
వరకాంతియుక్తుడై వాకిటనిలువ
సకలబలంబులు చనుదెంచి నిలిచి
ఆయుధపాణులై యంజలుల్ పట్టి
తొలగిరి రాజుకు దూరంబుగాను.
మావంతులప్పుడు మదమునహెచ్చి
పగవారలకునెల్ల భయమునుజేయు
బహుతరోన్నతమైన భద్రగజంబు
పైని పల్వన్నెల పరగుచునున్న
తగటుపటంబులు దంటగాచేసి
కూర్చిన కంథలు గొప్పయౌ వెన్ను
పైగప్పి ముఖమలుపరుపులు వేసి

పదునారువన్నియబంగారుతోడ
రచియించి దానికి రత్నముల్ తాపి
తీర్చిన చౌడోలు తెచ్చి పైగట్టి
బంగారుకంబముల్ బాగొప్పనిలిపి
మణిగణతపనీయమయమైనయట్టి
చప్పరం బొక్కటి సమకూర్చి మీద
పద్మరాగప్రభాపటలిచే మించు
బంగారుశిఖరంబు బాగుగానిల్పి
గంటలు మువ్వలు గట్టిగా కట్టి
చుట్టు ముత్యపుచేర్లు శోభిల్లచేసి
మణిమయమంజరి మధ్య వ్రేలాడ
చిరుతగంటలపేర్లు చెలువుగా కరికి
కంఠమందున చేర్చి గంట సంధించి
పంచవన్నెలు నిటలభాగంబుచేర్చి
ముత్యాలజల్లుల మొనసినపటము
కుంభస్థలమ్మున కొమరొప్పగట్టి
శుభ్రదంతమ్ముల శోభిల్లునట్లు
తపనీయవలయముల్ ధట్టించి మొనల
ఘనతరశితశస్త్రఘటన గావించి
బంగారు గొలుసులు పదములగట్టి
గంటలు ప్రక్కల గణగణమ్రోయ
తొండంబు గొలుసులతోడ రంజిల్ల
శృంగార మిటువలె చేసినయట్టి
ఇభరాజముం దెచ్చి యెదుటను నిల్పి
మావంతుడెక్కి యా మనుజేశునకును
చేయించి వినతిని చెలువంబుమించ
కూర్చుండగాజేసె కుంభిని నపుడు;
అంతట పరిచారు లతివేగముగను
పుత్తడి నిచ్చెన పొందిక చేయ

సేవకు డొక్కఁడు చేదండ యీయ
ఘన కరీంద్రము నెక్కెఁ గామభూవిభుడు
వెలయ సేవకుడొకడు వెనుక గూర్చుండి
తాంబూల మొసగుచు తగ చామరంబు
వీవగాసాగెను వినయంబుమీర
తరువాత లేచెను దంతావళంబు
హేమదండంబుల నెసగుచునుండు
మౌక్తికచ్ఛత్రముల్ మనుజేశునెదుట
పట్టిరి బహుకాంతిపటలి మిన్నలర
ధ్వజములు గొడుగులు తరుచుగానొప్పె
అయిదువిధంబుల నమరువాద్యములు
అధికరవంబుల నానందమొసగె
దళములతోగూడ ధరణీశవితతి
దిక్కులెల్లను గ్రమ్మి తిన్నగానడచె
తరువాత నెలగోలు దళములుగదలె
కదలిరి దండును కైజీతగాండ్లు
బలము నల్దిక్కుల పటిమతోనడిచె
బహుమిత్రవర్గంబు బంధుజనంబు
మంత్రిపురోహితుల్ మన్ననచేయ
పచ్చలుతాపిన పల్లకీయెక్కి
నరసింగుడరిగెను నాధునివెనుక
పడవాండ్లు బలముల పదపదమనుచు
బహుతరధ్వనులచే పలికిరి హెచ్చి
వేత్రహస్తులుచేరి విదళించగాను
సందడియెడగల్గి జరగంగసాగె
గుఱ్ఱముల్ గజములు గుంపులుగూడి
పక్షభాగంబుల పట్టుగానరిగె
మధ్యలోజిక్కిన మత్తగజంబు
సందుగానివ్వక జరుగంగసాగె

తురగహేషారవస్ఫూర్తులు మించె
గజములఘీంకార ఘనరవంబడరె
ఘనతరోత్సాహులు కాలిమానుసులు
అట్టహాసంబుల నమరిరావేళ
గొప్పగుఱ్ఱమునెక్కి కుడిభాగమందు
జగడంబుచేసెడి చాతుర్యమెల్ల
నయగతితెల్పుచు నాగమచనియె
నగరంబువెలువడి నలగామరాజు
దక్షిణదిశయందు తనరెడుబయల
దిరచెరువనుపేర తీరైనభువిని
నిలిపించి గజమును నిండినవేడ్క
వెంబడివచ్చిన విప్రులనెల్ల
వినయతబొమ్మన్న వేడ్కతో వారు
"పగవారినెల్లను బలిమిమై గెలిచి
ఏకాధిపతివౌచు నేలు భూమెల్ల"
అనుచు దీవనలిచ్చి యరిగిరివేగ
తన మది నమ్మిక దనరినయట్టి
బలములో పేరైన ప్రౌఢనాయకుల
పిలిపించి వారికి ప్రియములు చెప్పి
కర్పూరతాంబూల కలితులచేసి
"నగరంబు కోటయు నయమున మీరు
పగలును రేలును బహుజాగ్రదాత్మ
కాపాడుడీ మీరె కలవారు మాకు"
అని చెప్పి బొమ్మన్న నరిగిరి వారు;
తరువాత నాగమ తగునధికార్ల
పేర్పేర పిలిపించి ప్రియమున బలికె
"గొల్లెనల్ మొదలైన గురుతరభార
నిచయంబులెల్లను నించినబండ్లు
శస్త్రాస్త్రచయముల శకటసంఘంబు

అంగళ్ళవారల నాడుపాపలను
పరగ వంటయొనర్చు బానిసజనుల
ఆటపాటలచేత నలరించువారి
నానావిధంబుల నాణెంబులుండు
ఘనమందసంబులు గట్టినమ్రోయు
వేసడంబుల మంచివేగులనెల్ల
జీతరొక్కంబులు చేతిలోవేసి
వెంటనే పంపుడీ వేగంబె" యనుచు
పొందించి చెప్పిన పోయిరి వారు;
తరువాత కాముడు తర్లించె కరిని
పూర్వంబు నియమించు పొందికతోనె
హయములు కాల్బలం బాజ్ఞతో నడచె
బలపాతసంఘాతబలిమిని ధూళి
మేఘమార్గంబెల్ల మేదురంబైన
తపనుని హయములు తర్లలేవయ్యె.
అఖిలదిక్కులయందు నమరె చీకట్లు
బలములు నడుచుట బహుకష్టమయ్యె
జళిపించుకత్తుల సాంద్రతేజంబు
మణిగణభూషణ మంజుదీధితులు
అంతటంతట మార్గ మట్టె చూపించె
అవనియెల్లను గ్రుంగె నాదిశేషాహి
సిగ్గుచెందినయట్లు శిరములు వంచె
దిగ్గజంబులు మ్రొగ్గె దిశలు కంపించె
భట్టువారలు బిరుదుపద్యముల్ చదువ
అఖిలయాచకకోటి కానందముగను
దానంబు లిచ్చుచు తర్లి యాప్రొద్దు
కొదమగుండకుజేరె కుంభినీశుండు

*కొదమగుండ్ల ప్రజలు నలగామునిచేరి యుద్ధము నకు పోవలదని విన్నవించుట. నలగాముడు వారికి ధైర్యముచెప్పి తాను కార్యమపూడియందు విడియుట.*

పేరైన పల్లెల పెద్దలౌరెడ్లు
కోమటి జనములు కూడియేతెంచి
కామభూమీశుని కనుగొని మ్రొక్కి
విన్నవించిరి మహావినయంబుతోడ
"మామాట వినదగు మైలమ్మసుతుడ
వైరంబు మీకేల వసుధాధినాథ
అన్నదమ్ములు పూర్వమతిలోభమునను
కలహించి మడసిరి కదనంబులోన
పగలేక యేలుటే బలిమి మీకెల్ల
ప్రజలకు సుఖమౌను పరులు తగ్గుదురు
అనుకూలురై మీరలవనియేలంగ
కనుగొన్న మాకెల్ల కలుగుశుభంబు
హితులముగనుక మీకెరుగచేసితిమి
శక్తిచాలదు మాకు సారెకుదెలుప"
అని విన్నవించిన ననియె వారలకు
"మదమున గర్వించి మలిదేవరాజు
రణముచేయగ తర్లిరమ్మని మాకు
భట్టును పంపించె బలమెరుంగకయె
పైనమై వస్తిమి బవరంబుచేయ
వీరుల నాయుని వెస మలిదేవు
బంధుమిత్రాదుల పారపోదోలి
వేగమేవత్తుము విభవంబుమెరయ
వలసలు దీయంగ వలవదుమీరు
ఎలమితోనుండుడీ యిండ్లలోనిలచి"
ఇటువలె వారికి హితవుగాచెప్పి

పొమ్మన్నవారలు పోయిరావేళ
మరునాడు నలగామమండలేశుండు
మనమున రోషంబు మల్లడిగొనగ
కాలోచితంబైన కర్మముల్ దీర్చి
ఘనతరశృంగారకలితుడై వెడలి
భద్రకరీంద్రముపైని గూర్చుండె
తమ్ముడు నరసింగధరణీశ్వరుండు
ఎలమితో పాలకి నెక్కి వెంబడిని
స్థిరగతి బలములు చెలగంగ నేగె
ఆర్పులబొబ్బల నవని గంపింప
సాగరముప్పొంగి చనుదెంచినట్లు
మేఘముల్ వినువీథి మేదురంబగుచు
పరువులుబెట్టెడు భంగినిదోప
క్రమ్ముకకార్చిచ్చు కణగినయట్లు
పవనుండు దట్టమై పరగినమాడ్కి
వివిధబలంబులు వేగమే నడిచె
చక్కగా మిరియాల సరిమేర దాటి
ప్రజల మేలిమి చింతపల్లియు గడిచి
కౌరవుల్ పాండవుల్ కలహంబొనర్చి
కూలిచచ్చినయట్టి కురుభూమిరీతి
పొలుపొందుచుండెడు పుణ్యదేశంబు
కాశికిసమమైన కార్యమపూడి
రణరంగభూమిని రాజు తా నిలిచి
భద్రదంతినిడిగ్గె పదిలంబుగాను
మూలబలంబులు మొనగాండ్లు వచ్చి
చచ్చొకమేర్పడ సమమైనభూమి
హేమకుంభంబుల నెసగుచునున్న
పటకుటీరంబులు పన్నిరిచుట్టు
కనుచూపుదూరాన కంబముల్ పాతి

పటములు గొడుగులు పన్నుగాగట్టి
కనకసింహపుబిరుదు గలిగినయట్టి
ధ్వజపట స్తంభంబు తగనిల్పిరెదుట;
చెలువుగా విడిపట్టు చేయించివేడ్క
కొలువులోనికివచ్చి కూర్చుండెరాజు
దాపటనరసింగు తగినట్టి దొరలు
కొండమన్నెమరాజు కోటకేతుండు
కుడిదెస రెడ్డియు గురియైనయట్టి
చేరువకాండ్రును చేరికనలర
వీఁగంటలుగట్టి విలసిల్లుచుండు
సోమదేవరరౌతు శూరులైనట్టి
వీరరాహుత్తులు వెలయుమున్నూట
అరువదిసంఖ్యయౌ నాహరిజనులు
రణశూరులైనట్టి రాచకొమాళ్లు
పోటుబంట్లనుబట్టి పొడిచెడివారు
ఊడిగలొంటరు లొనరకొల్వంగ
దేవతాగణయుత దేవేశురీతి
భూపతిసభయందు పొల్పొందుచుండె
రాజువెనుకచేరి రమణినాగమ్మ
కార్యఖడ్గంబులగల నేర్పులెల్ల
తెలుపుచు గూర్చుండె ధీరతతోడ
ఇతరబలంబులు హెచ్చు వేగమున
తర్లెడువారును తగనడచువారు
విరిసెడువారునై విరివైనదండు
తగినతావులయందు తప్పకనిలిచె

*నలగామునకు తోడ్పడ బయలుదేరిన రాజులు తమ బలగములతో అతనిని చేరుట;*

మూడుసహస్రముల్ ముఖ్యులౌబంట్లు

జవనకంఖాణముల్ సప్తశతంబు
పరగంగ శ్రీవీర భల్లాణివచ్చె
పటువిక్రమాఢ్యులు పదిరెండువేలు
గదలవారొకవెయ్యి ఘనవాజులమర
పౌన్నాడభూపతి పొందుగాగలిసె
అరిగెలు పదినూరు లధికులౌబలము
ముప్పదివేలును ముఖ్యమొకరులు
మున్నూరు కొలువంగ మోదంబుతోడ
కలిసె మాళవపతి కామభూవిభుని
కదియ తొమ్మిదివేలకాలరిబంట్లు
నమ్మదగినయట్టి నాయకచయము
ఒకవేయిఅశ్వాల నొనరప్రతాప
రుద్రుడు పంపించె రూఢసంగతిని
పదివేలకాలరి బలములతోడ
పాచి దేవుడువచ్చి పన్నుగాగలిసె
నీలిమెక్కెమ్ముల నేర్పైనబంట్లు
పదివేలుగొలువంగ బంగాళవిభుడు
వచ్చెనువేగమె వసుధేశుకడకు
గజములుపదివేలు ఘనమైనబలము
ఇరువదివేలతో నేతెంచె నొడ్డె
భూమేలుబలదేవ పురుషోత్తముండు
పదివేలతురగముల్ బంట్లొకలక్ష
కూడుక కల్యాణ ఘూర్జరపతుల
ధనదదాసుడు పంపె ధరణీశుకడకు
ఉజ్జయినీపురి నొప్పుగానేలు
మహదేవదాసుడు మదకరుల్వెయ్యి
శకటసహస్రముల్ సమ్మతిగొలువ
ఏతెంచె సాహసం బెల్లవారెరుగ
పదిలక్షల బలమ్ము పటిమదీపింప

ద్రావిడ కేరళ ధరణీశవరులు
వచ్చిరి నలగామ వసుధేశుగలయ
పదివేల పతియైన పద్మసేనుండు
పదివేలబలముతో పట్టుగావచ్చె
సింధునదీతీర శివకీర్తిఘనుడు
ఒకవెయ్యిగుఱ్ఱము లొప్పైనసేన
పదివేలతో శౌర్యపటిమ నేతెంచె
గట్టుభూములనేలు ఘనులైనపతులు
పదుగురు పదిలక్షబలములతోడ
చనుదెంచిరతివేగ సాహసంబొప్ప
గురుసహస్రద్వయ ఘోటకయుతులు
సానిపోతమరాజు సత్యాఖ్యప్రెగడ
గుండమదేవుడు గొబ్బూరిరాజు
మొదలైనవారలు ముఖ్యులౌబంట్లు
ఏనూరుతోగూడ నెనుబదిమీద
ఎనిమిదివేలతో నేతెంచిరపుడు
మొదలు వెంబడివచ్చి మొనలైనయట్టి
బలములతోగూడి పరగలెక్కింప
బుద్ధిమంతులకైన పొందదునేర్పు
సంతోషమున తోడుచనుదెంచినట్టి
మనుజేంద్రులకునెల్ల మంచికట్నములు
తెప్పించియిచ్చిన తిన్నగాజనిరి.
అంతట నాయురా లశ్వంబునెక్కి
తగినయిరవులుచేసె ధరణీశతతికి
మిగిలినవారికి మేలైనతావు
లమరించి విడియించె నానందమొంద
ఎక్కడజూచిన నెడలేకగడిని
ఇసుముచల్లినన్నైన నిలమీదపడదు
చొరదువాయువు దండుచొచ్చినరాదు

సుపథంబు దొరకదు చోద్యమైయుండు
ఆదండులోపల నఖిలవర్తకులు
సకలధాన్యంబులు సకలరత్నములు
బంగారు వెండియు బహుధనవితతి
క్షౌమవస్త్రంబులు సరసంపుపట్టు
పటములు ఘనతంతు పటనిచయంబు
కాంస్యపిత్తడితామ్ర ఘనభాండతతులు
రసవర్గములనెల్ల రంజకంబొప్ప
విక్రయక్రయములు వెలయుంతు రెపుడు
సౌందర్యఘనతచే సంపూర్ణమైన
వేశ్యవాటికలొప్పు విశదంబులగుచు
దారిద్ర్యమన్నది దండులోలేదు
ధనధాన్యవృద్ధిచే తనరెడులక్ష్మి
వేలంబులోపల విలసిల్లుచుండె.

*నలగాము డట్లు దండువిడియుట చూచి, వీరులు ఆతనిని కదియుటకై తొందరపడుట: బ్రహ్మన వారిని శాంతింపజేయుట; కొమ్మరాజు గురిచూచి నలగామునిగుడారముపై నొక బాణము వేయుట: నలగాముని సైనికులు కళవళపడి నలుమూలల చెదరుట.*

అంతట బహువిక్రమాఢ్యమానసులు
భండనవిజయులు బలపరాక్రములు
వీరులు ఆదండు విధమెల్లచూచి
బ్రహ్మనాయునితోడ పలికి రీ రీతి
"నలగామభూతలనాథుండు మదిని
తనకెవ్వ డెదురనుధైర్యంబుపూని
భండనవిజయినై ప్రబలుదుననుచు
ఏపుననెదురెత్తి యిటు వచ్చినిలచె

కని యూరకుండుట ఘనతయుగాదు
ఏమివిచారించి యిటులుంటివయ్య
సరగునసెలవిమ్ము శంకయేమిటికి
కుమ్మరావములోన కుటిలతగచ్చ
ఫలమువేసిన భాండపటలమ్ముపగిలి
పెంకులైపడ్డట్లు పెనుశౌర్యమునను
వేలంబుపైబడి విచ్చలవిడిని
సకలబలమ్ముల సమయించి యముని
పురికిని బనుతుము భుజశౌర్యమమర
పంపవే"యనిపల్క బ్రహ్మన్న వినుచు
"తమకింపవలవదు తరియగుదాక
సహనంబుదొడ్డది సకలకార్యములు
కూడివచ్చున"టన్న కొమ్మభూవిభుడు
పలికెను తన శౌర్యపటిమమీరంగ
"కామభూమీశుడు ఘనశౌర్యమునను
ఎవ్వరు తన కెదురీభూమినన్ననుచు
జగజంపుడేరాలు సరవినెత్తించి
ఉన్నాడు మనమీద నుగ్రతేజమున
కమలబాంధవవంశకర్తయైనట్టి
బలభద్రరఘుపతిపంపున నేను
అంపుదునొకశరం బారాజుకడకు
అంపిన నిలచెనా యతడు నాసాటి
చెడివిరిగిపారెనా క్షితిభర్తగాడు
ఇంపార నీగురి నెరుగంగవలయు"
అని పంతమాడుచు నా కొమ్మవిభుడు
వాసుకికోరల వాడియున్నట్టి
తొలకరిమెరుపన దొనవెళ్ళదిగిచి
పింజను ముత్యాలపేరు లల్లాడ
అలుగున మణిగణంబమరంగ ముఖము

మధ్యాహ్నభానునిమాడ్కి కన్పట్టి
శరము చాపంబున చయ్యనదొడిగి
కర్ణపర్యంతంబు గ్రక్కునదిగిచి
కోపంబుమించగా 'కో' యనియార్చి
కనుదృష్టి చెదరక గ్రక్కుననేసె
నక్షత్రములుడుల్లె నాకేశుడులికె
అవనికంపించెను ఆకాశమదరె
కనురెప్పపాటునకంటె వేగమున
పిడుగుపడ్డట్టుగా పృథివీశుడదర
ఘనమౌగుడారంపు కంబంబుగాదె
పసిడి కుండలు డుల్లిపడెగుడారంబు
విడిబడి యేనుగుల్ వీధులబారె
అశ్వముల్ రౌతులు నరిగిరిచెదరి
బండ్లయెద్దులు జడిసి పరుగిడసాగె
సాలగుఱ్ఱంబులు సరభసమంది
కట్లుత్రెంచుకపారి గట్లపాలయ్యె
కోల్పోయి చేపట్ట గొడుగులనెల్ల
పట్టెడివారలు పడవైచిచనిరి
కల్లోలమందుచు కామునిబలము
భయమునచని చింతపల్లెయుదాటె
వీరకామేంద్రుండు వేత్రపాణులను
పడవాండ్లనంపించి భయములుతీర్చి
జనులనుబిలిపించ చయ్యనవచ్చి
తమతమతావుల తగనుండిరపుడు
వీరులందఱు తమ వేలంబులోన
ఆనందమునుపొంది యట్లున్నయంత
కాలజ్ఞులైనట్టి కార్తాంతికులను
పిలిపించి బ్రహ్మన్న ప్రియములుచెప్పి
"సమరంబుచేయంగ సరసమైనట్టి

నీలోభహీనత నేవిన్నవింత
తప్పకవిను మది తార్కాణగాను
నా మేనమామను 'నా ముద్దుసుతుకు
పిల్లనిమ్మ'ని నీవు ప్రియముననడుగ
'మనకులంబున నోలిమాడలుగలవు
తగినధనంబీక తానీయ'ననెను
ఆ మాటమీదట నమ్మరో నీవు
ముట్టడివేసితి మూర్ఖతతోడ
అయిదురోజులుదాక నంత మామామ
'అక్కవై ననునేమి అలిగిననేమి
అడిగినధనమీయ కతివనేనీయ
బ్రహ్మవచ్చినగాని భయపడబోను
నిశ్చయం బీమాట నెలతరో'యనిన
'ఏమి కావలె నీకు నిప్పింతు నేను
అన్న ! సందేహింపకడుగవే' యనిన
'మాడలు తూమెడు మాకు కావలెను
ఇప్పించు వేగమె యింకొక్కమాట
పొల్లును తాలును పొసగవు మాకు
తీర్పైనమాడలు తెచ్చియిమ్మ'నిన
మదిలోన నొవ్వక మగువ నీవపుడు
ఊడిగీలనుపంపి యొప్పైనధనము
తెప్పించి రాశిగా తీర్చిపోయించి
'కొలిపించికొమ్మ'న్న కోరి మీయన్న
మెట్టొండుకట్టించి మీదతానెక్కి
హెచ్చుగా తూర్పార నెత్తెను భువిని
'చిందిపోయినవెల్ల చెడు తాలు పొల్లు'
అని రోసి మిగిలిన అర్ధమంతయును
అధికమౌ తూమొక టపుడుతెప్పించి
ఎలమి తూమునకంటె హెచ్చుగాగొలిచి

# బాలచంద్రుని యుద్ధము

## క థా సం గ్ర హ ము

మలిదేవుడును నలగాముడును కార్యమపూడియొద్ద తమ సైన్యములను ఆయత్తపరచుకొని యుద్ధసన్నద్ధులై యుండగా ఒకనాడు మేడపిలో బాలచంద్రుడు తనకు ప్రొద్దుపోవుట లేదని చెప్పి తల్లి ఐతాంబ ఎంత వారించినను వినక చెలికాండ్రతో గూడి బొంగరములాడుటకై ఊరిబయటకు చేరెను. నగరమున నున్న అమ్మలక్కలు అచ్చట గుమిగూడి ఆటను చూచి ముచ్చట పడుచుండగా బాలచంద్రుని బొంగరము అన్నమ్మయను వైశ్యాంగన మీగాలికి తాకి మూర్ఛిల్లెను. చెంతనున్న చేడియలు శైత్యోపచారములు చేయగా ఆ అన్నమ్మ కొంతసేపటికి తెలివొంది పోతుసింగమువలె మన్నుమిన్ను కానక పోతరించితివి : మీ అయ్యలకు యుద్ధమున సాయపడ కార్యమపూడికి పొమ్ము. అచ్చట శత్రువులు నీ పొంకమణచెదరని బాలచంద్రుని తూలనాడెను. ఆమె పలుకులు ములుకులై నాటగా బాలుడిక ఒక క్షణమైనను అక్కడ నిలువజాలక

ఆమెను మన్నింపవేడుకొని తల్లికడకు పరుగునపోయి యుద్ధ రంగమున కేగుటకు తనకు అనుజ్ఞ యిమ్మని ప్రార్థించెను. ఐతాంబ బాలుని బుద్ధి మరల్ప ఎన్నియో విధముల ప్రయత్నించినను ఫలము లేకపోయెను. కొడుకును ఒప్పించుట సాధ్యముకాదని ఆమె యోజించి భార్య దీవనగొని యుద్ధమునకు పొమ్మనియు, అర్థిజనులకు దానధర్మములు చేయుమనియు ఆతనికి ధనమిచ్చి పంపించెను. బాలచంద్రుడు తల్లి చెప్పినచొప్పున తిన్నగా మాంచాలనగరికి పోక తన చెలికాండ్రతో మార్గమధ్యమమున నున్న తన ఉంపుడుకత్తె యగు సబ్బాయి యింటికి చేరి తన యొద్దనున్న ధనమును ఆ వేశ్యాంగనకును, వేశ్యమాతకును అర్పించెను. అతని వేశ్యాలోలత్వమును చూచి అనపోతరాజను బ్రాహ్మణ మిత్రుడు మందలింపగా అతడు సిగ్గుపడి తన ఆభరణములను పేదలకు, భట్టులకు దానమిచ్చి తన అత్తవారింటికి మరలెను. ఎన్నడును తమ గడపత్రొక్కి ఎరుగని అల్లుని చూచి అత్తవారు సంతోషభరితులైరి; బాలచంద్రుడు అచ్చట తాను ఏడుజాము లుండెదనని చెప్పి తన మిత్రులను ఇండ్లకుపంపించి సుగుణ వతియు, సుందరియు నగు తన భార్యను ఇన్నాళ్లువిడిచి వేశ్యాలోలుడైనందులకు తనను తాను నిందించుకొనుచు సర్వమును మరచి మాంచాలతో ప్రొద్దుబుచ్చుచుండెను.

బాలచంద్రుడు యుద్ధమునకు పోవలెనను మాటయే మరచి అంతఃపురమున ప్రొద్దుబుచ్చుచున్నాడని కలుషించి ఆతని చెలికాండ్రు అచటికేగి ద్వారముచెంత నిలబడి పెడ కేకలిడుచు కదనభూమికి పోదము రమ్మని పిలువసాగిరి. అందు

లకు బాలచంద్రు డాగ్రహించి కత్తిదూసి వారిపై కదియబోగా వారతనిని పోటుమాటలతో సిగ్గుపడునట్లుచేసిరి. బాలచంద్రుడు తన తప్పునుగ్రహించి లోనికిపోయి దీవించిపంపుమని మాంచా లకు తన ఖడ్గము నిచ్చెను; ఆమె కలియుగమున మీకు ఘన పూజ లమరునని దీవించి ఆ ఖడ్గమును మరల ఆతనికి అందించి బ్రాహ్మణుడైన అనపోతరాజు యుద్ధమున మరణించుచో బ్రహ్మహత్య ఘటిల్లుననియు, ఆతని నెట్లయినను ఇంటికి మరల్చుడనియు బోధించెను. బాలచంద్రుడు అల్లేయని అట నుండి తన తల్లికడకేగి ఆమె యాశీర్వాదమును బడసి చెలి కాండ్రతో కార్యమపూడికి పయనమయ్యెను.

అనపోతు నింటికిపంపు నుపాయ మాలోచించి బాల చంద్రుడు మార్గమధ్యమమున ఆగి తాను తన ముత్యాలహార మును ఉంగరమును మాంచాలనగరిలో మరచివచ్చితినని బొంకి వాటిని తెమ్మని ఆదేశించెను. అనపోతు వెనుకకు మరలగా బాలచంద్రుడు త్రిపురాంతకమునకు వచ్చి అన పోతును కార్యమపూడికి రావలదని ఆనలుపెట్టుచు లేఖ వ్రాసి దానినొక చెట్టుకొమ్మకు కట్టి మిగిలిన మిత్రులతో నలగొండ చేరి యచట విశ్రమించెను.

అచ్చట కార్యమపూడిలో నాయకురాలు సంధి చేసి కొనవలెనను తలంపుతో చింతపల్లిరెడ్డి, మాడుగుల రెడ్డి, కొండ అన్నమరాజు, కోట కేతరాజు మున్నగు ఆప్తులను పిలిపించి "నలగాముడు మాచెర్ల రాజ్యమును మలిదేవున కిచ్చుటయే గాక కులపగ దీర్చుటకు నరసింగుని బ్రహ్మనకు అప్పగించుటకు సైతము సిద్ధముగా నున్నాడని చెప్పి మలిదేవాదులను సంధి

కార్యమునకు ఒప్పించి రండ”ని వారిని పంపించెను. కేతరాజు మొదలగు రాయబారులు మలిదేవుని కొలువునకేగి ఆ విషయ మంతయు నెరింగించి వారిని సంధి కంగీకరించునటుల చేసిరి.

అక్కడ నల్లగొండ శిఖరమందున్న బాలచంద్రుడు కదనరంగమున మోహరించిన శత్రుసైనికులను కలయచూచి పర్వతము దిగి కార్యమపూడికేగి సరభసమున మలిదేవుని కొలువు చొచ్చి సంధికంగీకరించినందులకు ఆతని నిందించుచు వీరులను యుద్ధరంగమునకు కదలుడని పురికొల్పసాగెను. అంతట కొమ్మరాజు నయవాక్యముల వాని నెట్లో శాంతింప జేసెను; బాలచంద్రుడును కొమ్మరాజు మాటలాలించి సంధి కంగీకరించెను. కాని యింతలోనే ఒక దుస్సంఘటన జరిగి పరిస్థితులు తారుమారయ్యెను.

బాలచంద్రుని పనుపున మాంచాల నగరికి పోయిన అనపోతరాజు అచ్చట బాలచంద్రుని యాభరణములు లేనందున తిరిగివచ్చుచు త్రిపురాంతకమున చెట్టుకొమ్మకు తన మిత్రుడు కట్టి యుంచిన లేఖను చదివి హతాశుడయ్యెను. బాలచంద్రుడు మిష పెట్టి తనను వెనుకకుపంపి యుద్ధరంగమునకు రావలదని ఆంక్షవిధించినందులకు అనపోతరాజు మిక్కిలి దుఃఖించుచుండగా మేడపైనుండి కార్యమపూడికి పోవుచున్న మాడచియను మగువ ఆతనినిచూచి ఒంటరిగా నుండుటకు కారణమేమని ప్రశ్నించెను. అనపోతరాజు జరిగిన వృత్తాంతము నంతయుచెప్పి తన జండెమును బిరుదును బాలచంద్రున కిమ్మని ఆమెకు నప్పగించి ఆతనిని వీరస్వర్గమున కలియుదునని పల్కుచు పొడుచుకొని చచ్చెను.

కార్యమపూడిలో మలిదేవుని వీరులును నలగాముని రాయబారులును సంధికుదిరెననెడు సంతోషమున విందు గుడుచుచుండగా మాడచి యచ్చటకేగి అనపోతుజందెమును బిరుదును బాలచంద్రునికి ఒప్పగించెను; ఆతడు వాటిని చూచి దిగ్గునలేచి తానొక్కడే శత్రువులను హతమార్చి నరసింగుని తల తరిగి కొమ్మరాజుకిచ్చి కులపగ తీర్చెదనని ప్రతిజ్ఞబూని సమరమునకు ఆయత్తపడసాగెను. వీరులును వాని వెంట దిగ్గున లేచి తాము భుజించుచున్న అన్నమును ఏటిలో కలిపి సంధి కార్యమును విడిచిపుచ్చిరి. నలగాముని రాయబారులు హతాశులై వెనుకకుమరలి జరిగినదంతయు తమ ఏలికకు చెప్పగా ఆతడును సమరమున కాయత్తపడెను.

బాలచంద్రుడు తన తండ్రికి మ్రొక్కి ఆతనివలన రణనీతి నెరింగి పటహకాహళధ్వనులు మిన్నంది మ్రోగుచుండగా సైన్యసమేతుడై సమరభూమికి బయలుదేరెను. యుద్ధరంగమున నరసింగుడు తన దళములను తరలించుకొని వచ్చి బాలచంద్రుని యెదుర్కొనెను. బాలచంద్రుని ధాటకు నిలువజాలక తన సైన్యములు చెల్లాచెదరగుచుండగా వాటిని నిలువరించి మరికొంత సైన్యమును దెచ్చుటకు నరసింగుడు తన అన్నకడ కేగెను. అంతట శత్రుసైనికులలో నొకనిని జూచి అతడే నరసింగుడని భ్రమించి బాలచంద్రుడు వానితల తెగనరికి చేతబట్టుకొని తండ్రికడకు విచ్చేసి యిదే నరసింగుని తలయని ఆతనికి అప్పగించెను. బ్రహ్మనాయుడు అది నరసింహుని శిరము కాదని చెప్పగా బాలచంద్రుడు ఇనుమడించిన పరాక్రమముతో యుద్ధరంగమున జొచ్చి నరసింహుని సైన్య

ములపైబడెను. ఉభయపక్షములవారికి ఘోరయుద్ధము జరిగెను; ఆ యుద్ధమున బాలచంద్రుడు తన 'సామంతరాగోలచే' నరసింగుని పొడిచి ఆతని శిరమును ఖండించి దానిని చేతపట్టుకొని తండ్రికడకేగెను; నరసింగుని మరణమునకు బ్రహ్మనాయుడు మిక్కిలి దుఃఖించి తన కొడుకును నిందించెను. బాలచంద్రుడును తన తండ్రి కావించిన దుష్కృత్యములను పేర్కొని అచ్చట నిలువజాలక కదనరంగమునకు తిరిగిపోయి శత్రుసైనికులను చెండాడుచు కొంతసేపు పోరాడి తన చెలికాండ్రతో గూడి తానును వీరస్వర్గము చేరెను.

మేడపిలో బాలుడు ఐతమ్మకడకేగి తనకు ప్రొద్దు పోవుటలేదని చెప్పుట: ఆమె పురాణశ్రవణమున ప్రొద్దుపుచ్చుకొనుమనుట.

అంతట మేడపిన్నైన వార్తలను
తెలుపుదు జనులకు తెల్లముగాగ
సంతోషమున బాలచంద్రుడావేళ
సంగడిబాలురు చనువునకొలువ
రమణీయమైనట్టి రాచిల్కచదువు
వీనులకింపుగా వినుచువేడుకను
గుమ్మడికాయలు కొంతసేపాడి
చెరకులపందెంబు చెల్వొప్పగెలిచి
తనసంగడీలకు దయతోడనిచ్చి
తమ్ములువెంటరా ధామమ్ముచేరె
తల్లిని కనుగొని తనయులందరును
మ్రొక్కిన దీవించి మురియుచు తల్లి
"నాయాత్మసుతులార నాయన్నలార
పద్మనాభుని గర్భపాథోధియందు
పూర్ణచంద్రునిరీతి పుట్టినవార
ఘనమైనభూషణ కాంతులుమీర
మీయన్నదమ్ముల మేలిమి నేడు
ఎదుటను నిల్చి నన్నేమివేడెదరు
చిత్తంబులోకోర్కె చెప్పుడీ" యనిన
నవ్వుచుబాలుడు నాతికిట్లనియె
"తల్లిరో మేము నీతనయులమగుట
ప్రేమతోడుత మమ్ము పెంపుసేయుటను
సకలవైభవములు సమకూరెమాకు

పొలుపొందనేమిటి ప్రొద్దుపోద"నిన
ముద్దులతనయుని మోమువీక్షించి
"ప్రొద్దుపోవకయున్న పుత్రరత్నంబ
పోకలాడర బాగప్రొద్దుపోయెడిని
ఆడుముముత్యమ్మ లమరుబంతులను
బయటనాడగ నెండపడలేవు సుతుడ
కుటిలజంతులతెచ్చి గురిలోన నుంచి
విడిపించి పోరాడు విధమదిచూడు
రూకలకుప్పలు రూఢిగానాడు
బుద్ధి యాటలపైనిపోదేని పుత్ర
విబుధుల విప్రుల పిల్వగబంచి
వినుము భాగవతంబు విజ్ఞానమొదవ
భారతరణకథ పాటించివినుము
మోక్షార్థివై నీవు ముఖ్యమైనట్టి
గీతలమహిమలు కీర్తించి వినుము"
ఈరీతి నైతమ్మ ఏర్పడపలుక
బాలు డిట్లనియెను పకపకనవ్వి

*బాలుడు బొంగరములాడ కుతూహలపడుట: తల్లి వలదని ఆతనిని వారింపచూచుట.*

"వినవమ్మ మాయమ్మ విమలేందువదన
ధర్మార్థకామముల్ తత్త్వంబుతెలుపు
శాస్త్రంబులన్నియు చక్కగావింటి
మనసుంచి తెలిసితి మర్మంబులెల్ల
పిన్నవారముగాన ప్రియమంది మాకు
ప్రొద్దుపోవుటకునై బొంగరాలాడ
సెలవిచ్చి పంపుము చిత్తంబులలర"
ఇటువలెపలికిన నేణాక్షి కలగి
వెరచియువెరవనివిధమున ననియె

"వినవయ్యబాలుడా విను ముద్దుతనయ
ఈ బుద్ధితలచగా నిచ్చలోవలదు
వలసలోపల మీరు వడిబొంగరములు
ఆడిన చేతప్పి యతివలకైన
తగుబాలురకునైన తాకునుపోయి
పడతులు కోపించి పలుతెరంగులను
శపియింతు రీమాట సత్యంబు పుత్ర
శాపింపబడుటకు సాహసంబేల
నామాట గడచుట న్యాయంబుగాదు"
అనిన బాలుడు విని ఐతమ్మతోడ
"అమ్మరో నావంటి యనుగునందనులు
పుట్టరా భూమిని పుణ్యాంగనలకు
వారేల శపియింత్రు వనితరో నన్ను
అలిగి తిట్టిన ఫాప మనుభూతమగును
పూబోణి నాదేహపోషణకొరకు
పెట్టనితావుల పెట్టిదాచెదవు
కొదమసింహము తనగురుశౌర్యమమర
ధర విజృంభించక దాగునాయొదిగి
ఏటికి భయమంద నింతిరో నీవు"
అనవిని యబ్జాక్షి యాత్మలోకలగి
"ఏల బాలుడ నీకు నింతధైర్యంబు
శపియింపరని నీకు సంశయంబేల
దుష్టులు తులువలు దుర్భాషిణులును
తారతమ్యంబుల తగవెరుగలేరు
కచ్చెకు ముందుగా కాలుదువ్వెదరు
భావంబులిట్టివి పడతులకెల్ల
నీమేలు కనుగొని నేనోర్వలేక
పలుకుట కాదోయి బాలచంద్రుండ"
అని చెప్పినంతట నా బాలుడనియె

"దుష్టబాలుడగాను ధూర్తుడగాను
ఎవరును కోపించ రెవరు నన్ననరు
వెలదులకెల్లను వినతిచేయుదును
దయచూచెదరు నన్ను తనయునిమాడ్కి
తడవాయె నేవచ్చి తల్లి రోయిటకు
పుత్రుని మాటలు బుద్ధిలోనుంచి
నాకాంక్ష నీడేర్చి నన్నంపవమ్మ"

*ఐతాంబ బొంగరములనుచేయ నోజులను పిలిపించుట : బాలుడు తనకు బంగరు బొంగరములే కావలెనని పట్టుపట్టుట.*

తనయు డీలాగున తను వేడుకొనగ
ఐతమ్మ నవ్వుచు నపుడె నేర్పరుల
ఓజుల బిలిపించి "యొప్పుగా మీరు
బొంగరంబులు కొన్ని పూనిచేయంగ
తగునన్న బాలుండు తనలోననవ్వి
తల్లితోననియెను దయవచ్చునట్లు
"శత్రువుల బొజుంగు సాంద్రవిక్రముడు
గండుభీమనగర్భకంధిరత్నమవు
లోభత్వమేలమ్మ లోలాయతాక్షి
ఏడుకోటులసంఖ్య నెసగినధనము
కలిగిన యాగండుకన్నమనేని
చెల్లెలపై యుండి సిరులచెన్నొంది
చెనటిబొంగరములు చేయించుకొరకు
ఏరీతిమనసొప్పె నేణాక్షి నీకు
లేమిడిమాటలు లేమ నీనోట
తేరాదు పెద్దలతీరుకు వెలితి
భావంబులో లోభపటిమమీరంగ
సంసారకార్యముల్ జరుపజూచెదవు

నీవంటిదానికి నీతిగాదిదియు
నీతండ్రిసొమ్ముపై నే నాసపడను
సకలదేశాధీశ సంఘంబునెల్ల
సమరరంగంబున సాధించిమించి
వారిచే మాతండ్రి వలసినయట్లు
అప్పనంబులుగొన్న అధికధనంబు
పొందుగా తెప్పించి పుటముపెట్టించి
పైడిబొంగరములు పరగచేయింపు
వెండిచే ములుకులు వెలయబెట్టింపు
పట్టుచే జాలెలు పన్ని పేనింపు
ముత్యాలకుచ్చులు మొదలగూర్పింపు
తెప్పించి యిప్పించి తీర్చుముకోర్కె
దండివిక్రములైన తమ్ములు నేను
ఆడుకోవలెనంచు నభిలాష పొడమె
నావంటిదొరపట్టి న్యాయంబుతప్పి
చెనటిబొంగరమాడ సిగ్గౌను మిగుల
చూచినవారలు చోద్యమందుదురు
ప్రజలు దూషింతురు పరిపరిగతుల
'సకలరాజులగెల్చి జయముచేకొన్న
బ్రహ్మనాయుని ముద్దుపట్టియైనట్టి
బాలునికీ లేమి ప్రాప్తమౌటహహ
కాలమహిమ'మ్మని గర్హింపగలరు
అటుగాన లోభత్వమమ్మ నీకేల.

*బాలుడు, తల్లి ధనలోభమును నిరసించి, భోగ ధర్మముల సరళిని తల్లికి చెప్పి, తన పెళ్ళినాటి వృత్తాంతమును పేర్కొనుట.*

కలుములు నిత్యంబుకావు మా తల్లి
మెరుపులరీతిని మేఘంబులట్లు

బుద్బుదంబులభంగి పోవునుచెదరి
ఇటువలె తలపోసి యెరుకచేమించి
సంపదవేళనే సకలభోగములు
పొంది ధర్మంబులు పూనిచేయగను
భోగానుభవముచే పుట్టి సంతృప్తి
వేసటజనియించి వెగటుగాతోచు
అటుమీద వైరాగ్య మమరుచునుండు
ధర్మముల్ చేసిన తనరుపుణ్యంబు
సజ్జనసహవాస సంప్రాప్తికలుగు
వైరాగ్యమధికమై వర్తించుపిదప
భోగధర్మంబులు పుట్టినయపుడె
సరవివిరాగిత సంసారమెడలు
సద్గురుపదసేవ చయ్యనగలుగు
అందుచే నిర్వాణమందికయగును
శాస్త్రంబు లీలాగు చాటిచెప్పెడిని
ధనమందులోభంబు తగ్గించుతల్లి
ప్రాణంబనిత్యంబు భవమనిత్యంబు
ద్రవ్యంబువచ్చునా తవిలి వెన్వెంట
ఇటువంటి మానవు డీ దేహమెడలి
పోయికొన్నాళ్ళకు పుట్టుమరల
నీ వెరుంగనిమర్మ మే నెరుంగుదునె
చనినభూపతులెల్ల సమకూర్చినట్టి
చిత్రమౌధనములో చిన్నమెత్తైన
కొనిపోయిరావెంట కూర్పంగనేల
ఆశచాలించుటే ఆనందపదవి
చెలిమి పుత్రునిమాట చిత్తమందుంచి
మాకోర్కె లీడేర్చి మమ్ముపంపించు
ధనలోభ మొందని దానవుకనుక
ఇంతగా చెప్పితి నేణాక్షి నీకు

నీలోభహీనత నేవిన్నవింతు
తప్పకవిను మది తార్కాణగాను
నా మేనమామను 'నా ముద్దుసుతుకు
పిల్లనిమ్మ'ని నీవు ప్రియముననడుగ
'మనకులంబున నోలిమాడలుగలవు
తగినధనంబీక తానీయ'ననెను
ఆ మాటమీదట నమ్మరో నీవు
ముట్టడివేసితి మూర్ఖతతోడ
అయిదురోజులుదాక నంత మామామ
'అక్కపైననునేమి అలిగిననేమి
అడిగినధనమీయ కతివనేనీయ
బ్రహ్మవచ్చినగాని భయపడబోను
నిశ్చయం బీమాట నెలతరో'యనిన
'ఏమి కావలె నీకు నిప్పింతు నేను
అన్న ! సందేహింపకడుగవే' యనిన
'మాడలు తూమెడు మాకు కావలెను
ఇప్పించు వేగమె యింకొక్కమాట
పొల్లును తాలును పోసగవు మాకు
తీరైనమాడలు తెచ్చియిమ్మ'నిన
మదిలోన నొవ్వక మగువ నీవపుడు
ఊడిగీలనుపంపి యొప్పైనధనము
తెప్పించి రాశిగా తీర్చిపోయించి
'కొలిపించికొమ్మ'న్న కోరి మీయన్న
మెట్టొండుకట్టించి మీదతానెక్కి
హెచ్చుగా తూర్పార నెత్తెను భువిని
'చిందిపోయినవెల్ల చెడు తాలు పొల్లు'
అని రోసి మిగిలిన అర్థమంతయును
అధికమౌ తూమొక టపుడుతెప్పించి
ఎలమి తూమునకంటె హెచ్చుగాగొలిచి

కళ్లమడుగుకూడ కావలెననుచు
తాలును పొల్లును తానె కోరుచును
"ఈదగు మాకని హెచ్చినకాంక్ష
కటించి మాటలు గై కొనితరలె
నే నెరుంగుదు తల్లి నీ మనస్సరణి
మించినకీర్తికై మెలగితివపుడు"
అనిన పుత్రునిమాట కైతమ్మనవ్వె
హెచ్చుగా నవ్వినా రెనమంద్రుసుతులు

*ఓజులు బొంగరములు చేయునపుడు బంగారము చిమిడి చిద్రుపలగుట: వారు భయకంపితులగుట:*

గారాబుతనయుల కడుప్రేమ చేర
కూర్చుండబెట్టియు కూర్మితో నపుడు
మొదలరప్పించిన ముఖ్యులైనట్టి
ఓజులు తనమ్రోల నుండంగచూచి
"బొంగరంబులుచేయ పొసగును మీకు
పైడి యిప్పించెద పట్టినయంత
పనిముట్లు తీసుక పరిగెరమ్మనిన
పరిగె నిండ్లకుపోయి పట్లెళ్ల కొర్లు
కమ్మచ్చులను నీరుకార్లు సుత్తెలను
ఘనమగు పడియచ్చు కత్తెరల్ మరియు
శ్రావణాల్ కోపులు చక్కని త్రాసు
లలరు మచ్చులు గుదులాదియైనట్టి
పనిముట్లు కొనితెచ్చి ఖామకట్టెదుట
భక్తితో నిలిచిరి పటిమ దీపింప
ఐతమ్మ సెలవిచ్చె నంతట వారు
చదురేర్చి కూర్చుండి సరిపనిముట్లు
పరచి ముందలకడ పావకున్నిలిపి
పుష్పగంధంబుల పూజగావించి

నైవేద్య తాంబూల నతులనర్పించి
కనకలక్ష్మికి తగు కమఠంబునిలిపి
ఘనమైన మూసలు గట్టిగాచేసి
నిజమైన బంగారు నిండించి మంచి
పలుకుల కరగించి పరికించునపుడు
కాలహేతువొ యేమొ ఘనలక్ష్మిమహిమొ
కరగువేళలవన్నె కదలకనిలిచి
అంతకంతకు అదియాశ్చర్యముగను
చిందివందరయగుచు చీకాకునొంది
చిదురుపలాయెను చిమిడిపోవంగ
ఒగిచుట్టునున్నట్టి యోజులందరును
కనుగొని భీతిల్లి కంపితులయిరి.

*బాలుడు పదార్థతత్త్వమును తల్లి కెరింగించుట : ఐతమ్మ బొంగరములను చేయించి బాలుర కిచ్చుట.*

బాలు డావేళను ప్రాభవంబొప్ప
తల్లితోననియెను తన నేర్పుమీర
"కడవెన్ని చిద్రుపలై కరిగిన నేమి
నిలుచునే శకునంబు నిశ్చయంబిదియె
అటుమీదనగు కార్య మదియేమిలెక్క
చెడనిపదార్థముల్ సీమలోలేవు
చెడునుగట్లును నదుల్ చెట్లునులతలు
సంచారిజీవముల్ సమయుచునుండు
ఇందుల కాశ్చర్యమేలనే తల్లి
మాయసంసారంబు మాసిపోయెడిది
ధరబ్రహ్మవ్రాతలు తప్పింపరాదు
ఇచ్ఛలో ననుమానమేమియువలదు
చెలువారబొంగరాల్ చేయించవమ్మ"
అనిన పుత్రునిమాట కైతమాంబికయు

సెలవీయ బొంగరాల్ చేసిరివారు
వేయిమాడలచేత విరచించినట్టి
బొంగరంబొక్కటి పొందుగా నామె
మంగలిబిడ్డడు మాధవుకిచ్చె
కుమ్మరిపట్టికి గరుతుగా రెండు
వేలకుచేయించి వేడ్కతోనొసగె
సరిమూడువేలతో చాకలిచందు
బొంగరం బమరించి పొసగనిప్పించె
అలరునాలుగువేల కమరినదొకటి
కంసాలిచందుకు కరుణతోనిచ్చె
అయిదువేలకుచేసి యాకమ్మరికిని
ఇప్పించె మదిలోన నెన్నుచుగొనగ
వెలమపట్టికి ఆరువేలకుతీరె
పదివేలతోచేసి బావనికిచ్చె
నారాయణుండైన నాయునికొడుకు
పండ్రెండువేలతో బాలునికొఱకు
చేయించి వన్నెలు చిన్నెలు తీర్చె
సకల రత్నంబులు సంఘటియించి
ములుకులు వెండితొ మొనలగదించి
ఇచ్చెను సంతోషమింపెసగంగ
పిమ్మట నోజుల ప్రియముతోచూచి
తగినకట్నంబులు దయమీర నొసగి
పొమ్మని సెలవీయ పోయిరి వారు

*ఐతమ్మ కుమారులకు బుద్ధులు గరపుట.*

అంతట ఐతమ్మ యానందమునను
"చారువర్తనవాడ చక్కనివాడ
గురుతరరేచర్ల కులవార్థిసోమ
బాలుడ నీమది పరిణామమయ్యె

షడ్రసోపేతమౌ సకలవస్తువుల
వంటయైయున్నది వచ్చిమీరెల్ల
భుజియించిపొండన్న పొందుగాలేచి
పాకశాలకుపోయి పక్వవస్తువుల
గరిమతోభుజియించి కరములుకడిగి
వాసశాలకువచ్చి వసియించిమించి
పరిమళద్రవ్యముల్ బాగుగాగూర్చి
తెచ్చినగంధంబు తిన్నగాపూసి
చిత్రవర్ణములచే చెలగుచున్న
తగు పట్టువస్త్రముల్ ధారణచేసి
బహువిధమణులచే భాసిల్లుచున్న
ఆణిముత్యంబుల నమరినయట్టి
మెరుగుభూషణములు మేనులతాల్చి
బహువిధ శృంగారభరితులై వచ్చి
తగ నమ్రులై యున్న తనయుల చూచి
ఎలమితో నైతమ్మ యిట్లనిపలికె
"మేడపిలోపల మేలైనయట్టి
రచ్చల క్రంతల రాజవీధులను
విపణిమార్గంబుల విబుధగేహముల
బొంగరాలాడగ పోనగదుసుమ్మి
కరుణతో నాబుద్ధి గైకొని మీరు
మేడపిలోనుండి మేలుగావెడలి
ఉత్తరదిశయందు ఒప్పుగానున్న
చాలురావులకడ నరసమైయున్న
రమణీయమగు మొల్క రావిక్రిందటను
ఆడుడీ బొంగరా లానందముగను"
పొందుగా నిటువలె బుద్ధులుచెప్పి
చక్కని ముత్యాల జాలెలుతెచ్చి
అందించి చేతుల కాశీర్వదించె;

బాలచంద్రాదులు బొంగరము లాడబోవుట : బ్రాహ్మణ వైశ్యాంగనలు ముచ్చటపడి అటకేగి మురియుట.

సేవకుల్ తడయక శృంగారపరచి
పసిడి పల్లంబులు బాగుగాకట్టి
పట్టుజాలెలుగప్పి పరుపునతెచ్చి
ముందర నిలిపిరి ముద్దుపొట్టేళ్ళ
తమ్ములు బాలుడు తగరులనెక్కి
వింజామరలవారు విసరుచునుండ
గచ్చకాయలు చాల గలిగినయట్టి
తిత్తులు చిరుతలు తీరైనగోడెలు
చదరంగములు పాటిసారమేయములు
బంతులు పిట్టలు పంజరచయము
పేరైనదేగలు పిగిలిపిట్టలును
శారికావళి కీరసంఘంబు మొదలు
ఆటలసాధనా లవి వెంటరాగ
రయమునచని చాలురావులసరస
మొనమొల్క యూరావిమొదటనుచేరి
తీరైనతగరుల డిగ్గి గచ్చరుగు
పైనిపరచినయట్టి పలువన్నెలమరు
రత్నకంబళిమీద రమణకూర్చుండి
బొంగరాలాడంగ పూనిరావేళ :
సరస మేడపి జనుల్ సంతసంబొప్ప
బొంగరాలాడెడు పొంకమంతయును
'పోయి చూచెదమ'ని పోయిరచ్చటకు ;
వనితలు తండ్రుల పతుల పుత్రులను
అత్తల మామల నడుగుటమాని
సంసారభావంబు చాలించియంత

ఒక్కరినొక్కరు నొగిబిల్చికొనుచు
తమలోన ముచ్చటల్ తగచెప్పికొనుచు
రయమునపోయిరి రావులకడకు
ఆపురవరమున నలరుచునుండు
వరవిప్రకామిని వైశ్యకామినియు
ఎడలేనిపొందుచే నెసగెడువారు
తగ విచారించిరి తమలోన తాము
"నాయునిపుత్రుండు నవమన్మథుండు
బాలుడు సంతోషభరితుడై యిపుడు
తమ్ములు తానును తన నేర్పుమీర
బొంగరాలాడంగ పూనియున్నాడు
కనుగొనివత్తము గ్రక్కునపోయి"
అనిపల్క భూమిసురాంగనతోడ
ప్రకటమ్ముగా వైశ్యవనిత యిట్లనియె :
"ఓయక్క బాలుండు ఉరుమని పిడుగు
పాపపుణ్యంబులు భావించడతడు
శకటసమూహంబు చనియెడువేళ
చీలలూడగతీయు చేతులబట్టి
ఆడెడుపాపల నదరంటకొట్టు
ఇట్టిదుర్జనుచూడ నేమికారణము
వెంగలిదుష్టుడు వెక్కసుడతడు"
అనిన బ్రాహ్మణకాంత యాభామకనియె
"నేపోయివచ్చెద నెలత నీవుండు"
అనిన వైశ్యాంగన యామెనుచూచి
"పడతి నీదగు పొందుపట్టుట మొదలు
ఎడబాసియుండుట యెన్నడులేదు
నేడు నిన్నెడబాసి నే నెట్టులుందు
వచ్చెదపదమ"ని వనితలు లేచి
నీరాళ్ళ చేతుల నేర్పుగాపట్టి

అత్తల మామల కతిభక్తి మ్రొక్కి
"జలముల దెత్తుము చయ్యన" ననగ
విని నవ్వి పెద్దలు వెలదులనంప
కదిలిరి కర్పూరగంధులు చెలగి
చని దీర్ఘికనుడిగ్గి జలములమీద
కప్పిననాచును కడకెత్రోచి
నిర్మలోదకములు నించి కడవలను
శృంగారమొప్పగ శిరములనుంచి
దురితబంధంబుల దొలగింపలేక
నెలతలు చనుదెంచి నిలిచిచూచుచును
ఆశ్చర్య వాక్యాల నప్పుడిట్లనిరి ;
"ఈతడే పలనాటి నేలెడుబ్రహ్మ
తనయుండు సౌందర్యదర్పకుండితడె
మార్తాండతేజుండు మహితవిక్రముడు
ఈయొప్పులీచొప్పు లీచక్కదనము
అలవియే పొగడంగ నజునకునైన
బంగారుకుండల పన్నీరుతెచ్చి
అభిషేకమొనరించె నభవునితొల్లి
మాంచాలయేరీతి మరుపులేకుండ
కాకున్న యిటువంటి కందర్పసముడు
పతియేలనౌన"ని పాయనివేడ్క
ముచ్చటలాడిరి మూకలై చేరి

*బాలచంద్రుడు బొంగరమాడుట : అది అన్నమ్మ యను వైశ్యాంగనకు తగులుట.*

ఆసమయంబున ననపోతులేచి
పట్టుగాగిఱ్రవాసి పైడిటంకంబు
నిల్పిబాలునిచూచి నెనరుననని యె
"ఊరకయున్నాడ వో బాలచంద్ర

బొంగరాలాడెడు బుద్ధితో తమ్ము
లెల్లను కనిపెట్టి యిపుడున్నవారు
నీవు ముందాడక యెవరాడరాదు"
అనిన బొంగరమంది యపుడు బాలుండు
"తోరంపుసందడి తొలగింపుమ"నెను
బద్దలవారంత పరుగునవచ్చి
చెలగి బరాబరుల్ చేసి రెచ్చుగను
తంత్రజ్ఞులగు మేటితమ్ములు లేచి
చేరి ఆటలనాడ చిరునవ్వునవ్వి
పటుపరాక్రముడైన బాలచంద్రుండు
ఘనతరమాణిక్య కలితమైనట్టి
బొంగరం బరచేత పూనికనిల్పి
"నేరుపుచూడుడీ నిలిచి మీరెల్ల
తిరిగింతు చేతిలో దిటముగానిట్లు
అవనిపై బడకుండ నంతరమందె
పట్టియాడించెద బహువిధగతుల"
అనిచెప్పి చుట్టున్న యతివలచూచి
"అత్తమామల భక్తి అమరినవారు
పతులమాటల కెదురు పలుకనివారు
వినయమౌ నామాట వినుడి మీరెల్ల
దూరాననుండుడీ తొలగిచూడుండీ"
అనిచెప్పి బొంగరం బరచేతపట్టి
ముత్యాలజాలెను ముదమునచుట్టి
శయమెత్తి హుంకించి సత్తువకొద్ది
వేసిన వడిమీర వేగమెపోయి
సంయమీశుండను చట్రాయిదాకి
మింటిమీదికెగసి మెరుగులుక్రమ్మ
అన్నమ్మయనుపేరి నావైశ్యభామ
మీగాలిపైదాకి మించినములికి

అరికాలు దిగివచ్చి అవనినిగాడె.

*మూర్ఛిల్లిన అన్నమ్మకు వనితలు శైత్యోపచారములుచేయుట: ఆమె బాలచంద్రుని దూరుట.*

తాకిన ఆవైశ్యతరుణి భీతిల్లి
గగనంబుపై బడ్డగతి కంపమొంది
తరిగిన ఖర్జూర తరువుచందమున
తటుకున మూర్ఛచే ధరమీదనొరిగె
చెదరికుంతలములు చిక్కులనొందె
మిక్కిలిచెమరుచే మేనివస్త్రంబు 419
తడిసెను గుండియ దడదడమనియె
మేదినీరేణువుల్ మేనెల్లకప్పె
ఈరీతిపడియున్న యేణాక్షికడకు
పొక్కుచుచేరెను పొలతులగుంపు
కప్పిరివలువలు కర్ణంబులందు
కర్పూరరజమును గలయంగనూది
పదతలంబులయందు పాణులయందు
కస్తూరిగంధంబు కలయంగపూసి
సతులెల్ల శైత్యోపచారంబుచేసి
"చింతింపబోకుడి చెలికేమికాదు" 420
అనిపల్కునంతలో ఆ మూర్ఛదెలిసి
ముకుళితహస్తుడై ముందరనున్న
బాలుని కనుగొని బలుకోపమునను
కనులెఱ్ఱగాచేసి కాంతయిట్లనియె:
"ఓరి దురాత్మక ఓరిదుర్మార్గ
క్రిందుమీదెరుగక కేరంగనేల
గర్వమేటికి నీకు కాంతలయెడల
కలిగితే తినవలె కట్టంగవలయు
ఎరుకమరచినచేష్ట లేలచేసితివి

ఉత్సాహమునపొంగి యుదరిపడేవు
ముదిరెమదంబు నీ మురిపెంబుక్రుంగ
తగుమల్లభూపతి ధనమెల్లసీదు
సదనంబుచేరిన సత్తువనుంచి
త్రుళ్లెదవేటికి దుష్టమానసుడ
సమరంబులో నిన్ను శత్రులుక్రుమ్మ
మీయయ్యలెల్లను మించినబలిమి
చేరికార్యమపూడి శ్రీకలనిలోన
ఉప్పొంగుచున్నారు ఉర్వీశునెదుట
వారిలోగలయ నీవడిగానవచ్చు
పోతుసింహమువలె పొదలుచున్నావు
మలవరపుగిత్తవలె మలసిమేడపిని
ఉన్నావు కొవరముడుగక నీవు"
అని తూలనాడిన నతిరోషమునను
కలుషించి యనపోతు కండ్లెఱ్ఱచేసి
పట్టుజాలెయు పూనిభామలనెల్ల
పరమసాహసమున పారంగదోలె.

*బాలచంద్రుడు అన్నమను తనను క్షమింప వేడుకొని, తల్లికడకేగి వీరనాయకులు పోయినతావు చెప్పుమనుట.*

అప్పుడా అనపోతు నమరంగచూచి
పలికె బాలుడు నీతిపటిమమీరంగ
"వనితల నదలింపవచ్చునా మనకు
అందుచే పాతకమంటునుగాదె"
అని చెప్పి తరువాత ఆవైశ్యసతికి
ఆదరంబొప్పంగ ననియె బాలుండు
"నొప్పిచెందుటచేత నోరాచలేక
అనరానిమాటల నాడితి వీవు

నీమీద పగచేత నేవేయలేదు
బాలురకాటలు పథ్యంబుగనుక
అడితిబొంగరం బది నిన్నుతాకె
దైవకృతంబని తలపకాడితివి
ఏమందు నిన్నింక నిందీవరాక్షి
అబలవు నిన్నేమి యనవలదైన
నాతప్పుమన్నించు నయభావమునను
కరుణించుమ"నుచును కాంతకావేళ
పంచవన్నియపట్టు పటమునుచించి
ఘనమైనమందుచే కాలుగట్టించి
మానుపుకొనుటకు మాడలేనూరు
భామకు నిప్పించి భక్తితోననియె
"అమ్మ మాతల్లి నీవైతమ్మమారు!
మాయయ్య లెల్లను మలసిదండెత్తి
పోయి యేదిక్కున పూనియున్నారు
తలపోసి చెప్పవే తరుణినాక"నిన
పలికె కోమటికాంత బాలునితోడ
"ఘర్షించకుము నన్నుగన్న మాయయ్య
కాలుదాకిననొప్పి ఘనమాయెకనుక
కోపించిపలికితి గుర్తెరుంగకయె
మీయయ్య లేగిన మేటి యౌసమర
ధరణియు నేదిక్కొ తన కెరుకలేదు
ఐతమ్మ యెరుగు నన్నడగకుమ"నిన
తగనాట చాలించి తమ్ములు తాను
మేలైనవీధుల మేడపిచేరి
వేగమే యిలుచొచ్చి వినయంబుతోడ
తల్లికి మ్రొక్కిరి తనయులెనమండ్రు
మ్రొక్కినదీవించి మురియుచునున్న
తల్లితో బాలుండు తానిట్లుబలికె :

"కళదప్పియున్నది కారణంబేమి
నయమొప్ప నాయుడు నాయకులెల్ల
ఎక్కడి కరిగిరో యెరిగింపుమ"నిన
పుత్రునిమాటలు పౌలతికర్ణముల
ఘనమైనశరముల గతినాట నులికి
తరిగిన కదళికా స్తంభంబురీతి
గుండెలు పరియలై కుంభినినొరగె
చంద్రమండలమందు సాంద్రమైనట్టి
జలదంబుకప్పిన చందంబు వెలయ
సలలితకుంతలజాలంబు చెదరి
కప్పెను వదనంబు కనిపించనీక
కన్నుల నీరాని కాటుకజారె
గళబద్ధనవరత్న కాంచనయుక్త
హారజాలములెల్ల నటునిటుతొలగె
జమిలిముత్యపుచేర్లు చక్కనైయున్న
పాపటబొట్టూడి ప్రక్కనపడియె
వేనలిదురిమిన విరులెల్లజారి
పడెను భూస్థలిమీద పరచినట్లుగను
కొంతసేపున కామె గొబ్బునలేచి
ఘనమైన దుఃఖంబు క్రమ్మగాపలికె

*ఐతమ్మ బాలుని మభ్యపెట్టజూచుట: బాలుడు యుద్ధమునకుపోవ పట్టుపట్టుట.*

"చేసినధర్మముల్ చెడిపోయెనిపుడు
పరపుణ్యజాలంబు వరదనుకలసె
సౌభాగ్యమునకెల్ల నష్టంబుదోచె
ఇటువంటికార్యంబు నిచ్చలోతలచి
బాలుకెట్లాడెను నన్నడగ నీకు
బాలుడా నీకేమి భారంబువచ్చె.

వినగన నీవంటి వెట్టినెక్కడను
కాలంబు ననవలెగాని నిన్ననిన
ఫలమేమి"యని చాల భయమునుబొంది
పుత్రుడు విడనాడి పోవకయుండ
గొంకుమాటల తల్లి పుత్రునికనియె:
"తనరంగవిను నీదు తండ్రులు మామ
లెల్ల విచారించి యేకభావమున
మలిదేవు మన్నన మట్టాయెకనుక
ఇచ్చోటు విడనాడి యేగిరి తమిని
ఏ దిశబోయిరో యెరుగను నేను"
అనిన బాలుడు తల్లి కప్పుడిట్లనియె
"ఎన్నడసత్యంబు లెరుగని నీవు
తగవటే నాతోడ దబ్బరలాడ
చెలిగికార్యమపూడి శ్రీకలనిలోన
మలిదేవసహితులై మాయయ్యలెల్ల
చలముననున్నారు సమరంబుచేయ
అవలశాత్రవచయ మతివిక్రమమున
మూకలై బ్రహ్మన్న మొదలగువారి
గహనమును దావాగ్ని కాల్చినమాడ్కి
దగ్ధంబుచేయంగ తలచియున్నారు
ఈసమయంబున నేనేగకున్న
అపకీర్తిపాలౌదు హానియువచ్చు
'అరిగిన నీవల్ల నయ్యెడిదేమి'
అని విచారించక నాడుకోవలదు
తలి నాకసాధ్యంబు ధరలోనలేదు
బ్రహ్మాండములపట్టి బంతులాడెదను
మృత్యుదేవతనైన మెదిపివేసెదను
హరిహరుల్ మెచ్చంగ ననిచేసిమించి
కామభూవిభునకు కలబలంబెల్ల

ఖండించిపై చెద, కలియుగమందు
వీరచరిత్రలు వెలయంగచేతు
ఆలస్యమేల నన్నంపవేతల్లి
చిత్తంబుచెడిపోవ చింతించవలదు"
అనిన పుత్రునిమాట కైతమ్మపలికె:
"తమకంబు కూడదు తాళుముగడియ
తెలిసివిచారించి తెలిపెదనీకు
ఉండుమా"యని చెప్పి యొయ్యన నేగి

*ఐతమ్మ శీలమ్మతో నాలోచించుట, రణరంగ వర్ణనతో బాలుని భయపెట్టచూచుట: బాలుడు తన పట్టు వీడకపోవుట:*

అత్తయౌ శీలమ్మ నతిభక్తిచూచి
కరములు ముకుళించి కార్యమంతయును
వినిపించ చిత్తంబు వెరగుపాటొంది
నీతిచే శీలమ్మ నేలజేజేల
పిలిపించి బాలుని పేరిట లెన్స
గ్రహగణభావంబు గ్రహియించిబాగ
ఐతమ్మతో నప్పు డనియెనీరీతి:
"బాలుడు జగతిలో పరిణామమొంద
బదునేనుదినములై పరగెనుమేర
చెప్పంగబడెనిట్లు సిద్ధాంతమందు
ఎడలేకనడలెద వింతిరో నీవు
నీవెంతయడలిన నిలవడాతండు
కాలమెవ్వరికైన గడువగరాదు
దర పద్మజునివ్రాత తప్పింపరాదు
నీమాట కాతడు నిలువంగబోడు
శంబరాసురవైరి సతిచేతియందు
చెలువొంద నిలిచిన చిలుకకుసమము

మాంచాల సౌందర్య మహిమ కన్గొన్న
చాలించు పోకడ సఖియ నీసుతుడు"
అనిపల్కి శీలమ్మ కైతమ్మ మ్రొక్కి
విడువనిచింతచే వేగంబెవచ్చి
తన కుమారునిచూచి తడిబడిపలికె
"ఓయన్న బాలుడా యొప్పుగావినుము
పరరాజదళములు పైగొనిరాగ
వాద్యసందోహంబు వడితోడ మ్రోయ
ఘనగజ ఘీంకారకలితమౌరవము
నేపైన ఘోటకనిచయహేషంబు
అమితమౌబలతతి యట్టహాసంబు
భేరీధమామీల ఫెళ్లైనమ్రోత
ఏకమైమించిన నెట్లు తాళెదవు
విలుకాండ్రు చెలరేగి విచ్చలవిడిని
జడివానపట్టిన చందంబుదోప
దిట్టమౌశరవర్షధారలు గురియ
తప్పించుకొనలేవు ధైర్యంబుమీర
అలుగుల మెరుగులు నవనిపైనిండ
కన్నుల చీకట్లు గ్రమ్మగచేయు
బల్లెంబు లీటెలు పట్టుకతూలి
పైబడ్డ ధైర్యంబు పట్టగాలేవు
కత్తులు జళిపింప కనుగొని నీవు
తాళెదవెటువలె తండరపడక
నీవెంత రణమెంత నీబలమెంత
బాలురతో నాడు పగిదిగాదోయి
చెక్కులుమీటిన చిందునుపాలు
నుదురుతాకిన తరుచునూనియవెళ్లు
ఉదురునుతమకంబు నుడుగుముతనయ

పిన్నవు నీకిన్ని బిరుదులువలదు
నను వీడిపోవుట న్యాయంబుగాదు"
అని తల్లి బలికిన ననియెబాలుండు :
"భయమేల గొల్వెదు భామ నీ విపుడు
నలగాము డెరుగును నాదుశౌర్యంబు
ప్రళయకాలమునాటి భైరవురీతి
సైంధవవధవేళ సాహసస్ఫూర్తి
విజయుడు రణములో విహరించునట్లు
కౌరవసేనలో గదబట్టిదూరి
వడముడిరణమున వ్రాలినయట్లు
వాయుపుత్రుడు లంక వడితోడఁజొచ్చి
భస్మంబుగావించి ప్రబలినభంగి
రాక్షసరణములో రామచంద్రుండు
వీరపరాక్రమవిధి జెందినట్లు
జలధిమధ్యంబున సారెకుదిరుగు
మందరశైలంబుమాడ్కి దోపంగ
పాలాక్షు డతి రౌద్రపటిమ మీరంగ
త్రిపురముల్ గాలిచి తీర్చినయట్లు
స్థావర జంగమ సకలవస్తువుల
ప్రళయాబ్ధి ముంచంగ పరగినరీతి
కామభూపతిదళము గడగడవణక
విక్రమక్రమశక్తి విడివడఁజొచ్చి
పృథ్విపై పీనుగుపెంటలుగాగ
విహరింతు మదిలోన వేడుకకొలది
ఉర్వీశు దళముల కురుమనిపిడుగ
గర్వించుపగవారి కంటిలోనెరుస
ఎదురెవ్వరే నాకు నీభువిలోన
నలగాముబలముల నలినలిచేసి
వండంగ తరగిన వడుపుననరికి

నెత్తురుమడుగులు నిండంగజేతు
దహనునికడ్డంబె దట్టమౌవనము
బడబాగ్నినార్పునే పాథోధిమించి
భయదమౌపులికిని పశుగణం బెదురె
స్వాతికొక్కెరగుంపు సాళ్వంబు కెదురె
జింకలకదుపులు సివ్వంగికీడె
చిన్నమిరియమునందు చెడునె కారంబు
బాలుడనని నన్ను భావింపవలదు"
అనిన బాలునిమాట కైతమ్మ పలికె

సంతానప్రాప్తికై నోచిననోములను పడ్డ కష్టము లను ఐతమ్మ బాలునికిచెప్పి అతనిని యుద్ధమునకు పోవలదని వారింపచూచుట.

"వినవోయి బాలుడ వీరశేఖరుడ
సంతానమేలేక చాలకష్టించి
ఇలలోన నోములు ఎన్నెన్నికలవొ
అన్నియునోచితి నవిచెప్పనేల
దక్షిణ తాంబూల తతుల సద్భక్తి
కూర్చి చూరలనిస్తి కుమ్మరావముల
ఆడెడుగానుగ లవి చూరలిస్తి
పెండ్లిండ్లుచేసితి పేదవిప్రులకు
పాడైన దేవతాభవనంబులందు
పొందించితిని భక్తి పూజాదికములు
అమడామడమేర నన్నసత్రములు
వెలయంగచేసితి విస్తారమైన
విపినంబులో చలివేంద్రలుంచితిని
శ్రీగిరికేగెడు శివభక్తతతికి
ఇచ్చితి రాగిచే నిర్మితంబైన
ఘనకమండలువులు కప్పెరచయము

శ్రీభ్రమరాంబకు శ్రీశైలపతికి
రజత కాంచనముల రంజిల్లునట్టి
కూష్మాండఫలముల గూర్చి దక్షిణలు
కానుకలిచ్చితి కడుభక్తితోడ
గౌరీమహేశ్వర ఘననామశిఖరి
ఎక్కియు నోమితి నేలేశ్వరము
దిగివచ్చి నోమితి తిలపర్వతము...
విధివెలుగను నోము వెలయనోమితిని
ఘనవిష్ణుకాంతను గరిమనోమితిని
వారక యా సంజవత్తి నోమితిని
తప్పక నోమితి తగ జగజ్జ్యోతి
ఏగురువనితల నెలమితో గూర్చి
ఏకవిల్లనునోము నెన్ననోమితిని
పదుగురువనితల బాగుగాగూర్చి
పచ్చవిల్లనువ్రతము పట్టినోమితిని
నందికి పులగంబు నయతబెట్టితిని
శ్రీశైలపథమున చెలువంబుమీర
అశ్వత్థ పంక్తుల నభివృద్ధిచేసి
రమణీయ కాంచనరజతతంతువుల
అశ్వత్థ తరువుల కలరచుట్టించి
పెంటిపోతుల రెంటి పెండ్లిచేసితిని
చీకటింటను నోము చేసితిభక్తి
నియతికేదారేశు నిలిపినోమితిని
గుండుగుండుకు మరియు గుంటగుంటకును
చేయెత్తిమ్రొక్కితి చెప్పనేసిగ్గు
పుత్రకామ్యంబిచ్చు పొలుపైనచీర
లద్దించిగట్టితి యానమీరంగ
"పలునోము లీరీతి భక్తితోచేయ
ఏ దేవతైనను ఇచ్చులో మెచ్చి

వరమీయదాయె నా వ్రాతనేమందు"
అనిచింతచేయుచు నసురుసురనుచు
వింటిని యొకమాట వినువీధియందు
'గజనిమ్మనోమున గలుగుపుత్రుండు'
అనువాక్యమున కపుడానందమొంది
పెద్దలౌవిప్రుల పిలిపించి నేను
ముకుళితహస్తనై మ్రొక్కి-యామీద
వారితోజెప్పితి వాక్యలక్షణము
విని వారు సంతోషవిస్రంభమతిని
వ్రతకల్పములనెల్ల వడివిచారించి
శోధించిచెప్పిరి శుభమగునట్లు
'శాస్త్రమందున్నది చాన యీవ్రతము
సంవత్సరమునిండ సల్పగావలయు
ఇది విష్ణుదేవుని కింపైనవ్రతము
చెన్నుడాతడుగాన చింతించిదినము
శాస్త్రోక్తముగ నదీస్నానమాడంగ
వలెనంచు' నున్నది వ్రతకల్పమందు
చంద్రభాగానదీ సమమైననీరు
కలుగదు పల్నాటిగడ్డయందెల్ల
కృష్ణకుసమమిది కీర్తనీయంబు
ఎడమభాగమ్మున నెసగు చెన్నునికి
ఉత్తరదిశగూడి యొప్పుమీరంగ
స్నానమానదిజేసి సరిగంచుపట్టు
కోకను ధరియించి కుంకుమ పసుపు
తాల్చి గంధంబును తనువునబూసి
సంతోషమునబోయి స్వామియైనట్టి
చెన్నకేశవునకు జేసిజోహారు
దీపనైవేద్యముల్ తీరుగానిచ్చి
వైకుంఠ శృంగారవనములోపలను

చెన్నారు ఆనిమ్మచెట్టునుజేరి
చుట్టుతెన్నగజేసి శుద్ధిజేయించి
అలికించి ముగ్గుల నచటబెట్టించి
వనదేవతను భక్తి వర్ణనజేసి
ఆవాహనము చెట్టుకమరగావించి
పలకలబానిలోపల నీరుముంచి
బిందెలగొనితెచ్చి పెల్లుగాబోసి
సకలోపచారముల్ చయ్యనజేసి
భూసురులందరు భుజియించుటకును
తగినవస్తువులిచ్చి తాను నేమమున
ఫలముల నాహారపటిమతగ్గించి
పరమేశుచెన్నుని భావించుకొనుచు
ఎడపక దినముల నీలాగుజరుప
కొన్నాళ్ళ కానిమ్మకొమ్మ చిగిరించి
ఫలతతుల్ గనిపించి పరిపక్వమౌను
వర్షాంతమందున వారనిభక్తి
చెట్టుఫలంబులు చెన్నునికిమ్మ
సంతానమబ్బును సంశయింపకుము
అనుచు భూసురులెల్ల నాడిరిగనుక
సంవత్సరమునిండ సల్పితివ్రతము
కడపటిదినమున కడుమోదమునను
పూజాదికంబులు పొందుగాజేసి
విప్రభార్యలనెల్ల వేగరప్పించి
సకలోపచారముల్ సమతతోజేసి
చెట్టుఫలమ్ముల చిదిమితెప్పించి
పసిడితోజేసిన పళ్ళెరమందు
శోభించి భయభక్తిపూర్వంబుగాను
చేతులబట్టుక చెన్నునికడకు
వెడలితి చెల్లెంద్రుడు వేడుకతోడ

కానుకల్ మొదలగు కడమవస్తువులను
కొనివెంట జనుదేర కూరిమితోను
సకలవాద్యంబులు సాంద్రత మ్రోయ
వారకాంతలు నాట్యవశతచే జనగ
బహువిధగీతముల్ పాఠకుల్ చదువ
వివిధవిద్యలవారు వెనువెంటరాగ
జని జమ్మిమానుకు సవ్యభాగమున
చెన్నుని కెదుటను చిత్తముప్పొంగ
నిలిచితి నపుడేము నిశ్చలమతిని
అర్చకులందరు నతిభక్తివచ్చి
తలుపులు తెరచిరి తాళముల్ దీసి
చిత్తజు జనకుని చెన్నునిరూపు
కన్నుల పండువుగాగ జూచితిమి
ఫలములుంచిన జాలవల్లిక స్వామి
కర్పించి శరణంబునందెదమనుచు
చనువేళ చెన్నుడు సదయతమాని
పడమటి మొగమయ్యె భావమెట్టిదియొ
ఆవేళ మనసున నతిఖేదమంది
చంచలంబందెను ఝల్లనెగుండె
కన్నుల నీరానె కంపంబుమీరె
గద్గదస్వరములు గళములగ్రమ్మె ;
తడబాటు నడలను దారొ్కనిమేన
చెమటలుజారగ చీకట్లుగ్రమ్మె
పరవశంబున మహిబడితి మావేళ
తెలివొంది యంతలో దిగ్గననిల్చి
పటుతరధైర్యంబు భావమందలర
పలికితిమిబ్భంగి భయమింతలేక
"అదియేమిస్వామి మా యపరాధమేమి
తల్లివి దండ్రివి దైవంబు గురువు

నీ వేకా యితరంబునెరుగ మెవ్వరిని
ఇహపరంబుల కీవె ఇంటిదేవరవు
తనువులు ప్రాణముల్ ధనధాన్యవితతి
పశుపుత్ర మిత్రాది పరిజనంబెల్ల
నీయధీనము మేము నీ దాసిజనము
ఈవు మాకెల్లను ఏలికవరయ
మరువకుదాసుల మదిలోననెపుడు
"నీవారమనుచును నిశ్చయబుద్ధి
శరణన్న మాత్రాన సంరక్షజేతు
వ్రతమిది నాక"ని రామరూపమున
ఆనతినిచ్చితి వఖిలంబు వినగ
"సకలధర్మంబులు సమ్మతి విడచి
నాశరణందితే నను జేర్చుకొందు
వగవకు మదిలోన వద్దుభయంబు
సత్యమీమాట"ని సవ్యసాచికిని
దయతోడ కృష్ణావతారంబునాడు
పలికితివటుగాన భక్తిచే నిన్ను
శరణని వత్తిమి సతులము మేము
పడతులు మొరపెట్ట పాలనగద్దు
వనితల రక్షించువాంఛ నీకెపుడు
గౌతమునిపత్ని ఘనమైన నీదు
పాదరేణువుచేత పావనంబయ్యె
కరుణచే కుబ్జకు కాంక్షదీర్చితివి
వల్లవీజనముల వాంఛదీర్చితివి
ద్రౌపదిమానంబు దక్కజేసితివి
ఉత్తరవగపెల్ల నుడిచిబ్రోచితివి
పూనికాంతలనిట్లు పోషించినావు
ప్రాణులపోషించు భారంబె నీది
మిక్కిలి దయగద్దు మెలతలయందు

ఈపట్ల నీమది యినుమాయెనేమొ
కటకటా నీకింత కాఠిన్యమేల
నీచరణమ్ములె నెరనమ్మినాము
తిరిగిచూడవు మాకు దిక్కెవరయ్య
కరగదు నీమది కొసంతయైన
ఈ జీవనంబేల యీ దేహమేల
నీకైన ప్రాణముల్ నీకెయర్పింతు
మబలలమని చూడ న్యాయంబుగాదు
నెత్తురు నీమీద నిండజల్లెదము
చూడుము మా తెంపు చోద్యంబుగాను"
అని రోషమాపకహంకారమునను
ఒనరు కఠారంబు లొరలకుదూసి
వక్షఃస్థలంబుల వడిగాడనాట
మారుముఖంబాయె మరలిచెన్నయ్య
అప్పుడు మాచేత నమరియున్నట్టి
జాలవల్లికలన్ని స్వామిసన్నిధిని
ఉత్సాహమునసుంచి యొయ్యనమ్రొక్కి
చేతులు జోడించి శిరములవంచి
"కమలామనోహర గజరాజవరద
కాంచనాచలధీర కందర్పజనక
పక్షీంద్రవాహన పన్నగశయన
శశిరవిలోచన జలజాతనాభ
పరమదయాకర పాపవిదూర
కామితమందార ఘననీలవర్ణ
మాకాంక్ష లీడేర్పు మాచర్లచెన్న"
అని సన్నుతులుచేసి యబలలమెల్ల
కనుచూపు పదముల గట్టిగానిల్పి
నియమంబుతోడుత నిల్చినవేళ
అర్చించు వైష్ణవు నంతరమందు

ఆవేశమైపల్కె నందరు వినగ
"కోపింప మీమీద కూరిమిగద్దు
మనసులనిల్కడ మర్మంబుదెలియ
అరయంగదలచి నేనటు మొగమైతి
భక్తికిమెచ్చితి భయమొందవలదు"
అని పల్కనంతలో నతివేగమునను
పళ్ళెంబులోపలి ఫల మొక్కటెగిరి
వచ్చి నాచేతులవ్రాలిన చిత్త
ముప్పొంగి జోహారు లొయ్యనజేసి
గుడినుండి వెలువడి కోర్కెలుమీర
విజనమౌదెసకేగి విప్రాంగనకును
ఫలమిచ్చి మాకెల్ల పంచియిమ్మనిన
ఎనిమిదిఖండంబు లేర్పడజేసి
ఆరుగురుసతులకు నారుఖండములు
మేరతోడుతనిచ్చి మేలైనదొకటి
నాచేతికందిచ్చి నాతితానందె
'బ్రాహ్మణకులమున ప్రభవించినావు
సకలజనములు మీకు సాటిరాదగరు
తొలితిముందుగ నీవు భుజియింపవమ్మ
అటుమీద మేమెల్ల నారగించెదము'
అనిచెప్పి క్రమములో నారగించితిమి
కర ముఖ పాదముల్ కడిగియామీద
పోయి స్వామికిమ్రొక్కి పూజారివచ్చి
చెలువైనపదపీఠి శిరములనుంచ
వెనుకకునడుచుచు వేడుకతోడ
ఎవ్వరెవ్వరియిండ్ల కేగియున్నంత
గర్భంబులాయెను కంటిని నిన్ను
చాలకష్టముమీద జనియించినావు
కుంతాలవారికి గురుదేవుకృపను

సంతానమాయెను సాటిలేదనుచు
సకలభూములవారు సంతోషపడిరి
ననుబాసిచనగను నాయమ్మా నీకు
ఎలమితో నొక్కనా డెదుటలేకుం
ప్రాణంబు లెటువలెపట్టంగగలను
చనియెను మీతండ్రి సమరంబుజేం
తోడునీవుండిన దుఃఖంబులేదు
పోషింతువీవని బుద్ధినమ్మితిని
వడ్డకష్టంబెల్ల పరులపాలాయె
సంతానలేమికి చాలదివసములు
బహుతరదుఃఖంబు పాలైతికొడుక
స్వామిసత్కృపచేత జన్మించితీవు
ఆనాటినుండియు నణగెఖేదంబు
వేములుపూచెను వేములుగాచె
కానివేములఫలము కాకులకయ్యె
మనుజరక్షణలేని మల్లెపూదోట
వడిచూరపోయిన వడువయ్యెతంద్రి
వేడిపెనమున నీళ్ళు విదలించినట్లు
అణగిన వగపెల్ల నధికమైపెరిగె
నీడనిధానంబు నిలిచికన్నట్లు
వడ్లలోరత్నంబు వడిగన్నమాడ్కి
గుడిదెరచి దేవుని కోరికన్నట్లు
చుక్కలలోచంద్రు జూచినయట్లు
కంటినిపుత్రుడ కాంక్షతోనిన్ను
తాడెక్కపురుషుని తల్లియౌసతికి
గడమీదనాడెడు కాంతతల్లికిని
శూరునితల్లికి సుఖమేమిలేదు
పందవైపుట్టిన బ్రతుకుదునేను
ముందరనీవున్న మురిపెంబుమీరు

దూరాననిలచిన దొడరునుజాలి
తప్పించజూచెను దైవమీవేళ
బవరంబుకేగుట పైనమైనావు
వీరమాతలకును వీరభార్యలకు
విషమిచ్చియేగుట విహితంబునీకు
తరువాత మీతండ్రిదగ్గరకేగు"
అనియిట్లు వగచెడు నైతమ్మజూచి
బాలుడీగతిబల్కె పటుధైర్యమూని

*బాలచంద్రుడు స్వధర్మ నిరూపణముచేయుట: భార్యకుచెప్పి, యుద్ధమున కేగుమని ఆతనితో ఐతమ్మచెప్పుట.*

"అమ్మరో యారీతి నడలంగనేల
నీవెఱుంగని ధర్మమేనెఱుంగుదునె
రణరంగభూమియై రంజిల్లుచున్న
కార్యమపురమందు ఘనశౌర్యపటిమ
తండ్రులునిల్చుండి దండుచేయంగ
నే నింటనుండుట నీతియేతల్లి ?
ఉండుమనుటకు నీకు నొప్పునా మనసు
ప్రాకృతభామల పగిదిబల్కెదవు
వెఱ్ఱితనంబేల వీరునిసతివి
కాయమనిత్యంబు కల్మిహాళక్కి
జలబుద్బుదములట్లు సత్యంబుగాను
షట్చక్రవర్తులు సకలభూపతులు
చనిరి బ్రహ్మేంద్రాది సర్వదేవతలు
భూతంబులైదును పొలియుచునుండు
శౌర్యసత్కీర్తులు సమయవెన్నటికి
సకలపురాణముల్ సద్ధర్మకథలు
నీతిశాస్త్రంబులు నీ వెఱుంగుదువు

పౌరుషేయముచేత బ్రతుకుటలెస్స
జననమరణంబులు జనులకునిజము
ఆలయంబున నున్న నడవిలోనున్న
తప్పవు తాకును తథ్యంబుగాను
పుణ్యలోకంబును పొందుమార్గములు
వినిపింతు వినులెస్స విశదంబుగాను
సజ్జనసంగతి సంసారమెడల
గురువు బోధించిన గురిమీద మనసు
నిలిపి మరణమొందు నిశ్చలుండొకడు
ఘనరణమ్మున రొమ్ము గాయాలనొంది
మనసుచలింపక మరణంబునొందు
శౌర్యపరాక్రమసంపన్నుఁ డొకడు
వీరలిద్దరులెస్స వినువీధికేగి
ఆదిత్యమండలం బరుదారచించి
పోయి పుణ్యంబులభూమి జెందుదురు
మొదటికార్యంబంత ముఖ్యమ్ముగాదు.
శౌర్యంబుచే మాకు సంపాద్యమగును
ఇక నొక్కధర్మంబు నే వినిపింతు
చిత్తచలనములేక చెవియొగ్గివినుము
ఆదికాలంబున నజుడు నిర్మించె
వరవిప్రరాజన్య వైశ్య శూద్రులను
వేదవిద్యలయందు విప్రులనుంచె
రణకార్యములయందు రాజులనుంచె
క్రయవిక్రయాది కార్యంబులందు
వైశ్యులనియమించి వరలగాజేసె
సద్భక్తి నీమూడుజాతులవారి
శుశ్రూషనొందంగ జేసెశూద్రులను
నరవినాలవజాతి జననంబు మాకు
వెలమలమెతిమి వీరజీవనత

విప్రులసేవింప విజ్ఞానమొదవు
క్షత్రియసేవచే శౌర్యంబుగలుగు
కడువైశ్యసేవచే గలుగుసంపత్తి
మేము రాజులగొల్చి మెరయుచుండుదుము
విక్రమరూఢిచే వెలయుటజేసి
తమసరిగా మమ్ము దయజేతురెపుడు
శస్త్రధారులకెల్ల సమరంబుకాదు
శౌర్యంబుచాలించి సకలధర్మములు
చేసినధర్మంబు చెందదుమాకు
మనువుబోధించిన మార్గమేయిదియు
పరమాత్మ కృష్ణుండు భండనభూమి
సవ్యసాచికిదెల్పి సకలధర్మములు
అటుమీదజేయించె నధికరణంబు
ఇదిగాక యింకొక్క హేతువువినుము
అలరాజుకాముచే హతుడైనవెనుక
కొమ్మభూమీశుడు కోపించినపుడు
నాతండ్రి చెయిపట్టి ననుగొనిపోయి
కొమ్మ భూపతికిచ్చి 'కోరినట్లుగను
తీర్చును కులపగ ధీరుడితండె
ఇల్లడవెట్టితి నేను బాలుణ్ణి'
అనిపల్కె నోయమ్మ యరమరలేక
ఆనాటనుండియు నాయొప్పగింత
నాటియున్నది నువ్వె నామదియందు
ఆహారనిద్రల కమరదు మనసు
కార్యమీవేళను గదిసియున్నదియు
ప్రాణమైనను నిత్తు పగయైనదీర్తు
తప్పితేవారికి దాసుండనగుదు
మనసొప్పదందుకు మాతల్లి వినుము
అరలేకచెప్పితి నంతరంగమున

బిరుదుశూరుడగాని పిన్ననుగాను
మగువలుండెడునట్టి మందిరంబందు
ఉండుట శూరుల కుచితంబుగాదు
ఎక్కువపలుకక యికనూరకుండు
జననమరణమ్ములు చాలుపుమనకు
పుట్టుపుట్టువునకు పుత్రులు నీకు
జన్మజన్మంబున జననులు నాకు
కలుగుచుండుదు రిదికమలజునియతి
దుఃఖింప పనిలేదు తోయజగంధి
దీవించి నన్నంపుధీరతతోడ"
భయమందకీలాగు బాలుడుపలుక
ఐతమ్మకొడుకుతో ననియెనీరీతి
"సమరంబునకునేగు శౌర్యవంతులకు
తల్లిదీవనబొంది తగనాలిచేత
దీవనగొనిపోవ తేజంబుసుమ్ము
నడచిరిపెద్దలీ నయమార్గమునను
మనసుంచి నామాటమన్నింపుమ" నిన
బాలుండు తల్లితో పలికెనీరీతి
"తల్లి నీదీవన తరగదుమాకు
కులసతిదీవనకొనుట యేలాగు
నాగురుతెరుగదు నాతిమాంచాల
ఏ నాపెపోలిక నెరుగనుసుమ్ము
మన యిల్లెరుంగదు మగువమాంచాల
చానయింటికి నేను చనుటయేలేదు
నీమాటవినకున్న నీతికాదనుచు
ప్రియమునపోయిన ప్రియురాలుకినిసి
ఎగ్గులెన్నిన నాకు హీనతగాదె
సాహసల్ మూర్ఖులు చాసలెయ్యెడను
మాటలుమంచివి మనసుక తెరలు

పూర్వజన్మఫలంబు పొందికేలాగొ
ఆలుమగలజేసె నజుడు మమ్మిలను
నాభాగ్యమేమియు నాతెరుగదమ్మ
తొయ్యలిమనసున దుఃఖమున్నదియు
అపరాధమధికమా యమ్మనాయందు
ఈసమయంబున నేనేగరాదు
నాస్వభావము నేనె నమ్మంగలేను"
నావిని సుతునకు నాతియిట్లనియె:

*ఐతాంబ కోడలిచెంతకేగి పుత్రునిబుద్ధి మరల్ప మనుట: మాంచాల తన నగరికి బాలచంద్రుని పంప గోరుట.*

"అటజని వృత్తాంత మరసివచ్చెదను
ఇచ్చటనేయుంఢు మెటుబోవవలదు"
అనుచు నేరాంద్రతో నందలాలెక్కి
గండువారింటికి గ్రక్కునజనియె
ముత్యాలకుప్పమ్మ ముందరనేగె
ఘనమైన పేర్నని గౌరమ్మయరిగె
దంటగావెంటను దాదులుజనిరి
ఐతమ్మ యిటువలె నతిమోదమునను
వచ్చుట తెలిసికొని వారినిప్రీతి
చెలువంద రేకమ్మ చెలియలనెల్ల
వివరించిపిలిచెను వేడుకతోడ
"వేమినాయునిభామ వేగమేరమ్మ
మలినేనియాచమ్మ మముజేరరమ్మ
పినమల్లినేనికి ప్రియురాలవైన
చందమ్మయిచటకు చయ్యనరమ్మ
గోపినాయునికూర్మి కులకాంతలక్ష్మి
ననుజేరరావమ్మ నాతిరోయనుచు

పిలిచినవచ్చిరి ప్రియముతోడుతను
వారును రేకమ్మ వాంఛలుమీర
ఐతమ్మకెదురుగ నరిగికొంపోయి
కనకపీఠంబుల గరిమతోనుంచ
అప్పుడు మేడపై నతిమోదమునను
ఉన్నట్టిమాంచాల యొయ్యనవచ్చి
అత్తలకెల్లను నమరంగమ్రొక్కి
కస్తూరిపునుగును గలిపినయట్టి
అగరుగంధముబూసె నణకువతోడ.
చేకట్లుకడియముల్ చెలువుగానిచ్చి
మరియును మాణిక్యమయమైన భూష
లందరికిప్పించి హర్షమొందించి
కోమలులందరు కూర్చున్నవేళ
అలరంగవదినయౌ నైతమ్మ జూచి
వినయంబుతోబల్కె వెలదిరేకమ్మ
"అక్కలు చెల్లెండ్రు నత్యంతదయను
ఆందోళికారూఢలగుచు నీవేళ
మముజూడవచ్చుట మాభాగ్యమరయ
మీరు వచ్చినపని మీకోడలైన
మాదునిరాచిల్క మంచాలెరుంగు
తక్కినవారికి తరముకాదనెను
తనతల్లిమాటకు తనయమంచాల
నవ్వుచుబల్కెను నయభావమమర
"మాయత్త తనకొడుకు మగటిమిమీరి
ఘనతకార్యమపూడి కలనికిబోవ
'అలిదీవనగాని యరుగుమీ'యనిన
అణకువచేరాక నటుతలవంచె
పిలిపింపుమనివచ్చె ప్రీతితోనతని
బ్రహ్మగూర్చెను మమ్ము బాలురమపుడు

సమరంబులో నతడు సమసినవెనుక
వెంటనేగెదగాని, వినుమునామాట
పంపుముపుత్రుని బవరంబునకును"
అనినభీతిల్లుచు నైతమ్మపలికె
"పరమపతివ్రత పావనమూర్తి
పతిభక్తిగలిగిన పద్మాయతాక్షి
నే నరుదెంచుట నీమదిదెలిసె
వలవదీలాగున వచియించుటకును
సాధ్విప్రేమమె పతికి సకలసాధ్యంబు
కావున మనసున కరుణయునుంచి
నేరంబులతనిపై నిలుపకుమిపుడు
రట్టుచేసిన నిటకు రాడునాసుతుడు
నిన్నుజూచినయపుడె నిలుపంగగలడు"
అనియిట్లుపలికిన అత్తకుమ్రొక్కి
పల్కెను మంచాల ప్రౌఢిమీరంగ
"ఇనుమంతనాపుణ్య మెరుగడు నీదు
తనయుడు అత్తరో దైవంబుకెరుక
పాపపుమాటలు పలుకంగనేల
వేశ్యవారింట నే వేళభుజియించు
విడియంబుచేయుట వెలయాలియింట
సానికూతురుతోడ సకలభోగములు
నానోముఫలమేమొ నలినజుడతని
ననుబాపివేశ్యయౌ నాతికొప్పించె
మేలనుభవించెడి మెలతలువారు
చావనోచినయట్టి సకియనునేను
సరిచేసియీమాట సభనెన్నరాదు
నీపుత్రునడవడి నీచిత్తమెరుగు
ఈవె కర్తవుమాకు నేమిజెప్పుదును
ఆడపలసినమాట లాడితిగాని

అత్తరో నీమది ననుమానమేల
పంపుమీ 'కాముని పగతీర్చుటకును
పోయెద'ననియెడు బుద్ధిమాన్పింతు
ఏడేండ్లనుంచి తానేమరనట్టి
వేశ్యపై మోహంబు విడువంగజేతు
నీయానసిద్ధంబు నేకల్లబలుక"
అనిపల్కుకోడలి నాలింగనంబు
చేసి పుత్తడినీరు చీరలురత్న
కాంచనమయమైన ఘనభూషణములు
పెట్టికోడలికపుడు ప్రియముమీరంగ
కొలువులోపలనుండి గొబ్బునలేచి
వియ్యపురాలిని వెసకౌగిలించి
కోర్కెతో శీలమ్మ కోడండ్రుతిరిగి
అందలమ్ములనెక్కి యతులమోదమున
తమతమయిండ్లకు తగనేగిరపుడు
తన కుమారుని జూచి తల్లియిట్లనియె :

*తల్లి బాలుని తన భార్యానగరికి వెళ్ళుమనుట: దానార్థము తల్లి యిచ్చిన ధనముగైకొని అతడు వేశ్యాయింటికి జనుట.*

"రావన్నబాలుడ రాయలదిగుల
గండువారింటికి కదలుమువేగ"
అనిచెప్పి పుత్రున కధికమోదమున
మాడలు చీరలు మణిభూషణములు
కర్పూరకస్తూరికలితగంధంబు
బాగాలచూర్ణంబు పక్వాన్నములును
తగువారిచేనంపె తనయునివెంట
"బ్రాహ్మణజనులకు భట్టువారలకు
ఆటపాటలవారి కఖిలార్థితతికి

దాసజనాళికి దాసీలకెల్ల
దానంబొనర్పుము తగిన మార్గమున
'రాజుకు మంత్రియై రంజిల్లుచున్న
బ్రహ్మన్న సుతుడవు బహుదాత'వనఘ
అర్థంబుగలవారి కల్లుడవనుచు
కీర్తిసంగ్రహమతి కేరును జనము"
అనిచెప్పి "పొమ్మ"న్న నధికసాహసుడు
వృద్ధశీలమ్మకు వేడ్కతో మ్రొక్కి
ఐతాంబమొదలైన అమ్మలనెల్ల
తిన్నగ సేవించి దీవనబడసి
ఎలమితో తమ్ములు నిరుమేరగొలువ
బ్రాహ్మణుల్ దీవింప భట్లుపొగడంగ
ఆటపాటల వారు నాడుచురాగ
సానివారింటికి చయ్యననేగె
సానిసబ్బమ తన సఖియనుబిలిచి
"మైనోపదనిదెల్పి మరలిపొమ్మనుము"
అనిపంప నేతెంచియావార్తజెప్పె
"తలనొప్పిచేజిక్కి తమయక్క నేడు
పాన్పుపైబొర్లుచు పడుకున్నదయ్య"
అనవిని యాబాలు డప్పుడిట్లనియె :
"పొలుపుగ కార్యమపురి కలనికేను
పోవుచు ధనమిచ్చిపోవలెననుచు
వచ్చితి నింతలో వనితగర్వించి
ప్రేమచే సిరిరాగ పెడచేత ద్రోసె
భామకీపట్టున భాగ్యంబులేదు
దైవమీయడుసొమ్ము తరుణికీవేళ"
అనవినిచని దాది యావార్తచెప్ప
ఉదిరిదిగ్గనలేచి యొయ్యెన వేశ్య
పరిగె నాయతమయ్యె బాలునిబిల్వ

కస్తూరి జవ్వాజి కలిపినయట్టి
మలయజ మోపికమై నిండనలది
బంగారుజాళువాపటము ధరించి
రాజతకుసుమంపు రవికె తా దొడిగి
ముదమున నవరత్నములహారవితతి
గళమునధరియించి కరములయందు
హేమకంకణములు హెచ్చుగావెలుగ
సవరనిముత్యాల జల్లులుతూల
సౌందర్యఖనియైన సబ్బమయపుడు
వివిధచిత్తరువుల వెలుగుచునున్న
మేడపైనెక్కి యామేలిమిగనియె
అంతటదిగివచ్చి హర్షముప్పొంగ
వీరులందరికిని విడియముల్ గొనుచు
కడువేగబాలుని గానగబోయి
పన్నీరుదెప్పించి పాదముల్ గడిగి
ఎనమంద్రకప్పుడు ఇచ్చెవీడ్యములు
వెలదిబాలునిరెట్ట విడువకపట్టి
మేడపైనెక్కించె మెలతసౌందర్య
మహిమగన్గొని కలనుమరచె బాలుండు
ద్వారసమీపాన తమ్ములందరును
కనిపెట్టియుండిరి కడుభక్తిమీర
బాలుడుపవళించె పట్టెమంచమున.

*బాలచంద్రుడు వేశ్యను పాలనాడుట: ఆమె ఆతనిని లోపరచుకొనుట.*

సకినలపట్టెపై సఖియగూర్చుండి
తీరైనతనప్రేమ తెలుపుటకొరకు
తలవంచి యూరకె తానుండెనపుడు
బాలునిభావంబు పల్లటంబగుట

తెలిసియాసబ్బాయి తిన్నగాననియె :
"నినువాసిదినములు నేటికైదాయె
ఐదేండ్లపలెదోచె నక్కటా నేను
నీకు సంతసమిచ్చు నెలతనుగాను
దయతప్పినప్పుడు తానేమియనిన
నీమదికెక్కదు నేనేమిచేతు
నామదికె తెలియు నావిచారంబు
విరహతాపముదొట్టి వేసటబుట్టి
పదియవస్థలుమేన ప్రాప్తమైమించ
బహువేదనలుబొంది పారంబులేక
ఉసురుసురనుచును నుడుగనిజాలి
భాపంబులోనొంది భయమునుబొంది
తనువుకంపమునొంది తగుమాటమరచి
ఎప్పుడు నీరూపు నేజూతుననుచు
వాక్యంబుబలికితే వగరుపుబుట్ట
నిట్టూర్పువిడుచుచు నిన్నెచింతించి
పొందినసిగ్గెడలి భుజియింపనోడి
తపియించిదేహంబు తరచైనకాక
తడబడనాలుక తల్లడంబంద
జీవిదొలంగ నీచింతయొనర్చి
పరవశంబునుజెంది పొన్నుననుంటి
తలనొప్పిఘనమయ్యె తాపంబుహెచ్చె
నీవువచ్చుటజేసి నీమాటవింటి
అణగెనుతలనొప్పి యంతమీదటను
నినుజూచుభాగ్యంబు నేటికిగలిగె
నీమదిదయలేదు నేనేమిచేతు"
అని తలవాలిచి యాసబ్బసాని
వక్షఃస్థలంబున వరదలై పార
కన్నీటిబిందువుల్ గ్రక్కునజార్చె

బాలుడు ముందరి పాపెరుగలేక
మాయదుఃఖంబని మదిదెలియలేక
కామాంధకారంబు కన్నుల దొట్టి
కాటుక చెదరంగ కన్నీరుదుడిచి
చెదిరినపెన్నెరుల్ చిక్కులుబాపి
సీమంతమొగిదీర్చి చేర్చుక్కనిలిపి
కౌగిటబిగియించి కాంచనరత్న
హారంబు లెదమీద నమరికచేసి
ఏనూరుమాడల నిచ్చె సబ్బమకు
బాలుని కనుగొని పలికెన్బ్రేమ
"పయనమైవచ్చిన భావంబుదోచె
తెలుపగావలె నాకు తిన్ననిదయను"
అనవిని బాలుండు నా లేమజూచి
"చెలగి కార్యమపూడి శ్రీకలనియందు
వీరులగలయంగ వేగబోవుచును
ప్రియురాలవని నిన్ను పిలువవచ్చితిని
పయనమ్ముగమ్మ"ని పలికెనంతటను
సానికూతురునవ్వి చయ్యనబలికె
"బాలుడనీకేల పట్టెనువెఱ్ఱి
ఎక్కడిమోహంబు ఎక్కడిపొందు
సరసుడవౌదువు సాటినీకెవరు
ఈపట్ల నీబుద్ధి యెక్కడచనెను
కానిసొమ్మునకీవు కాంక్షచేసెదవు
అడవిలోగాచిన యామ్లఫలంబు
ఉదధిలోలవణంబు నొగిగూడినట్లు
జరిగెనీకును నాకు సంగడితనము
ఇహసౌఖ్యమొసగుట కేమె కర్తలము
పరసౌఖ్యమొసగ నీ పడతియే కర్త"
అనిపల్క విని బాలు డాగ్రహం బొప్ప

"కుటిలాత్మురాల నీగుణ మెఱుగలేక
మటుమాయలోఁజిక్కి మానంబు ధనము
నీపాలుచేసితి నేగాననైతి
కామాంధకారంబు కష్టపువిద్య
నీతిమాలిననడక నేటికిదెలిసె
ఇంటిలోఁభోజనం బిచ్చకురాక
పరులయెంగిలి కాసపడితిని నేను"
అనిదూరి యటనుండి ఆమహామహుఁడు
కాలాగ్నిరుద్రుడై కనలుచులేచి
పోవగా నబ్బాయి పోనీకబట్టి
పకపకనవ్వుచు బాలునికనియె :
"నీమనసెడలెను నినునమ్మరాదు
నీమదినిలకడ నేదెలియగోరి
పలికితి తప్పుగాబట్టంగనేల
పురుషులనమ్మంగ పొసగదటంచు
మాటికిజెప్పిరి మా పెద్దలెల్ల
పర్ణాగ్రములయందు పట్టుకవ్రేలు
జలబిందుతతివలె చలనంబునొందు
మనసొకతీరు నీమాటొకతీరు
తనవద్దనున్నపుడె తనవాడుగాని
ఇలువెళ్ళితే వాని నెవరుపట్టెదరు
క్రొత్తలపై లెస్స కూరిమినిలిపి
ప్రాతలవిడనాడ భావముంచెదరు
తమతప్పులేమియు తలచరుమదిని
ఒరులతప్పులనెన్న నోడరునమ్ము
కరుణకు మూలంబు కొంతకోపంబు
పైపగా జూతురు సజ్జనులెల్ల
అదిగాన మదిలోన నలుగంగవలదు
మనలోన భేదంబు మానుటనీతి

నరికితే జలములు నడిమికిదెగవు
తరువును లతయును దంటగానుండ
చెట్టుకు నష్టంబు చెందినయపుడు
తీగెకాధారంబు తిన్నగాజెడును
తీగెనష్టమ్మున చెడిపోదుచెట్టు
మనసున నీభంగి మరువంగవలదు
తగుతీగె నేనౌదు తరువవునీవు
భూమినికొంతకు పురుషుడాదరువు
మాయక్కకంటెను మరివేగమునను
నీతోడవైకుంఠ నిలయంబుజూతు"
అనినబాలుడుమెచ్చి యపుడు సభ్రమకు
చయ్యన నగసాల చందునిబిలచి
"వేయిమాడలనిమ్ము వెలదికి"ననిన
ఇచ్చిన గైకొనె నిందీవరాక్షి
"మాపెద్దలకు నీవు మక్కువ నోలి
నిప్పింపుమ"నిచెప్పి యింతివేగమున
దాసిచే పిలిపించె తమతల్లినపుడు.

*వేశ్యమాత బాలుని దెప్పి, ధనముగుంజుట.*

కోతివంటిది వృద్ధ గురుతరకోపి
కోలపట్టుకవచ్చె కూతురుకడకు
విరిగినరొంటియు వ్రేలుచన్నులును
ఉరిసినవ్రేళ్లను ఊచలుకాళ్లు
వంగిననడుమును వదలినపండ్లు
పీలచేతులు గూని పీనుగుమోము
చిక్కగనెరసిన చింపిరితలయు
వ్రాలినబొమలును వదలినమేను
మెడమీదకణితియు మీగాళ్లపూత
ఘనమైనపులిపిరి గడ్డంబుమీద

మాతిమీసపుమొల్క ముక్కురోమములు
తలవణకును మాటతబ్బిబ్బు మరపు
బొల్లిగారెడునోట నుడిసెడుకంపు
కన్నుల పుసులును కక్షల చెమట
సోలుచు గునియుచు సొరుగుచువచ్చి
చేవెలుంగున బాలు చెచ్చెరజూచి
ఒరిగిన బొక్కినో రొయ్యనదెరచి
పలికె కంపముమీర బాలునితోను
" 'దొరలజూచినయంత తొలగంగవలయు
వారితో పొందైన వడి నుడివచ్చు
మనసరివారితో మాలిమిమేలు
తగినయాతడు మనకు దక్కినయెడల
చేనికికాపౌను చెప్పినపనులు
భక్తితోజేయును పశువులనరయు
అలసిసొలసినప్పు డాదరువగును
ముక్కుకుకానట్టి ముత్యంబువలదు
కడదాక జరగదు కలవారిపొందు
నామాట వినుమ'ని నయముకొలంది
చెప్పిన వినదాయె చెలియనేమందు
నీవేమిచేసితో నిన్నా పెమరగె
నిశ్చయించెనునెలత నీవెంటజనగ
బ్రతుకు మా దెవ్వరి పాలుజేసినదొ
అనుకొన్నఫలమేమి ఆపెకే తెలియు
మనసునీపాలాయె మమ్మెల్ల విడిచె.
ఒకనాడు మాయింటి కొయ్యనవచ్చి
వేడినసొమ్మిచ్చు విటకానినైన
చిక్కులుబెట్టదు చీకాకుజేతు
సంప్రదాయంబిది సకలవేశ్యలకును
సర్వకాలము నేను సాకిపెంచితిని

సత్యంబు నీవెంట సాగిపోనీయ
కెరలిన నాతోడ గెలవలేరెవరు
మెల్లనిమాటకు మీరకునీవు
నేను గద్దించిన నిలువలేవెదుట
తెలిసియేయుండు నాతీరు లోకమున
అడిగిన ధనమెల్ల నలర నాకిమ్ము
నీవెంటపంపింతు నెలతను నేను
సమ్మతిదీవింతు సర్వేశునాన
వెలయగా పదిరెండువేలరొక్కంబు
ఇంతికుంకువగాగ నిప్పించు"మనిన
అవిచారముగ బాలు డందుకునొప్పి
వెలమలదోర్నీని వేగమేపిలిచి
"ఏడువేల ధనంబు నింతికినిమ్ము
కూరిమితమ్ముడ కుమ్మరిపట్టి
మూడువేలధనంబు ముదిదానికిమ్ము
కంసాలిచందన్న కడమైన రెండు
వేలమాడలనిమ్ము వృద్ధుకు" అనుచు
ఇటువలెనిప్పించ నెన్నుచుగొనియు
కరములుముకుళించి గ్రక్కునమ్రొక్కి
ముదివానరమువంటి ముసలిది పలికె
"చక్కదనముకుప్ప సరసంపుతెప్ప
మదనునిబాణంబు మాకుప్రాణంబు
తక్కించుకొంటివి తగనిటువంటి
పుత్తడిబొమ్మ నీ పుణ్యంబుకతన
చేరెను కోరికెసిద్ధించునట్లు
పట్టుపచ్చడమిమ్ము భక్తితో నాకు
నీమారుగాజూతు నే పెద్దదాన"
అనుచువేడిన నిచ్చెనపుడు నవ్వుచును
ఇప్పించబుచ్చుక యింటికినేగె;

ఇటువలె తనతల్లి యేగినవెనుక
బాలునితోడుత బలికె సబ్బాయి
"ఉల్లంబు చల్లనై యుత్సాహమొదవె
ఎల్లి కార్యమపూడి కేగంగవలెను
మల్ల భూమీశుని మన్ననబడసి
గొల్లెనలోపల కొలువులోనుండి
మనసులో దలచక మరచిపోయెదవొ
రాజులు సెలవీక రారాదుమరలి
ఎన్నాళ్ళుబట్టునో యీ కార్యసరణి
అన్న వెచ్చంబున కానుపోకలకు
ఇచ్చెదవేనియు నిపుడెయిప్పించు"
అనిన బాలుడువిని హర్షంబునొంది
చయ్యన కంసాలిచందుని బిలిచి
"నాలుగు వేలిమ్ము నాతివెచ్చముకు"
అనిన "మంచిది"యంచు నందరివద్ద
అరసియిప్పించెను యామేరసొమ్ము
తరువాత బాలుడు తరుణినిజూచి.
"పయనమైయుండుము పద్మాయతాక్షి
ఘనతకార్యమపూడి కదనరంగంబు
చూపింతు నీమది చోద్యమందంగ"
అనిచెప్పి యొప్పించి యనుజులుదాను
సబ్బాయిసదనంబు చయ్యనవెడలె
పంచమహావాద్యపటలిమ్రోయంగ
బ్రాహ్మణుల్ దీవించ భట్లుకీర్తించ
ఆనందమున వీధికటులేగుదెంచి
అమితమైవచ్చిన యర్థులజూచి
"వీరికందరికిని వేడినధనము
కూరిమినిప్పించు కుమ్మరిపట్టి"
అనిపల్క బాలున కాతడిట్లనియె

"అమ్మ యిచ్చిన ధనం బతివచ్చబోయె
ఇమ్మన్న నేనేడ నిత్తునర్థులకు"
తరువాతనందరి తమ్ములబిలిచి
చెప్పినవారెల్ల జెప్పిరీలాగె.

*అనపోతు బాలుని ప్రవర్తనను గర్హించుట : గండువారింటికి బాలచంద్రుడు వెడలుట.*

ఆసమయంబున అనపోతుజూచి
పటుకోపమునబల్కె బాలునితోడ
'ఇంతగర్వంబేమి యీ మదమేమి
కామాంధకారంబు కన్నులదొట్టి
కిందుమీదెరుగక కేరుచున్నావు
కలధనములనెల్ల గడ్డిగా జూచి
చేస్తివిపాపంబు చేరునొచ్చెంబు
ఇహపరదూరమౌ యీనడకేమి
సబ్బాయిపై వలపు సర్వనాశంబు
సోలిదానికిమొగ్గి సొమ్మెల్ల జేర్చి
ఇందరినడుగంగ నేమిపుణ్యంబు
వారకాంతలరీతి వర్ణింపరాదు
బిడ్డలకొసగక ప్రియురాలికీక
చీమలుగూర్చిన చెలువునగూర్చి
ధనవంతులగువారి ధనమెల్ల దోచు
ముంజిగాండ్లనుజేరి మురిపెమణంచు
వంజలై విటులెల్ల వసుమతిమీద
పోయిరి బ్రతికెడు పొందికలేక
గొనకొనివేశ్యల కోరియిచ్చుటలు
వినలేదు కనలేదు వేడబంబిదియు"
అనిదూరి పలికిన నా బాలుడపుడు
తలవంచిమరుమాట తానాడలేక

వెలమలదోర్నీని వేగమేపిలిచి
మరచుట్టుతప్పించి మాణిక్యఖచిత
భర్మ్యపతకమ్మును పట్టియందించి
"ఇచ్చువారలకిచ్చి పట్టినధనము
తెచ్చియిప్పించుము దీనార్థిజనుల
కని"చెప్ప ధనమెల్ల నప్పుడుతెప్పించి
సకలార్థులకునీయ సంతుష్టులైరి.
తరువాత బాలుండు తాత్పర్యమొప్ప
వైభవంబున గండువారింటికేగ
విపణిమార్గంబుల వెలయుచురాగ
వరవిప్రకాంతలు వడితోడవచ్చి
హారతులిచ్చిరి ఆనందమొదవ
పలుకానుకలొసంగి బ్రాహ్మణజనము
నాదరించుచుజూచి నందరిననిపి
ఘనతరశృంగారకలితమైయొప్పు
గండువారలగృహము కనుగొనువేళ
మాణిక్యతోరణ మండితంబైన
ద్వారంబుచొరబడి వచ్చుచుజూచె
ఘనచిత్రకళకర్మకలితపటాలి
గోడలు కనరాక గుప్తమౌనట్లు
చేసివితానంబు చెలువొప్పగట్టి
సరసంబుచేసిన చవికెలోపలను
రమణీయమైయొప్పు రత్నకంబళము
అరసిచూచుచు బాలుడాసీనుడయ్యె
తమ్ములందరువచ్చి తగినరావులను
వసియించిరంతట వైభవంబడర
ద్రాక్షాఫలంబులు తగుపనసపండ్లు
నారికేళాదియౌ నయఫలవితతి
జాలవల్లికలతో సరగునదెచ్చి

ముందరనిలిపిరి ముదముమీరంగ
వింజామరంబులు వేసిరిరుమ్మైల
బాలుడు సురనాథుపగిదిగా దోచె
కనుగొనువారల కన్నుల కపుడు.

*మాంచాలను చెలికత్తెలు అలంకరించుట: భర్తను గుర్తించు నుపాయమును మాంచాల తన తల్లిని అడుగుట.*

అలరంగ చెలికత్తె లమితహర్షమున
మంచాల ననువుగ మక్కువతోను
శృంగారమొనరించు చిత్తంబులుంచి
సంపంగితైలంబు సయ్యనదెచ్చి
మగువకు తలయంటి మంచిగంధమున
అటకలిరాచిరి ఆమూనెపోవ
బంగారుబిందెల పన్నీరుదెచ్చి
స్నానమాడించిరి సంతసంబొప్ప
తడితీర్చిరప్పుడు తగినవస్త్రమున
ఒకపాటివసనంబు నొప్పుగాగట్టి
గురుహేమపీఠిపై కూర్చుండబెట్టి
బంభరచయమును భయమొందజేయు
కాటుకకాకచే కందగాజేయు
చీకటిగుహలందు జేరగాదించు
కాలాంబుదంబుల గట్టులజేర్చు
దీర్ఘమైనునుపులై తీరైననెరులు
కూర్చి నున్నగదువ్వి కొప్పుగీలించి
బంగారుపూచేర్లు బాగుగాజుట్టి
మదనుకుంతము సరి మంచిపాపటను
మణిహేమమౌక్తికమండితంబైన
చేర్చుక్కగదియించి చిత్రంబుగాను

పొలుపొంద శశిరవిభూషణయుగము
పాపట కిరువంక భాసిల్ల నిలిపి
మాణిక్యహాటకమయబింబ మొకటి
తలవెన్క మెరయగ దట్టించి రెలమి
సగముచంద్రునితోడ సమమగునట్టి
ఘనఫాలదేశంబు కాంతులనడుమ
కుంకుమ చేరేఖ కుదురంగచేసి
కందర్పువిండ్లను ఖండించువైచు
బొమలురెంటికిమధ్య పొందికగాను
కస్తూరిబిందువు ఘటనగావించి
తిలహేమసుమముల తీరులగేరు
ముక్కున ముత్యంపుముంగరనిలిపి
చంద్రఖండంబుల సాటికివచ్చు
గండభాగంబుల కస్తూరితోను
మకరికాపత్త్రముల్ మానుగావ్రాసి
నవసంఖ్యశ్రీలను నవ్వుచునుండు
వీనులమితిలేని విభవంబునొంద
నవరత్నమౌక్తిక నవహేమయుక్త
తాటంకభూషణద్వయము గీలించి
ముత్యాలకుచ్చులు మునుకొనిప్రేలు
బవిరలు కుంశేండ్లు బాగొప్పబెట్టి
కర్ణాగ్రదేశముల్ కాంతులుగ్రమ్మ
కుప్పెల ముత్యాలకుచ్చులు రెండు
ఘనకుంతలంబులగదియించిమరియు
కస్తూరికాశ్మీరకర్పూరసహిత
మలయజంబును హేమమయమైనమేన
విశదంబుగాపూసి విసరి యామీద
పుష్పాలబంతుల బొంగరంబులను
మహనీయకందుక మాలూరతతుల

చక్కన నిరసించు చన్నులపైన
బంగారుపువ్వుల పట్టుకంచుకము
గూఢంబుగా ముడిగొబ్బునవేసి
ముత్యాలరత్నాల మురిపెంపుపేర్లు
పతకాలు పగడాలు బన్నసరాలు
వక్షఃస్థలంబున వరుసతోవేసి
కంబుసన్నిభమగు గళభాగమందు
ముత్యాలపట్టెడ ముదమొప్పకట్టి
మర్రియూడలతోడ మార్కొనిగెల్చి
సుమమాలికలనొంపు చూరలుబుచ్చి
చెలువొందుచుండెడు చేతులురెంట
కీలిత నవరత్నకేయూరములను
రత్నాలుచెక్కిన రమ్యాంగదములు
జంటకడియములు జంటతాయెతులు
మక్కువతోగట్టి మణికట్లకెగువ
నీలాలగాజులు నేర్పునదొడిగి
పచ్చలకంకణాల్ భాసిల్లబెట్టి
చామలాకడియముల్ సంధింపజేసి
మాణిక్యతపనీయమంజులోర్మికల
అంగుళంబులకెల్ల నమరంగగూర్చి
పయ్యెటసవరించి బంగారుతగటు
ముయ్యంచుచేలంబు మోహనమొప్ప
కటియందుసంధించి గంటలుమ్రోయు
తపనీయకాంచియు దట్టించిముడిచి
అందెలు గొలుసులు నలరుగజ్జలును
భర్మవినిర్మిత బహువిధంబైన
భూషణంబులు కాళ్ళనొందుగాబెట్టి
పాఠీనపద్మాళి భ్రమనొందజేయు
పదముల లత్తుకప్రకటంబుచేసి

కర్ణాంతవిస్తారఘననేత్రములను
కాటుకవెలయించి కాంతఏరీతి
శృంగారమొనరించ చెలగిమంచాల
తల్లికిమ్రొక్కెడి దయపుట్టననియె
"తల్లి నీయల్లుని తానెరుగలేను
ఎటువలెదెలియుదు నేయుపాయంబు;
పతియని యితరుల భావించరాదు
అటువలెజేసిన నపరాధినగుదు
హాస్యంబుచేయుదు రక్కడివారు
పంపించు గురిచెప్పి పణతిరో"యనిన
మంచాల కప్పుడు మాత యిట్లనియె
"నీవటుపోయిన నినుజూచినపుడు
లేతురు మరుదులు లేవడు వరుడు
ఇది గురుతుచెప్పితి నేగు నీవ"నిన
తల్లినిసేవించి తా నేగెనపుడు.

*మంచాల తన భర్తదగ్గర కేగుట : బాలుని తమ్ములు అచటనుండి మరలుట.*

భూదేవి తనరూపు పొలతినిజేసి
బాలునిభ్రమియింప పంపెనోయనగ
సౌందర్యవతియైన చాన మాంచాల
నిల్చివారలజూచె నివ్వెరగంది
మరుదులార్వురుగూడి మక్కువతోను
వేగమేలేచిరి వెలదినిజూచి
పతిలేవకుండెను; 'బ్రాహ్మణుండేను
లేచినపాపంబు లేమకుజెందు'
ననుచులేవకపోయె ననపోతు, అపుడు
ఇద్దరిలో పతి నేర్పరచలేక
కాంచనసమవర్ణకాయుడై నట్టి

పొరుడే పతియని పాదంబుపట్టి
పన్నీటగడుగంగ భావనచేయ
భయమున ననపోతు పలికె వేగంబె
"నేను బాలుడగాను నిజము ఓ తల్లి
మరది బ్రాహ్మణుడను మరియు నాపేరు
అనపోతని బిల్తు రందరుజనులు"
విప్రు డీరీతిని వెలదితో బలుక
అనపోతుతోనని నపుడు మంచాల
"మరదౌట యెరుగను మగడౌట యెరుగ
భయమొంద నేటికి బ్రాహ్మణోత్తముడ"
అనిపల్కి మాంచాల కా విప్రుడనియె
"అమ్మ నీపెనిమిటి యతడు; నామంబు
బాలుండు శాత్రవభయదుండుసుమ్ము
నీమనోహరుసేవ నియతిమైజేసి
తిరువాత మమ్మెల్ల దయ నాదరించు"
అనినంత నతనితో నా లేమపలికె
"వినవయ్య విప్రుడ విన్నవించెదను
ఇద్దరికిని మాకు నెలమితోపెండ్లి
చేసెడునాడొకచెనటివిప్రుండు
చూడలేదాయెనో సుముహూర్తమొకటి
'సౌభాగ్యమన్నది చానకులేదు
ఎట్లుగానొప్పిరో ఈ వివాహంబు'
కాకున్న బాలుండు కపటంబుబూని
నన్నేల విడనాడు నయమార్గమెడలి
పతికిని నాకును ప్రాప్తమేలేదొ
ఇప్పుడు బాలుండు ఇటువచ్చెగాన
నేను పూర్వమునందు నియమంబుతోడ
చేసినవ్రతములు సిద్ధించెననుచు
హర్షంబునొందితి నాత్మలోనేను

బాలుడు నన్నిక బాయకయున్న
మాభాగ్యమహిమకు మరిసాటిలేదు
బ్రహ్మకులంబున బ్రభవించినావు
వేదాదివిద్యల విజ్ఞానివనుచు
నీచరణంబులు నేను పూజించ
పట్టితి నా కితరభావంబులేదు
మనసునిశ్చయమిది మరది ! నాక"నుచు
అనువొప్పగాబల్కి యాత్మేశుజూచి
పన్నీరుదెప్పించి పాదముల్ గడిగి
బాలునిజూచుచు పలికె మంచాల
"ప్రాణాంగనన్ గలసి పరిగెవెళ్లెదవు
పంపుము తమ్ముల; పాపమంటెడిని"
అనినబాలుడు పదుండనిన వారనిరి
పోవుచుపోవుచు పొసగనవ్వుచును
"బవరంబునకునేగు పయనమేమాయె ?
కలనిలోనున్నట్టి ఘనులెవ్వరైన
నవ్వరా యీమాట, నాయకుల్ విన్న ?
'ఈసుఖమేదక్కె నెవరు నాకేల'
అనిచూడవలవదు అపకీర్తివచ్చు"
అనిపల్కి వాక్యంబు లాలించియపుడు
తగపల్కెబాలుడు తమ్ములతోను
"ఇంతగా నాతోడ నేలచెప్పెదరు
బవరంబునకుపోవు పయనంబుమరవ
కులపగ మదిలోన కుములుచున్నదియు
కాయమిక్కడ మనసుకలనిలోపలను
నివసించియున్నది నిశ్చయంబిదియె
శ్రీగిరీశునియాన చెన్నునియాన
మాయమ్మమాటకు మారాడలేక
ఇటువచ్చినాడ మీరేమిచెప్పెదరు

రయమునవచ్చెద రమ్మంటివని
మీరెల్ల నిలుమన్న మీరక నిలుతు
ఎన్నాళ్ళు నేనుండు టెరిగింపు డ"నిన
"ఏడుజాములదనుక నిచ్చోటనుండు
అంతటమితివచ్చు నరుగంగవలయు
సర్వజ్ఞుడవు నీవు జడులము మేము
అపకీర్తివచ్చెనా యంటునందరికిని
ఒత్తిచెప్పుట మాకు నుచితంబుగాదు"
అనుచుబాలునిబంపి యాకొల్వువెడలి
తమతమయిండ్లకు తమ్ములు చనిరి.

*బాలచంద్రుడు తన భార్యా సౌందర్యమును చూచి ముగ్ధుడై తన వేశ్యాలోలత్వమునకు పశ్చాత్తాప మొందుట.*

తరువాత మాంచాల| తనమగడైన
బాలచంద్రునితోడ బహుమోదమునను
మేడమీదికిబోయి మేలైనయట్టి
చిత్తర్వుజూపుచు చిలకలచదువు
వినిపించి శృంగారవిపినంబుజూపి
పెద్దలు తనమీది ప్రియముకొలంది
ప్రొద్దుపోవుటకునై పొందించినట్టి
ధర్మపాంచాలిక ప్రతతినిజూపి
అందులో నొకబొమ్మ నాడంగజేసె
అందుకు నాబాలు డానందమొందె
అటుమీద నిద్దరు నధికమోహమున
చిత్తర్వుమేడకుజేర బాలుండు
హంసతూలికశయ్య నధివసియించె
ప్రియురాలు ముత్యాలపీటపైనుండి
తాంబూలమిచ్చుచు తనమదిలోన

బాలునిభావంబు బాగుగాదెలిసి
"ఆయత్తపడివత్తున"ని మ్రొక్కిలేచి
తమతల్లికడకేగి తగజల్కమాడి
ముత్యాలుగూర్చిన ముంగొంగు మెఱయ
ప్రతిమలువ్రాసిన పట్టువస్త్రంబు
కటియందుధరియించి కనకమాణిక్య
మౌక్తికసంయుక్తమంజులభూష
వితతి మేనునజేర్చి వెలయపాదముల
మహనీయకాంచన మంజీరయుగము
సంధించి ముత్యాలజల్లులువ్రేల
బహువిధశృంగారభరితురాలగుచు
నవరత్నమంజీరనాదంబుమించి
వీనులకింపుగా విభుమీదభక్తి
మనసునమించగా మంచాల వచ్చు
చెలువంబు బాలుడు చెన్నుగాజూచి
తనమదిలోపల తానూహజేసి
"ఎక్కడిసౌందర్య మెంతయొయ్యార
మేమనియెన్నుదు నీ చెలువచెలువు
నరలోక సురలోక నాగలోకముల
సరిలేరు నెలతకు సౌందర్యమునను
ఇటువంటికాంతపై నిచ్చయువిడిచి
పశుబుద్ధివాడనై భావంబుమరచి
ఉంటి నేనిన్నాళ్లు ఉన్మత్తదశను
పరలోకసౌఖ్యంబు పారదోలితిని
మిత్రులు చుట్టాలు మేటిబంధువులు
తిట్టి నిందించిన తెలియలేనైతి
ఆశ్రితజనముల నరయుటమాని
పరియాచకులకిచ్చు భ్రష్టమానవుల
చందంబునొందితి సతినెడబాసి

వెలయాలితోఁబోవు వీరిడనైతి
ఏగతి తలపోతు నేమందువిధిని
నా కర్మఫలమేమొ నాగతియేమొ
దైవమే యెఱుగును తానెఱుగనైతి'
అనిచింతజేసెడి యాబాలుజేరి
మంచాలగూర్చుండె మక్కువతోను.

*బాలచంద్రుడు భార్యతో సరససల్లాపము లాడు నపుడు ముత్యాలహారము తెగిపోవుట: బాలచంద్రుని తమ్ములు యుద్ధరంగమున కేగుటకై అతనిని తొందరపెట్టుట.*

బాలుండు మోహంబు ప్రకటంబుగాగ
చేవేగమున చీరచెరగొడిసిబట్టె
పట్టిననాచీరపై నున్నయట్టి
ముత్యాల చేరులు మొదటికితెగెను
చెదరిరాలినగని చెలియభీతిల్లి
చిన్నబోయెను మోము చెలువెల్లదొలగి
వెలది వెలవెలబోవ విభుదప్పుడనియె
"చింతింపవలవదు చిత్తంబులోన
అంతకుమిక్కిలి నమరింతుచీర"
అనిలేచి మోహంబు నాత్మలోనణచి
చెక్కులు కరముల చెన్నుగానిమిరి
అక్కున జేర్చుక నతివను, తాను
తిన్నగాగూర్చగా తెగిన యా సరము
చీకాకుపడజేసె చిక్కులు బెట్టె;
కాలంబు నిటువలె గడుపగామించి
జాము లేడిటిమేరజరిగె, మంచాల
బాలుతోననియెను భావంబుదెలసి
"నాతోడమసలిన నయమేమిలేదు

అతివేగమున కలని కరుగుడీమీరు
కలహపగదీర్చెడి గురుసాహసుండ
వెవ్వరెరుగరు దీని నే నెరిగియుందు
నీచేతనౌనది నిజము సత్యంబు"
అని పల్కుచుండంగ నాసమయమందు
అతిశౌర్యులగు ననుజులందరువచ్చి
తగగండువారింటి దాపుననిలిచి
ధ్వనిచేసిరందరు తామేకమగుచు
వినిబాలు "డదియేమి వెలదిరో" యనిన
"మేడపిచెన్నుని మేలైనసేవ"
అని తెల్ప నా బాలుడతివేగమునను
మౌక్తికహారముల్ మరిగూర్చసాగె
తమ్ములందరువచ్చి తత్తరపడుచు
మారెరుంగక దిరుగు మదకరులట్లు
నగరుతల్లడమంద నాతులుబెదర
భీకరంబుగనార్చి పెడబొబ్బలిడిరి
అది బాలుడాలించి యాయుధమంది
ఓడకోడకుమంచు నువిదనుబలికి
పెనుకోపమున చేత పెరికికటారి
అట్టహాసముచేసె ననుజులమీద
పలికిరి తమ్ములు బాలుతోనపుడు
"తుక్కుబట్టినకత్తి దూయుటతగపె
ఘనమగుశౌర్యంబు గలిగినచాలు
సమరకార్యము నీవు చాలించినావు
కొలువులో మీమామ కొమ్మభూపతికి
ఇల్లడనిన్నిచ్చె నెలమిబ్రహ్మన్న
అలరాజు హరిపురికరిగినమీద
పెండెంబునందెయు భేతాళమనెడు
ఖడంబుమొదలైన కలబిరుదులెల

ఒప్పించుమని నీకు నుర్వీశుడంపె
ఇనుమును రాగియు నిత్తడి కంచు
పెట్టిచేసినయట్టి బిరుదులుగావు
రజతజాంబూనదరచితమైనట్టి
వెలలేనిసొమ్ములు వెసనీకుదక్కె
సన్నుతినొందె నీసరసత్వమెల్ల
కట్టిడివాడవు కరుణలేదాయె
మనయక్కవెలలేని మాణిక్యమనఁగ
చనిపోయి కైలాసశైలంబునందు
అలరాజుగలసెను ఆశ్చర్యముగను
సరసిజలోచన చావువిన్నపుడు
దరికొనదామది దావాగ్నివలెను ?
అన్నంబునెటువలె నరుగునోటికిని
కంటికినిదుర యేగతివచ్చునయ్య
బంటుతనమ్మను పంతంబువిడిచి
బావకులపగదీర్చు పంతంబువదలి
ఇంటికినాసించు టే నీతిచెపుమ ?
బాలుడా ! మముబంపు బవరమ్మునకును
కులపగదీర్తుము గురుశౌర్యమమర
దక్కించెదము నీకు దరిలేనికీర్తి"
అనినబాలుడువిని అణకువమీర
సిగ్గుచే తలవంచె; శీఘ్రమేతిరిగి
మంచాలమందిర మార్గంబుపట్టి
పురుషునిరాకడ పూబోణిచూచి
వాకిలిపొంతకు వడినెదురేగ
అతివచేతికి బాలు డాయుధంబిచ్చె

*మాంచాల తన భర్తను దీవించి ఖడ్గము చేతి కిచ్చి బ్రహ్మహత్యా ఘటిల్లునుగాన విప్రుడమారుని యుద్ధరంగమునకు తోడ్కొనిపోవలదనుట: బాల చంద్రుడు అందుకు సమ్మతించి అటనుండి తన తల్లికడ కేగి ఆమె దీవనపొంది తమ్మునితో గలసి యుద్ధ రంగమునకు బయలుదేరుట*

నవ్వుచు దీవించె నళినాయతాక్షి
"రతిరాజసౌందర్య ! రణరంగధీర !
కమలబాంధవతేజ ! కరుణాలవాల !
వినతాత్మజునిలావు వెనసీకుగలుగు
సామీరిసమమగు సాహసంబబ్బ
అలరాజుపగదీర్చి యనుజులు నీవు
పటుతరవిక్రమప్రౌఢిచే మెరసి
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుడు
వరములొసంగగా వర్థిల్లగలరు
శాత్రవవిజయంబు సమకూరు మీకు
కలియుగంబున మీకు ఘనపూజలమరు
ఈయాయుధము నీకు నిచ్చునుజయము"
అనియిట్లు ప్రాణేశు నాశీర్వదించి
ఆయుధంబిచ్చిన నతడు గైకొనియె
బాలునితోపల్కె పణతి మంచాల
"కలహంబునకు మీరు కదలుచున్నారు
జయమపజయము నీశ్వరునకుదెలియు
విప్రు డీయనపోతు వెంటవచ్చెడిని
బ్రహ్మహత్యఘటిల్లు పాపమువచ్చు
బహుజన్మములకైన బాయదాకీడు
పరమేశ్వరుండగు పార్వతీశుండె
బాపకోలేకను బహుకషపడెను

మనుజులెంతటివారు మదివిచారించి
మగుడంగబంపు మే మాయచేనైన
అనినసంతసమంది యపుడు బాలుండు
మాంచాలవీడ్కొని మనసుచలింప
తనయింటికేగెను దండిశూరుండు
తల్లిచేనన్నంబు తానారగించి
చందనపరిలిప్త సర్వాంగుడగుచు
తగటువస్త్రంబులు తగజుట్టితొడిగి
ఛర్మమౌక్తికరత్న బహుభూషణములు
తగిన యంగములందు ధారణజేసి
తల్లికిమ్రొక్కిన తనరదీవించి
"సురనాథువిభవంబు సొంపొప్పగలుగు
వీరభద్రునిసాటి విజయంబుగలుగు
వినతపుత్రునివంటి వేగంబుగలుగు
రఘురాముకెనయైన రాజసమొప్పు
పవనపుత్రునివలె బలియుడవగుము
విచ్చేయుమ"ని తల్లి వేడుకబలికె
తగినట్టిదీవన తల్లిచేనంది
దట్టమౌకోపాన తనమొగసాల
కరుదెంచి యాబాలు డందలంబెక్కి
తల్లికి బాలుడు తగజెప్పపంపె
"భూమండలపుకోట పొందుగాగెలిచి
పడసెను మాతండ్రి పటువిక్రమమున
బలుపైన జగజంపు భద్రసాలేయ
మిప్పించుమది"యన నేణాక్షి వేడ్క
తనయునివాక్యంబు తాను పాటించి
తెప్పించి యిప్పించె దీవనతోను
రాచబిరుదులంది రణరంగమెన

కాశ్యమపురిచేర గదలంగదలచి
మేడపిపెడలెను మితిలేనిపటిమ.

*బాలచంద్రుడు అనపోతు నింటికిపంపు సహాయ మాలోచించి మార్గమధ్యమున నాగి తాను తన ముత్యాలహారమును, ఉంగరమును మాంచాల నగరిలో మరచివచ్చితినని చెప్పుచు వాటిని తెమ్మని అనపోతును పంపుట:*

అనపోతు నింటికి నన్పుపెట్టనుచు
ఒప్పుగాబాలుండు ఊహయొనర్చి
తమ్ములకెరిగించి తనమర్మమెల్ల
కనుచూపుమేరను గదలకనిలిచి
"తమకమ్ముమై నాకు దగుమోసమాయె
ఏమిచేయుదునింక నిటమీదనేను
తిరమగుపయనంబు తిరుగంగరాదు
కుమ్మరిపట్టి నాకూర్మితమ్ముడవు
వడితోడజనుము మీవదినెనుగనుము
ముత్యాలగళమాల ముద్దుటుంగరము
మరచివచ్చితి తెమ్ము మరివేగమునను"
అనినకుమ్మరిపట్టి యతనితోననియె
"అనఘాత్మ నాదేహమలసటనొందె
నడవనోపగలేను నరకుంజరుండ"
అనుడు చాకలిచందు నాలాగెపలికె
కమ్మరిపట్టి యీకరణిని చెప్పె
"మేడపికేగెద మెలతజూచెదను
రయమున మిమ్ముచేర రాలేనుసుమ్ము"
వెలమలదోర్నీని వేడనిట్లనియె
"ఈ ప్రొద్దు రాలేను ఏనలసినాను
కలయవచ్చెద రేపు కలనిలోపలికి"

కొదువయిద్దరి వేడుకొన్నంతవారు
"పోలేమ"టంచును బొంకిరిబాగ
అంతనవ్వుచు బాలుడనపోతుకనియె
"నమ్మినతమ్ముడ నయశాస్త్రవిదుడ
పేరమ్మతనయుడ పెద్దనపౌత్ర
ఒద్దిమల్లపరాజు నొయ్యారిపట్టి
అందనితరువుల నాకులుదీసి
వ్రాయుదులేఖలు వసుధేశతతికి
బ్రహ్మవంశజ లోకపావనమూర్తి
నాఆత్మసఖుడవు ననుజేరరమ్ము
గ్రక్కున మీవదినె గనబోయివేడి
ముత్యాలహారమ్ము ముద్దుటుంగరము
కొనితెమ్ముతమ్ముడ గురునీతిపరుడ"
అనిపల్కననపోతు ఆనవాలడుగ
"పెనగొన్నవేడ్కతో పీటపైనుండి
ముత్యాలుగూర్చిన మొనచీరకొంగు
చేపట్టియీడ్చిన చెఱరెముత్యములు
కనికూర్చగాబోవ కనుపడదాయె
ఇదియానవాలని యింతితోచెప్పు
హితమొప్ప సానివారింటికిబోయి
అడుగుము, ఆనవాలడిగిన తెల్పు
అరటిఫలంబుల నమరుచర్మంబు
ఫలమనియిచ్చెను పడతియావేళ
ఇదియానవాలని యెరుకగాబలుకు"
అని చెప్పిపొమ్మన్న నప్పుడే కదలి
వడి పాదఘట్టనవశమున ధూళి
జనియించి వినువీథి సాంద్రమైపర్వ
అసహాయశూరుడై యనపోతుగదలె

అనపోతు వెనుకకు మరలగా, బాలచంద్రుడు త్రిపు రాంతకమునకు వచ్చి అనపోతుకు యుద్ధరంగమునకు రావలదని ఆనలుపెట్టుచు లేఖవ్రాసి ఒక రావిచెట్టు కొమ్మకు కట్టి తాను నంగొండ చేరి అట విశ్రమించుదు·

బాలుడు బ్రాహ్మణు బహుసేర్పు మెరయ
మాయమతంబున మగుడనంపించి
తమ్ములు తానును తడయక కదలి
కడు వేగ త్రిపురాంతకమునకు వచ్చి
అచ్చోటకూర్చుండి యనుజానిపంపి
తెప్పించిగంటంబు తీరైనయాకు
తన హస్తమునవ్రాసె తగినట్టిలేఖ
అది రావికొమ్మల కంటగట్టించి
వీరులేగినత్రోవ వెంబడినడచె
పల్లెలవారెల్ల బాలునిచూడ
చనుదెంచిరంతట సంతసంబొప్ప
ముటుకులకాపులు మ్రొక్కుచుననిరి :
“విందారగింపుడు విశ్రమింపుండు
తరువాతతరలుట తగుశకునంబు
వినుమ”న్నవారితో వీరుడుపలికె
“కార్యమపురమున కదిసెనుపోరు
ఉండరాదిక్కడ నుండుడు మీరు”
ఈరీతినని వాలుడేగెనావేళ
గరికెపాటుననున్న కాపులువచ్చి
కనిమ్రొక్కినంతలో ఘనుడువారలకు
పోకలాకుల నిచ్చి“పొండ”నిపంపె
మేళ్ళవాగుకువచ్చి మిక్కుటంబైన
తమితోడబాలుడు తమ్ములుతాను
పోటుమూకలవెంట బొబ్బరింపంగ

ఘనశైలగహనముల్ కనుమలు గడచె
తార్క్ష్యుండు గిరులపై దాటినయట్లు
భానుకై రాహువు పరువిడినట్లు
భయవర్జితుడైన బాలుడార్చుచును
పరదళంబులు విన్న భయములు మించ
నరసింగరాజును నయమొప్పమదిని
కలపగకొరకుగా గురిచేసినిలిపి
కొదమసింగంబులు కూడినభంగి
అనుజులు తనవెంట నరుగుదేరంగ
కురువకునేతెంచె గురుశౌర్యమమర
ఎక్కెను నలగొండ కెదురేమిలేక
కనెను కార్యమపూడి కదనరంగంబు
కుమ్మరిపట్టిపై కుడిహస్తమూని
వెలమలదోర్నిని వెసచేరబిలిచి
"వీరుడౌ అలరాజువిభుపగదీర్ప
వచ్చియెక్కడ బోవవలవదుసుమ్ము
వెనుచిక్కివచ్చెడి వీరులౌభటులు
కలయవచ్చినదాక గడియకాలంబు
విశ్రమింత"మటంచు వేడ్కతోనిలిచె.

*నాయకురాలు మలిదేవుని చెంతకు సంధికై రాయబారులను పంపుట: మలిదేవాదులు సంధికార్యమునకు సమ్మతించుట.*

నలగామకొలువులో నాయకురాలు
మదిలో విచారించి "మంచివారలను
వారున్న తావుకు వలనొప్పబంపి
బవరంబుగాకుండ పట్టుతే మేలు"
అనిపెద్దలైనట్టి యాప్తవర్గంబు
కొండయన్నమరాజు కోటకేతన్న

తగుమాడుగులనుండు తగవరిరెడ్డి
పరమాప్తుడౌ చింతపల్లి రెడ్డియును
మొదలైన సుపచారముఖ్యులైనట్టి
చనవర్ల బిలిపించి సమబుద్ధిననియె
"బాహాపరాక్రమప్రాభవులైన
వీరులు రాజులు వెలయుచున్నట్టి
కొలువులోనికిబోయి కూరిమిమెరయ
సమరంబుగాకుండ సంధియౌనట్లు
మాట్లాడి యటమీద మాచెర్లభాగ
మేలుకొమ్మని చెప్పు డింకొకమాట
నాయునియెదుటకు నరసింగుదెచ్చి
కులపగకిత్తుము కొమరొప్పమేము
ఒక్కటైయుండంగ నొప్పించిరండు
మగిడిపోవలయును మనదేశమునకు"
అని వీడుకొలిపిన నంతటవారు
పయనమై యేతెంచి పట్టపురాజు
మలిదేవు దర్శించి మన్ననబడయ
చెలువొంద జోహారు చేసిరందరును
కూర్చుండనియమించె కుంభినీశ్వరుడు
వచ్చినవారలు వారితోననిరి :
"ఇదియేమి కలనిలో విన్నాళ్ళు మీరు
తడిసిశిరిచటికి తడవాయెవచ్చి
ఏమికార్యమొ మాకు నెరిగింపుడ"నిన
"మీరెరుంగని కార్యమేమి యున్నదియు
తెలిసియు నడిగిన దెలుపగావలెను
సంధికార్యమునకు జనులెల్లనెరుగ
అలరాజునంపిన హతముజేసినది
అతని కులపగదీర్ప నర్వదేగురును
ఉన్నారు వీరులు నుగ్రకోపమున

నలగాముతమ్ముడు నరసింగరాజు
తలగోసికొనిపోవ తగు తమకనుచు
బలువీరులిందుకు పంతంబుజేసి
నిలిచిరిరణభూమి నిశ్చయంబుగను
ఎత్తివచ్చినవార లికబోవరాదు
సమరంబుచేయుటే సంతోషకరము
బ్రతుకు లస్థిరములు పడుటసిద్ధంబు
సంపదల్ నిలువవు జలబుద్బుదముల
అనిచేయ మీరెల్ల నాయత్తమగుచు
పరువునరండ"ని పలికె బ్రహ్మన్న
విని కోటకేతన్న వివరించెనిట్లు :
"వినవయ్య నాయుడ విన్నవించెదను
అతివివేకులు మీర లఖిలరాజ్యముల
మీకుసమంబైన మేటివిక్రములు
నీతిమంతులులేరు నిశ్చయమిదియు
కలపగకై మీరు కోరినయట్లు
నరసింగరాజును నయముతోదెచ్చి
ఇచ్చెదమటమీద నేమైనలెస్స
సంరక్షచేసిన సంహారించినను
భారంబు మీయందు పాదుకొన్నదియు
మునుపటిరీతినే ముదమొప్పమీరు
మాచెర్లయూళ్లెల్ల మక్కువనేలి
సంరక్షచేయుడీ జనములనెల్ల
ఉభయరాజులు మీరలొక్కటైయున్న
మావంటివారికి మానసంబలరు
అఖిలాధిపతులు మీయాజ్ఞచేయుదురు
మీరెరింగిననీతి మేమెరుగలేము
ఉభయసంస్థానంబు లొక్కటేమాకు
అనుగురాజేంద్రుడు హరిపురికేగు

సమయంబునను పుత్రచయమునుదెచ్చి
మీకునప్పనజేసి మేనుచాలించె
తరువాత నిర్వాహదశయెల్ల మీది
ఒకయిల్లు రెండుగా నొప్పజేసితిరి
అడ్డుమాటాడిరా యపుడు మీయెదుట
మతిచెడి యీమధ్య మనసులుగలగె
ఇందుచే పగహెచ్చె నీర్ష్యలుగదిరె
'కోడిపోరాడుట కూడద'టంచు
ఇచ్చతోజెప్పిన నెవ్వరువినరు
గురజాలకేతెంచి కోడిపోరాడ
ఎవ్వరువచ్చిరి ఇదియేమిమాయ
గతజలంబుల కడ్డుగట్టినరీతి
నెవ్వరిదూరగ నేమౌనుచెపుమ ?
సకలరాజుల నాజి సమయంగజూచి
తగనొక్క మలిదేవు దక్కించుకొన్న
మేలేమి ? యేకీర్తి మిమ్ములనంటు
తల్లులువేరైన తండ్రియొక్కండె
సవతిపుత్రుల కిపుడు సంధియొనర్ప
మభయమిమ్మికార్య మనుగురాజాన
నీయాన, మేమింక నిలువమిక్కడను"
విని వారిపల్కులు వీరు లిట్లనిరి :
"పాపంబుజేసిన పగవారువచ్చి
కనుపడ శిక్షించ కర్తవ్యమగును
సహసంబుజూపిన సకలభూజనులు
'భయపడిరం'చును పరిహసించెదరు
పగవారియెడ దయ పాటింపదగదు
హతముజేయుట మంచి దనువైనవేళ
భాండంబునెగబట్టి బలురాతిమీద
వేసి పగిల్చినవిధమునమించి

తరిచూచి శత్రుని దండించవలయు
హస్తగతుండైన నధికశాత్రవుని
బొమ్మని విడిచియు పోరాడు బెంచ
చెట్టెక్కి ఫలమును చేనంటిచూచి
వేగమె దిగి రాత వేసినట్లగును"
తెంపున వీరులు తెగనాడినట్టి
మాటలు విని కొమ్మమనుజేశుడనియె
చెవులు రెండును మూసి శ్రీకంఠుదలచి
"చేతికిచ్చినవాని ఛేదించినట్టి
పాపంబునెటువలె బాపుకోవచ్చు
శరణనివచ్చిన శత్రువునైన
కాచిరక్షించుటే ఖండించుటరయ
సంరక్షచేయక చంపినందునను
ఇహముననిందింతు రెల్ల వారలును
పరమున నరకంబు ప్రాప్తించునమ్మ
పగవానితమ్ముడు పదముల వ్రాల
రక్షింపడా మున్ను రామభూవిభుడు"
అని భానుకులనాథుడాడుమాటలకు
మనసులో కోపంబుమాని నాయకులు
సంధికార్యమునకు సమ్మతులైరి.

*దోర్నీడు బాలచంద్రునకు శిబిరంబునకు హద్దులు చెప్పుట: అతడు రాజదర్శనార్థము నలగొండదిగుట.*

అటవీరవరులకు హర్యక్షుడైన
బల్లరగండడు బాలచంద్రుండు
నలగొండపైనుండి నాలుగుదిశలు
పరికించికనుగొని భావముప్పొంగ
వెలమదోర్నీనితో వివరించిపలికె
"ఎరిగియుండుదువె నీవిశిబిరంబు

అడిగెద గురుతుగా నదిచెప్పవలయు"
అనినదోర్నీడనె నాబాలుతోడ
"చెప్పశక్యముగాదు సేనలతెరగు
పెలయుజలనిధి వెల్లివిరసినయట్లు
నలగామభూమీశు నమ్మినదళము
ఉన్నది నామది యుత్తలపడెను
ఇసుకచల్లిన బడుట కెడమేమిలేదు
నేలయీనినరీతి నిలచియున్నదియు
చుట్టుకొండలనడుమ చూడనొప్పుచును
రణవీరరంగంబు రంజిల్లసాగె
పారెడునురవుచే పగుల భూధరము
నాగాధిపతిబ్రతుకు నష్టంబుచేసి
నడుముగా పారిన నాగులేరాయె
కన్నులపండుపై కనిపించునదియె
ఉభయకూలంబుల నుర్వీశుబలము
నివసించియున్నది నిశ్చలమతిని
హద్దులుచెప్పెద నవి చిత్తగింపు
జువ్వలకల్లను సొగసైనపల్లె
సన్నెగండ్లనుపేర జవరనయూరు
తూరుపుదిక్కుకు తుదిమేరసుమ్మ
దక్షిణదిశహద్దు తగవినుపింతు
నాగులేటికితూర్పు నలగొండదాక
చెలువైన యా వప్పిచెర్లనుపల్లె
పడమటిహద్దు ఓ బాలుడవినుము
కొదమగుండ్లనుపేర గురిగ్రామమొకటి
ప్రజలమేలిమి చింతపల్లియునొకటి
ఉత్తరదిశయెల్ల ఒయ్యనగాంచు
ఇకకొన్ని గురికొండలెంచెదవినుము
జన్నిదేవరగుళ్ళ సవనాలమేడ

వంగతోటలబైలు వన్నియకెక్క
సింగభూపతిచెరువుశ్రీకరమైన
సంగడిగుళ్ళను సర్వేశుడైన
ఉత్తరేశునిగుళ్ళ నూర్జితాకృతిని
ఉయ్యాలకంబంబు నున్నట్టితావు
గరుడకంబముదాకి కలజువ్విచెట్టు
నల్లగొండనుహత్తి నాగులేరంటి
విడిసియున్నది దండు విభవంబుతోడ
ఆశ్చర్యమైదోచె నది యేమొ మదికి
నరనాథుడైనట్టి నలగామరాజు
ఘనగుడారముచుట్టు కనిపెట్టియున్న
సేనాధినాథుల చెప్పెదవినుము
పడమటిదిక్కున పౌజులబ్రహ్మ
సంకోజిగణపతి సరవితూర్పునను
నాయకురాల్ రెడ్డి నవవిక్రమమున
దక్షిణభాగాన దంటయైనారు
అందెలరాముండు అనేమిపురము
ముమ్మడిరెడ్డియు మొనమీరినట్టి
పొందుగులనునేలు భూరివిక్రముడు
వీరమల్లనునట్టి విఖ్యాతుడొకడు
ఉత్తరభాగాన నుండిరివేడ్క
ఇందరినెల్లను హెచ్చరించుచును
తిరుగుచు నరసింగు ధీరుడైయుండె
విక్రమసింహంబు వీరకామేంద్రు
డాప్తమౌబలముతో నామధ్యవిడిసె
మహితబలుండైన మలిదేవుసేన
మారొక్కనియున్నది మనసుంచి కనుము
ఘనమైనతురగముల్ కాలిబలంబు
బిల్లానిపెట్టెలు బలువీరవరులు

మహిని నాగులయేటి మడుగెండజేసి
పలనొప్పుచున్న రేవంతులపై లు
పడమటితటియందు పట్టుచాలఁగను
పరవీరభయదమై బలమెల్ల విడిసె
మనవారితోసాటి మహినెవరులేరు
ఒక్కొక్కవీరుడె యొక్కొక్కలక్ష
దళమునుసమయింప దగియున్నవాడు
చెలువైనపలగాము సేనకునెదిరి
మనబలమున్నది మహిమమీరంగ"
అనితెల్పుదోర్నిని కనియెబాలుండు :
"బలమెల్ల సాంద్రమై బహుదూరమునకు
క్రిక్కిరిసియున్నది కినిసిచూచినను
ఎక్కడనెడలేదు ఇసుమంతయైన
మార్గంబుగనరాదు మదివిచారింప
ఆలస్యమిచ్చట నాయెనామనకు
అపకీర్తిపాలౌదు మాడికెవచ్చు
తెంపుననొకదిక్కు తెగటార్చికొనుచు
శౌర్యసంపదమీర చయ్యనబోయి
కలసినవీరులు కలహించిమనల
ఎంతకోపింతురొ యెట్లుపల్కుదురొ
'అరువదేగురును తా మటులుండగానె
పడుచుతనంబున బాలుడుమించి
ఎంగిలిచేసెను ఎదుటిబలంబు
ఏమందుమీపట్ల నీపిన్నవాని'
అనినిందజేతురు ఆరడియౌను
తెగనికార్యంబాయె తెలియదుమనకు
ఇరుగడల్ వారల ఇచ్చలీవేళ
ఎటువలెదెలియును ఎవరుచెప్పెదరు
సంధికార్యంబిట సమకూడెనేని

విచ్ఛిన్నమైపోవు వేడుకయెల్ల
'పొందినకార్యంబు పొసగంగనీక
పగతెచ్చెవీడ'ని ప్రజలాడగలరు
నవ్వరేరాజులు నామోముమీద
'ఛీ' యనిరోతురు సిగ్గెల్లబోవు
నాతండ్రి కొడుకని నన్నుచేకొనడు"
అనిపలువిధముల హర్షంబుతగ్గి
పలుకంగసఖులెల్ల బాలునితోడ
"వినుబాలచంద్రుడ విద్విషద్భయద
పరశురాముడవీవు బాహాలబల్మి
పరగజహర్యక్ష పావనమూర్తి
శౌర్యగంగాధర సర్వజ్ఞమౌళి
బ్రహ్మన్నసుతుడవై భాసిల్లుచుండి
ఈనిందబడుటకు నేమిఫలంబు
కూర్మితోపెదమల్లు కొలువులోజొచ్చి
వీరులగనుగొని వేడ్కమైమ్రొక్కి
'కులపగ దీరచికొనవలె భూమి
పోనివ్వగూడదు పోరునిశ్చయము
కలనిలోమీరున్న కారణంబేమి
అనతిండ'నివారి నడుగంగవలయు
'కామునితో సంధికార్యంబుచేయ
నున్నారమితరంబు నొప్పదుమాకు'
అనిమాటలాడిరా, యావలబోయి
దర్శింతమప్పుడు ధరణీశవరుని
రాజుపంపంగబోయి రణమొనరించ
ప్రాప్తమౌదేవేంద్రపట్టణవాస
మ"ని పల్క బాలుండు హర్షంబునొంది
శైలంబుపైనుండి సాహసంబునను
గిట్టురెక్క భూమిపై భీతిల్లనృపులు

తురగముల్ గజములు ఘోషిమిన్నులము
బంధంబులూడ్చుక పరుగులు పెట్టె
తరితీపునొందియు ధైర్యంబువదలి
బలమెల్ల భయపడి పారంగసాగె
బలుపైనమందరభ్రమణంబుకతన
కలకచెందినయట్టి కంధిచందమున
దండెల్లనీరీతి దత్తరమొందె
తమ్ములుబలమును తనవారలెల్ల
కలసిరి బాలుని ఘనమోదమునను.

*సభాస్తారులను త్రోసికొని మలిదేవుని కొలువున ప్రవేశించిన బాలచంద్రుని కన్నమ అడ్డగించుట: బాలచంద్ర కన్నమదాసుల వివాదము: బాలచంద్రుడు మలిదేవుని సమీపింపగా అతడు తనవంక చూడనందు లకు బాలుడు మలిదేవుని దూషించుట: గండుకన్నమ అతనిని శాంతింపచేయుటకై ప్రయత్నించుట: బాల చంద్రుడు వీరులను యుద్ధమునకు పురిగొల్పుట: కొమ్మరాజు బాలచంద్రుని శాంతింపచేయగా అతడు సంధి కంగీకరించుట.*

అంతట నాబాలు డధికశౌర్యమున
పరిఘముల్ ఖెక్కెముల్ భద్రసాలేయ
జగజంపుఛత్రంబు జయమునగొన్న
సకలమౌబిరుదులు సరసరంజిల్ల
భయదమై నరసింగుపాలిటి మృత్యు
వీరూపమునవచ్చి యెదిరించెననగ
“తొలగుడీ తొలగుడీ దూరించిపొండి
ఎదురు నిలువకుడం”చు హెచ్చరించుచును
బలములన్నిటిని పారదోలుచును
మలిదేవుగొల్లెన మార్గంబుపట్టి

చనుదెంచుచందంబు చయ్యనజూచి
సంధికార్యమునకు చనుదెంచినట్టి
దొరలమొగంబుల తొలగెతేజంబు
వెలవెలబారుచు వేడుకలుడిగె
ఒకరొకరిమోముల నొయ్యనజూచి
"ఇకనేమిచక్కటి యేమికార్యంబు
ఇతడురాకుండిన నెసగునుసంధి
ఇకసాగదెవ్వరి హితవిచారంబు
దైవకృతం బెవరు తప్పించలేరు"
అనిచింతచేయుచు నక్కటాయనుచు
కడతొలగినిలిచిరి కడుచిన్నబోయి;
మలిదేవభూపతి మంత్రియైనట్టి
బ్రహ్మన్నతమ్ములు బంధువర్గంబు
సమరసంతోషులౌ సకలవీరులును
కొలువుగొల్లెనలోన కూర్చుండిరెలమి
రాయబిరుదులతోడ రంజిల్లుచున్న
బాలచంద్రుండంత ప్రాభవంబొప్ప
తమ్ములుకొలువగ తరగనివేడ్క
వనజాప్తసుతురీతి వచ్చెనాసభకు
నాయకులుగ్రులై నాయునిసుతుని
భూవరుదర్శింప బోవ సందీక
ఉన్నభావము బాలుడొయ్యనదెలసి
"సౌందర్యసాంద్రమౌ జగదీశుకొలువు
కనుగొంటి సంతోషకలితుడనైతి
వసుధీశుకనుగొను వాంఛయున్నదియు
తెరువియ్యవలె మాకు ధీరాత్ములార"
అనుమాటవినరైరి అటనున్నవారు
బాసదబ్బరగండ బ్రహ్మన్నసుతుడు
వాసిగ రేచర్లవంశవర్ధనుడు

పదములుదట్టించి బాహువులెత్తి
సాహసోత్సాహుడై శౌర్యంబుమెఱయ
కలికిసింగపుకొదమ గంతుగొన్నట్లు
కుప్పించిపై కెగసి గురుజవమొప్ప
వసుధేశుసముఖాన వ్రాలెనువేగ
పిడుగుపడ్డవిధంబు పృధివికంపించె
సభలోననిల్చుండి జగదీశుజూచి
అతిభక్తిమ్రొక్కిన నటుమొగమాయె
కడుభయభ్రాంతుడై కరములుమోడ్చి
"ఏమిచేసితిరాజ ! యేలకన్గొనవు
నావల్లతప్పేమి నన్నేలురాజ"
అని ప్రార్థనముసేయ నాకొల్వులోన
గాసిల్లుకన్నమ కడురోషవశత
ఉలికిపాటునలేచి యుగ్రుడై మెరసి
ఘనరౌద్రభరితుడై ఖడ్గంబుదూసి
చయ్యనజళిపించి సభజూచిపలికె :
"కంటిరా బాలుని గద్దరిపనులు
తనసాటిబలియుడు ధరలేడటంచు
మత్తిల్లి మరచెను మావంటివారి
చులకనైతిమి వీనిచూపులకేము
దండిశూరులుచూడ దట్టించినేను
ఖండింతునో నిన్ను గనియలుగాగ
ఏపాటిబంటువో యీవుమాకన్న
మాపేరువిన్నంత మదిలోనబెగడి
ఉభయబలంబులు నలుకుచునుండు
సభలోననీయున్కి సహ్యంబుగాదు
సరసుడవౌదువు చనుమువేగంబె"
అనవిని యాబాలు డప్పుడిట్లనియె :
"బంట్లుమీరలుగాక బవరంబునందు

మేమేడబంట్లము మీసాటిగాము
సరిగబంచినయూళ్లు సర్వంబువిడిచి
విపినశైలంబులు వేసటలేక
తిరిగితిరెవ్వరు దీటులేరైరి
వాగులనీళ్ళను వనములపండ్లు
తినుకొంచు మితియైన దినములన్నియును
జరగగాజేయుచు సమరమ్ముమరచి
ఉన్నందుచేతను నురుపైనవాడి
తూలకత్తులకెల్ల త్రుప్పలుబట్టె
బాపుకొనగామీకు బవరంబులేదు
పగవారు కన్నులబడకున్నవారు
పగచేసి మమునరికి బాపుకోత్రుప్పు
సభలోన నేనిట్లు చౌకళించితిని
ధరణీశుబొడగాంచ తా వచ్చునపుడు
ఎవ్వరునెడమీయ రేనీతిచెపుమ !
పంతంబుచెడి నేను బ్రతిమాలలేక
ఒయ్యన మీదుగా నురవునజనితి
తప్పేమి నావల్ల తగవర్లనడుగు
కులపగకై వచ్చి కూర్చుండుటేమి
పరభూములందెల్ల పరువులువారి
వనములకృశియించి వచ్చినందునను
మేనునబడలికల్ మీరెనాయేమి
అటువలెబడలికల్ అందెనామీకు
పగవారివిస్తళ్లు బండికండ్లగును
భావించికొనదగు ప్రౌఢులు మీరు"
అనిన కన్నమ పలికె నాబాలుతోడ :
"పడుచువాడవు నీకు పలుమాటలేల
కొలువులో మాటలు గుర్తెరిగిపలుకు
ఈతీరుపలికిన ఈశక్తిచేత

తలతెగవేయుదు ధరణీశునెదుట"
అనిన తామసమణచి యపుడుబాలుండు
కులశైలధీరత గొబ్బునపలికె
"కడలిమధ్యంబున గడ్డయున్నట్లు
చేరిశత్రులనడుమ చిక్కియున్నారు
మున్నీరుపెరిగెనా మునుగునుదిన్నె
శాత్రవబలములు సమయంబుచూచి
నద్దిక్కులనుద్రొక్కి నడచినవేళ
ఏమౌదురో మీరలెరుగకున్నారు
ఇదివిచారింపక యేలవచ్చితిరి
మీరుమాత్రమెరాక మేదినీశ్వరుని
ఇటకేలదెచ్చితి రిందఱుమీరు
ప్రజలాడికొనుటలు పరికించివినరు
గొల్లెనలోజేరి కోపంబుచేసి
వదరెదవిందుల ఫలమేమిచెపుమ
ఎలమినాయుని కీవు నేమిగావలెను
వినిపింపు కన్నమ వివరంబుగాను"
అనిన కన్నమదెల్పె నాతనికిట్లు :
"నాయుడు విష్ణువు నారాయణుండు
ఆయన వరమిచ్చె నధికమోదమున
తగపుట్టితిని నేను తల్లిగర్భమున
పరమదయాళుడౌ బ్రహ్మన్నకేను
పాదసేవకుడనై పరగినవాడ
భుజములముద్రలు పూనినవాడ
క్షుద్రమార్గుల నెపుడు చూడనివాడ
ప్రసాదజీవినై ప్రబలినవాడ
జ్యేష్ఠపుత్రుడనంగ చెలగినవాడ
దట్టించిపలికేవు ధరణీశునెదుట
పుట్టితివెనుకను పురుషోత్తమునకు

పడుచుబంటవు నీకు పలుమాటలేల"
అనవిని యాబాలు డప్పుడిట్లనియె :
"చెలగి బ్రహ్మన్నకు జ్యేష్ఠపుత్రుడవు
తలదన్ని పుట్టిన తమ్ముడనేను
కదిసి యగ్రజుతోడల్ గద్దెలుచేసి
త్రొక్కుచుబోవచ్చు తోడరినకూర్మి
ధరణీశుపొదగన దాటిపోయితిని
అంతమాత్రమెకాని హంకారమెరుగ"
అనిపల్క కన్నమయటుతలవంచి
భైరవఖడ్గంబు పడవైచిధరను
చిరునవ్వునవ్వుచు చేరి బాలుణ్ణి
ఒనరంగనెత్తుక యుర్వికిదించి
"తప్పునాయెడనుండె తమ్ముడా" యనెను
ఆమాటవిని బాలుడనుజులుదాను
భూమీశుముందర పొందుగానిలిచి
జోహారుచేసిన చూడకారాజు
ఊరికె తలవంచియుండెను బాలు
డందుకు వెరగంది యనుజులకనియె :
"తెలిసెనా ధరణీశుతెరగెల్ల మీకు
పగతీర్చుకొరకుగా బవరంబుచేయ
మూణ్ణెల్లు మితియని మున్నాడెరాజు
మదిలోన నామితి మరచియున్నాడు
ఎండకన్నెరుగడు ఈరాజుమున్ను
అవనెల్ల పగవారికప్పనజేసి
కాననంబులదిరిగి కాయంబుడస్సి
నీడలనిలచిన నీళ్లెల్లద్రాగి
పొలపుకూరలు చాల భుజియించెగనుక
పసరుకన్నులకెక్కి పలుకకున్నాడు
మంచిమందిచ్చిన మానునువేగ"

అనిపల్కుమాటల కదురుచు గండు
కన్నప్ప యల్లునికని కోపమునను
భర్జించినీతియో పలుకులననియె
"ఇటువంటి మాటలనేమిఫలంబు
తప్పెల్లమనయందు దంటయైనిలచె
ఎటువలెనంటివి ? ఏనెరిగింతు;
పగవారిచర్యలు భావమందెరిగి
కులపగదీర్చుటకొఱకు మేమెల్ల
వచ్చుటతగపైన వసుధేశుసీటకు
తెచ్చుటయొకతప్పు, త్రిపురాంతకమున
రణనిశ్చయముజేసి రణకంబమిటకు
తర్లింపరెండవ తప్పౌటదెలియు
కంకణంబులపల్లెకడ కూరుచుండి
కంకణంబులు చేతగట్టుటమూడు
తెగిరణభూమిలో దిగుట నాల్గవది
తరిమిశత్రువువచ్చి తార్కాన్నమీద
కలయవిచారించు కార్యమైదవది
ఈ యైదుతప్పులు ఎవ్వరివయ్య
మనలనంటుకవచ్చె మదివిచారించు
ఎటువలె నోరాడె నీరాజుబలుక
ఐదుమిక్కుటముల ఆరులుబెంపైరి
అవియునుజెప్పెద నలరంగవినుము
కోడిపోరునగెల్చుకొనుట మొదలిటిది
పనులకుపంపుట వరుసరెండవది
అలరాజుజంపుట నరయమూడవది
మంచికై భట్టును మనపంపినపుడు
వెళ్ళదోలించినవిధము నాల్గవది
కూటువమూకల గూర్చుకవచ్చి
గర్వించినిలిచిన కార్యమైదవది

ఎక్కువతక్కువ లిటువ లెనుండ
తెలియక ధరణీశ తెగిమాటలాడ
అపరాధమంటును అదినీతిగాదు
ఎక్కువమాటల నికనాడబోకు
మనసురాకుండెనా మగిడిపోనీవు"
అనిపల్కుమాటల కా బాలుడనియె :
"మేరదప్పిరటంచు మీరుబల్కితిరి
మేటిబ్రహ్మనవాకు మితిదప్పరాదు
చుక్కలురాలిన సూర్యుండుతప్పి
పడమటబొడిచిన పాథోధిమించి
మితిగట్టుదాటిన మిగులదావాగ్ని
చల్లనైపోయిన సత్యసంధుండు
నాయనిమాటకు నమ్మికగలదు
పగవారిగినియుచు పలికితినీవు
ఇటువంటికార్యంబు లెందుకుజరుగు
పగవారిసేనలో బలువిడిజొచ్చి
దగ్ధంబుచేయుదు దావాగ్నిరీతి
చిన్నవాడంటిరి చెలగియీకలన
అలనాడుగురజాలనయినట్టిపగకు
చేపట్టియిల్లడ చేయగాలేదె
అపుడుబాలుడగానె నఖిలభూపతుల
నెదిరియుద్ధముచేయ నేనిల్చినపుడు
అవినీతివాక్యంబు లాడితివెట్టు
వినగూడదీమాట విడువుముచాలు"
అనిచెప్పి సభవారలందరు వినగ
మలిదేవుసన్నిధి మరియునుబలికె :
"ధీరాగ్రణీ ! వంకిదేవరాజేశ
శంకింప నేటికి సమరంబుగదిసె
తీరనిసుద్దుల తెగజాలదేది

ధనువు శింజినిగూర్చి ధ్వనిచేసినపుడు
బ్రహ్మాండభాండముల్ పగిలినట్లుండు
ఎనలేనివిలుకాడ విటువంటినీవు
తనయునిచావుకు తాళితివెట్లు
ఆవాలనాయుడా యపుడుపంతములు
పలికిననీవేల పరవశమంద
ఏముఖతలేనట్టి వీరుడవీవు
కానెనుకట్టితి కత్తిపట్టితివి
పగసీగలేనట్టి పౌరుషంబేమి
మితి మూడునెలలాయె మిన్నకున్నావు
నీవంటి జగజెట్టి నే జూడలేమ
మామకన్నమనేడ మగటిమియేది
కదలనికంబంబు కాలిసంకెళ్ళు
పొందించి చావుకై పూనినిల్చితిరి
కంబంబుచెదలంటె కదిలించిచూడు
సుంకరరాముడా చుట్టుడొంకెనలు
తుక్కులుబట్టెను తొడరవిదేమి
చెవులనాయకులార చెలగెడుబంట్లు
ఇచ్చగించరుమీర లెంగిలిపోటు
నమ్మినజంగిలి నాయకులార
మెచ్చరురణమున మేటిశూరులను
తగుజల్లికేడెముల్ దండచక్రములు
పొగబట్టె పోరయ్య పోరుమీకేల
పేరైనబంట్లగు పెనుమాలవార
గాయగోవాళాఖ్య గలబిరుదులెల్ల
పగతులగననీక పాతుడీభూమి
బాదన్నరాహుత్తు బడియెందుబోయె
సంపెటనారన్న జయమగుబిరుదు
లెక్కడబోయెను ఎందుదాగితివి"

అనిబాలుడుగ్రుడై యదలించిపలుక
విని బ్రహ్మనాయుడు వేగమెలేచి
తనయున కెదురేగి తగగౌరవించి
అర్ధాసనంబున నాసీనుజేసి
వలనొప్పదంటగా వచ్చినవారి
కొలువుకు పిలిపించి "కూర్చుండు" డనిన
కూర్చుండిరందరు కూరిమిమెరయ
కూరిమివారల కుశలంబులడిగి
తమకార్యమంతయు దగవినిపింప
వినిబాలు డీర్ష్యతో వివరించిపలికె
"పగవారు అలరాజు పట్టిచంపంగ
కోపంబుమదిలోన గూర్చుటమాని
పందమాటలుపల్క పంతమామీకు
భయదోగ్రసంభూత పటురోషవహ్ని
భస్మీకృతాఖిల పరరాజవిపిన
బ్రహ్మన్న నాతోడ పలుకకుమీవు
ఓడకరాజుచే నొప్పించి యిపుడె
నాచేతిహేతిచే నరసింగరాజు
తలతెగవ్రేయుదు ధరణీశునెదుట
సత్యంబు పలికితి శంకనాకేల"
అన కొమ్మభూపతి యల్లునిజూచి
వినయంబుతో చెట్ట విడువకపట్టి
"నాయన్న వినవయ్య నలినాప్తతేజ
చనిరాయబారంబు శత్రులచేత
పరగజచ్చినవాడె బాలుడుసుమ్ము
అరయమాసుతుడైన యలరాజువీవె
చలపట్టిపోరాడ శత్రులబిలువ
వచ్చిమనలజూచి వారనిభీతి
బిరుదులుబో విడిచి పిరికిపారుచును

హీనుడై తమ్ముని నిచ్చినయపుడె
క్షత్రియజాతికి చచ్చుటేసుమ్ము
చేతికిచ్చినశత్రు చెలగిచంపంగ
బహుపాతకంబని పలికెవేదములు
ఎన్నిజన్మలకైన నేక్రియనైన
పాయదుపాపంబు పట్టిపీడించు"
అని యితిహాసంబు లతనికి జెప్పి
కౌగిటజేరిచి కడుబుజ్జగించి
"సాహసంబెల్లను చాలింపుచలము
మనసునబెట్టక మాటవిను" మనిన
తగవిని బాలుండు తలవంచియపుడు
చలమెల్లవిడనాడి సంధిమేకొనియె
తరువాతకొందరు దర్పముల్ మీర
'ఏచేటుపాటైన నేదిమాకేల
విందులుభుజియించి వేగమేపురికి
పోవలె జాప్యంబు పూనకుడ' నిరి.
ఒప్పినమతులచే నుభయత్రవారు
అత్యంతసంతుష్టులై యుండిరంత.

*బాలచంద్రుని పనుపున అనపోతు, మాంచాల నగరికి పోయి, బాలచంద్రుని ఆభరణము లిమ్మని అడుగుట. అతడు తన ఆభరణములేవియు మరువ లేదని చెప్పి మాంచాల అనపోతును యుద్ధమునకు పోవలదనుట: అనపోతు వేశ్యాంగనగృహమున తేగి అట బాలచంద్రుని ఆభరణములు లేనందున హతాశుడై కార్యమపూడికి బయలుదేరి త్రిపురాంతకమున బాలచంద్రుడు వ్రాసియుంచిన లేఖను చదివి పలువిధముల దుఃఖించుట: మేడపినుండి వచ్చుచున్న గరికెమాడచి అను నొక వనిత మార్గమధ్యమున*

*అతనిని చూచి యొంటరిగ నుండుటకు కారణమడుగుట: బాలచంద్రుడు యుద్ధమునకు రావలదని తనపై ఆజ్ఞ విధించినందులకు అనపోతు తన బ్రతుకును రోసి తన జందెమును, బిరుదును అతనికిమ్మని మాడచికి అప్పగించి ప్రాణత్యాగము చేయుట; అనపోతు తల్లిదండ్రులు తమ పుత్రునికై విలపించుట: అనపోతు దహనసంస్కారము.*

అచ్చట మేడపి కనపోతుచేరి
మంచాలనగరికి మక్కువనేగి
వినయంబుతోడ నావెలదినిజూచి
"మంజులభాషణ ! మహనీయసుగుణ !
రమణి నేవచ్చినరాక వినవమ్మ
అన్నబాలుడుపంపె నతివ 'నీవద్ద
ముత్యాలహారమ్ము ముద్దుటుంగరము
ఉన్నవితెమ్మ'న్న నౌన వచ్చితిని
మరచినవస్తువుల్ మాచేతికిమ్ము
పరిగెబోవలె నేను బాలునికడకు"
అనిన నా యనపోతు కనియెమంచాల:
"ఏమానవాలయ్య యిందులక"నిన
"కూరిమిపాన్పుపై కూర్చుండితాను
పైటకొంగెడమచే పట్టిలాగినను
చెదరిముత్యపుచేర్లు చెదరిరాలినను
అవికనలే దిది యానవాలమ్మ"
అనవిని మంచాల "యౌనయ్య సకల
శాస్త్రముల్ వేదముల్ చదితివిగద
ఎరుగలేకుంటివా యీమర్మమీవు
తమ్ములుబిలిచిన తరితీపుతోడ
విడివడ్డముత్యముల్ వెదకికూర్చంగ

సావకాశములేక చనియెమీయన్న
మాటతెలివిడి నీవు మదివిచారించు
కారణమేలేదు కలనికిబోవ
మీయన్నబాలుని మితిచేసివారు
పరగమూడునెలలు పట్టంబుగట్టి
వెళ్ళెనుమితియంచు వీరులగలయ
చనియెనుబాలుండు సమరంబునకును
వీరమేడపి నీవు వెలయరక్షింప
పట్టంబుగట్టెను బాలచంద్రుండు
అటుగాన కలనికి నరుగంగవలదు"
అనవిని బ్రాహ్మణు డత్యుగ్రుడగుచు
విముఖుడై వచ్చెను వెడలి యాక్షణమె
సబ్బమయింటికి చయ్యనవచ్చి
పలికె నా యనపోతు భామతోనిట్లు :
"ముత్యాలగళమాల ముద్దుటుంగరము
మరచివచ్చితి నేను మగిడి నీవేగి
అడిగి తెమ్మనిపంపె" నానవాలడుగ
'కదళికాఫలచయ కలితచర్మంబు
ఇచ్చితిఫలమ'ని యిదియానవాలు"
అనిన సబ్బమనవ్వి యనపోతుకనియె
"అటువలె నమ్మి యీయానవాలంది
ఎందుకువచ్చితి విది పొల్లుమాట
మరచుటదాచుట మావద్దలేదు
మాయమాటలుచెప్పి మరలపంపించె
కనలేకవచ్చితీగతి భూసురేంద్ర"
అనిబల్కి బ్రాహ్మణుం డమితరోషమున
వెలదిగృహంబును వీడి వేవేగ
త్రిపురాంతకమునకు తిన్నగావచ్చి
బాలునితెరగెల్ల ప్రజల తానడిగె

"ఆతీరు మేమేమి యెరయుటలేదు
మూకలుగూడుండె ముందటిదెసను
తెలిసికొమ్మనివారు తెల్పతీవ్రముగ
అచ్చటికేగి యాయవనీసురుండు
అశ్వత్థతరువున కమరించినట్టి
పొందైనపత్రిక పుటమెగదీసి
వేగమే చదివెను వివరంబుగాను
"శ్రీగిరీశునియాన చెన్నునియాన
మలిదేవరాజాన మాతండ్రియాన
అరువదేగురువీరు లందరియాన
త్రోసివచ్చితివేని ద్రోహమంటెడిని
బాలునిమిత్రుల ప్రాణంబులకును
తప్పినలాగౌను తరలితివేని
అనలుమీరుట అదినీతిగాదు
తనసంగడీలతో తాను బాలుండు
చనియెను ఇకనీవు సాగిరావద్దు"
అనునట్టి కఠినంపుటానలుచదివె
చండాగ్నిపై చమురు చల్లినయట్లు
భీకరకోపాగ్ని పెనగిచిత్తమున
అంతకంతకుదుఃఖమధికమైపొంగ
"దంటనౌ ననువీడ ధర్మమానీకు
మంచితనమ్మున మన్నించినన్ను
పొమ్మన్నపనికి నేపోయితిగాని
తప్పానవాలని తలపకపోతి
నిజమనిచెప్పిన నీయానవాలు
తబ్బిబ్బుదంచును తగనవ్విరపుడు
నిజముగా నిదిదెల్ప నీవున్నకడకు
వచ్చితి విడనాడి వడినేగినావు
వగవ నేనందుకు వరగుణశాలి

నీనాతిమంచాల నీపొందుకత్తె
హాస్యంబుచేసినా రానవాలడిగి
వెంగలివైతివి వెలదులవద్ద
కలిమికోసమువచ్చి కలియుటలేదు
కులమునకొదవని కూడుటలేదు
తల్లిని దండ్రిని తగువారినెల్ల
ఎడబాసి నీపొందు నేనమ్మియుంటి
బాసిపోదగునయ్య బ్రహ్మన్నతనయ
కెళవుగాబోతివి ఖిన్నునిజేసి
నాయంబువిడనాడి నమ్మినవాని
ఒంటరిగాజేయ నొప్పెనామనసు
ఎన్నడునాలావు విసుమంతయైన
కనుగొనవైతివి కట్టిడివాడ
'బ్రాహ్మణుడీతడు బవరంబుచూచి
భయపడు' నంచును భావించినావొ
అటులైనజూచితే యనిలోననున్న
బ్రాహ్మణమరణంబు పాపమటంచు
చనితివో పొందెడలి సర్వజ్ఞమౌళి
ధర్మశాస్త్రంబులదారి నీకెరుక
తనునేలినట్టి యాధరణీశునెదుట
సమరంబులోపల చచ్చినయపుడు
పాపంబనగలేదు బలిమినిబట్టి
ఖండించివైచిన కలుగుదోషంబు
ద్రోణుండు కృపుడును ద్రోణసుతుండు
సమరంబుచేయరా సాహసంబొప్ప
గురువైనద్రోణుండు కూలెయుద్ధమున
ఎవ్వరినంటెను ఈకల్మషంబు
ఇదియెల్లనీకెరుక యింతిమాటలకు
నన్నెడజేసితి నాకర్మమిదియ

కామునిబలములు కదిసిననెదుట
బల్లేలవారితో బవరంబుచేయ
వలెనని మదిలోన వాంఛకద్దెపుడు
ఈడేరదాయె నాహితమైనవాంఛ
ఏమిచేయుదునేను ఏమందువిధిని
బాలుడ నన్నడవిపాలుజేసితివి
వీరవిక్రమసమరవిభవంబుగనగ
భాగ్యంబులేదాయె పాపినినేను
పూర్వజన్మంబున పొందులఁబాపి
ఎవ్వరెవ్వరినేను ఎడజేసినానొ
అనుభవంబాయెను ఆఫలంబిపుడు
ఈవుబాసినయట్టి ఈదేహమేల"
అని చింతచేయుచు "నయ్యయో" యనుచు
ఉన్నంతలోపల నొయ్యనవచ్చె
గరికెమాడచియను కాంతయొకర్తె
వీరమేడపినుండి వీరులగలయ
చనుదానినచ్చోట చయ్యనచూచి
అంజలిజేసెను అనపోతుతెలిసి
"బ్రాహ్మణుడవీరీతి పలుకంగరాదు
తగము నీవొనరించు దండముగొనగ
ఎందుకిక్కడనునికి నెరిగింపు"మనిన
అనపోతు ఆపెతో ననియెనావేళ
"బాలుని కలనికిపంపియిచ్చోట
నిలువకారణమయ్యె నెలతరోనాకు
అన్న బాలుని కేను నంజలిచేసి
విన్నవించెద నీవు వినిపించవమ్మ
తనసంగడమ్మును తలచకమదిని
కూరిమితమ్ముల గూడుకనన్ను
వలదనిపోయెను వగచితినను

ఆలస్యమికచేయ నాయత్తపడితి
ఇందులదోషంబు నెనయదుతనకు
తనరాకచూచెద తా స్వర్గమందు
ననుగూడరమ్మను నాతి వాలిణ్ణి"
అనిచెప్పిమదిలోన నధికమౌనియతి
ఈషణత్రయమును ఏహ్యమనిరోసి
తల్లిదండ్రులదలచి దండంబుపెట్టి
అడపంబువానిని నాగొడుగువాని
"వెరతురు రక్తంబువెడలుటచూచి
ఈదెసనిలువక యేగుడీతొలగి
పాపమనుచును నన్నుపట్టంగవలదు"
అనిచెప్పి బ్రాహ్మణుడత్యంతభక్తి
పరమాత్మ మదిలోనబాయకనిల్పి
ఇంటివేల్పులనగ నేర్పడియున్న
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుల
ప్రార్థనకావించి ప్రభుడైనయట్టి
బ్రహ్మన్ననామంబు భావనచేసి
సంగడీలను బాలుసన్నుతిచేసి
బంగారుజందెంబు పాదంబుబిరుదు
మాడచికిచ్చుచు "మన్నించి నీవు
బాలునికిమ్మ"ని పలుకుచునంత
తనతలకోసుక ధరణిపైవ్రాల
తలయూవలించుక తటుకునవెగిరి
ఎటువంటిభావమో యీశ్వరుడెరుగు
కన్నులువిప్పక ఘనముగానవ్వె
గొడుగడపమువారు గొబ్బుననేగి
తనయునిగతిజెప్ప తల్లియుదండ్రి
వినిమూర్ఛనొందిరి వేగమెలేచి
కుందుచుజనుదెంచి కొడుకుపైవ్రాలి

"ఈడ వ్రాసెను నేలయిరవయ్యే నీకు
నాల్గువేదంబులు నయమొప్పజదివి
అఖిలదేశముల విఖ్యాతినిగాంచి
చెల్లితివా యిచట చెలికాడువీడ"
అనివిలపించంగ నటబంధుజనులు
చనుదెంచి వారల సమ్మతిపరచి
"దహనకార్యముచేయదగు"నంచు బలికి
గంధపుచెక్కలు ఘనకాష్ఠవితతి
తెప్పించిపేర్పించి తీర్చిరివేగ 2560
తగుశాస్త్రమార్గంబు తప్పిపోనీక
సతియువెంబడినేగ సమ్మతమొంద
వారినిద్దరిని నట వహ్నికొప్పించి
తమయిండ్లకేగిరి స్నానముల్ చేసి.

*సంధికుదిరెననెడి సంతోషమున మలిదేవునివీరులును నలగామునిరాయబారులును విందుగుడుచు సమయమున మాడచి అప్పుటువచ్చి అనపోతు తన కిచ్చిన జందెమును, బిరుదును బాలచంద్రునికి ఒప్పగించుట. రక్తసిక్తమైయున్న అనపోతు జందెమును చూచి బాలచంద్రుడు రోషించి యుద్ధమున అందరిని హతమార్చెదనని ఆర్చుట: సంధి భగ్నమగుట: నలగాముని రాయబారులు విఫలమనోరథులై వెనుకకు మరలిపోయి జరిగిన వృత్తాంతమంతయు నలగామునికి తెలియచేయుట: నలగాముడు సమరమున కాయత్తపడుట.*

అంతటమాడచి యాయత్తపడుచు
తరుచునెత్తుటిచేత తడిసినయట్టి
బిరుదును జందెంబు పెట్టెలోబెట్టి
ఆందోళికారూఢయై త్వరితముగ

చనుదెంచిధరణీశు సముఖాననిలిచి
వీరులుదొరలును వేడుకమీర
పంక్తినిగూర్చుండ బాలసీలపుడు
వండినవస్తువుల్ వడ్డించిపిదప
చమురులువడ్డించు సమయంబునందు
గరికెమాడచియటకు గ్రక్కునవచ్చి
తానుమేడపినుండి తగదెచ్చినట్టి
మధురవస్తువులెల్ల మరువకయిచ్చి
పలికెబాలునిజూచి పడతిదైన్యమున :
"అనపోతు నీకంపె నతిమధురంపు
వస్తువు లివి గొనవలయు న"టంచు
శిరమురక్తంబున దడిసినయట్టి
జందెంబు బిరుదంబు చయ్యనవిచ్చె
చూచినయంతనె ఛురికాగ్రమునను
వక్షంబుపొడిచిన వడువునగలిగి
బాలచంద్రుడులేచి పగవారువినగ
పెడబొబ్బపెట్టెను పృథ్వీశులదర
"ఒప్పివారును| వీరు నొక్కటియైన
శంకింపకెదురెక్కి శాత్రవచయము
బారులపైబడి ప్రకటశౌర్యమున
బ్రహ్మప్రముఖ వీరవరులనుగదిసి
అనిలోన ముందుగ హతముగావించి
తరువాత కాముని దళముపైదుమికి
కాలిబలంబుల గజవాజివితతి
పీనుగపెంటలు పెల్లుగజేసి
తడయకనరసింగు తలదరిగితెచ్చి
కొమ్మభూపతికిచ్చి కులపగదీర్చి
నాపంతమీఢ్దేర్తు నను జూడుడిపుడు"
అనిబాలుడాడిన నప్పుడుతెలిసి

వీరులు దొరలును వేగమే లేచి
సంధికార్యముమాని జాహ్నవికేగి
ఆమడ్గులోవేసి రన్నమంతయును.
చివరకు కార్యంపుస్థితి విచారించి
రాయబారులతోడ రాజులిట్లనిరి :
"కానున్నకార్యంబు కాకపోదిపుడు
ఎక్కడిబంధుత్వ మెక్కడిచెలిమి
బాలునితమకంబు పట్టలేరెవరు"
అనివీడుకొల్పిన నారాయబార్లు
కామునికడకేగి కరములు మోడ్చి
వినిపింపసాగిరి విషయమంతయును
"మమ్మంపితిరి మీరు మలిదేవుకడకు
విన్నవించితిమెల్ల విని రాజవరుడు
ఒసరంగ చెలిమికి నొప్పెనావేళ
వీరులురాజులు వేడ్కనుప్పొంగి
విందులు భుజియింప వివిధవస్తువులు
పచనంబుచేసిరి పంక్తులుసాగె
ఉభయత్రవారలు నుత్సాహమునను
కూర్చుండిరరలేని కూరిమితోడ
బానసీలన్నంబు పట్టుకవచ్చి
వడ్డించి చమురులు వడ్డించువేళ
గరిగెమాడచివచ్చి కడుచిన్నబోయి
అనపోతుతెరగెల్ల నపుడుబాలునికి
తెలుపగనాతడు తెంపునుపూని
ఇడినట్టియన్నంబు ఏటిలోగలిపి
ఉగ్రుడై రణమున కుద్యుక్తుడయ్యె
మలిదేవరాజును మన్నెనాయకులు
మముబంపివేయంగ మగిడివచ్చితిమి
కాగలకార్యంబుగతి మీకెతెలియు

అనవినికాముండు ఆయతపడగ

బాలచంద్రుడు యుద్ధమున మగటిమిచూపుదనని తమ్ములకు హెచ్చరించుచు వేరపిల్చుట: వీరులు అతనిని యుద్ధము చేయవలదని వారింపచూచుట: బాలచంద్రుడు వారికి తన పూర్వజన్మ వృత్తాంతము తెలియచెప్పి యుద్ధమున శత్రువుల గెలిచెదనని ప్రతిజ్ఞ పట్టుట: బ్రహ్మన బాలచంద్రునికి యుద్ధధర్మము లుపదేశించి దీవించి పంపుట.

అంతటనబ్బాలు డతికోపమునను
భుజములనెగబెంచి బొడవుగానిక్కి
ఉదుటు పంతము లాడుచున్నంతలోన
గురుతరరణలక్ష్మి గొబ్బునవచ్చి
ఆవేశమాయెను ఆబాలునందు
కేరి తమ్ములు తాను కిలకిలనార్చి
నిండుధైర్యముతోడ నిశ్శంకులగుచు
కనుగొనుచుండి రా కామునిదళము
తమకంబుమీరంగ తాలిమిమూల
బవరంబునకుతాము పయనమైపోవ
వీరాగ్రగణ్యుండు వినుతసద్గుణుడు
హాటకాచలధీరు డబ్ధిగంభీరు
డరిజయసంశీలు డైతమ్మసుతుడు
సంగడీలకు ప్రాణసఖుడైనవాడు
నిర్మలుడగు బ్రహ్మనిజకూర్మిపట్టి
పులినిదండంబుతో బొడిచినయట్లు
కొలువులోపలనుండి గొబ్బునలేచి
తనప్రాణసఖులను దగ్గరబిలిచి
"వెన్నివుపగరకు వెనుకాశపడవు
విరిగినవారల వెన్నాడిచనవు

కులమున వెలమవు క్రోధంబు హెచ్చు
సకలశాత్రవులకు సమవర్తివీవు
వన్నెదెచ్చితివౌర వంశమంతకును
నను జేరరావయ్య నమ్మినసఖుడ"
"మీరియోజులకెల్ల మేటివైనట్టి
కమ్మరపట్టి నాకడకురావయ్య"
"తగవింజయోజుకు తనయుడవైన
కంసాలచందు నాకడకురావన్న"
"గురుతైనబిరుదుల కుమ్మరిపట్టి
మరియుచాకలచందు మంగలమల్లు
నమ్మినమిత్రులు ననుజేరరండి"
అనిబిల్వగా నార్గురతిభక్తిగొలువ
సంతోషమున బాలు సన్నిధికరిగి
వరుసతో మ్రొక్కిరి వారెల్లగూడి
తరువాతబాలుండు ధైర్యచిత్తమున
వీరనాయకులను వేడుకజూచి
విన్నవించెను శౌర్యవిభవంబెసంగ
"సత్యవ్రతోత్సాహ సాహసులార
నిర్మలగుణయుక్త నిశ్చలులార
దేవతల్చూడంగ తేజంబుమీర
మనసున శంకలు మట్టుగాజేసి
బ్రతుకులపైనాశ పారగదోలి
పిరికిప్రేవులువీడి బెగడుటమాని
లోభమోహంబుల లోలతవిడిచి
సూర్యతేజంబున శూరతమీరి
కామంబుక్రోధంబు కడతొలగజేసి
కామభూపతిగెల్తు కదనంబునందు
జయులార దేవాంశసంభూతులార
సజ్జనరక్షులై జగతిలోబుట్టి

వీరశౌర్యంబులు వెలసినయట్టి
అరువదేగురుమేటిఅయ్యలు మీరు
మించగబ్రహ్మన్న మిక్కుటంబొప్ప
పూర్వంబుచూపిన భుజవిక్రమంబు
విందుము మీరెల్ల వినిపించగాను
బ్రహ్మన్నకెదురైన పగతులులేరు
అటువంటి బ్రహ్మన్న కనుగుపుత్రుడను
భీతిచేపగరకు బెదరనునేను
తాతతండ్రులకును తగమామలకును
కడుపిన్ననని వారు గారవించెదరు
ఎత్తిముద్దాడెడి యీమేలుమీది
కన్నెకయ్యమునందు గలిగెపుణ్యంబు
స్వర్గంబుగొనుటకు చాలినవాడ
నాపంతమరయుడీ నాయకులార
కామునితమ్ముని కలనిలోజంపి
తలదెచ్చిమీకిత్తు ధరణీశునెదుట
చంపుదురణమందు సకలశత్రువుల
ప్రతినతీర్చకయున్న బాలుడగాను"
అనవిని నాయకులాబాలుకనిరి:
"వలదుబాలుడ పిన్నవాడవు నీవు
నన్నపుపనికాదు సమరకార్యంబు
దళమువిస్తారంబు తగదుశౌర్యంబు
పడుచువాడవునీవు పటిమకొంచెంబు
వలనొప్ప శీలమువారేగురికిని
సంతానహీనమై సంతోషమెడలి
పదిరెండునేడుల పరిమితిగడచె
మాచెర్లచెన్నుని మన్ననబడిసి
ఐతమ్మ నినుగనె నధికమోహమున
సంతతివృద్ధియై జరుగంగనిమ్ము

సమరంబునకు నేగు సాహసంబుడుగు
మీతల్లిదండ్రుల మిగులమన్నించి
మమ్మెల్లదయచేసి మామాటవినుము"
అనుచుబల్కినవారి కనియెబాలుండు :
కడుతెంపుతోడుత కలకలనవ్వి
"ఇటువలెబల్కంగ నేమిధర్మంబు
అసహాయశూరులౌ నయ్యలుగారె
తనరిన యాగంగధారలే వచ్చి
కలసినమడుగులో ఘనతమీరెల్ల
స్నానముల్ చేసియు తమపేరుపేర
పటులింగమూర్తుల బట్టుకవచ్చి
ధరణిప్రతిష్ఠించి తథ్యంబుగాను
అన్నంబువెసముట్టి యారాజుచేత
విడియముల్ గొన్నట్టి వీరులుమీరు
ప్రథమతాంబూలంబు పట్టితినేను
వీరులు నాయకుల్ వేడ్కతోజూడ
చెలగియుద్ధముజేతు చేకొందుమెచ్చు
ఎంగిలిపోటగు నిపుడు మీకెల్ల
సురలోకవైభవస్ఫూర్తి నాకగును
బాలుడీతండని పలుకుటతగదు
నాపూర్వమంతయు నయమొప్పనిపుడు
వీరనాయకులార విఖ్యాతులార
వినరయ్యమీరెల్ల విశదంబుగాగ
అయోధ్యనేలిన యా హరిశ్చంద్ర
మహరాజునకు చంద్రమతికినిబుట్టి
లోహితాస్యుడనైతి లోకంబులెరుగ
నాడుబాలుడగానె నాయకులార
కనకకశ్యపునకు కారణంబునను
ప్రహ్లాదుడనుపేర పరగబుట్టితిని

నాడుబాలుడగానె నాయకులార
శివకంచి నేకామ్రశివభక్తుడౌచు
చిరుతొండనంబినా చెలగె మాతండ్రి
చెన్నైశివయను చెలువమాతల్లి
సిరియాళుడనపేర చెలగితినేను
తల్లియు తండ్రియు తన్నుమర్దించి
ఇష్టభోజనముగా నీశునకీయ
జీవముతోడనె శివునితోగూడ
ఏడువాడలవారి కింపుదళ్కొత్త
ఘనపుణ్యవాసంబు కైలాసమునకు
కొనిపోయితిని నేను గురుతరభక్తి
నాడు బాలుడగానె నాయకులార
కిష్కింధనేలిన కీశాధిపతికి
తారకంగదుడనై ధరబుట్టినాను
రఘువంశమందున రామచంద్రునకు
కుశుడనై పుట్టితి గురుశూరుడనగ
నాడుబాలుడగానె నాయకులార
పాండవపుత్రుడౌ ఫల్గునికేను
అభిమన్యుడనపేర నమరబుట్టితిని
నాడుబాలుడగానె నాయకులార
ఇటువంటిజన్మంబు లెన్నైనగలవు
చెప్పశక్యముగాదు చెన్నునియాన
ప్రతిజన్మమందున ప్రౌఢవిక్రమము
చెలగిపురాణముల్ చెప్పుచుండెడిని
కలియుగంబున నిపుడు కడసారినేను
కుంతాలవారింట కూరిమిమీర
బ్రహ్మనాయునికిని పడతియైతమకు
బాలుడన్‌పేర నీపల్నాటిలోన
జననంబునొందితి సమరశూరుండ

పేరుబాలుడనుమ్ము బిరుదులుగలవు
పగవారికొట్టని బాలత్వమేల
భూమి జనకుఁబోవ పుత్రుడుకర్త
మానాభిమానముల్ మగటిమిమించ
ప్రబలింపగలవారు బాలురెనుమ్ము
బాలురేపెద్దలు బల్లిదుల్వారె
బుద్ధియునేర్పును భుజశౌర్యమహిమ
బాలురకే వృద్ధి పరికించికనుడి
పెద్దలుమతిచెడి పిరికిపారుదురు
వయసుమీరినవేళ వచ్చునాబలిమి
బాలురబలమేమొ బవరమునజూపి
మైలమకామిని మడియంగజేసి
నాయకురాలిని నయహీనజేసి
పరదళంబులజంపి పంతంబుతీర్తు
పడుదునారణభూమి బవరంబుఁజొచ్చి
చూచియాస్వర్గంబు చూఁలుగొందు"
అనియిట్టులాబాలు డాడినమాట
వినితండ్రులేగురు విశ్వాసమునను
కౌగిటజేర్చిరి గాఢంపుప్రేమ
బాదన్న మొదలైన భ్రాతృవర్గంబు
వీరులు నాయకుల్ వినుచుండగాను
బాలచంద్రునితోడ బ్రహ్మన్నపలికె:
"నాయాత్మనందన నాయనుగ్గపట్టి
ఇట్టిధీరత్వంబు నీదిట్టతనము
ఎటువలెనీకబ్బె నేమి యీవింత
ఒకబుద్ధిచెప్పెద నొప్పుగావినుము
ఘోటకంబులు మేటికుంజరవితతి
కాలిబలంబులు ఘనఖడ్గచయము
కుంతంబులును గండ్రగొడ్డండ్లు గదలు

ముసలముద్గరములు మొనలకటార్లు
చక్రతోమరములు శార్ఙ్గసంఘంబు
ఛురికలు బాణముల్ శూలచయంబు
మొదలైన శస్త్రాస్త్రములనెల్ల జూచి
భావంబుచెదరిన పంతముల్ గావు
పలికినరీతిని బవరంబునందు
విక్రమంబుననిల్చు విధమద్భుతంబు
సమరకాలంబున సకలదేవతలు
కనిచిత్తచలనంబు గావింతురయ్యా
గణపతిభైరవుల్ కాలుడుదుర్గ
విఘ్నకారులు సమరవిభవంబువేళ
అర్జునునంతవా డనిచేయునపుడు
కర్ణునిరాకడ గని భీతినొంది
'బ్రతికిన శుభములు బడయంగవచ్చు
అరదంబు మరలింపుమయ్య శ్రీకృష్ణ'
అని విన్నపముచేసె నాశ్చర్యముగను
ఇతరులు నిలువంగ నెట్లుజాలుదురు
అటుమీద పౌరుషం బణగిపోయెడిని"
అనవిని యాబాలు డల్లననవ్వి
"పిన్నవాడని నన్ను బెదరించకయ్య
చిన్నమిరియమునందు చెడునెకారంబు
మానక నోరంత మండుచునెక్కి
ఘనకపాలముకెక్కి కాకనొందించు
కాలుదావాగ్నికి కారడవెదురె
హనుమానుడెగురునా, యలచౌటిపడెకు
వారిధిలంఘించి వడిదాటుగాక
బాలుడు చిల్లరబలముపై బడడు
కామునితమ్ముని గదిసిమర్దించి

తలగోసితెచ్చును ధైర్యంబెసంగ"
అనవిని బ్రహ్మన్న యందరువినగ
"ఓబాలచంద్రుడ యొప్పుగావినుమ
ధరలోననాపేరు దశదిశలందు
ప్రఖ్యాతినొందుట బ్రహ్మన్ననైతి
మండలేశులకెల్ల మదితల్లడమయి
చెల్లినమనపేరు చెడిపోవనీకు
పృథ్విమనబిరుదుల పెంపునొందించు
ఘనమైననాపేరుకల్లగానీకు
ఇలలోన మనలావు నెన్నలేరెవరు
ఇదిసమరాంగణమిదిపుణ్యభూమి
శ్రీకంఠశిరసంటి చెప్పెదనీకు
పటుకీర్తినొందించు బ్రహ్మాండమందు
ఇదిముక్తిసోపానమిదిమూలధనము
ఇదిదేవపతితులకెన్ననౌమేలు
హెచ్చైనవీరులకిదిపుట్టినిల్లు
కొమభూమీశుడు కలిమెల్లమెరసి
సకలభూమీశుల సంగ్రామమునకు
పిలిపించవచ్చిరి పేరైనవారు
ఖండనపటిమచే ప్రబలినవారు
పూర్వంబుమనతోడ పోరాడలేక
చిక్కిచెప్పినవెల్ల చేయుచునిపుడు
పగవారిలోగలసి పరతెంచినారు
జడియకనిలుతురు సమరంబునందు
కన్నెకయ్యంబిది కనిపెట్టిపోరు
సలుపంగవలయును సత్కీర్తికలుగ
తలపడునప్పుడు తలకకుమన్న
వారణధ్వనివిని వణకకుమన్న
శరములదీప్తికి జడియకుమన్న

తరచుయుద్ధమ్మున దద్దరింపకుము
పరదళంబులుగని పారకుమన్న
తగుజోళ్ళదీప్తికి తత్తరపడకు
అనివేళచలియించి యట్టిట్టుబోకు
మొనచెడిరణములో మురియకుమన్న
బిరుదులుజారిన బెదరకుమన్న
ఘనఖడ్గహతులకు గతిమాలవద్దు
బలములుజుట్టిన భంగంబుపడకు
నందడిరణమున శంకనొందకుము
బహుతరసైన్యపటిమమీరంగ
పరదళములనొంచి బవరంబుచేయు
కాముడురణములో కంపంబునొంద
నడుపుముమనసేన నరసింగుమీద
జయముచేకొనవయ్య సాహసంబొప్ప"
అనినీతిగా జెప్పి యపుడుబ్రహ్మన్న
తగినట్టి కర్పూరతాంబూలచయము
తమ్ములతోగూడ తనతనయునకు
నిప్పించె తనదగునిచ్చతో మరియు
శంఖతీర్థముబెట్టి "జయమొందు" మనుచు
పంపించ తనతండ్రిబ్రహ్మన్నకపుడు
దండనమస్కృతుల్ తాజేసివెడలె.

*బాలచంద్రుడు కదనరంగమున నరసింహభూపతి నెదురుట: అతని నిలువరింపలేక నరసింగుని సైన్యము చెల్లాచెదరగుట.*

ఆవేళరణభేరు లధికమైమ్రోసె
ఢక్కాఢమామీలు తగుమురజములు
పటహ కాహళశంఖపటుతరధ్వనులు
మిన్నందిమ్రోయంగ మేటిబాలుండు

సమరభూమిని నిలిచి సంతోషమలర
సూర్యభైరవులాది సురలకు మ్రొక్కి
"దిక్పతులార యో దేవతలార
కనుగొనుడీ మీరు కదనరంగంబు
చేసెదసమరంబు చిత్తముప్పొంగ"
అని విన్నపముజేసి యాయుధమంది 2880
ఒరతీసిజళిపించి యుగ్రుడై నిలిచె
తరువాత నరసింగధరణీశ్వరుండు
ఘనమైనగజముపై గ్రక్కున నెక్కి
సమరరంగమునకు చనుదెంచువేళ
చొక్కుచువ్వలవారు సూరెలవారు
పదివేలునడిచిరి పటుశౌర్యమునను
బల్లెముల్ పట్టుక బలుపైనబంట్లు
గజముముందరజనిరి ఘనశౌర్యులగుచు
విలుకాండ్లు పదునాల్గువేలసాహసులు
బాణతూణీరముల్ ప్రకగధరించి 2890
వడితోడరణరంగ వసుధదార్కొనిరి
పంచసహస్రముల్ పటువాజివితతి
ఏన్గులవెన్కలనేగె విక్రమత
భూరిమాతంగముల్ భూధ్రంబులట్లు
బృంహితధ్వనులతో పెల్లుగానడిచె
శూలకరాగ్రులై శోభిల్లుచున్న
వీరవర్యులు రెండువేలకుజనిరి
కడమబలంబులు కాదులెక్కింప
పటువిక్రమస్ఫూర్తి బలమిట్లునడచె
ధ్వజములుపడగలు దట్టమైకదలె 2900
బిరుదులుఛత్రముల్ పెద్దబెక్కెములు
సాంద్రమైయుండెను జగదీశునెదుట
ఇటువలెనేతెంచె నెదుటిబలంబు

బహుతరరణవాద్యపటలిమ్రోయంగ
పిక్కటిల్లెనుదిశల భేరీరవంబు
దారలబూరల తగుకాహళముల
ధ్వనులచేజనతతి తల్లడంబందె
అతిసాంద్రమైవచ్చు యా సైన్యమెల్ల
బాలచంద్రుడుచూచి భ్రాతలుతాను
శుష్కాటవులనగ్ని సుడిసినయట్లు
కోయనియార్చుచు కుప్పించియురికి
బలముపైవ్రాలెను పౌరుషాధికత
కుంతముల్ చేనంది గుదులుగాబొడిచి
కత్తులచేతులు ఖండించివైచి
మణికట్లుదునుమాడి మస్తకవితతి
ధరమీదదొర్లంగ దట్టించినరికి
మోచేతులెడచేసి ముక్కులుచెక్కి
పక్కలుఖండించి పాదముల్ నరికి
దవడలూడగబొడిచి దంతముల్ద్రుంచి
కనుగ్రుడ్లుపగులంగ కర్ణముల్ వ్రాల
బలువైనరొమ్ములు పరియలుగాగ
తొడలుతుత్తునకలై తూగాడుచుండ
జానువులూడంగ జంఘలువిరుగ
చీలలన్నియువదలి చీకాకునొంద
ఇటువలెగొంతసేపెక్కువౌతమిని
అనుజులతోగూడ ననిచేసిపిదప
దంతావళంబుల దట్టంబుచూచి
బాలుడుకోపంబు ప్రకటంబుగాగ
బలిమిమైకుంభముల్ పగులంగమోది
తొండముల్ తోకలు తునుకలుజేసి
మావంతులనుగొట్టి మరణమొందించి
పైనున్నదొరలను పడివోవనరికి

దీర్ఘదంతంబులు తెగపడగొట్టి
చెవులను కత్తితో చీలికల్ జేసి
పిల్లదంతంబుల పెకలించివైచి
ఘనపదంబులదున్మి కంఠముల్ నరికి
కొంతసేపిమ్మాడ్కి గురుశౌర్యమలర
సమరంబుగావించి సాహిణీతతిని
చక్కాడపైబడి సాహసగరిమ
ఖడ్గకుంతంబులు కరములబట్టి
పైనున్నరాహుత్తపటలినిచంపి
తొడగినజోళ్లన్ని తునుకలుజేసి
సింగిణివిండ్లను చిదుపలొనర్చి
బాణతూణీరముల్ భగ్నంబుచేసి
ఖడ్గఖేటకములు ఖండించిమించి
మెడలురెండుగజేసి మేనులుచించి
ఎదురొమ్ములనులెస్స యీటెలుపొడిచి
కొంకులుతెగగొట్టి ఖురములుదునిమి
బాలుడిటువలెను బవరంబుచేయ
పడితన్నుకొనిచచ్చు భటసమూహంబు
మస్తకంబులుతెగి మహిమీదపడిసి
కన్నులుతెరచుచు గంతులువైచి
ప్రాణముల్ విడిచెడువారును మరియు
పాదముల్ విరుగగ బవరంబుచేయ
పండ్లుగీటుచుతూగు బలుశూరవితతి
కరములుతునిసిన కత్తులువదలి
బాలునిగని వచ్చు భయదోగ్రభటులు
ప్రేవులువెడలిన పెడచేతనొత్తి
కడమచే బల్లెంబు గట్టిగాబట్టి
హుంకారమున పైకినరుదెంచినట్టి
చంచలింపని శౌర్యసాహసఘనులు

గాయాలుఘనమైన కదలంగలేక
బాలునికనుగొని భయమందివేగ
పారిపోయెడి పిరికిభటసమూహంబు
పారిపోవగలేక బ్రతుకుపైనాస
బ్రతిమాలుచుండెడి బలములగుంపు
'ఇటువంటిజగడంబు లెన్నడేమెరుగ
మెటుపోదుమ'ని భీతినేడ్చెడువారు
'ఆలుబిడ్డలబాసి యన్నంబుకొరకు
వచ్చితి మీనేల వ్రాసెనుచావు'
అనిదుఃఖపడుచును అసురుసురనుచు
విధిలేకప్రాణముల్ విడిచెడువారు
'బహుదినంబులు మేముపాలేరుచేసి
ములుకోలలెల్లను ముంజూర్లదోపి
పణతులుదిట్టిన పడలేకవచ్చి
నెలలేదు మాకొల్వు నిత్యభత్యంబు
మాత్రమేయెక్కువ మాకేమిలేదు
బోయవారముమేము పూర్వంబునందు
భుజములకాయలుపూనికన్గొనుడి
'పగవారుమముగని పారిపోవుదురు
మీకేమిభయమ'ని మెలతనాగమ్మ
బాగుగానమ్మించి పంపవచ్చితిమి
జీవముల్ దక్కిన చిన్నలగలిసి
బ్రతికెదము బహుకాష్ఠభారవిక్రయత
మీరుపిల్చినవేళ మేమువచ్చెదము"
అనిమ్రొక్కుచును జీవితాశనువిడక
మగసిరివిడిచిన మానహీనులును
కూడదోలినబంట్లు గుంపులైచెదరి
చాలించిరణమును చనియెడువారు
చనలేకభయమున చచ్చినవారి

మీద తోసుకపడి మెదలనివారు
చచ్చినవిధమున సమరోర్వియందు
పలుకకయూరక పడియున్నవారు
చచ్చినగజములచాటునదాగి
పందతనమ్మున పడియుండువారు
పెండ్లాలదలచుక బిట్టేడ్చువారు
వల్మీకములమీద వసియించువారు
గడ్డిలోజొరబడి కదలనివారు
బవరంబులో గూలి ప్రాణజాలంబు
విడిచియు ఖడ్గముల్ విడువనివారు
భయదమైయిబ్బంగి పరికింపరాక
సంగ్రామరంగంబు చక్కనై యుండె.
కొందరువిలుకాండ్రు గుంపులుగూడి
బహుబాణములు మీదబరపెడువేళ
తమ్ములనందరి తగనిల్వజేసి
పరిఘమొక్కటి చేతపట్టుకదూరి
తనువునబాణముల్ దాకకుండంగ
భ్రమణనైపుణ్యంబుబల్విడిజూపి
పరతెంచు విశిఖముల్ పాయగొట్టుచును
ఖడ్గమంకించుక గద్దరించుచును
అట్టహాసంబున నావిలుకాండ్ర
పైకేగి ధనువులు భంగంబుచేసి
శింజినులెల్లను చిదుపలుజేసి
తూణీరశరములు తురుముగాగొట్టి
చుట్టుపేరెముదిరిగి శూరతమెరసి
వందతరిగినయట్లు వారిమేనులను
ఖండించియమపురిగానంగబంపె
చొక్కచువ్వలవారు శూరతహెచ్చ
వచ్చి తన్పైకొన వలయుటజూచి

బాలుడువెసనార్చి పకపకనవ్వి
తమ్ములతాను నుద్దండులై వాలి
కుప్పించిపై కెగసి గొడ్డండ్లతోడ
చెరకులునరికిన చెలువుఘటిల్ల
అడుగులమట్టున కందరిదునిమి
శూలంబులబొడిచి సురియలగ్రుమ్మి
బల్లెలరొమ్ములు పరియలుజేసి
గదలచేశిరములు కడునుగ్గుజేసి
బాకుల పొట్టల పటిమచేజించి
కత్తులమేనుల కండలుడుల్చి
పంపిరి జముకడకు బలములనెల్ల
సంగ్రామ మిటువలె జరిగెడువేళ
పారిరి మిగిలిన బంటులుగూడి.

*నరసింగుడు పారిపోయెడు తన బలములకు ధైర్యము చెప్పుట: బాలచంద్రుడు యుద్ధరంగమున విజృంభించుట: నరసింగుడు మరికొంత సైన్యమును తెప్పుటకై తన అన్నకడకేగుట: బాలచంద్రుడు ఒకనిని చూచి నరసింహునిగా భ్రమించి అతని శిరమును ఖండించి తండ్రియొద్దకు కొంపోవుట: అది నరసింహుని తలగాదని తండ్రి బాలచంద్రునకు చెప్పగా అతడు మరల యుద్ధరంగమున కేగుట.*

ఆవేళనరసింగు డధికకోపమున
పారెడువారితో పలుకంగసాగె
"విరిగిపోవుటయిట్లు వీరధర్మంబె
ననువిడిచిపోవుట న్యాయంబుగాదు
బాలులకనుగొని పరువిడనేల
తప్పునా మరణంబు తలచెడిపార
మృత్యుదేవతవచ్చి మేనులనిల్పె

పారిపోవుట యేటిబంటుపంతంబు
వడివివాహామునకు వచ్చుటలేదు
సమరకార్యముకొరకు చనుదెంచినాము
పోవుటహీనత పుట్టదన్నంబు
బంధులు మిత్రులు పకపకనవ్వి
పోదురు రాజాజ్ఞపోయితిరేని
ఇహపరంబులులేవు ఇలలోనమీకు"
అనియిట్లుపల్కంగ నాదళంబెల్ల
బహురోషపటిమచే పోరకనిల్చె
అప్పుడుబాలుండు వనుజులుతాను
అట్టహాసముచేసి యరిమినవేళ
జడిసిగుండెలుపగల చలనంబునొంది
ధైర్యంబుదెచ్చుక తద్బలంబెల్ల
కదలుచక్రంబులు గండగొడ్డండ్లు
పెదపెద్దసురియలు భిండివాలములు
బల్లెముల్ కుంతముల్ పరశుచయంబు
కరములగొని రోషకలితులై వచ్చి
మిడుతలు మంటపై మిడిసిపడ్డట్లు
బాలునిదాకిరి భయదూరులగుచు
విక్రమాటోపత వెలసిబాలుండు
జలధిలో మందరశైలంబుతిరిగి
కలకనొందించినకైవడి ఘోర
కాలాగ్ని లోకముల్ గాల్చినయట్లు
దవవహ్ని విపినంబు దార్కొన్నభంగి
మనుజులలో మారి మసగినరీతి
శత్రుసైన్యంబుపై చయ్యనగదిసి
వారుప్రయోగించు వరశస్త్రవితతి
బహువిధంబులద్రుంచె భంగమ్ముగాగ
ఒకబంటుకడకాలు నొయ్యనబట్టి

ఒకబంటుతొడపట్టి హుంకరించుచును
ఇద్దరముగ్గుర నేకకాలమున
కుంతంబులనుజిమ్మి కూలజేయుచును
ఈటెలబొడిచి తామెత్తియాడుచును
కత్తులతో తలల్ గట్టిగావేయ
వ్రయ్యలై తనువులు వసుధపై బడగ
కటిదేశములయందు కత్తులువేయ
తునియలురెండయి దొరగునుభూమి
కుంతంబుపెడతలల్ గ్రుమ్మితీసినను
నెత్తురు భూమిపై నిండుగాపారె
ఎదురులేక సమరమీరీతిచెల్ల
కనుగొని నరసింగు కంపంబుగదుర
తలయూచి శ్రీహరిదలచినెమ్మదిని
వ్రేలిడిముక్కుపై వెరగందికుంది
'ఇతడుబాలుండని యేలాగుపలుక
శూరతబలముల సుడివడగొట్టె
ఇతనితోపోరాడ నేదినాబలము
గ్రక్కున మాయన్నకడకేగిదెత్తు'
అనిభయంబున నేగెనన్నను జూడ
తరువాతబాలుడు తనరోషవహ్ని
అధికమైజ్వలియింప నాపంగలేక
చిత్రంబుగాబొడిచె సేనలనెల్ల
కొందరఖండించె కొందరదరిమె
గుదిగ్రుచ్చె కొందర గూల్చెకొందరను
సంగరమిటువలెజరుగుటకతన
భండనరంగంబు బయలగుచుండె
మదగజవ్యూహంబు మావంతులపుడు
ధీరతతోడుత డీకొల్పియార్చి
దట్టమౌశరవర్షధారలు గురియ

బాలచంద్రుడు కోపభరముతో నపుడు
అనుజులు దానును హంకార మెచ్చి
కదిసిఖండించెను గజసమూహమును
తునుమాడిదంతముల్ తుండముల్ నరికి
శూలంబులం గ్రుమ్మి సురియలబొడిచి
పట్టిసంబులగొట్టి పరిఘలమొత్తి
గదలచేకుంభముల్ పాతలుజేసి
పదములు తెగిపడ పటుఖడ్గతతుల
కొట్టినకూలెను కొండలవలెను
వినువీథిదేవతల్ వేడుకచూచి
ఆశ్చర్యమొందిరి హర్షంబుహెచ్చ
హెచ్చుగానొకవంక నేనుగనెక్కి
నేర్పుమైనొకడుండ నిర్భయుడగుచు
అనుజులనందర నటఁబుచ్చివచ్చి
కొదమసింహముమాడ్కి కుంభిపై దుమికి
వక్షంబుబాకుతో వడితోడపొడువ
వాలంబునకువెళ్ళి వచ్చెనుతిరిగి
ఘనముగానెత్తురు కాలువలయ్యె
ఖండించమదగజఘనమస్తకంబు
కూలెనుభూమిపై కొండబట్టబ్లు
పైనరుడెవ్వడో భావింపలేక
వీడె నరసింగని వేగిరమంది
తమకంబుచే వానితలవిడగోసి
తనకేలబట్టుక తనతండ్రికడకు
బాలుడుచనుదెంచె పటుఁజయమునను
సమరరంగముచూడ చక్కనై యుండె
ఘనమైననెత్తురు కాల్వలై నిలిచె
తెగిపడ్డగజములు దీవులై యొప్పె
నరకినతురగముల్ నక్రములయ్యె

పొర్లాడుశిరములు బుద్బుదపటలి
బెక్కెముల్ గొడుగులు డిండీరవితతి
ఘనమైనయరిగెలు కచ్ఛపరాజి
మేటినేత్రంబులు మీనవారంబు
దీర్ఘశిరోజముల్ తీరైననాచు
మెదడునుమాంసంబు మించినబురద
తరచైనయీటెలు దర్వీకరాళి
పొడియైన భూషణపుంజంబులెల్ల
సైకతనిచయంబు చాడ్పుననెసగె
ఇటువంటిరణరంగ మీక్షించుకొనుచు
చనుదెంచి సోపానసంయుక్తమైన
మేడమీదికినెక్కి మేటివిక్రముడు
బాలుడాశిరమును బ్రహ్మకొప్పించె
నాయకావళిజూచి నాయుడిట్లనియె :
"చెలువైననరసింగుశిరమిదికాదు
తగులెంకతలయౌట తానెరుగలేక
వచ్చిననేమయ్యె వసుధేశుతమ్ము
డైనట్టి నరసింగు డన్నదగ్గరకు
తరలెను దళమును దాతెత్తుననుచు
తెలియలేవైతివి ధీరాగ్రగణ్య"
అనిపల్కగా బాలుడాగ్రహంబొంది
వీరులకెల్లను వినమితుడగుచు
అతివేగమునవచ్చి యనుజులగలసె.

*నరసింగుడు ఇనుమడించిన సేనతోవచ్చి బాలచంద్రుని ఎదిరించుట : బాలచంద్ర నరసింగుల ద్వంద్వయుద్ధము : యుద్ధమున బాలచంద్రుడు నరసింగుని తలకోసి తండ్రి కడకేగుట : నరసింగుని శిరస్సునుచూచి వీరనాయకులు విలపించుట : బ్రహ్మన బాలచంద్రుని ఉపాలంభించుట.*

అటమున్నె నరసింగు డధికమౌ బలము
తెచ్చుకమొనచేసె ధీరతనెదుట
మదగజంబులపైకి మత్తసింహంబు
లరుదెంచువిధమున నాశ్చర్యలీల
పౌజుపై నడిచిరి బాలురార్గురును
వసుధేశుతమ్ముడు వారలజూచి
తనవారికెల్లను తాసైగజేయ
క్రమ్మిరివిలుకాండ్లు ఘనులపైనపుడు
బాలుడుమొదలైన బాలవీరులను
నారులవింట్లను నలినలిజేసి
దౌనలనుబాణముల్ తునియలుజేసి
వెరవకవర్తించు వీరులపైకి
గదలమూకలుఎదిరి కలనమధ్యమున
సాంద్రవంశాటవి చందానవచ్చి
కప్పెనుబలములు ఘనులనేడ్గురిని
తలకకవారలు తారసిల్లుచును
చేగదల్ త్రిప్పుచు చెలగియార్చుచును
కొక్కెరగుంపుపై తుప్పించియురికి
సాళ్వంబుడీకొన్న చందంబుగాగ
కరులపై సింహపుకందెగసినట్లు
వ్యాఘ్రంబు గోవులవడిదాకినట్లు
సేనలపైకేగి చెండాడిరపుడు
చెక్కులుముక్కులు చేతులుమెడలు
కన్నులువెన్నులు గడ్డాలుతలలు
ఘనమైనకత్తుల గదిసిఖండించి
కుంతాలతోబొడ్చి కూలంగద్రోసి
చక్రసంఘముచేత చక్కగాజేసి
ఎదురెవ్వరునులేక యీతీరునల్ప
చాపకటుగకూలె సకలబలంబు

అంతకంతకు యుద్ధమగ్గలంబయ్యె
అప్పుడుబాలు డాయనుజులజూచి
"దళముపై బోకుడీ దట్టించిమీరు
కాముతమ్ముని నేనుకనుగొనివత్తు"
అనుచుముందుకుబోయె నడుగుచరిట్లు
"అనుగుభూపతిపుత్రు డానరసింగు
డెక్కడనున్నవా డేడిరావాడు
బాలచంద్రుడువచ్చు పటిమవీక్షించి
ఢాకకుభయపడి డాగెనోలేక
పందతనమున తిర్గిపారెనోయేమొ"
అనివిచారించుచు నపుడుబాలుండు
పర్వతమ్మున పిడుగుపడ్డట్లుగాను
తగగంతుకొనె కాముతమ్మునిమీద
గరిమబ్రహ్మనపట్టు ఘనకుంతమునకు
ప్రతివచ్చు సామంతరాగోలపట్టి
కటియందు గట్టిగాకాసెబిగించి
హనుమంతు లగువున నటుచౌకళించి
కిలకిలనార్చుచు కేరళవిభుని
పొడిచితోసెను వేగభూమిపై బడగ
కర్ణాటభూమీశు కలనిలోజంపె
మాళవమహినేలు మనుజేశుశిరము
చిదిమినట్లుగద్రుంచె చిత్రంబుగాను
బర్బరధరణీశు బాహువుల్నరికి
సమవర్తికడకంపె శౌర్యంబువెలయ
కరిపైననుండిన ఘనునరసింగు
పైకేగె సాహసపాటవమొప్ప
దంతిని కవియించె ధరణీశ్వరుండు
అప్పుడుబాలుడు అధికకోపమున
తండ్రినిబోలిన తనయుడుగాన

అత్యున్నతంబైన యాదంతిపైకి
కుప్పించిదుముకుచు కుంభినీశుణ్ణి
భుజముపై పొడిచిన భూమీశుడలిగి
ఐతాంబపుత్రుని నసిధారగొట్టె
తప్పించికొని యంతధరణీశునేసె
నరసింగరాజును నాయునిసుతుడు
పటుశౌర్యసాహస ప్రబలతమీర
బలదానవుడు వజ్రపాణియుబోలె
రావణాసురుడును రాముడువోలె
హెచ్చియుద్ధముజేసి రిరువురు జాము
విక్రమస్ఫూర్తియై వెలయబాలుండు
కామునితమ్ముని గదిసెడువేళ
ప్రేగులువెడలగా భేదించిపొట్ట
అంకుశంబునబొడిచె నానరసింగు
అంతట నాబాలుడధికరోషమున
సామంతనాగోల చక్కగాబట్టి
వక్షఃస్థలంబున వడితోడగ్రుచ్చె
గాడివీపునవెళ్ళె గ్రక్కున నలుగు
మొగలిపూభంగిని మొనచందమమర
అప్పుడానరసింగు డాత్మనిశ్చలత
మాచెర్ల చెన్నుని మదిలోనదలచి
అనుగుభూతలనాథు నాత్మలోనిలిపి
శీలమ్మనాయుని చెలువంబుదలచి
ఊర్ధ్వమార్గంబుల నొయ్యననెక్కి
బ్రహ్మరంధ్రంబున ప్రాణంబులేగ
కుంభికుంభముమీద కూలెనారాజు
కనిబాలచంద్రుండు కడుదుఃఖమొంది
అతనిచుట్టునుదిరిగి యతిభక్తిమ్రొక్కి
"అనుగుభూపతిపుత్ర యంగజగాత్ర

అయోధ్యపురినిలయ యవనీశతనయ
మానదుర్యోధన మైలమ్మసుతుడ
ఓతండ్రినరసింగ యోరాజవిభుడ
అపరాధిగాను నేనపకారిగాను
పాపమించుకలేదు పట్టపురాజ
మిమ్ముగట్టనుత్రాళ్లు మీరెతెచ్చితిరి
మీపాలిమృత్యువు మెలతనాగమ్మ
అలరాజుచంపిన ఆపగదీర్ప
పట్టిచంపితి నాకుపాపంబులేదు"
అనిఖేదపడుచును యాయత్తపడుచు
కత్తితోతలకోసి కరములబట్టి
అనుజులతోనిట్లు లపుడువచించె :
"తగవంత మొప్పింతు ధరణీశునెదుట
ఇచ్చోటనుండుడి యెచటికిపోక"
అనిచెప్పితమ్ముల నచ్చోటనిల్పి
ఒకచేతప్రేవుల నొయ్యననొత్తి
సామంతరాగోల చంకనుబెట్టి
తనతండ్రితావుకు తలగొనిపోయి
సోపానముల మేడ చయ్యనవెక్క
నాయుడుగనిలేచి నయముకన్పట్ట
"నరసింగువచ్చెగా నాయకులార
ఎదురుకొందమ"టంచు నేతెంచెభక్తి
తనయునిచే శిరము తానందుకొనియె
తపనీయపీఠిపై తలయుంచి మంచి
గంధముకస్తూరి కలయంగనలది
తగటుపచ్చడముపై తలయుంచిపొదిగి
కొలువెల్లమ్రొక్కిరి కోపంబులణచి
బ్రహ్మన్నయును మ్రొక్కి పలికెనిబ్భంగి :
"బావలజూచితే ప్రాణంబువిడిచి

మరదులజూచితే మరణంబునొంది
తమ్ములజూచితే దైవంబుగలసి
ఘనదేవభవనముల్ కట్టించినట్టి
ధర్మశీలుండు మీతండ్రియనుగయ్య
కడకేగ మీకిట్లు కారణమాయె"
అనుచుశోకమునందె నపుడుబ్రహ్మన్న
తనమదిఖేదంబు తాపట్టలేక
తమ్మునిచేశిరము తనచేతబట్టి
కన్నులనీరెల్ల గడ్డానగార
బహుదుఃఖమునుబొంది బాదరాహుత్తు
"తండ్రివెళ్ళినవెనుక దంటయైకూర్మి
నుంటిమికొన్నాళ్ళు నుర్వీశతనయ
మానకమృత్యువు మనవెంటబడియె
చెన్నుడుతనవ్రతము చెల్లించినాడు"
అనిబాదరాహుత్తు అడలెశోకించి
కొమ్మరాజువగచె కొలువెల్లనడలె
సుంకర్లువగచిరి శూరులగలసి
గండువారలవగపు ఘనమయ్యెనపుడు
నాయుడప్పుడు కూర్మినందనుజూచి
"రమ్మని నినుపిల్వ రాజంపలేదు
వచ్చి యూరకయున్నవాడవే కావు
చూరకొంటివి దళము శూరతమెరసి
చెల్లెబోనీవిట్లు చేసినక్రమము
విభునకు సేనకు విధివైతివీవు"
అనవినియాబాలు డతిరౌద్రముగను
పలికెనందరువినగ బ్రహ్మన్నతోడ
"వెడవెడయేడ్పులు వేగచాలించు
కొలువులో మామామ కొమ్మభూపతికి
అలరాజుకైనన్ను అప్పగించితివి

ఇదిగాక నీకపటమెన్నెదవినుము
పోగొట్టితివి కోడిపోరున భూమి
నినునమ్మివచ్చిన నీమరిదినపుడు
ప్రాణంబుగొన్నట్టి పాపాత్ముడీవు
చెలువుచూడగబంప చెవులగోపనను
చటులకర్మడవగుచు జంపించితీవు
ఘను లెంకజోదును కలనికంపించి
మందలోచంపితి మాయయొనర్చి
ఇటువంటి నీచేష్టలెన్నివర్ణింతు"
అనినమాటలుబ్రహ్మ కలుగులై తోచి
బాలునికనియెను ప్రకటముగాగ :
"వెన్నిచ్చివత్తివి విమతులకీవు
వెన్నిచ్చివచ్చెదు వీరుడగాను
సుమ్మ"ని పలికిన శూరవాక్యములు
విదితమైతోచెను వీరులకెల్ల.

*బాలచంద్రుడు తిరిగి రణభూమికేగి శత్రు సైనికులను చెండాడుట: అతని సోదరులందరును యుద్ధమున చనిపోవుట: బాలచంద్రుడు వీరస్వర్గముచేరుట.*

అనబాలు డప్పుడహంకారమునను
తెంపుచే కలనికి తిరిగివేగంబె
రయమున దావచ్చి రణములోనిల్చె
అప్పటి రణకార్యమలవియే పొగడ
వాణీశుకైనను వర్ణించరాదు
కమ్మర కాచన్న కడుశౌర్యమునను
ఘనమైన తనపాలి కామాక్షిదలచి
తనపాలిదళముల తరిమిఖండించి
కడసారిమృతినొంది కలనిలోగూలె
శత్రుసేనలకెల్ల సమవర్తియైన

మంగలికులమల్లు మహితవిక్రమమున
తురగసంఘమునెల్ల తునుకలుచేసి
కదనంబులోనొరిగి కాలునిజేరె
కోచపారనియట్టి కుమ్మరిపట్టి
విక్రమంబుగ జాతవేదునిబోలి
పరదళవిపినంబు భస్మంబుచేసి
గురుదేవతల మదిగూర్చి ప్రార్థించి
హతశేషభటులచే ననిలోనమ్రొగ్గె
చాకలచందన్న సాహసపటిమ
పాతాళగంగను భావమందుంచి
పటువిక్రమప్రళయపవనునిచేత
దుష్టశాత్రవచయము తూలికలట్లు
ఆకాశపథమున కరుగంగజేసి
బవరంబులోబడి ప్రాణముల్ విడిచె
సమరంబులోజొచ్చి చలనంబులేక
"బాలునియనుజుడ బాహుబలుండ"
అనిచెప్పికొనుచును నధికసాహసత
పేరై నదళముల పెల్లుగాబొడిచి
గడలమూకలజొచ్చి ఖండముల్ జేసి
బల్లేలవారిని భంగంబుజేసి
తురగాళిపైనురికి తూలగాబొడిచి
మదదంతిచయమును మరణమొందించి
తరుచుగాయంబుల తాళగాలేక
మాచెర్లచెన్నుని మదిలోనదలచి
వెలమలదోర్నీడు విడిచెప్రాణంబు
తమ్ములపాటెల్ల తప్పకచూచి
బాలుడు రోషంబు పట్టగాలేక
పటుతరసాహసప్రౌఢి చెన్నొంది
వ్రేలాడుప్రేవులు వేగమేపెరికి

గంగధారనుకలిపి కలనికివచ్చి
తమ్ములదలచుక "తానాలసించి
మిముబాసియుండుట మేరయుగాదు
నాదురాకడజూచి నమ్ముడీమీరు"
అనిచాటిచెప్పుచు నాకలనిలోను
నిర్భయవృత్తిచే నిలువబాలుండు
కనుగొనిపరసేన కడుభీతినొంది
"తమపాలిమృత్యువు తరుముకవచ్చె
ఎట్లుజీవించెద మీతనియెదుట"
అనిపారిపోయెడు నాసేనజూచి
"పోవద్దుభటులార పుణ్యకాలంబు
చనుదెంచె దేవేంద్రసభకేగవలెను
మీరెల్లనిలువుడీ మేలిమిగనుడి"
అనిపల్కవారిలో నధికవిక్రములు
చొక్కచుక్కలవారు శూరులై మించి
వచ్చుటగనుగొని వడిమీరనెదిరి
ప్రబలయుద్ధముచేసి బాలచంద్రుండు
చావకట్టుగగూల్చె సకలసైన్యంబు
ఆసమయంబున నతులసాహసులు
కుంతధారలమీరి కోయనియార్చి
గడెలువంచుకవచ్చి కదసిరి బాలు
వెనుకడుగువేయక విక్రమాధికత
అలుగులపైవ్రాలె నైతమ్మసుతుడు
గ్రుచ్చియెగబట్టిరి గురుశౌర్యఘనుని
విచ్చేసిదివియందు వీరులగలసె
అంతటభాస్కరు డపరాద్రిజేరె
సాంద్రమైచీట్లు జగమెల్లనిండె
జంగమస్థావర సకలవస్తువులు
కాటుకకప్పిన కైవడినొప్పె

సకలప్రపంచంబు సత్యంబుగాను
విష్ణుమయంబన్న వేదవాక్యంబు
నిశ్చయంబాయెను నీలిమనొంది
శివుడేడి కైలాస శిఖరంబునేది
సోముడువృషభంబు సురదీర్ఘికయును
ఎక్కడికేగెనో యెరుగరాదనుచు
సంశయస్వాంతయై శైలజవెదకె
ఇభమునుగానక యింద్రుడువెదకె
వాణిని వెదకెను వనజాసనుండు
తెలియకయీరీతి దేవతావితతి
పరిశీలనభ్రాంతి బరగిరితరచు
అధికసంతోషత నాసమయమందు
ఘనభూతభేతాళగణములుగూడి
సమరాంగణముజూచి సంభ్రమమంది
తగవిచారించిరి తమమదియందు
"ఎక్కడియుద్ధంబు ఏమిచోద్యంబు
ఇంతకాలంబాయె నేమెరుగమహహ"
అనివెరగందుచు నాభూతగణము
కలనుగాచుకయున్న కాళినిజూచి
"మీదయచేతనే మేమెల్లతనియ
బహుజనమాంసంబుప్రాప్తించె"ననుచు
పలువిధంబులమ్రొక్కి ప్రస్తుతిజేసి
"బాలుడు మనపాలి పరమేశ్వరుండు
ఇతడనిచేయగా నిటులబ్బెమనకు
ఏవిధంబునతీర్తు మీతనిఋణము"
అనికొందరాడిరి ఆనందగరిమ
"నాయకురాలైన నాగమ్మవలన
మనకాంక్షతీరెను మాటలకేమి"
అనికొందరాడిరి హర్షంబుమీర

ఇటువలె మెచ్చుచు నింతులుతమరు
చల్లులాడుచు దరికి చౌకళించుచును
కుప్పించియురుకుచు గొబ్బునమునిగి
దూరానదేలుచు తూలివచ్చుచును
మదమెక్కిసోలుచు మరియుసొక్కుచును
"ఎవడురా నామీదనెక్కినవాడు
దిగిరార తులువ నిన్ తిట్టెదసుమ్మ"
అనివెక్కిరించుచు హాస్యమాడుచును
భటకళేబరములు పట్టుకవచ్చి
చచ్చినగజముల సంధించినిలిపి
పడియున్నగజములపైని గూర్చుంచి
అంకుశంబులతోడ నదలించువారు
వాజిశవంబుల వడితోడనెక్కి
చబుకులగొట్టుచు చనుమనువారు
గజములవాజుల కాలిమానుసుల
పట్టుకవచ్చి యాపాథోధియందు
"ఘనమైనసేతువు కట్టుదమ"నుచు
సంతోషమొందెడు శాకినీగణము
గుండెలునములుచు గుంపులుగూడి
పిల్లరిపాడెడు పెద్దఢాకినులు
"ఎదురుమాకెవ్వరు ఈకలనిలోన
మిగిలినదళములమీరిమర్దింప
క్రొత్తనెత్తురు మెదడు కుతుకంబుమీర
భుజియింతుమను"చును బొబ్బలుపెట్టి
హంకారమొందెడు హాకినీచయము
దిక్కులనంతట తేజంబుహెచ్చ
మిణుగుర్లురాల్చుచు మింటికిజనుచు
కూడిపరువులువెట్టు కౌరవిదయ్యములు
పొరిగొని రణరంగభూతలమందు

విహరించె నిటువలె వేకువదనుక
తమపొందుపట్లకు తరువాతజనిరి
సకలజనంబులు సంతసమొంద
భానుండుపూర్వాద్రిపై నెక్కినిలచె
ఘనుడైన శ్రీనాథకవిరాజరాజు
చెన్నునికృపచేత చిత్తముప్పొంగి
వాలునివిక్రమప్రౌఢియంతయును
విరచించె జనులకు విశదంబుగాను. 4343

# కొమ్మరాజు యుద్ధము

## కథాసంగ్రహము

బాలచంద్రుడు మరణించిన పిదప బాదరాజు యుద్ధరంగమున జొచ్చి శత్రుమూకలను చెండాడి, తానుగూడ మృతినొందెను. అంతట కొమ్మరాజు బ్రహ్మాన యాజ్ఞగైకొని ప్రళయరుద్రునివలె కదనరంగమున కేగి, తాను యుద్ధమునకు వచ్చిన వార్త నలగామునికెరిగింపుమని భట్టునొకనిని పంపెను. ఆ వార్తవిని నలగాముడు కళవళపడి దళము లేర్పరుచుమని నాయకురాలితో చెప్పగా, ఆమె జోదుల సోమశేఖరుడను నొక ధనుర్విద్యాచార్యుని కొమ్మరాజును కదియపంపెను. ఆతడు పెక్కుదళములను సమకూర్చుకొని కొమ్మరాజు సైనికులపైబడగా, కొమ్మరాజు వారిని నలినలి చేయుచుండెను; అది చూచి సోమశేఖరుడు మరికొన్ని బలములతో ఆతని నెదిరించెను.

అంతట కొమ్మరాజుసోదరులు తమ యన్నకడకు వచ్చి శత్రువులను సంహరించుటకు తమకు అనుజ్ఞ యిమ్మని ప్రార్థించి ఆతని సెలవొంది, జోదులసోమునిపై బడిరి. సోముడును,

తన తమ్ములను పిలచి, వారిని మనుమాడిరండని పంపించెను. యుద్ధమున కొమ్మరాజుసోదరులు సోముని తమ్ములను సంహరించిరి. తమ్ములు నేలకొరుగుట చూచి సోముడు రోషించి, తనసైనికులను పురిగొల్పి వారిని చంపించెను. కొమ్మరాజు కోదండపాణియై శత్రుసైనికులపై కురిసెను. ఉభయపక్షముల వారికిని సంకులసమరమయ్యెను; చాపకట్టుగా సైనికులు నేలకొరిగిరి; కొమ్మరాజును, సోముడును ద్వంద్వయుద్ధమునకు తలపడిరి. యుద్ధమున సోముడు ప్రాణములు విడిచెను. అదిచూచి నాయకురాలు నలగామునితో ఆలోచించి, దొమ్మియుద్ధము చేసి కొమ్మరాజు నెట్లయినను సంహరింపుడని వివిధదేశాధిపతులను ప్రోత్సహించి పంపించెను. వారు కొంత సైన్యముతో కొమ్మరాజుపైబడిరి; ఆతడు శత్రుసైనికులను కుప్పలు కుప్పలుగా కూల్చి రాజులనందరి నోడించి వీరస్వర్గమునుకోరి, తనయొద్ద దివ్యాస్త్రములున్నంతవరకు తనకు ఓటమిలేదని ఎరింగినవాడుగాన, వాటిని మోపుకట్టించి భట్టుచే బ్రహ్మన కడకు పంపించెను. బ్రహ్మన ఆదివ్యాస్త్రములను తిరుపావనముగ ముద్రించెను.

పిమ్మట కొమ్మరాజు కుంతముగైకొని యుద్ధరంగమున విజృంభించి మరికొంతమందిని మడియించి పారిపోవుచున్న శత్రుసైనికులను ఏమియు చేయనని అభయమిచ్చి, తనను సంహరించవలసినదిగా వారి నాహ్వానించెను; అంతట శత్రువులు చుట్టును గుమిగూడి, బాణములను కుప్పించిరి; కొమ్మరాజు చెన్నకేశవుని మది తలచుచు నేల కొరిగెను.

ఆవార్త కన్నమదాసువలన విని మలిదేవుడు మిక్కిలి దుఃఖించి గతమునంతయు పారచూచి, తానే తన కులనాశన మునకంతయు కారకుడనని హాతధారణమున ప్రాణములు విడిచిపుచ్చెను. మలిదేవాదుల మరణమునకు నాయకురాలు సంతసించి, బ్రహ్మన్నను పట్టితెచ్చుటకు పచకుల బ్రహ్మన్న యను వీరుని పంపుమని నలగాముని ప్రోత్సహించెను. నల గాముడు పచకులునికి విడియమిచ్చి యుద్ధమునకు బంపెను. అతనిని వారించుటకు బ్రహ్మన్న అడపకేశవదాసిని పంపగా, పచకుల బ్రహ్మన్న ఆతనిని సంహరించెను.

కొమ్మరాజు ముందుగా బ్రహ్మన్నయాజ్ఞ గైకొనక యుద్ధరంగమునకు పోగా ఆతని కన్నులకు అంధకారము క్రమ్ముట: అంతట అతడు తిరిగివచ్చి బ్రహ్మనాయుని మన్నింపవేడి తనకు యుద్ధరంగమునకు పోవుటకు అనుజ్ఞ నిమ్మనుట: బ్రహ్మనాయుడు విడియమిచ్చి తన విశ్వరూపమును చూపి, కొమ్మరాజు కులదేవతయగు అంకాళదేవిని భువికి దింపించుమని అతనికి చెప్పుట: కొమ్మరాజు అంకాళదేవిని భువికి దింపించి తాను యుద్ధరంగమునకేగుట: కొమ్మరాజును చూచి నలగామునివీరులు అడలిపోయి నాయకురాలిచెంతకు పోగా, ఆమె వారికి ధైర్యము చెప్పి సైన్యముల నాయత్తపరచుట.

బాలుడు దివికేగ బాదరాజపుడు
కారుబొల్లనినెక్కి కలనికినడిచి
ఘోటకఘనభటకోట్లనుదునిమి
తనపాలిమొనలన్ని తానుగ్గుచేసి
మడసెను చెన్నుని మదితలంచుచును
అదిచూచికొమ్మరాజధికరోషమున
ప్రళయాగ్నిరుద్రునిపగిది చెన్నొంది
"కామునిపనియెంత కలను నాకెంత
చెలగినిర్ధూమంబు చేసెదన"నుచు
పట్టపేనుగునెక్కి పగతురపైకి
విలుగుణధ్వనిచేసి వేగ తాకదలె
ఆవేళనెత్తంబు లాడుచునుండి
బ్రహ్మనయూరకె ఫక్కున నవ్వె
అందుకు సుంకరి అరుదందియడిగె:

"నవ్వకారణమేమి నాయుడానీవు
ఈయకారణహాస్య మిదియేమిచెపుమ"
విని బ్రహ్మనాయుడా వీరునకనియె:
"వినవోయి సుంకరి విశదంబుగాను
నే నవ్వినందుకు నీమదిలోన
శంకింపవలదు నేసకలంబు తెలియ
చెప్పెద నామాట చేకొనివినుము
కొమ్మరాజిప్పుడు క్రోధాగ్నితోను
గమకించి సంగరాంగణమునకేగి
ఒప్పారచేసెడి యుద్ధకర్మంబు
చాలించి సర్వము చాలించినట్లు
మనవేలమున కిపుడు మరలిరాగలడు
అనినేనునవ్వితి నంతియెకాని
మరియిక వేరొక్కమాటలేదయ్య."
అనవిని సుంకరి యదిమంచిదనుచు
నాయునిమాటకు నవ్వుచునుండె
ఆవేళ కొమ్మరాజధికరోషమున
కామభూపతిమొన గ్రక్కునచొచ్చి
నలుదెసల్ చూచిన నడుకలనిలోన
కనులకు పగవారు కానరారయ్యె
మెరసినరవి యస్తమించుచందమున
అంధకారముగప్పె నారాజుకపుడు
అందుకు కొమ్మరాజాశ్చర్యమొంది
"ఇదియెంతచోద్యంబొ యిదియెంతవింతొ
ఏనుయుద్ధానకు నేతెంచునపుడు
కామునిసేనలు కనుపించుచుండె
పిదప నాసైన్యముల్ కనుపింపవయ్యె
కడువేగమున నంధకారముకప్పె"
అని విస్మయంబంది యచ్చోటుబాసి

వేగమునను తనవేలమ్ముచేరి
బ్రహ్మన్నకనుగొని పలికె నిట్లనుచు ;
"ఓ నీలవర్ణుడ యో బ్రహ్మనేడ
నేను యుద్ధానకు నేతెంచునపుడు
సకలంబు చూచితి సమరంబునందు
కడపట పగతురు కానరారైరి
నీకుదెలుపగ వస్తి నీరజనాభ"
అని రాజుపలికిన నాబ్రహ్మనేడు
తనవిష్ణుమాయ యా ధరణీపాలునకు
తెలుపంగవలెనని దిగ్గునలేచి
తనచేతి శంఖతీర్థముబుచ్చి యతని
కన్నులుదడిపిన గ్రక్కునతెలసె
కడువేగమున నంధకారమ్ము విచ్చె.
నలుదెసల్ పరికింప నాయుడిట్లుండె
ఆరాజుచూడ్కుల కతులితంబైన
సరిచతుర్భుజములు శంఖచక్రములు
గరుడవాహనమును కాంచనాంబరము
పరికింప కౌస్తుభాభరణంబు కలుగ
ఇంపారకనుగొని 'యిందిరానాథు
డీ మహాత్ముడెకాక యిన్నిజగములకు
వేరె నేనొకచోట వెదకనేమిటికి'
అనుచువిస్మయమంది యాత్మతెలివొంది
"ఓపుండరీకాక్ష యోజీవరక్ష
ఓనిత్యకళ్యాణ యోశ్యామలాంగ
స్థిరబుద్ధి నీచేత సెలవుగైకొనక
వేగిరంబుననడచి వెఱ్ఱినైపోతి
నీసెలవునాకిచ్చి నీకృపయుంచి
నన్నంపుకలనికి నాయుడబ్రహ్మ"
అనిరాజుపలికిన నా బ్రహ్మనీడు

కనుగొనిపలికెను గారవంబెసగ :
"వీరసోమునిపుత్ర విమలచారిత్ర
సరససద్గుణజాల సంగీతలోల
కలితకీర్తివిశాల ఘనసత్యశీల
కమలాప్తకులవర్య గాంభీర్యధుర్య
రణపట్టమునకును రాజసంబొప్ప
గట్టిగాపట్టంబు కట్టితినీకు
అదిగాక నీకు నా యాత్మచెప్పెదను
రట్టడై మలిదేవరాజుకు నొసల
పట్టంబుకట్టితి బాగుగానిపుడు
అంతకంటెను నిన్నునధికునిజేసి
మోకాలిపట్టంబు మొనసిగట్టితిని
మలిదేవరాజుకు మాపటికొలువు
చేసి రేపటికొలువు చేతు నీకెపుడు
మీరు రాజులుకాన మీ వద్దనేను
ఉభయప్రధానినై యుండుచో నన్ను
చెల్లబో సెలవడగ చిత్తమెట్లొప్పె
నీ ముద్దుమరదలు నీలకంధరులు
మలిదేవరాజులు మండలేశ్వరులు
నీకుపట్టముకట్టి నిను రాజుచేసి
అరువదియార్వురి అయ్యలందరిని
నీకు నిల్లడిచేసి నేర్పుపాటించి
వెనుకొని యీ కలను వెడలియున్నారు
అది నీవెరింగియు నందరికిపుడు
సెలవియ్యదగుగాక సరగుననేను
సెలవియ్య న్యాయమా జనపాలతిలక
మీరు రాజులుకాన మీకు ధర్మంబు
సెలవిచ్చిపంపించు జాగులేమిటికి"
అనవిని కొమ్మరాజతని కిట్లనియె :

"నాయుడ బ్రహ్మన్న నరసింహమూర్తి
నీవు చెప్పినమాట నిక్కమౌనయ్య
మక్కువ నామాట మదినిలుపుమయ్య
పరికించి అలరాజు పగకొచ్చి మీరు
అందరు పంతంబులాడియున్నారు
నాకుమారునిపగ నాడెల్లనెరుగ
నీకుమారుడు తీర్చె నెమ్మితోడుతను
బాలుడు తమ్ములు బాదరాజన్న
మొదలైనవారలు ముందరమడిసి
ఒరగగా నే జూచి యుండన్యాయంబె
ఒకరొకరికి సెలవునొప్పుగా నిచ్చి
కలనిలోనోరిగింప కారణంబేమి
అయ్యలందరు చూడనంపుము నన్ను
అంపిన పగవారి నందరిచంపి
కామునిబట్టి నీకడకు పంపెదను
కదనమున పగతురఖండించివైచి
వేగమే నేవత్తు వీరావతార
అదిగాక వీరులకందరికంటె
ముందరసెలవిచ్చి ముదమొప్పపంపు
ఈవు స్వతంత్రుడ వీవు దేవుడవు
కార్యంబుసెలవీయ కర్తవందరికి
అనుజులతోగూడ నంపుమునన్ను
ఇంక మారుత్తరం బిచ్చితివేని
చెన్నకేశవమూర్తి శ్రీపాదమాన"
అనుచు రాజేంద్రుడు నాత్మలోపలను
ఇరవొంద నిష్ఠీకరించి పలుకుటయు
అదివిని రంజిల్లి యాబ్రహ్మనేడు
పరికించి కొమ్మభూపతితోడపలికె
"మనమార నీచిత్తమందున్నయట్లు

సాధించివిడుతువు చయ్యన"నుచు
చెలువారనేగురి చేరంగపిలచి
తెలివిగా ఫాలమున తిలకంబుతీర్చి
కొమ్మరాజునకు చాల గురుతింపరాని
మంత్రమర్మముదెలిపి మరియు నాయుండు
మంత్రపిండముచేసి మమతదైవార
"ఏపార దేవతులెల్ల జూడగను
మీపాలిమొనలెల్ల మీరుఖండించి
దివిజులుమెచ్చంగ తేజంబుమెరయ
విచ్చేయుడ"ని మరి విడియంబులిచ్చి
కదనస్థలమునకు గమనించువేళ
బాగొప్పరాజుతో బ్రహ్మన్నపలికె :
"కొమ్మభూపాలక కోపించవలదు
మనకు నందరికి సమ్మతమైనదొకటి
చెప్పెదనామాట చేకొనివినుము
తిలకింప మీవంకిదేవిరాజులకు
సొంపార వజ్రాంగిజోడుగానున్న
అంకాళదేవత నందందభువికి
దింపించుమోరాజ ధీరాగ్రగణ్య
మనసున నీకనుమానమైయున్న
తెలిపెదనొకమాట తెల్లముగాను
అరిభయంకరనీవు అనిలోననిలచి
కోపించినప్పుడే కుతలమల్లాడు
సాగరంబులనేడు సరగునపట్టి
గ్రుక్కగాగొన్నట్టి కుంభజుమాడ్కి
కామునిదళముల కదసినక్షణమె
ఆపోశనముగొందు వదికల్లగాదు;
యుగములుజగములు నున్నయందనుక
పల్నాటివీరులభాగవతంబు

ఆచంద్రతారార్కమైయుండవలయు
చెలరేగికథలలో చెప్పినయట్లు
చూప చూడనుగల్గి సొంపొందవలయు
దింపించుశక్తిని ధీరుడభువికి
అదినీకుసమ్మతంబవుగాదె"యనిన
విని బ్రహ్మతో కొమ్మవిభుడిట్లుపలికె :
"ఓనీలవర్ణుడ యోదేవదేవ
సర్వేశ నీకేది సమ్మతంబగునొ
అది నాకుసమ్మతం బట్లుచేసెదను"
అనిరాజు తనజోడునై యున్నయట్టి
శక్తినిదించి యాశాంభవికనియె
"పరమకళ్యాణి యోపద్మాక్షినీవు
నాయుడు ఏబుద్ధి నడిపించినాడొ
ఆబుద్ధినుండుమా యంకాళదేవి"
అనియొప్పగించిన ఆదిమశక్తి
బ్రహ్మనాయునితోను పలికె దీనతను :
"శీలమరఘురామ చెప్పెదవినుము
మావారు కళ్యాణమందుననుండి
ఘనరాజ్యసంపదల్ కడకుపోద్రోసి
పొలుపొంద నీవిష్ణుప్రోలికందరము
లోనుగావస్తిమి లోకంబులెరుగ
నీవుబెట్టినచిక్కు నీవెరుంగుదువు
అందరి నీమాయ హతముచేసితివి
పరగంగనిటువంటి పనియూహచేసి
నన్నెడబాపను న్యాయమానీకు
ఏమనివగతును ఏమిచేయుదును
ఏమనివిలపింతు నేనందునింక
రాజుఅయ్యలతోడ రణభూమిలోన
గట్టిగా తనకొరుగంగ కారణము

లేకపోయెను లవలేశమాత్రంబు
నినునమ్మినందుకు నీవుమామీద
దయనుంచవైతివి దానవారాతి
భుక్తిముక్తులకును భువనేశనీవు
కర్తవన్నిటికిని కాన చెప్పితిని"
అనిప్రలాపించెడి హంకాళిచూచి
అనియెనాబ్రహ్మన్న యాత్మచింతించి :
"అంకాళదేవి యో యాదిమశక్తి
నీకింతవగ పేల నీరజగంధి
ముదమొప్ప భుక్తియుముక్తి గల్పింతు
రట్టడియావీరరణమునేమరక
కనిపెట్టియున్న యాగంగలలోన
నిన్నుఘనముగచేసి నీకు ముందరను
ఆహూతిచెల్లింతునదికల్లగాదు
మామూర్తియెన్నాళ్ళు మహిమీదగలదో
అన్నాళ్ళు మాలోన నైక్యంబుజేసి
పోతులరాజును పొసగ గంగలను
నిన్నుపీఠంబున నెమ్మితోనిలపి
మమ్ముకొలుచుచున్న మనుజులచేత
నేనిన్ను గొలిపింతు నిదికల్లగాదు"
అనినసంతోషించి హంకాళదేవి
నాయునిపరిచారనాంచారిబోలి
ఉండె కార్యమపూడియుద్ధరంగమున
ఆవేళకొమ్మరాజరువదేగురికి
కరపంకజంబులు గ్రక్కునమొగిచి
యుద్ధసన్నద్ధుడై యొప్పారకదలె
దారలుభేరులు తమ్మటధ్వనులు
నఫీరీలు గిడిగిళ్ళ నాగవాద్యములు
మలహరిధ్వనులకు మదితల్లడిల్లి

కాముని సేనలు కళవళంబంది
రాజువేలము జొచ్చె రణభూమి విడిచి
పగవారివీరులు భ్రమపొందిరంత
అప్పుడు నాయురాలందరిచూచి
"ఇదియేమి భీతిల్లి యిందరునిటుల
వచ్చితిర"నవిని వారలిట్లనిరి :
"ఓనాగసానమ్మ ఒనరంగనీకు
చెప్పెదవినవమ్మ చెలరేగిరాజు
కదలివచ్చెను తానుకదనంబుచేయ
కాలాగ్నిరుద్రుడొ కాలభైరవుడొ
కాలుడో లయకాలకాలుడోయేమొ
భూనభోంతరమెల్ల భుగభుగమండు
భానుడో యలచిత్రభానుడోచూడ
పటుపరాక్రమ వీరభద్రుడోయనగ
విలసిల్లుచున్నాడు వీక్షింపతరమె
అతనిధాకకువెరచి యరుగుదెంచితిమి"
అనవిని నాయురాలప్పుడిట్లనియె :
"తెరగొప్పనెలుగుచే దెబ్బలుపడియు
వెనుకమంగలముకు వెరచినయట్లు
పారిపోవంగను పందలెమీరు
మనలపోరునగెల్చు మానవులెవరు"
అనుచు సేనలభీతినందందతీర్చి
బాగుగా బలమేరుపరచుచునుండె.

*కొమ్మరాజు తాను యుద్ధమునకు వచ్చిన వార్త నలగామున కెరిగింపుమని భట్టును పంపుట : ఆ వార్త విని నలగాముడు కళవళపడి దళము లేర్పర్చుమని నాయకురాలితో చెప్పుట : నాయకురాలు జోదుల సోమ*

*శేఖరుడను నొక ధనుర్విద్యాచార్యుని కొమ్మరాజు మీదికి పంపుట: యుద్ధమున కొమ్మరాజుసోదరులు మడియుట.*

ఆవేళకొమ్మరాజధిక రోషమున
తమభట్టురాఘవు తనుచేరపిలిచి
కట్నంబులిచ్చియు "కదనంబు కేను
కదలివచ్చినరాక కామునికీవు
ఎరిగింపుమ"నినను ఏగిరాఘవుడు
కామభూపాలుని కనుగొనిపలికె :
"రాజరాజాధీశ రాజపరమేశ
రాజకులాన్వయ రాజదేవేంద్ర
తపవరగండాంక ధరణీవరాహ
శశికులసౌభాగ్య చతురపుణ్యుండ
మానదుర్యోధన మైలమ్మసుతుడ
అనుగుభూపతిపుత్ర యమితచారిత్ర
వీరకామనరేంద్ర వినుముభూపాల
సూర్యవంశమునందు శోభిల్లురాజు
వరుసతో రఘురామవంశపురాజు
వీరసోమునిసుతుడు విమతసంహారుడు
రహిమించుజగతిలో రాజులకెల్ల
రణముకుత్తుకబంటి రమణతోధనకు
బవరంబు మోకాలిబంటిగాతలచు
ప్రేమ నీశ్వరుని మెప్పించినరాజు
కొమ్మభూపాలుండు కులశేఖరుండు
ఆయనపుత్రుని అలరాచమల్లు
మంత్రతంత్రంబుల మడియించినావు
కడలేనిపాపములు కట్టుకొన్నావు
కూతురి నలుని కుంభినిమీద

చలపట్టియూరకె చంపించినావు
నెలకొనికంటికి నిద్రెట్లువచ్చె
అన్న మెట్టుల హితవాయెనునీకు
నిర్దయపరుడవు నీతిహీనుడవు
కాన నాడికె బొందగావలెనెనీకు
ఆరాజుపగవనై యరువదేగురును
ఆయనతోడనే హతమౌదుమనుచు
వీరులు ప్రతినగావించి యేతెంచి
కలనవిడిసిరి పిదప గ్రక్కునరాజు
తనకుమారునివెంట తానేగవలసి
రణభూమికేతెంచి రాజశేఖరుడు
నన్నంపె నిచటికి నలగామరాజ
వేవేగకలనికి విచ్చేయుమయ్య"
అనివిన్నవించిన ఆకామరాజు
మదిలోన నిది తథ్యమౌననివగచి
తనదునేరమునకు తనలోననియె :
'మదముననువొప్పంగి మంచంబునెక్కి
వెనకవావులుతెల్పు వెఱ్ఱితనంబు
నెట్టనవోయిన నీళ్ళకుకట్ట
కట్టనూహించిన గతిగాదెయిపుడు
కాక యీతలపుల కారణమేమి'
అనుకొనిధృతిబూని యాత్మలోతాను
భట్టురాఘవునకు పదివేలుచేయు
కట్టువర్గములిచ్చి కామరాజపుడు
అభట్టు నతివేగనంపినపిదప
నాయురాలినిచూచి నయముతోననియె:
"వింటివా నాగమ వివరంబుగాను
కొమ్మభూపాలుడు ఘోరాజినడుమ
పన్ని సన్నద్ధుడై భట్టునంపించె

తరళాక్షి నీవును దళమేరుపరచి
ఎరిగించుమ" నినను ఇంతియేతెంచి
బలమెల్లశోధించి పతికినిట్లనియె
"మీయానతిప్పుడు మేకొనియేను
అరసివచ్చినక్రమమంతయుదెలియ
వినుపింతు నీకునేవీరకామేంద్ర
తెరగొప్పఛప్పన్నదేశాధిపతులు
పంపులంపినయట్టి బలములెక్కింప
ఇరుమూడులక్షలు నిరువదివేలు
అదిగణింపగనేను ఆలస్యమనుచు
ఇదివేళకాదని యెన్నలేదయ్య
బలమెల్ల నాయత్తపరచివచ్చితిని
ఆబల మీబలమంతయుగూర్చి
అంపింతురాజుపై నవనీశతిలక"
అనినను కామరాజప్పుడిట్లనియె :
"ఎవ్వరెవ్వరిదళమేర్పాటుచేసి
అంపించవలయునో యదికార్యసరణి
కాక దొమ్మికి నంపగాగూడదిపుడు
బాగొప్ప కొమ్మభూపాలునిపాలి
దళముపంపించుట ధర్మంబుమనకు."
అనవిని నాయురాలౌగాకయనుచు
సొంపార జోదులసోమశేఖరుని
పిలిపించి విడియంబు పెంపారనిచ్చి
నాయురాలిట్లనె నయముదీపింప :
"విను సోమదేవుడ వీరశేఖరుడ
వినుముచెప్పెద నీకు విశదంబుగాను
కొమ్మభూపాలుండు ఘోరాజినిలిచె
అతనిసాహసంబలతియేతలప
కోదండదీక్షాదిగురువరేణ్యుండు

అదిగాక బహుళదివ్యాస్త్రసంయుతుడు
ఆరాజు విలువిద్యనధికుడు, నీవు
ఎక్కుడువిలుకాడ వి వ్వసుంధరను
వివరింప నీపాటి విలుకాడులేడు
కుంభసంభవుడు తా కురుపాండవులకు
విలువిద్యచెప్పిన విధముదీపింప
ఆచార్యుడై నీవు అనుగయ్యసుతుల
కందరకు విలువిద్య నర్థిచెప్పితివి
అటుగాన రాజగురువనగ మించితివి
ఎవ్వరునీసాటి యీలోకమునను
ఏతరి పొడగాన మిదితథ్యమయ్య.
అటుగాన నేడింక నావహకేళి
సమకట్టినీవును సాహసంబొప్ప
రాజును దునుమాడి రమ్మపొమ్మనిన"
ఆమాటవిని సోముడధికరోషమున
వేవేగ తొంబదివేలకాల్బలము
బలుఘోటకంబులు పదిరెండువేలు
కుంజరంబులువేయి కుంతముల్ లక్ష
శూలాలబండ్లను సొరిదినేనూరు
పెద్దఫిరంగులు పిల్లగోవులును
పదిపదివేల తుపాకీలతోడ
కదలెజోదులసోము కామునికెరగి
భేరీలమ్రోతకు పృథివికంపింప
చెచ్చెరభటకోటి సింహనాదములు
ధరణి మిన్నును నొక్కటాళమైమ్రోగ
ఆర్పులబొబ్బల నవనిఘూర్ణిల్ల
కామునిసేనలు గ్రక్కునగదిసి
సునిశితాస్త్రంబుల సోనలుగురియ

గా చూచినవ్వుచు కమలాప్తకులుడు
చెచ్చెరనలజడి సేనలుబెదర
విలుగుణధ్వనిచేసి విజయుచందమున
దినకరాన్వయుడెడద్రెవ్వని యంప
దొనలయమ్ములుగొని దుర్దాంతుడగుచు
అందరనేడింట నైదింటనేసి
ఘనశైలములబోలు గజములపట్టి
తునియలుగానేసి తుండముల్ద్రుంచి
తనువులుచెక్కాడి దంతముల్పెరికి
మావటీలందరి మర్దించివైచి
బాగొప్పశూలాల బండ్లపైకురికి
చక్రంబులెల్లను చక్కుచెక్కాడి
చక్రరక్షకులను సమయించిమించి
అశ్వతండమ్ముల హతముగానరికి
ఆశ్వశిక్షకులను అందరబట్టి
విదళించి ఖండించి విండ్లుదున్మాడి
దొరకొని వాజులతోన పక్కెరల
తోన భూషణములతో చేతనున్న
అక్షికుంతపరిఘపట్టిసములతోడ
బళియురౌతుల పరలోకమనిచె
కరములునురములుకంకటంబులును
శిరములుసరములుచెవులుచేతులును
మేనులుతొడలును మెరుగుకైదువులు
పక్కలుపిక్కలు పండ్లునుకండ్లు
ఎరుగరాకుండ ననేకబాణముల
నలినలిగాజేసె నలగాముసేన
లలితమై యింద్రజాలముచూపుకరణి
కనుపట్టియుండెను కలనిమధ్యమున
వేడుకనెదిరిన వీరులచేతు

లాడకయుండ చెండాడె, నారదుడు
ఆడె, లోకముకొనియాడె, పెల్లట్ట
లాడె, నెత్తుటనోలలాడె భూతములు,
ఈతెరంగున రాజు ఏపుదీపింప
చేతులకసిదీర చిత్రంబుచేసె
కొమ్మభూపాలుని కోపదావాగ్ని
తనుముట్టియున్నట్టి దళములనెల్ల
తలకొనికాల్చియు దగ్ధంబుచేసె
అదిగని నాయురాలాశ్చర్యమంది
ఇదియెంతచోద్యంబు ఇదియెంతవింత 390
ఈరాజువిలువిద్య నేమనవచ్చు
వెనుకొని కనురెప్పపెట్టుమాత్రమున
కనిబలమ్ముల చాపకట్టుగాకూల్చె
ఈతనిగెలువంగ నేరాజునోప
డని చాలచింతించి యానాగసాని
పరగఘోటకనాగభటసమేతముగ
అని ననేకబలమ్ములంపె నత్తరిని
పరగంగ రణములోపలనుండువారు
మునుకొని యొకచోటమూకయై తాము
సుడియకుండినచూచి సోమనాయకుడు 400
"మెరసి నేనుండగ మీకేలభయము
సరిరాజుదునుమాడి జయముచేకొందు"
అని యభయముదెల్ప నందరుకూడి
పరగవెన్కొనివచ్చుబలములకలసి
ఆర్చుచుకదిసిన అదిచూచిరాజు
ప్రళయాగ్నిరుద్రునిపగిది చెన్నొంది
విల్లందబూనిన వీక్షించివేగ
తమ్ములునల్వురు తనుచేరవచ్చి
రాజితంబుగమ్రొక్కి రాజుతోననిరి

"గురుతరగుణజాల కొమ్మభూపాల
సెలవుమాకిచ్చిన సేనలనెల్ల
చలపట్టిమర్దింప చాలమే మేము"
అనవినికొమ్మరా జప్పుడిట్లనియె:
"గొనకొనికాముడు కూర్చినబలము
ఆపోశనముమాకు నంతియేకాక
బవరంబుచేయను బలమేడగలదు
మనమీదనేతెంచి మడయుటెకాని
మనతోడపోరాడ మహిపతుల్ లేరు
ఆతెరంగెరుగుదు అదియునుగాక
పుత్రునిపగకునై భూతలంబెరుగ
అరువదియేగురు నయ్యలుమనము
అనిలోనపగవారి హతముగావించి
మానకవెనువెంట మనమేగవలయు
అటుగానవైరుల ననిలోనదునిమి
మీపాలిమొనలను మీరుఖండించి
దివిజులుచూడంగ తేజంబుమెరసి
విచ్చేయుడ"నుచును వీడ్యంబులిచ్చి
అంపినరాజులు అన్నకుమ్రొక్కి
కోదండములు వంచికొనియార్చిరపుడు
నలుగురుఏతెంచి నడుకలననిలిచి
శరపరంపరల నాసేనలమీద
బరపంగనప్పుడు బలములన్నియును
చుట్టుకఅప్పుడాశూరులమీద
శరవృష్టిగురియించి ఝాంకృతుల్ చేసి
ముసలతోమరకుంతముద్గరహేతి
పరశుపట్టిసశూలబహువిధాస్త్రముల
సోనలుగురిసిన చోళభూవిభుడు

శరశరాసనములసంధించియేసె
పగతురువేసిన బాణజాలముల
తమచేరనీక యుద్ధతి ద్రుంచివైచె
పలుబాణములచేతబలమెల్ల నేల
పడుచున్నచందంబు భావించిచూచి
సోముడు ఘనబలస్తోముడై యుండి
తనతమ్ములంబిలిచి తానిట్టులనియె:
"సోదరోత్తములార సుజనాప్తులార
వీరశేఖరులార వినుడుచెప్పెదను
రాజుతమ్ములువచ్చి రణభూమిలోన
మనబలమంతయు మడియించిమించి
ఊరకయెదురులేకున్నారుపొంగి
మీరుమీబలములు మేకొనిపోయి
దురములోవారిని దునుమాడిరండు."
అనవిని వారలు అధికరోషమున
చనుదెంచి శరవృష్టిచాలవర్షింప
వారలగనుగొని వసుమతీశ్వరులు
సడలని లయకాలసమవర్తులగుచు
తడయక యాపేదదళములన్నిటిని
చంపబూనుట యేమిసాహసంబనుచు
నలుగురిదొరలపై నాగబాణంబు
సంధించియేసిన సమరరంగమున
ఉరవడిమంటల నుమియుచువచ్చి
అందరిచేతుల నంటించినట్లు
విరిచికట్టిన నంత వెనకొక్కశరము
నేసిన నాశరమేపారవచ్చి
చెచ్చెర నెనిమిదిచేతులుద్రుంచె
కరములుదెగిన దిగ్గజములపోలి

కలుషించి కుతికలుకరచెదమనుచు
తెగువమై తమనోళ్లు తెరుచుకరాగ
చోడభూపతులును గ్రుక్కుచువేగ
'వీరలుప్రాణముల్ విడుచుచువచ్చి
ముట్టుకొన్నను పాపములువచ్చున'నుచు
సరిలేనియొకయర్ధచంద్రబాణంబు
సంధించియేయ నాశరముమందుచును
వారలశిరములువడిమీరద్రుంప
తడయకాశిరములుధరమీదగూలె.
తమ్ములుపడుపాటు తా కన్నులార
చూచి జోదులసోముగ్రుక్కికోపమున
బంధురంబగుచు వెల్వలనులోపలను
కోపంబుశోకంబుఘూర్ణిల్లుచుండ
భీకరాకారుడై భీమవిక్రముడు
బలములకోపించి పల్కెనత్తరిని:
"మెరసివెన్కను మితిమీరినదళము
కలిగియుండగ వెరవగానేలమీకు
నలుగురుమన్నీలు నడుకలనిలోన
రూపించియుండంగ రోషంబుమీకు
లేకపోయెను, లవలేశమాత్రంబు
ధర్మయుద్ధమూని తమకించిమించి
అందరుదొమ్మిగా నటుకమ్మిక్రుమ్మి
కదలమెదలగనీక గ్రక్కునగవిసి
చేతులెత్తగనీక చేవయుక్కణగ
చేసిన లోపడిజిక్కుదురు మనకు"
అనవినిసేనలు అల్లకల్లోల
మగునట్లుగా నప్పుడార్భటిచేసి
దొమ్మియుద్ధమునకు దొరకొనునపుడు
అనుజులతోడుత నాచోళరాజు

అన్నదగ్గరకొచ్చి యప్పుడిట్లనియె:
"మాపాలి దళములు మానవాధీశ
ఖండించితిమిచాల కలనిమధ్యమున
మమ్ముల నొరిగింప మహిపతుల్ లేరు
అందుకెట్లోయని యడుగవచ్చితిమి."
అనవిని కొమ్మరాజనియె నూహించి :
"చోళభూపతి! వీరసోముకుమున్ను
ఈ శస్త్రజాలంబు నిచ్చెశంభుండు
అదియెల్ల గైకొని యతడిచ్చెమనకు
అదిగాక అలరాజు కాదిత్యుడొసగె
సూర్యభేతాళంబు సునిశితాస్త్రంబు
ఇన్నియుఅలరాజు ఇచ్చెనుమనకు
అటుగాకశస్త్రంబు లరసిజూచినను
దివిజులిచ్చినయట్టి దివ్యబాణములు
దివ్యాయుధంబులు దీప్తమైవెలుగు
అవి సాధనములిప్పుడై యున్నకతన
మనలగెలువగలేరు మానవేశ్వరులు
అటుగాన ఒరుగుటకాత్మచెప్పెడిని
తక్కక దివ్యాయుధంబులుడించి
కురుచకైదువులెల్ల గురుతుగాపట్టి
ఎసగవైరులమీద నేగుడుమీరు"
అనవిని చోళరాజౌగాకయనుచు
దివ్యాయుధంబులు తెరగొప్పడించి
ముద్రించి తమయన్నముందరపెట్టి
కురుచబల్లెంబులు కుంతఖడ్గములు
ధరియించిరాజుకు దండంబుబెట్టి
అలచోళరాజును అల్లాడిరాజు
అలరుముప్పిడిరాజు అలనూకరాజు
కోపుకోపునవార్చి కుప్పించిదాటి

సేనలపైకురికి చెండాడిమరియు
ఘోటకంబులనెల్ల కుప్పగాగూల్చి
రౌతులఖండించి రణవీథిద్రోచి
కుంజరంబులనెల్ల గుదులుగాగ్రుచ్చి
మావటీలనుకుమ్మి మహిమీదనూకి
శూలాలబండ్లెల్ల సుడిబడగొట్టి
పోటుబంట్లనుబట్టి పొట్టలుచించి
బలుపైనమన్నీల బట్టుకత్రుంచి
కుంతంబులెల్లను కొనలుఖండించి
బిరుదుటెక్కెంబులు పృథివిపైకూల్చి
సకలాయుధంబులు చక్కులుచేసి
కాల్బలంబులుద్రుంచి గగ్గోలుపరచ
విరిగెకామునిసేన విరిగెకాలారి
తలచెడిపోవు నాదళములందరిని
మరలించుకొని సోమమండలేశ్వరుడు
"మరువకమానాభిమానముల్ మీరు
తలచుకొండ"నినను దళమెల్లక్రమ్మి
అందరుదొమ్మిగా నందందపొడవ
పేటులపోటుల నేపెల్లతరిగి
పోలుపొందరొమ్ముల పోటులునాటి
ఒసగపీపునవెడలె నొనరవజ్రంబు
వెడలంగబొడిచియు వేసిరమ్ములను
కన్నులగప్పెను ఘననారసములు
సొరిదిమేనుల నుక్కుసురియలునిండి
వేవేగనలుగులు వెడలినట్లుండె
కుంచాన నమ్ములుకొల్చినయట్లు
పోటురక్తంబులు భుగభుగదొరుగ
జొత్తుపాపలమాడ్కి శోభిల్లుచుండి
అలుగులపొన్పుగా నవనిపైనొరుగ

దివిజులుకనిమెచ్చ దిక్పతుల్ పొగడ
మాచెర్లచెన్నుని మదిలోనదలచి
శ్రీగిరీశుని తమచిత్తమందుంచి
బ్రహ్మన్న నాత్మలోపలనుంచితలచి
అరువదియేగురియయ్యలదలచి
తమయన్నకొమ్మభూతలనాథునెంచి
నలుగురురాజులు నడుకలనిలోన
వేవేగ ప్రాణముల్ విడిచిరత్తరిని.

*కొమ్మరాజు జోదులసోమునితో దునుమాడుట : నాయకురాలు నలగామునితో ఆలోచించి, ద్వొమ్మి యుద్ధముచేయ కొమ్మరాజుపైకి వివిధదేశాధిపతులను పంపుట.*

తమ్ములు నల్వురుద్దండసాహసులు
ధరణిపై నొరిగిన తనకన్నులార
కనుగొని యారాజకంఠీరవుండు
తరుచైన తనకోపదావాగ్నిశిఖల
దట్టమైరణభూమి దార్కొన్నపిదప
బలువిడి చతురంగబలములవిడిచి
మొనలకునడువగ మునుకొనిరాజు
మదముననుప్పొంగు మత్తవారణము
పైనెక్కి కోదండపాణియైనడువ
అప్పుడుసోముడు అలుకదీపించి
గజతురంగముఖ్యకాల్బంబులను
పురికొల్పతాకెను భువనముల్ వణక
ఉభయసైన్యంబులు నురవడిగలసి
ఏనుగులేనుగ లీటెలీటెలును
సుభటులుసుభటులు శూరులుశూరు
లరదంబులరదముల్ హారులునుహారులు

శూలాలబండ్లును శూలాలబండ్లు
వీరులువీరులు విండ్లునువిండ్లు
కాల్బలంబులు మరి కాల్బంబులును
బాణముల్ బాణముల్ బంధురంబగుచు
శిరములుశిరములు చెక్కుచెక్కులును
కరములుకరములు కాళ్ళునుకాళ్ళు
పెనగొనిపెనగొని భీకరాకృతిని
ద్వంద్వయుద్ధముచేయ తలపడిరంత
వసుధలో కలిగిన వనసమూహంబు
ప్రళయమారుతముచే పడినచందమున
కడగిదలములు చాపకట్టుగాపడియె
అపుడుజోదులసోముడశ్వంబుడిగ్గి
కడు వేగమున మత్తగజముపై నెక్కి
బాణబాణాసనపాణియైనిలిచి
రాజుతోననియెను రాజసంబొప్ప:
"కొమ్మభూపాలక గురుతింపరాని
రణగరిష్ఠుండవు రాజులలోన
పట్టపురాజవు పరికింపనీవు
కానయెవ్వరు సరి గాలేరునీకు
నన్నునీసరిచేసె నలగామరాజు
ననుగెల్వతరమౌనె నాకేశుకైన."
అనవిని కొమ్మరాజనియెనవ్వుచును:
"ఔదువుశూరుండవౌదువు నిన్ను
సమరంబులోపల సాటిగాచేసి
నిలిపిరితథ్యంబు నిజమౌనుమున్ను
అదినేడుసమకట్టె నాహవంబునను
నాముఖాముఖినిల్చి ననుగెల్చియిపుడు
వడిమీరశూరుడవైపొమ్ము నీవు"
అనినజోదులసోముడాగ్రహంబునను

వెలయంగతూపులు వేయంగదొడగె
ఏసినబాణంబులెల్ల నాతండు
వాసిగాఖండించె వడినారసముల
మరియుననొక్కటి మార్గణంబేయ
నడుమనెఖండించె నారాజవిభుడు
అతడేయుబాణంబు లరవాయిగొనక
పలికెనత్తరిరాజు బవరంబునడుమ
"ఓయిజోదులసోము ఓవీరవరుడ
నీవేసినట్టి యా నిశితశస్త్రములు
ఏత్రోవబోయెనో యెరుగనేనిపుడు
ఏనొక్కసాయకం బేసెదచూడు."
అనుచుబాణముబూని యతడంతనేసె
తోడనేవిలునారి తునుకలై పడియె
విలుదునుకలైనను వివశుడై యతడు
వేవేగవేరొక్క విల్లుసంధించి
రోషించికోపాగ్ని రుద్రుడై పేర్చి
సమరంబులోతనకు సాధనంబైన
దివ్యబాణంబులు దివ్యమైతనరి
ఉన్నశస్త్రాస్త్రంబులురుశక్తిమెరసి
మరువకన్నియునొక్కమాటుగాబూని
అందుచేతనురాజు హతమౌనటంచు
కొమ్మరాజునుజూచి కోపించిపలికె :
"ఓరాజ నీతోడ యుద్ధసంక్రీడ
చేయువేడుక నింతసేపును నిల్చి
సొంపార రణకేళిచూడగానీవు
నాచేతివిల్లును నారినిద్రుంచి
అదినీకు సాహసంబనుచుమోదించి
ఉన్నాడ వుప్పొంగుచున్నావుచాల
ఇకతప్పిపోనీయ ధీబాణసమితి

పొరిగొందు నినుబట్టి పోనీయనింక
తలచుకో నీపాలి దైవసంఘముల"
అనుచును బాణంబులరిమురిదొడిగి
ఏసినశస్త్రంబులిలపింజపింజ
కరుచుకునిప్పులుగ్రక్కుచుగదిసి
ఆతని నొప్పించె నాశ్చర్యముగను
అప్పుడు రాజేంద్రుడాతనిమీద
అగ్నిహోత్రునిమీద నాజ్యంబుతెచ్చి
చిలికించినటువలె చిరచిరమండి
ఖానుడిచ్చినయట్టి బాణసంచయము
ఏపారసంధించి యేసిననదియు
అగ్నికీలలుమీర నవనిగంపింప
సోముడేసినయట్టి సునిశితాస్త్రముల
నడుమనేఖండించి నలినలిచేయ
రహిచెడి చుక్కలురాలుచందమున
అమ్ములతునకలై అవనిపైరాలె
శస్త్రముల్దునిమి యాశస్త్రజాలంబు
అందందుముంచి యాసోమునిదాకి
తనువెల్ల జర్ఝరితమ్ముగావింప
అందుచేకడునొచ్చి యతడుమూర్ఛిల్లి
అంతలో తెప్పిరి యతివేగమునను
అతడుబాణంబుల నందందవేయ
నాగంబుపదములు నాల్గునుత్రుంచి
ఖడ్గంబుదునుమాడి కరములుత్రుంచి
మండితనవరత్నమయమైనయట్టి
కుండలంబులతోడ కూల్చెతచ్ఛిరము
పడియెజోదులసోము బవరంబులోన
అంతయు భావించి హతశేషులపుడు
విరిగివిజోడులె వేలంబుచేర

కనినాయురాలంత కాముతోననియె :
"వీరకామేంద్ర యోవిభవదేవేంద్ర
సోదరయుతముగా జోదులసోము
నాజిలోద్రుంచియు నాకొమ్మవిభుడు
మనమీదనేతెంచె మానవాధీశ
మితిమీరికార్యంబు మించినమనము
వెనుకచింతించుట వెఱ్ఱితనంబు
మరువక నేనొక్కమాట చెప్పెదను
ధర్మయుద్ధముమాట తలపోతమాని
దొమ్మిగా రాజును దునిమించవలయు
తిలకించి ఛప్పన్నదేశాధిపతుల
సెలవిచ్చిపంపించు జనపాలతిలక
మనమేలుబలముల మన్నెనాయకుల
అందరపిలిపించి యంపెదనేను
తిమురుచున్నట్టి యీ దివ్యబాణములు
ఏమియుపనిగొన వీరాజుమీద
ఏమికారణమొకో యెరుగంగరాదు
బాణాసనముతీసిపారంగవైచి
కులిశంబుగైకొనిగురితింపరాని
వారణంబుననెక్కి వాలువాలెత్తి
వడిమీరగను చేరవచ్చుచున్నాడు."
అనవినికామరాజదిసమ్మతించి
ఒనరసాళువరాజునొడ్డెభూపతిని
మత్స్యదేశాధీశుమగధవల్లభుని
మాళవవసుధీశుమలయాళవిభుని
సౌరాష్ట్రరాజును సౌవీరఘనుని
కేకయరాజునుకేశాధిపతిని
సూరసేనాధీశుచోళభూవిభుని
కాశ్మీరభూపాలు గాంధారవిభుని

అంగభూమీశుని నాంగీరపతిని
పాంచాలరాజును బర్బరాధిపుని
పాండ్యభూపాలుని బాహ్లీకవిభుని
కుకురుదేశాధీశుకుంతలాధిపుని
నేపాళరాజును నిషధభూభుజుని
ఘోటదేశాధీశు ఘూర్జరేశ్వరుని
కరహాటమరుభోట కర్నాటలాట
కొంకణప్రముఖ దిగ్దేశాధిపతుల
రావించి నలగామురాజు వారలకు
కప్పురబాగాలు కడుప్రీతినిచ్చి
"కొమ్మభూమీశు నొక్కమ్మడిగూల్ప
రండ"న్నవారలు రాజుకుమ్రొక్కి
కదిలిరి దిగ్దేశఘనవీరవరులు
తమతమబలములు తగిలికొల్వగను
నాయురాలా వేళ నగరేలుబలము
నమ్మినమూకల నాయకోత్తముల
రాజులమన్నీల రౌతులనపుడు
తాబిల్చివిద్యముల్ తగవేగనిచ్చి
"రాజునుదునుమాడి రండుపొండ"నుచు
పంపినవారును పటుశౌర్యమునను
రాజులుమన్నీలు రణమున మూక
లన్నియు నొక్కటై యందందమ్రోయ
పదిదిక్కులును చెముడుపట్టినట్లుండె
భోరునబలములద్భుతముగకదలి
దట్టమైనడువంగ ధరణీరజంబు
గగనంబునకుపోవుకరణిగన్పట్టె
'రాజును కొమ్మభూరమణశేఖరుని
కాముడన్యాయంబుగా ద్రుంపబూనె'
అనుచుభూదేవి తానాత్మలో పొగిలి

ఇనునకునెరిగింప నేగినట్లుండె
నెలమితోడుత నేలయీనినయట్లు
సేనలబ్బురముగ చెలరేగిగదిసె.

*కొమ్మరాజు శత్రురాజులందరి నోడించి, తనయొద్ద దివ్యాస్త్రములున్నంతదనుక తనకు ఓటమి లేదని గ్రహించి, స్వచ్ఛందమరణమునుకోరి వాటిని మోపుకట్టించి భట్టుచే బ్రహ్మన్నకడకు పంపుట: బ్రహ్మన ఆ దివ్యాస్త్రములను తిరుపావనమున ముద్రించుట.*

ఆబలమ్మంతయు నార్చిపెల్లురికి
ఏసినశరముల యేపుదీపింప
జడివానగురిసిన చందమైయుండె
అదిచూచికోపించి యాకొమ్మరాజు
కన్నుల నిప్పులుగ్రక్కుచుకదిసి
కొందరపదియింట కొందరనూట
కొందరవెయ్యింట కొందరలక్ష
కొందర కోటానకోటిబాణముల
అందరపడనేసె నతులసాహసుడు
తెరగొప్పభప్పన్న దేశాధిపతుల
పలుమారుపేర్కొని పలికెనిట్లనుచు :
"ఓభూమిపతులార యొకమాటమీకు
వివరించిచెప్పెద వినుడుమీరింక
ఘనులార యారణగండ్లకయ్యమున
మిమ్మునందరిపట్టి మెరసిబ్రహ్మన్న
దురములో బందెలదొడ్డేరుపరచి
అందులో మిముతోలి యందరిచేత
బందెలుగైకొనె ప్రాభవంబొప్ప
ఏచేటనాబందె నెన్నికనిచ్చి

మనునట్టిబందెలమారుఈవేళ
ఏరీతియుద్ధాన కేతెంచినారు
సిగ్గేమియును మది చింతింపలేరు
పొండుపొండూరకె పోరేలమీకు
మైలబంట్లైనను మానహీనులను
అరియొప్పనము లిచ్చునట్టివారలను
పుట్టలెక్కినవారి పోలేనివారి
ఆయుధంబులువైచి యరిగెడువారి
కదనంబులో పూరికరచినవారి
చంపధర్మముగాదు చర్చించిచూడ
ఐననులజ్జ లేకరుదెంచు మిమ్ము
తగినమార్గణముల దర్పమడంతు
మొనసినేన"నుచు సమ్మోహనాస్త్రంబు
సంధించివేయ నాశరమువెంబడిని
పెనుభూతకోటులు పృథ్విఘూర్ణిల్ల
శాకినీఢాకినీచయముతో వచ్చి
ఆలములోచొచ్చి యరిమురిదాక
నిద్రచెందినరీతి నిశ్చేష్టులగుచు
మూర్ఛలనొందిరి మొగికొంతసేపు
ఈరీతినుండి వారిటునటుమెదలి
లేచియూరకె యావలించెడువారు
పీడిన సిగలొగివేసెడువారు
వేవేగదుమ్ముల విదలించువారు
పడినభూషణములు పరికించువారు
'వెరపింపగాబోయి వెరచినట్లయ్యె
కటకటామనశౌర్యగతి' యనువారు
'ఉసురుగల్గినజాలు ఉప్పమ్ముకొంద
మ'నువారు నట్టుల'నౌన'నువారు

‘ఈగండ మెడలిన నింకనూ రేండ్లు
చావులేదను’ వారు ‘సందేహ మేమి
పులినాకి విడిచెను పొమ్మను’ వారు
నై లేచి వెన్కముందై పోవనపుడు
పిడుగుదాకినవారి పిదపను గొరవి
చూడినచందాన సునిశితాస్త్రముల
వీపులుగాడంగవేసె వేయుటయు
‘మునుపటికంటెను ముమ్మరముగాగ
ఇదియొకటయ్యెను నిన్నిటిమీద’
అనితలల్ వంచుక యటులుండిరపుడు
అంతట కొమ్మరాజంతరంగమున
‘దివ్యాస్త్రయోధను ధీకొని నన్ను
ఎవ్వడుగెల్వలే డీరణస్థలిని
చెలగి నావేడుకచేసి యిందనుక
యుద్ధంబుజేసితి నుర్వికంపింప
బ్రహ్మన్న చెప్పిన పద్ధతితోడ
నాపాలిమొనలను నరికివైచితిని
ఏపారనేనింక నేగంగవలయు”
అనుచు భద్రేభంబు నతివేగడిగ్గి
శరశరాసనములు సరవిముద్రించి
అమ్ములపిండ్లు శస్త్రాస్త్రజాలంబు
లన్నియుపోగుగా నవనిపై బెట్టి
భట్టుతోపల్కె నప్పార్థివేశ్వరుడు :
“భూతకోటులకు నిప్పుడుతృప్తిగల
చేసితి రణకేళి చేసితిచాలు
కరములకసిదీరె కలనిమధ్యమున
ఒప్పారనేనింక నొరుగంగవలయు
ఈ యాయుధంబుల నిన్నియునీవు
పరువడిగొనిపోయి బ్రహ్మనాయునికి

తిరుపావనమున ముద్రింపగానిమ్ము
అనగరాఘవభట్టు అప్పుడిట్లనియె:
"ఓకొమ్మభూపాల యోరాజచంద్ర
పోలి నీవారిగినచోటనే నేను
ఒరుగుదు నన్నంప నుచితంబుగాదు".
అనవినికొమ్మరా జతనినిచూచి
"అంతసాహసచిత్తుడౌదువు మేలు
మాపౌరుషంబులు మహిమీదచాట
భట్టుచేతనెకాని పరులచేగాదు
ఈవుండవలయును నిలమీదనిలచి
కొన నాయునికడకు గ్రక్కునజేరు"
అనుచు ప్రియముజెప్పి యతనిబంపుటయు
చయ్యన శరశరాసనములన్నియును
మునుకొని యొకపెద్దమోపుగట్టించి
పట్టించుకొనివచ్చి బ్రహ్మన్నతోడ
"విన్నపంబవధారు విశ్వలోకేశ
విను రాఘవేశ్వర విన్నవించెదను
ఘోరయుద్ధముచేసి కొమ్మభూవిభుడు
ఖండించి రిపుకోటి గర్వంబడంచి
దివ్యాయుధంబులు తెరగొప్పడించి
నీకడకంపించె నీలవర్ణుండ
అవినీవుగైకొని యతులితంబైన
తిరుపావనమున ముద్రించువేవేగ"
అనవిని యాయుధాలట్లముద్రించి
'ఏమనవచ్చును నితనిసత్త్వంబు
అస్త్రదేవతలున్న ననిలోనతన్ను
ఒరిగింపనెవ్వరు నోపలేరనుచు
ఆయుధంబులబంచె నయ్యలకడకు
ఇకరాజుగెల్చుట యిదినిశ్చయంబు'

అనిపల్కి బ్రహ్మన్న యారాజురణము
ఒప్పారవీక్షింపుచుండె నంతటను.

*స్వచ్ఛందమరణమును కోరిన కొమ్మరాజు యుద్ధ రంగమున మరికొందరిని మడియించి, ధర్మదార పట్టించి నేలకొరుగుట.*

ఆవేళ కొమ్మరాజతులితంబైన
కుంతంబుగైకొని కుప్పించిమించి
బలముపై నడచెను పటుశక్తిమెరసి
చయ్యనకుంతంబు జళిపించియార్చి
ఘోటకపటువీరకోటులబొడిచి
కాల్బలంబులచిదిమి గజములదునిమి
మోటపలకలద్రుంచి మొనలుఖండించి
నలుగురి నేగురి నలినలిచేసి
పదులనూరులవేల బంట్లనుదునిమి
లక్షలరెండేసిలక్షలగూల్చి
తండోపతండముల్ ధరమీదపొడిచి
మావటీలనుగొట్టి మన్నీలనరికి
రాజులపడగొట్టి రణవీథిద్రోచి
ఘనవీరవరులను ఖండించి వారి
కుతికెలు వెసద్రుంచి గుండెలుపెరికి
కడగిమొనలను చాపకట్టుగాగూల్చ
అపుడు రక్తంబేరులైపారుచుండె
గజకళేబరములు కలనిమధ్యమున
తెప్పలైనెత్తుట తేలాడుచుండె
ఈరీతి కొమ్మరాజేపుదీపించి
ఘోరయుద్ధముచేయ కుంభినివణకె
జలధులుకలగె భూచక్రంబుతిరిగె

దిగ్గజంబులు గ్రుంగె దిక్కులు నదరె
ఫణిరాజు తనమోము పడగలు వంచె
దివినుండి కన్గొని దివిజసంఘములు
"సారెకు జగతిపై సంగరస్థలుల
చూచితి మీలాటి శూరుడుగలడె
ఈతని భుజశక్తి యితనిసాహసము
ఈ ధైర్య మీశౌర్య మీ పటుత్వంబు
ఈ లాఘవంబును ఈ లక్ష్యమెపుడు
ఎక్కడ పొడగాన మీ విచిత్రంబు"
అని పల్కుచున్నంత నాకాశవాణి
భోరున కురిపించె పుష్పవర్షంబు
ఆవేళ దళములు ఆరాజుతోడ
పోరాడజాలక పోయిరివిరిగి
అలరుచు కొమ్మరాజంత వెన్దిరిగి
తనరారగా ధర్మదారపట్టించి
ధరమీద పడియున్న తమ్ములకడకు
తగ వేగవచ్చెను తా కొమ్మరాజు
ఆవేళ కొమ్మరా జలయుటచూచి
విరిగిన బలములు వేవేగతిరిగి
వెసదూరముననుండి విండ్లు సంధించి
గుదిగుచ్చుకొననేది కూతలుపెట్ట
ఆరాజశేఖరు డప్పుడిట్లనియె :
"మీతోడ పోరాడి మీబలంబెల్ల
మడియించి మడియించి మదిలోనరోసి
ఆయుధంబులు డించి యానబూనితిని
ఇకనేను మీతోడ నెదిరించినిలిచి
చెచ్చెర యుద్ధంబు చేయుటలేదు
ఇకమీరు డప్పుల నేలనున్నారు
చేరి యేయుడు మిమ్ము చెనకుటలేదు

అనిననునమ్మి తామటుచేరవెరచి
పగవారి బలములు బవరంబులోన
క్రమ్మిరి కొమ్మరాఘవవీరబలుని
అప్పుడు తనదేహ మతిభారమైన
కలగనిమది పరజ్ఞానంబు గలిగి
శ్రీగిరిదేవుని చెన్నకేశవుని
తనమదిలోనుంచి దాస్యమర్మంబు
తెలిపి యీదేర్చియు దేవుడైయున్న
నాయుని పాదంబు నమ్మికదలచి
కొమ్మభూపతి గూలె కుంభినిమీద.

*మలిదేవరాజులు హతధారణమున ప్రాణంబు విడుచుట : నలగాముడు పచకుల బ్రహ్మన్నను బ్రహ్మన్నపైకి పంపుట : ఆతనిని వారించుటకు బ్రహ్మన్న అడప కేశవదాసిని పంపగా పచకులు వాతని సంహరించుట.*

కూలె కుంభినిమీద కొమ్మరాజనుచు
కన్నీరు కార్చుచు కన్నమనీడు
తనరాజుకడకేగి తలయొంచినిలిచి
ఆవార్తవినిపింప 'హరిహరీ' యనుచు
అతులనే మూర్ఛిల్లి యంత తెలివొంది
మదివితర్కించెను మలిదేవుడిట్లు :
'సాటిబందుగులెల్ల సమరంబులోన
కడతేరిపోకకు కారణంబెవరు ?
అర్వెల్లినాగమ్మ యానాడుమమ్ము
పందెముకు పిలిచిన పంతగించితిని
వలదని నాయుని వారించనైతి :
కోరితెచ్చితి నేను కులవైరమకట !
పందెమాడుటకతన పగవృద్ధిపొంది

కలహమ్ము రేగెను కార్చిచ్చుపగిది
బాలుడుతమ్ములు బాదన్నరౌతు
పేర్నీడుసూర్నీడు పెక్కంద్రుసఖులు
కొమ్మభూవిభుడును కూలిరిభువిని
బలియిచ్చియిందర బ్రతుకుటెందులకు
రాజ్యమునాకేల బ్రతుకదియేల ?'
అనుచుక్షోభిల్లుచు హాశధారణమున
ప్రాణమ్మువిడిచెను పార్థివేశ్వరుడు
తమయన్నమరణింప తమ్ములిద్దరును
మాచెర్ల చెన్నుని మదినిభావించి
అసువులుబాసిరి హరిహరీయనుచు
మలిదేవరాజులు మరణించిరనుచు
నాయురాలుబ్బుచు నలగామువేరి
"విజయమ్ముమనదేను వీరపుంగవుడ !
బ్రహ్మన్నయొక్కడే బ్రతికియున్నాడు
బంధించియాతని పట్టితెచ్చుటకు
పచకులబ్రహ్మినే పంపగావలయు"
అనవిని నలగాము డాతనిజూచి
"పచకులబ్రహ్మన్న ! బాహువిక్రముడ !
సాటినీకెవరయ్య సమరరంగమున
బ్రహ్మన్ననోడించి బందిపెట్టుటకు
నీవెచాలుదువయ్య నిఖిలైకవీర !
అనవిని పచకులు డతిమోదమంది
"పలుమాటలేల నాపంతమ్ము వినుము
హరిహరాదులు నాకు నడ్డమొచ్చినను
పట్టితెచ్చెదనిపుడె బ్రహ్మన్న" ననుచు
విడియమ్ముపుచ్చుక వేగంబెకదిలె;
ఆవార్తవిని నాయుడతనివారింప
అడపకేశవదాసి నటువేగబంప

పచకుల బ్రహ్మన్న పటుసాహసమున
తనపైకివచ్చెడి దళములచూచి
అడిదమ్ముచేబూని యదరంటునార్చి
నలుగుర నేగుర నలినలిచేసి
అడప కేశవదాసి నవనిపై గూల్చె 939

# బ్రహ్మన్న విరుగు

## కథాసంగ్రహము

వీరనాయకులందరును మరణించిన పిదప బ్రహ్మన్న తానే యుద్ధమునకు బయలుదేరెను. అతనిని పచకుల బ్రహ్మన్న ఎదిరింపరాగా బ్రహ్మన్న మన మిద్దరము సహాధ్యాయులము కనక నీతో పోరాడుటకు శంకించుచున్నాను, పొమ్మని పలికెను గురుడొక్కడే ఐనను కురుపాండవులు యుద్ధం చేయలేదా యని ప్రశ్నించి యాతనిని ఒప్పించి పచకుల బ్రహ్మన్న సమరమునకు తలపడెను. బ్రహ్మన్న ఒక్క వేటువేయగా అతని తల తెగిపడి బ్రహ్మన్న పాదముల డాయవచ్చెను. అది తన పాదములను తాకకుండా బ్రహ్మన్న దూరముగా తొలగి ఏదైన వరము కోరుకొమ్మని యడిగెను. పచకుల బ్రహ్మన్న తనను వీరులలో నొక వీరునిగా చేయుమని కోరగా బ్రహ్మన్న కరుణించి అతని తేజస్సును తనలో కలుపుకొనెను.

పచకుల బ్రహ్మన్న నేలకొరుగుటచూచి కార్యమపూడి రాజు క్రోధవివశుడై బ్రహ్మన్నను మార్కొనెను: బ్రహ్మన్న అతనిని

సంహరించగా చింతపల్లిరెడ్డి, బ్రహ్మన్న నెదుర్కొనెను. కాని వానినిట్టే బ్రహ్మన్న మూర్ఛితుని గావించి రణరంగమున విజృంభించెను. నలగాముడు భయపడి యుద్ధభూమిని విడిచి కొదమ గుండ్లకు పారిపోయెను. అంతట భీమసింగుడు బ్రహ్మన్న నడ్డగింప ప్రయత్నించి యాతని చేతిలో హతుడయ్యెను. నాయకురాలది చూచి యశ్వమును దుమికించుకొనుచు బ్రహ్మన్నను ఢీకొనెను. ఆడుదానిని చంపుట నీతిగాదనివెరచి బ్రహ్మన్న నాయురాలి యశ్వమును కూల్చగా ఆమె ప్రక్కకు తొలగి పారిపోయెను. అంతట బ్రహ్మన్న నలగాముని పట్టెదనని కొదమగుండ్లకుచేరగా అచ్చట నున్న విప్రులు నలగాముని కరుణింపుమని బ్రహ్మన్నను ప్రార్థించిరి. వారి ప్రార్థన మన్నించి నలగామునికి హితోపదేశము చేసి పట్టముకట్టి బ్రహ్మన్న అటనుండి నిష్క్రమించెను.

*బ్రహ్మాస్త్ర పచకుల బ్రహ్మాస్త్రతో యుద్ధము చేసి వానిని సంహరించుట: అతని తేజస్సు బ్రహ్మాస్త్రలో కలియుట.*

అడపకేశవదాసి యాలంబులోన
పడుటయుచూచి యాబ్రహ్మినాయుండు
కడు నుగ్రుడైమండె కార్చిచ్చుమాడ్కి
కడువడితో ప్రళయకాలునిభంగి
కలితవిక్రమ కళాకౌంతేయుడనగ
బలియుండు పచకులబ్రహ్మనంజూచి
ఉత్తమాశ్వమునెక్కి యురికించుకొనుచు
కదలి నాయుడురాగ కని వాడుపలికె :
"చతురత నాతోడ సమరంబుచేయ
కదనమున ననుచూచి గర్వించిరాకు
పదివిధంబులనిన్ను పరపెదచూడు
నేడుతప్పించుకో నీనేర్పుమెరయ"
అనిపల్కివాడు మహాశౌర్యమునను
నాయునిపైనేసె నాగబాణంబు ;
సేనలువెరగంద చిత్రంబుగాను
వాటినన్నిటివేగ వడిద్రుంచివైచి
పచకులబ్రహ్మతో బ్రహ్మినేడనియె :
"సరవితోనొకగరడి సాముచేసితిమి
మనగురుడొక్కడే మరిచూడునీవు
మనకుభేదములేదు మానుమీరణము.
తగదుయుద్ధము మనకు ధర్మంబుకాదు
చంపంగవలెనిన్ను సమరమధ్యమున

శంకింపుచున్నాడ సమరంబుచేయ."
అన పచకుల బ్రహ్మయతనికిట్లనియె :
"ఆచార్యుడొకడని యనిచేయజొరవు
కురుపాండవులకును గురుతింపగాను
ఒనరంగ కులగురుడొక్కడెకాదె
మరివారుయుద్ధంబు మానిరేచెపుమ"
అనియొడబడజెప్పి యాబ్రహ్మతోడ
చెలరేగియుద్ధంబు చేయంగదొడగె :
పటుశక్తిమెరసి యాపచకులబ్రహ్మ
కమలనాభునిమీద గదిసిపొడుచుటయు
ఆపద్మదళనేత్రు డదితప్పదొలగి
పొడిచె నాతని బింకపొంకమ్ములడగ
పొడిచినతెగివచ్చి పొరలుచుశిరము
పరగశీలమబ్రహ్మపాదయుగ్మమ్ము
డాయరా నతండు ధర్మమ్ముతలచి
పాదమ్మునోకునని పరగవెన్కకును
పోవునప్పుడు శిరసుభోరునపలికె :
"పెనుపొందుఘనుడవు పిరికితనమేల
వెనుకకుబారుట వెరచుటగాదె
ఓపుండరీకాక్ష ! యోదైత్యదమన !
ఓసత్యసంకల్ప ! యోహృషీకేశ !"
అనినిరసించిన యాబ్రహ్మయనియె :
"నీనొసట తిరుమణినిండియుండుటను
పూనినేవెనుకకు పోయితినంతె
నీవునన్నిందుకు నిరసించనేల
మెచ్చితి నడుగుము మేలైనవరము."
ఆమాటవిని శిరస్సప్పుడిట్లనియె :
"నలినాక్ష ! నాయుడ నడికలనిలోన
వీరులలో నొకవీరునిచేసి

వీరగంధము ముందు వెలయించునాకు."
అన బ్రహ్మినాయుండు "అటుగాక" అనియె;
మిసిమిగల్గిన నీల మేఘంబునందు
వెసతీగెమెరుపు ప్రవేశించినట్లు
అతనితేజస్సు నాయనియందుగలిసె,
గరిమతోనమరులు ఘనపుష్పవృష్టి
కురిపింపనంతయు కొమరుదీపించె;

*బ్రహ్మన్న చేతిలో కార్యమపూడిరాజు మరణిం చుట : చింతపల్లిరెడ్డి మూర్ఛిల్లుట : నలగాముడు కొదమగుఱ్ఱపు జారిపోవుట.*

అంతటకామరా జడలుచుభీతి
"అదెవచ్చెనాయుడు అదెవచ్చెనిపుడు
పదపదమ"ని బెదరి పారంగ మంత్రి
"తిరుగుమని" పోనీక తిరిగించిమరల
"చెలగిబిరుదురాజు చింతపలిరెడ్డి
ఇద్దరుసుండగా నిక నేలభయము"
అనుచు నాగమ బల్కి నాలించియపుడు
వెలయరాహుతులను వెనుకరండనుచు
మూడుమొనలై రాజు ముదముతోనడిచె
ఈచందమున మొన లేపొందినడువ
వామభాగంబున వారిమొనతాకె
తాకినమూకను తా గనుంగొనుచు
కార్యమపూడిరాజు కడుకోపగించి
తనమూకలునుతాను తలకకమిగిలి
పోనీక నాయుని పొదివి నల్దెసల
పొడిచిన బ్రహ్మన్న పోనీక నిలచి
కరిమీదహరివేగ కదిసినయట్లు

విలుమూకలనుపొడిచి విందులుచేసి
పట్టెముల్ కేశముల్ పంద్రెకోలలును
అడ్డాయుధంబులు అరిగెలుమరియు
వాలుబల్లెముపూను వారిబనపొడిచి
హతముచేసెనుబ్రహ్మ అమరులుపొగడ
తనవారలొరిగిన తానుకోపించి
కార్యమపుడిరాజు కదియంగవచ్చి
నాయునిపొడిచెను నాసాగ్రమునను
అదియుతప్పించుక యాబ్రహ్మినేడు
కుంతానపొడువగా కూలెనురాజు;
అదిచూచినలగాము డడలుచుండగను
చింతపల్లి రెడ్డి శీఘ్రమెపోయి
"కాలుబలములగూల్చి కదిసినాయుండు
వచ్చెననిజడియక వసుధీశనీవు
విచ్చేయుపురికిని వేగంబుగాను
చిక్కుపడపొడిచెద చక్కరానిమ్ము
వెనుతగిలిపొడుతును వెళ్లిరాకుండ
సెలవిచ్చిపంపుము శీఘ్రంబెనన్ను",
అనిపంతగించిన ఆరెడ్డికపుడు
రయమునసెలవిచ్చి రణభూమివిడిచె;
నలగామునటుబంపి నాయునిపైకి
చింతపల్లి రెడ్డి చెచ్చెరవచ్చి
"ఎవరుపోయిన పోక నేనున్నవాడ
నన్నంపుమెరుగవా నాయుడబ్రహ్మ."
అనవినినాయుడు అల్లననవ్వి
"స్వామికిహితుడవు సమరంబులోన
నీతోడయుద్ధంబు నెగడిపోరాడ
నొచ్చెమౌనాకును నోడినట్లుగను
చంపకబ్రమయింతు సమరంబులోన

మరిపోయి కాముని మదమణగింతు."
అనిపల్కనా రెడ్డి యతివేగనార్చి
సరుగునపొడిచెను సాహసవృత్తి
మరియునుపొడువంగ మాన్యుడుబ్రహ్మ
"ఏలయ్యపోరాడనేల నీకిటుల
రాజరక్షకుడవు రాజుతీర్పరివి
యుద్ధంబుమానుట యుచితంబునీకు"
అనుచునాయుండార్చె నాకాశమదర
ఆర్చిన నా రెడ్డి యదరిపడిజడసి
యంధకారముగప్పి యత్తైమూర్ఛిల్లె.

*బ్రహ్మన్న భీమసింగును సంహరించుట : నాయకురాలు బ్రహ్మన్న నెదుర్కొని అతనిధాటకు నిలువజాలక రణభూమిని విడుచుట :*

భీమసింగనురౌతు భీమవిక్రముడు
వేయికాల్బలముతో వెనుకొనిరాగ
అప్పుడునాయుడు ఆగ్రహంబంది
రౌతులసమయించె రణభూమిలోన
పక్కెరలతోడను పడిరిరౌతులును
రాహుత్తరాముని రణమునజంపి
గజసి గుప్పైదూకి కత్తికెంజేయ
పలుతున్కలైపడెను బవరంబులోన
అప్పుడునాయురా లదరంటనార్చి
"నాయునిపైనేను నడచెదనిపుడె" .
అని తురగమునెక్కి యతివేగమునను
అశ్వమ్ముదూకించి యతనితోననియె :
"ఏడుతరమ్ముల కెన్నగలాడ
కారణపురుషుండ ఘనుడబ్రహ్మయ్య

ఆడుదాననను చు నాలస్యమేల
కనిపోదువు నాయుడ కదలక నీవు'
అనవిని బ్రహ్మన్న యలతినవ్వులర
"వినుము నాయకురాల వివరంబుగాను
ముగురుమూర్తులలోను ముఖ్యుడైనట్టి
ఈశ్వరుడీశూల మిచ్చెనునాకు
ఇంతులమీదను నేయంగతగదు
కుంతానబొడిచిన కొరతగు నాకు'
అనవినినాయురా లదలించి పొడిచె
పొడిచిన నాయుడు పొంకంబు చూచి
గుదిగొని యశ్వమును కూలంగపొడువ
ఆర్వెల్లి నాగమ్మ యటనుండి పారె;
అంతట నాయుడు అటుచూచి నిలచి
'రాజెందుపోయెనో రణభూమిలోన
వినువీథి నమరులు వినుచుండగాను
ప్రతినచేసితి రాజుపట్టెదననుచు
పట్టుపడకరాజు ప్రాణంబుతోను
ఏదిక్కుపోయెనో ఏటనున్నవాడొ'
అని మదితలపోసి యటనుండి కదలె.

*కొదమగూండనున్న విప్రులు నలగామునికరుణింపుమని బ్రహ్మన్నను వేడుకొనగా, అతడు నలగామునకు పట్టముకట్టి అటనుండి మరలుట.*

ఇటువచ్చె నాయుడు ఇటువచ్చెననుచు
కొదమగూండ్లకు రాజు గొబ్బునచేరి
"కాచిరక్షింపరే కరుణతో మీరు
అదెవచ్చెనాయుడు అనుమానమేల
పచకులబ్రహ్మన పడపొడిచెకలన
కార్యమవుడిరాజు ఖండించివైచె

చింతపల్లి రెడ్డిని చీకాకుచేసె
పంతపురౌతులు పడిరనిలోన
తరుముకవచ్చె నిత్తరికుంతగాడు'
అనివిప్రులకునెల్ల నందంద్రమొక్క
విని యటవిప్రులు వేగనందరును
పరుగునవచ్చెడి బ్రహ్మనిచేరి
'ఓ బ్రహ్మనాయక ! ఓజీవరక్ష !
భావింపకలియుగ భార్గవరామ !
జలములుప్పొంగిన జలములజొచ్చి
వేదముల్ బ్రహ్మకు వేడుకనిచ్చి
భయమునమునిగిన ప్రహ్లాదుగాచి
కడుభక్తిపరుడైన కరినుద్ధరించి
కపికులశ్రేష్ఠుని కరుణించినిలిపి
దనుజేంద్రుతమ్ముని దయతోడగాచి
శరణాగతులబిరుదు చెల్లించినావు
బాహుబలభీముడా ! బ్రహ్మనాయకుడ !
కదిసినబలములు కలనిలోగూలె
కామునిప్రాణంబు కావవేబ్రహ్మ
పరనారిసోదర పరమోపకారి'
అనవిని బ్రహన్న ఔగాకయనుచు
'కామునిచూపుడు కాచితినని' న
అభయంబుపుచ్చుక యావిప్రులపుడు
నలగాముతోడ్కొని నాయునికడకు
విచ్చేయ కాముడు వినతులచేసె
కామునిగనిబ్రహ్మ కరుణతోపలికె :
'అనుగుభూపతి మరణమైనదిమొదలు
కట్టితిపట్టంబు కరుణ భూపాల
ఎల్లరాజులునెరుగ నేలితిభూమి
తగవెంతతప్పితి ధరణీశ్వరుండ

భామినిమాటలు పరగంగవినియు
మీదుపరుకించక మిగులచేసితివి
కోడిపోరనిపెట్టి క్రూరమార్గమున
గోపనజంపితి క్రోధంబుతోడ
మండాదినుండగా మదముననీవు
పశువులబట్టితి భయమింతలేక
అనుజులకును భాగమడగవచ్చినను
అల్లుమల్లునిజంపి తదియునుగాక
వినవయ్యచెప్పెద వీరకామేంద్ర
గాజువారలును మరికనకంబువారు
గొడ్డటివారును గోవిందువారు
పట్టుజాజులవారు పద్మనాయకులు
వనవసంతునివారు వరబలాధికులు
ఇట్లుచేసిన వారెవ్వరులేరు
ఇకనైననెమ్మితో నిలనేలుమనుచు
అందరుచూడంగా అభయపట్టంబు
కట్టించెబ్రహ్మన్న కడుశాంతమునను
అంతటనలగాము డతులితభక్తి
"నీకుదాసుడనేను నిజమునామాట
విజయంబునీదేను వీరపుంగవుడ
అనఘాత్మ నీమహిమంత యుతెలిసె
ధరలోన దాతవు దైవంబవగుచు
గురువులకును పరమగురుడవీవగుచు
ఈవీరులకునీవు నీశ్వరుడవగుచు
నిలిచితివటుగాన నీమూర్తివలన
పలనాటివీరుల పరమచరిత్ర
ఆచంద్రతారార్కమై యుండగలదు"
అనిపల్కి అతనిచే నంపించుకొనియె.



| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 9 | 36 | వార్తకెక్కిన | ప్రసిద్ధికెక్కిన |
| 10 | 62 | ఝల్లులు | కలువడములు = మేలుకట్లు |
| 11 | 80 | అతిప్రీతి | 'ప్రీ' – దీనిని ఊదిపలుకరాదు |
| 11 | 91 | పంచాంగముష్టి | పంచాగము పుచ్చుకొన్నచేతి గుప్పిలి |
| 12 | 103–104 | గోవిప్ర ... | ఈ సంబోధనలు నిందా గర్భి |
| 12 | | బ్రహ్మఘాతి | తములు; కార్తవీర్యుడుచేసిన పాపములను తలపించునట్టివి. |
| 15 | 193 | చెన్ననితోడ | ఇలువేల్పుఅయిన చెన్నకేశవుని అర్చా విగ్రహములతోడ. |
| 16 | 227 | కనకాద్రి | చెన్నకేశవస్వామి వెలసి యున్నట్టి కనకాద్రి అను పేరుగల కొండ. |
| 16 | 228 | చరువు | ప్రత్యేక పాత్రలో వండించిన నైవేద్యము |
| 17 | 262 | విష్ణునామముపాడ | విష్ణుసహస్రనామ పఠనము చేయగా |
| ,, | 264 | స్వాములు | వైష్ణవస్వాములు |
| 18 | 271 | గొల్లెనలు | గుడారములు |
| ,, | 287 | జరుగుచు | కదలిపోవుచు |
| ,, | 294 | దివ్యక్షేత్రములు | 'క్షే' – ఊదిపలుకకూడదు |
| ,, | 296 | అభ్రకేశుడు | వ్యోమకేశుడు; శివుడు |
| 19 | 303 | శివరాత్రి యగునట్లు గడిపి | నాలుగుజాములు జాగరము చేసి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 324 | గోపాదము | కొవ్వూరు తీర్థమున పూజింపబడు గోపాదములు |
| ,, | 327 | తీర దివ్యలింగములు | గోదావరికి ఆవలి యొడ్డున పూజింపబడు కోటిలింగములు |
| 21 | 352 | కంట్లపెద్దు | సరకుల మూటలుమోసెడి ఎద్దు |
| 23 | 429 | సదయుడవని | ఇక్కడ సజ్జనుడవని అర్థము |
| 24 | 455 | దైవము మీపాల దయచేసినాడు | దైవము మీపట్ల అనుగ్రహము చూపినాడు |
| ,, | 461 | సోమించి | పరాక్రమించి |
| ,, | 466 | ఊరికోట | ఆ సీమకు రాజధాని |
| 26 | 499 | దోపు | కొల్ల (Loot) యుద్ధానంతరము సైనికులు గ్రామములపైబడి కొల్లగొట్టుట |
| ,, | 501 | విరిగెను | విచ్చిపోయెను |
| ,, | 511 | సారె | కుమ్మరి సారె |
| ,, | 512 | మల్లాడు | పెనగొను |
| ,, | 513 | కోరాడు | ఏనుగులు దంతములతోడను, ఎద్దులు కొమ్ములతోను ఉత్సాహముతో నేలను కుమ్ముట; ఇక్కడ 'పోరాడు' అను అర్థమున ప్రయోగింపబడినది. |
| 27 | 529 | చందవోల్ పృథివి జన నాయకుడు | చందవోలు రాజు; ఊరకోట రాజునకు అధిరాజు |
| ,, | 546 | కణక | కడక; పూనిక |
| ,, | 547 | దుడుకుగా | దురుసుతనముతో |
| 28 | 558 | అన్న పెద్దన్న | అన్నగారైన బాదరాజు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 29 | 591 | పసుపున కిచ్చె | అరణమిచ్చెను; అరణమును పసుపు కుంకుమకు ఇచ్చునట్లు చెప్పుట సంప్రదాయము |
| 29 | 595 | అతివలతోడ | ముగ్గురు భార్యలతోడ |
| ,, | 598 | కనకాద్రివిభుడు | చెన్నకేశవుడు |
| 31 | 632 | కన్నమ | ఉత్తరు నోడించినది తెప్పలి, కాని కన్నమకాదు. రచయిత పొరపడి యుండవచ్చును; లేదా కన్నమ తెప్పలినేని కుమారుడే కనుక తండ్రి యాధిపత్యమున జరిగిన ఆ యుద్ధమున కన్నమయే ఉత్తరుని ఓడించియుండ వచ్చును. |
| ,, | 654 | కోరుబైళ్లు | అచ్చట నున్న మైదానముపేరు |
| 32 | 679–681 | | మీరు పురుషులు కానిచో స్త్రీ వేషములు ధరించి యింటి పట్టుననుండి పోవచ్చును. యుద్ధమునకు రానక్కరలేదు |
| ,, | 682–683 | | భూపురంధ్రి ఉత్తరునిపతిగా వరించి వివాహమాడును. |
| 33 | 686 | పట్టుకట్నము | పట్టుబట్టలకట్నము |
| ,, | 693– 97 | | యుద్ధములో శత్రుసంహారము చేయబూనుట, కోతకువచ్చిన చేను కోయుటకు వెళ్ళినట్లుగా రూపించినాడు |
| ,, | 708 | భోగవతి | ఒక ఏనుగుపేరు. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 34 | 714 | కొలువయ్యె | రాజు సింహాసనమున కూర్చుండునట్లుగా తెప్పలి అంబారిలో కూర్చుండెను. |
| ,, | 718 | కార్తవీర్యునినాటి కంచు రణభేరి | వంశపరంపరాగతమైన ఈభేరి యిందు పెక్కుచోట్ల పేర్కొనబడినది |
| ,, | 728 | సూర్యకుండ | సూర్యప్రభ లీనెడి బంగారపు శిఖరము |
| ,, | 733 – 35 | విత్తులు చెడిపోక ... పండినట్లుండెను | 693–97 పంక్తులలోని రూపకమే యిచ్చటకూడ |
| ,, | 741 | విడిగొత్తెలు | మందనుండి వేరుచేసి తెచ్చిన గొత్తెలు |
| 35 | 745–50 | పాటిమీద ... కూల్చిరవ్వేళ | పైని చెప్పిన పంటచేని రూపకమే పునరుద్ఘాటింపబడినది |
| 36 | 782 – 93 | తొలియుద్ధ ... హతము కారెవరు | తెప్పలినీడు చనిపోయిన పిమ్మట 'శత్రువులతో రెండవ యుద్ధము చేయుటకు ఎవరి పేరుఫలము బాగుండునో చూడుడ'ని రాజు జ్యోతిష్కులను కోరెను; వారు బ్రహ్మన, సుంకరి, కన్నమ, దామనాయుడను ముగ్వురి పేరుఫలము బాగున్నదనియు, కాని వారిలో బ్రహ్మన వచ్చి సేనలను నడిపినచో శత్రుసంహారము జరుగుననియు చెప్పిరి. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 36 | 791—92 | పట్టువచ్చిన విధిని పండ్లూడదన్ని | బ్రహ్మన పుట్టినపుడు ఆ పసి పాపనుచంపుటకు పురిటింటిలో ఒక దుష్టశక్తి ప్రవేశింపగా ఆ పసిపాపదానిపండ్లూడదన్నెను. |
| 37 | 811 | మోకాలిర్ముల్లి | హస్తములకు దెబ్బతగులకుండ అంగుళీత్రాణము కట్టుకొన్నట్లు మోకాలిచిప్పలకు దెబ్బతగుల కుండ కట్టుకొనెడి ఒక చిన్న కవచమని తోచుచున్నది. |
| ,, | ,, | మోర్చిక్కము | ఎదురొమ్మునకట్టుకొనుచిక్కము. |
| ,, | 820 | సెలగొని కొట్టుడీ | చేతిబెత్తములతో కొట్టుడి. సెల=బెత్తముగా ఉపయోగించెడి చువ్వ. |
| ,, | 823 | కనిపెట్టుదురు | కాపాడెదరు |
| ,, | 825 | ఆ రాజులెల్ల | శత్రురాజులు; వారు బ్రహ్మన గురుజాల నుండి తరలి వెళ్లు చుండగా అతనికెదురువచ్చిరి. |
| 39 | 874 | అరియప్పనము | సమర్పణముచేసిన కప్పము |
| 41 | 913 | వీరజగ్గారెడ్డి వేడుక పుత్రి | జగ్గారెడ్డికి ఆమె కన్నకూతు రయినచో వేడుక పుత్రిక; అనగా ప్రియపుత్రిక; కానిచో ఆ పదమునకు అర్థము మోహా ముతో పెంచుకొన్న కూతురు అని; రెండవపక్షమున కన్న తండ్రిపేరు తెలియదు. |
| ,, | 915 | ఆరవెల్లివారింటి యనుగు కోడలు | అత్తవారింటిపేరుచెప్పి భర్త పేరు చెప్పకపోవుటచే కదా |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | కాలమునాటికి ఆమె వితంతువని ఊహింపవచ్చును. |
| ,, | 919-25 | వినవయ్య రాజేంద్ర ... విచ్చేయవలెను | రాజును ఆమె ఆహ్వానించిన ధోరణినిబట్టి చూడగా అప్పటికే ఆమెకు గ్రామములో మంచి పలుకుబడి కలదని తెలియుచున్నది. |
| ,, | 940 | ప్రభువులచెంత | ప్రభువులైన తమ చెంత |
| 42 | 942 | అర్హకాలమ్మున | తగిన సమయమున |
| ,, | 959 | వీపున ఒకపుండు | రాచకురుపు |
| ,, | 966 | నలగామరాజుకు నారాజ్యమిచ్చి | పల్నాటిసీమ నలగామునకు తల్లివంక సొత్తుకనుక ఆ రాజ్యమునకు న్యాయ్యముగా అతడే అధికారి అని అనుగురాజు అతనికి పట్టము కట్టుమని బ్రహ్మనాదేశించెను |
| 51 | 32 | కవిలెలు | ఆయవ్యయముల లెక్కలు |
| ,, | 36 | స్వామిద్రోహమ్మ | 'ద్రో'—ఊదిపలుకరాదు |
| 52 | 57 | కన్నాన తెప్పించి | చెరసాలకు కన్నము వేయించి దానినుండి తప్పించి |
| 53 | 77 | గవకులు | పుంద్వారములు |
| ,, | 95 | వీరప్రమథులు | బ్రహ్మనాయునికి అనుచరులుగా ఈ కథలో మాటిమాటికని పేర్కొనబడు వీరులు. వీరిని బ్రహ్మనాయుడు తన పంతుకు తీసికొని తక్కిన బలమునెల్ల నలగామునికిచ్చెను |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 54 | 108–9 | చెన్నకేశవునకు ... గొప్పగా నచట | ఇలువేల్పయిన చెన్నకేశవుని గురుజాలలోవలె మాచెర్లలో కూడ ప్రతిష్ఠించెను. ఆనాటి నుండియు గురుజాల చెన్న కేశవుని గుడికంటె యిది ఎక్కువ ప్రశస్తికి వచ్చినది |
| ,, | 120 | విధులప్పగిం చెను వీరులందరికి | రాజ్యపరిపాలనలో ఎవరెవరు ఏయే అధికారములలో ఉండవలెనో ఆ విధులను వేర్పాటుచేసి |
| 55 | 125 | బాలరాజునకు | బాలుడైన మలిదేవరాజునకు |
| 56 | 150–51 | మీరు ... నిచ్చెదము | వీరసోముడు శైవుడు; వీర శైవుడు కూడ కావచ్చును. శైవులు భవులతో నెట్టిపొత్తున కంగీకరింపరు. భవులనగా శైవేతరులు. మలిదేవాదులు వైష్ణవమతస్థులు. కనుక 'మీరు దాసరివార'ని బ్రహ్మ నాదులను వీరసోముడు ఎత్తి పొడిచినాడు. |
| 57 | 177 | ఆపరివేషంబు | తేజోవలయము (Halo) త్రిపురములను గెల్చిన నాటి శివుని తేజము శివనంద్ల కోటయై నిలచిన దని వాక్యార్థము. |
| ,, | 189 | అనుకూలమగును | కార్యసాఫల్యమగును |
| 58 | 225 | సర్వాయితంబయ్యె | సర్వసన్నద్ధుడయ్యెను |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 227–228 | పోకంత ... పట్టుగా నుంచి | కొంచెమన్నమును, ఉదకమును ఒక పాత్రలోనుంచి కుంతమునకు కట్టెను. |
| 59 | 250 | శ్రీశైలనాథుని చెలగి పూజించి | బ్రహ్మన వైష్ణవ మతస్థుడైనను శివుని పూజించరాదనెడి అసహిష్ణుత కలవాడు కాడు. అతనికి శివకేశవు లిరువురును సమానమే. |
| ,, | 256 | అధికశక్తులను | రావణునిలంకను లంకిణివలె ఆ కోటను కాపాడుచున్న శక్తులను |
| ,, | 257 | అందరి ... చొచ్చె | ఆ కోటను కాపాడెడి శక్తులకు భౌతికదేహములేకపోయినను బ్రహ్మన తన ప్రభావముచే వాటిని అణచివేసెననిఅర్థము. లేదా ఆశక్తులు సశరీరముగా అతనికిపొడకట్టినవనవచ్చును |
| 60 | 264 | ఆడు ... పిలిచె | శివనాగులాదేవి కుమార్తెకు బ్రహ్మన పిన్నయక్క అని కొడుకునకు లంకపోతన్న అని పేరులు పెట్టెను. ముందు కథలోవచ్చు మందపోటులో చనిపోయిన లంకన్న యీ లంకపోతన్నయే కావచ్చును. |
| ,, | 271 | ఆనాటి నీకోర్కె | మలిదేవునకు పిల్లనిమ్మని అడుగుట. |
| ,, | 273 | సిరాదేవి | శ్రీదేవి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 279 | భూతరాట్టుంబంబు | ఇది ధ్వజస్తంభమువంటి శిలా స్తంభము. దీనినే బ్రహ్మాన త్రిపురాంతకము నుండి తరలించి యుద్ధారంభమున కార్యంపూడిలో ప్రతిష్ఠించెను. |
| ,, | 284 | అరిగెల జోళ్ళు | మొగమునకు ఎండ తగులకుండ పట్టెడి చిన్న గొడుగుల జంట |
| ,, | 286 | కుంచెలవారు | చామరధారులు |
| 61 | 292 | ప్రతిమోతలు | ప్రతిధ్వనులు |
| 62 | 321 | కంధితూణీర | సముద్రము అమ్ముల పొదిగాగలవాడ (శివుడు) |
| ,, | 322 | గరుడాసనాంబక | విష్ణువు బాణముగా గలవాడ; త్రిపురసంహారమపుడు శివునకు విష్ణువు బాణముగాను, సముద్రము అమ్ముల పొదిగాను అమరినవి |
| ,, | 327 | మితివచ్చు పర్యంతము | బ్రహ్మాన తన మనమున పెట్టుకొన్న గడువుకాలము వచ్చువరకును; ఆగడువు కాలమేదో అతనిమనస్సులోనే యున్నది. |
| ,, | 328 | మితిచేసి | గడువుపెట్టి |
| ,, | 342 | కరివరదాచ్యుత | కరివరద అచ్యుత; సంబోధనాంతమైన అకారాంతమునకు తెలుగున సంధిలేదు; సంస్కృతమున నున్నది. అది ఇక్కడ పాటింపబడినది. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 64 | 398 | బ్రాహ్మణ స్త్రీలు | 'స్త్రీ'— తేల్చి పలుకవలెను |
| 65 | 404 | జగజంపుగొడుగులు | పెద్ద కుచ్చులుగల గొడుగులు; |
| ,, | 405 | పడిగెలవార్లు | ధ్వజములు పట్టెడువారు |
| ,, | 415 | కనకతప్పెటలు | బంగారు తప్పెటలుకావు; కొన్ని కులములవారి యిండ్ల వివాహాది శుభకార్యముల వాయించెడి తప్పెటలు |
| 71 | 571 | ఏగువాద్యమ్ములు | ఉత్సవవేళల వాయించు వాద్యములు |
| 74 | 662 | ప్రథమ-ఏకాదశి | తొలిఏకాదశి |
| 75 | 698 | ఒగి ... చిత్రంపుకోడి | మున్ను ఫలదుడను మహర్షి శాపమువలన ముగ్గురు కన్యలు, ఒక వనములో అవురుదుంప క్రింద కోడి గ్రుడ్లుగా జన్మించిరి. వాటిని ఒక చెంచులరేడు తనఇంటికి తీసికొనిపోయి భద్రపరచెను. అందులో ఒక గ్రుడ్డు క్రుళ్ళిపోయి, చెవుల గోపన్నగా జన్మించెను. ఇంకొక గ్రుడ్డు, పెట్టగామారి వెంటనే చనిపోయి, పేరాదేవిగా పుట్టెను. మిగిలిన గ్రుడ్డు, పుంజుగా పెరిగి పెద్దదయ్యెను. అదియే చిట్టిమల్లడు. ఒకనాడు వనమున వేటాడ వచ్చిన అరువది ఆర్గురు రాచపుత్రులకు |

పుట పంక్తి పదము

చెంచులరేడు ఆతిథ్య
మీయగా, వారి వేటడేగ
లను చంపుటయే కాక చిట్టి
మల్లడు వారి మరణమునకు
సైతము కారణమయ్యెను.
ఆ రాచబిడ్డలతో వారి
భార్యలు సహగమనము
చేసిరి. దీనికంతటికి కారణ
మగు చిట్టిమల్లునికి భయపడి
చెంచులరేడు ఆ కోడి
పుంజునుఒక చెట్టుతొఱ్ఱలో
విడిచిపుచ్చెను. ఆకోడిపుంజు
మెల్లమెల్లగా శనైశ్చరుడను
ఒక చెట్టుక్రిందకు చేరెను.
పెద్దన్న, పానుగల్లు పురా
ధీశుని కూతురగు ముక్తల
వాంబను వివాహమాడిగురు
జాలకు వచ్చుచుండగా,
చిట్టిమల్లుని వృత్తాంతము
తెలిసికొనెను. (ఇది ప్రబంధ
కథ; చూ: ముదికొండ వీర
భద్రకవి విరచిత 'వీరభాగ
వతము' పుట: 25)
హేతువాదము చేయకుండ,
ఈ కథలో నమ్మవలసిన
అనేక వృత్తాంతములలోనిది
యొకటి.

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 76 | 720 | అర్థనారిఝల్లు | ఇది ఈకథలో వీరులుధరించెడి తొడుగులలో ఒకటి. దీని స్వరూపము స్పష్టముగా తెలియదు |
| ,, | 733 | మూస్టీలు | శూరులు |
| 96 | 8 | వతారు | వటూరు, నగరు |
| ,, | 10 | ఉపహారము | ఉపాయనము; దేవతలకిచ్చెడి బలి |
| ,, | 16 | విడియము | తాంబూలము |
| ,, | 23 | వలిపంపు చీర | సన్నని వస్త్రము |
| 87 | 28 | ఉత్తరిగె | ఒకవిధమైన హారము. |
| ,, | 34 | శ్రీకృష్ణరాయుని చెలువంబు | శ్రీకృష్ణుని చెలువంబు. |
| ,, | 35 | అర్ధనారి | ఈ శబ్దము బ్రహ్మనాయునికి విశేషణముగా పెక్కుచోట్ల ప్రయోగింపబడినది. అర్థము తెలియదు. బహుశః విష్ణుని అవతారముగా నెంచబడిన ఆ వీరునకు విష్ణు పర్యాయ నామములు ప్రయుక్తములైనట్టుగానే, ఆతడు అర్థనారీశ్వరుడైన శివునిమారటమూర్తి యని ఊహించి, 'అర్థనారి' అనగా అర్థనారీశ్వరుడని వాడబడినదేమో. |
| | 37–53 | కినుక ... విచారించిచూడ | బ్రహ్మన్న, చిట్టిమల్లుని జయాపజయ సూచకముగా కూయు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | మనికోరగా, ఆ కోడి మొదట నిండుగా గంభీరస్వరమున కూసెను. అతడు రెండవ మారు కూయమనగా హీన స్వరమున కూసెను. శకునజ్ఞులు మొదటి పందెమున గెలుపనియు, మరుపందెమున గెల్పు దుర్లభమనియు అర్థము చెప్పిరి. |
| 87 | 42 | సేసలు | అక్షతలు |
| ,, | 43 | పొదవించి | పెరిగి; శరీరము పెంచి పెద్దది చేసి |
| ,, | 50 | మునుపటి పందెము | మొదటి పందెము |
| 88 | 63 | సంబవులు | పావకోళ్ళు |
| ,, | 64 | అడపకేదాసి | వక్కలాకులసంచి పట్టుకొనెడి నౌకరు. ఇతడు ఈ కథలో కేవలము దాసుడుగా మాత్రమే కాకుండా, వీరుడుగా కూడ పేర్కొనబడెను. |
| ,, | 65 | కరతిత్తి | ప్రయాణములలో వెంట నీరు పోసుకొని పట్టుకొని వెళ్ళెడి తిత్తి (నేటి Water bag వంటిది) |
| ,, | 70 | ఊడిగములవారు | సేవకులు |
| 89 | 835 | భాగానది | చంద్రభాగ |
| ,, | 36 | ఉనిచి | "ఉండుడు" అని నిలిపి |
| 89 | 88–112 | గొట్టిపాళ్ళను ... వనధియుపోలె | బ్రహ్మనాయుడు బయలుదేరిన సమయములో, గోపన గొట్టి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | పాటిలో ఆలమందలను కాయుచుండెను. ఆతనికి పని విడుపు కలిగించి పర్యాయ సేవకు వచ్చిన మల్లబోయ నికి మ్రొక్కి, గోపన మాచ ర్లకు వచ్చుచుండగా, దారిలో కొందరు గొల్లలు కానరాగా "దిక్కులు పిక్కటిల్లెడి ఆ తమ్మట ధ్వనియేమి?" అని అడిగెను. వారు అది బ్రహ్మన కోడిపోరునకై గురజాల పోయెడి సన్నాహమని చెప్పిరి. |
| 89 | 91 | పెళ్ళికి మ్రొక్కెడి ప్రియముతో | పెళ్లికి తరలి వెళ్లెడివాడు ప్రీతితో మ్రొక్కినట్లు. |
| 91 | 137 | కొదమసింగము వోలె గొదగొని | ఆకలిగొనియున్న సింహ పోతమువలె; గొద=ఆకలి |
| ,, | 139 | రూపింప | నిర్ధారణచేసి చెప్పగా; నిరూ పింపగా |
| ,, | 147 | మగిడించుపొందుగా మాటలుచెప్పి | గోపన వీరుడే; కాని తొందర పాటుగలవాడు; వానిని వెంటగొనిపోవుటకు బ్రహ్మన యిష్టపడలేదు. |
| ,, | 152 | ఆనలువ్రాయించి పొడువు | "ఇది దాటిరావలదు" అని చేతి కత్తితో ఆనగా ఒక బరి (అడ్డుగీత) వ్రాసి ఆకత్తి చివ రతో ఆబరిమీద పొడుచుట |
| ,, | 153 | అరవాయి గొనక | సంశయింపక |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 164 | పొడచూపగా | వచ్చికన్పింపగా; హాజరుకాగా |
| 92 | 170 | పని వినియెదను | వారి ఆజ్ఞప్రకారము వర్తించెదను. దర్శనముచేసి పోయి వచ్చెదనని సెలవు పుచ్చుకొందును. |
| 93 | 202 | తొడిబడ | తొందరపడి |
| ,, | 207 | తొడుసు | దోషము, చిక్కు, బాధ; ఎన్ని అనలు వ్రాసినను లెక్కచేయని గోపన, పరివారము పేరుమీద అన వ్రాసినంతనే త్రోసిపుచ్చలేక ఆందోళన చెందెను. పరివారము యొక్క అనను రాజుకూడ అతిక్రమింపలేడట. పరివారము రాజుమీద యెంత ప్రభావము కలదియో తరువాతి పంక్తులలో వర్ణింపబడినది. |
| ,, | 218 | గాసిగాచేయుచు | గాసిచేయు; క్లేశపరుచు |
| ,, | 219 | కెరవు | కానుక; ఉపాయనము; |
| 94 | 231 | పట్టభద్రుడు | రాజు |
| 95 | 254 | సమయులు | సమయమంత్రులనెడి ఒక రాజకీయ ఉద్యోగివర్గము |
| ,, | 262 | అన పడిచినయది | ప్రమాణముచేసిన సంగతి |
| 95 | 269 | బ్రహ్మన్న యానతి బాగుగా తలచి | "కాదు కూడదని వచ్చిన రానిమ్ము" అనిన యానతి; (చూ. 91వ పుట: పంక్తులు 154–156 |
| ,, | 272 | బాగాలు | వక్కలు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 96 | 290 | సజ్జనులకైన | సజ్జను లైనవారికి; (లేదా) ఎంత పెద్దవారికైనను; గొప్ప వారిని సజ్జనులనుట ఈ రచయిత అలవాటు |
| 97 | 317 | చేర చేరంగను చేటయ్యె | సన్నిహితత్వము హెచ్చిన కొలది కీడు హెచ్చెను. |
| ,, | 330 | మల్లభూపతి | మలిదేవరాజు |
| 98 | 344 | మాటలాడుచు చనె | గోపన్న దెస చూడక యితరులతో మాటలాడుచు పల్లకీ నడిపించెను. |
| 99 | 377 | ఒచ్చెము | లోపము; దోషము |
| 100 | 393 | త్రోచు టరాజకమయ్యె | త్రోచుట + అరాజకము + అయ్యె ; అరాజకము = రాజతిరస్కారము;స్వామిద్రోహము అను అర్థమిచ్చుచున్నది. (లేదా) అవినయమయ్యె. (Indiscipline) |
| ,, | 399 | కులము దాచడు | తన కులమునకు సహజమైన అవివేకమును బయట పెట్టుకొనును. |
| ,, | 405 | తమ్ముడవటు లౌట ధరణీశు డెరుగు | నీవు నా తమ్మునివంటివాడవు. నీఎడల నాకుగల ప్రేమ రాజునకు తెలియును. |
| ,, | 415–16 | | కోళ్ళ పందెమును చూడవలెనను కోర్కెయే నీకున్నచో రాజాజ్ఞ గైకొనిరమ్ము; నేను వలదనను. |
| ,, | 419 | తుచ్ఛము | తగని పని; |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 101 | 429 | శృంగిపేరి పట్టణంబు | వీరసోముని రాజధాని అయిన కల్యాణపురము |
| 102 | 459–472 | అని ... కంకణ మదీయము | మా అన్న వీరపడవాలు సిరా దేవి కడకు నేతెంచి ఆమెతో మాచర్లకు తరలిపోవుటకు సమ్మతించి యిట్లనెను: "మలిదేవభూపతిని గొల్చుచు గురజాలరాజుతో ఆయనకు యుద్ధము తటస్థించినపుడు నేను వెనుకంజవేయక వీరుడనై గురజాల కోట మీదకు మాకి స్వామి కార్యార్థమై ప్రాణములర్పించి ముక్తికాంతను వివాహ మాడెదను" ఇట్లని అతడు తన చేతికి కంకణము కట్టు కొనెను. |
| 103 | 475–76 | నీకును ... చెప్పుము | నీవు వచ్చునపుడు ఎటువంటి శకునములు వచ్చెనో చెప్పు మని బ్రహ్మన్న గోపన్న నడిగెను. |
| ,, | 479–81 | గాలిగాడు | గాడిద |
| ,, | ,, | పరడు | నక్క |
| ,, | ,, | పైడికంటి | ఒకపక్షి (శకునము తెల్పునది) |
| ,, | ,, | కనుబెంటి | జీలుగు పిట్ట |
| ,, | ,, | మూగ | ఒక పిట్ట |
| ,, | ,, | నేలపాము | ? |
| | | నుప్పెనయు | |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 103 | 485 | నీ శకునంబులే నీ బంటుకగును | ఈ ప్రయాణము నీది కనుక నీశకున ఫలమే నీ బంటునగు నాకుకూడ కల్గును; నా శకునములు పాటింపరాదు. |
| 104 | 511-512 | అనుగంపుకాయ | అనపకాయ. |
| ,, | 523 | మలవరపు కోడెలు | మల్లవరపు గిత్తలు |
| ,, | 525 | నక్తములు | నల్లగ్రుడ్లగూబలు. |
| ,, | 527 | అసత్తువై | సత్వహీనమై |
| ,, | 528 | పట్టిన కుంట | నీరు ఎండిపోయిన గుంట. |
| ,, | 542 | నాశేసంబు లెవియు | నేను చెప్పిన శకునముల మంచి చెడ్డలు ఎట్టివో |
| ,, | 544 – 45 | కొరగాని ... చిత్తమెట్లగునే | చెడుఫలములను చెప్పరాదు చెప్పినచో నీ చిత్తము కలత చెందును, కాని చెప్పవెతును. |
| ,, | 547 – 48 | విన్నను ... ఖడ్గంబు కాక | వీరపురుషుడవైన నీవు నీ ఖడ్గమును నమ్మవలెగాని శకునములతో పనియేమి? |
| 106 | 566 | పాలసికడమ | తక్కువయైన శేషము |
| 107 | 612 | చందురువంకలో సతులు రేవాడ | చంద్రవంక నదిలో స్త్రీలు స్నానము చేయగా |
| 108 110 | 622-682 | ఇట్టికాలము ... భూమి | కోడిపోరున బ్రహ్మన ఓడిపోయి రాజ్యము విడిచిపోవు నపుడు ప్రజలు అతని సత్పరిపాలనమున తాము పొందిన సౌఖ్యముల నుగ్గడించు కొనుచు నలగామురాజు' |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | చేతిక్రింద ఉండు పడవలసిన పాట్లను తలచుకొని బెగ్గడిల్లుచు తమలో తాము అనుకొనబోయెడి మాటలు ఈ పంక్తులలో వర్ణింపబడినవి. |
| 108 | 624 | పంౘ్రెండుపాళ్ళు | పదహారు పాళ్ళలో ప్రజలకు పంౘ్రెండు వంతులు, రాజునకు నాలుగు వంతులు. |
| ,, | 625 | పన్నువరాయుండు | పన్ను వసూలు చేయునాడు; సుంకరి. |
| ,, | 627 | దండుగ | జుల్మానా. |
| ,, | 628 | పినికడుగబోడు | పినికి అడుగబోడు: పవింతులను విని వాటిని బట్టి ప్రశ్నింపడు. |
| ,, | 637 | తానెయైమంచుకు... | దున్నని బీటి నేలయైనను తనంత తానే వాన లేకుండ మంచు పడినంత మాత్రమునకే పంటపండును. |
| ,, | 638 | కాపురమతనికిచేసె | ఇతని రాజ్యమున కాపులమై నివసించి |
| 109 | 650 | పుల్లరి | గడ్డిమేసినందుకు ఇచ్చెడి పన్ను |
| ,, | 651 | దండాయము | శిక్షగా వసూలుచేసెడి పన్ను. |
| 109 | 669–75 | గురజాల ... | మాచెర్ల గురజాలలు విడి |
| 110 | ,, | యెరుగంగరాదు | పోయినపుడు మాచెర్ల పాలికి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | వచ్చిన ఊళ్ళవారిని, మాచెర్ల వైపునకు వచ్చినవారిని పాతర్లలో వేసి రోకళ్లతో బాడిపించునని బయపడిరి. |
| 110 | 676–77 | జగము… … …యుండు టెట్లు? | భూప్రజలు రాబోవు దుష్కాలమును గురించి ప్రాణ సంకటమైన కలగన్నప్పుడు (అనగా ఊహించినపుడు) శుభము కలుగునని ఆశించియుండు టెట్లు? |
| ,, | 696 | ఒకయిటి | ఒక పంజరము; ఒక బోను. |
| 111 | 707 | [illegible] | ఒకజాతి డేగలు; కాని బ్రహ్మనాయుని చుట్టుముట్టినవి నక్తములు అని (నల్లగూబలు) పైని చెప్పబడినది; అవియే యివి కావచ్చును. |
| ,, | 710 | కోడిమేడము | కోడి పందెము. |
| ,, | 722 | [illegible]ట్టినట్లు | చావ మంత్రించినట్లు. |
| ,, | 725 | కొందడవు | కొంతతడవు. |
| 112 | 734 | పిండలివందు | బురదముద్ద |
| 113 | 773 | సంబెరమిత్తురు | తిలోదకము లిత్తురు |
| ,, | 780 | రేపల్లె | ఇది బ్రేపల్లెకు వాడుకలో నున్న రూపము |
| ,, | 788 | సద్గుణమహాదేవు | గుణములందు ఈశ్వరునివంటి వాడు. |
| 114 | 793–97 | మహాదేవిచెర్లకు … నేగుదెమ్మ | నీవిపుడు మాచెర్లకు వెళ్ళి ఈ రాత్రి నిద్దురపోయి. లేచి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | తెల్లవారిన పిదప మూడుగు లలో మమ్ముకలియుము అని బ్రహ్మన గోపు నాజ్ఞాపించెను. |
| 114 | 801–802 | శకునంబు లన్నిటుం గైకొన నీకు సెలవు | శకునములయొక్క ఫలముల ననుభవించుట నావంతు; కోడి పోరు నీవంతు : అనగా శకున దుష్ఫలములు నాకు వదలి, కోడిపోరులో జయము గొనుము. |
| ,, | 811 | వ్రాలాకు | వ్రాసిన ఆకు; ఆజ్ఞాపత్రము. |
| ,, | 811 | వ్రాలాకుపెట్టుము | ఆజ్ఞయిమ్ము. |
| 115 | 821–22 | లోకమాతకువరుడు | మహాలక్ష్మికి భర్త. |
| ,, | 826 | సోమసూర్యగతులు | చంద్రనాడి, సూర్యనాడి ఆడుట. |
| ,, | 830–33 | | బ్రహ్మనాయుడు యోగ నిష్ఠాపరుడై భవిష్యత్తును చూచెను. |
| 116 | 870 | మిను | ఆకాశము |
| 117 | 894 | తమ్ము | తామరలు; సోదరులు; (శ్లేష) |
| ,, | 898 | మోడ్చె | మొగిడెను–ముకుళించెను |
| 118 | 917 | పిచ్చికకుంటు etc. | అనూరుడు; కాళ్ళులేనివాడు. దీనికి సరియైన రూపము పిచ్చుకకుంటు; కాళ్ళు లేని వాడు గంగకుపోలేక దిగులు పడియుండగా గంగయే వచ్చి అతనిపై ప్రవహించినట్లు. |
| ,, | 92[illegible] | తనిసి | తృప్తిపొంది. |
| 119 | 934 | [illegible] | చతుష్కలలు; నాలుగింట్ల [illegible] |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 119 | 947 | వీడుపట్టు | విడిడి |
| 120 | 980 | బాసపత్రము | సమయపత్రము; ఇరారు నామా. కోడిపందెముయొక్క జయాపజయ ఫలానుభవము ను గూర్చి యింతకు ముందే పత్రములు వ్రాసుకొన్నారని ఊహింపనగును; ఆ వృత్తాంతము ఇందు ప్రత్యేకించి చెప్పబడలేదు. |
| 121 | 1001 | తరమిడియున్ని | వారివారి అంతరములను బట్టి తరతరములుగా నంపి. |
| ,, | 1009 | సత్యంబు ... లయిము | సత్యమే జయము; అసత్యమే నాశము |
| 122 | 1018 | వరుసలనెరిగి | వారివారి అంతరములు గుర్తించి |
| ,, | 1024 | తామసవామాక్షి ముఖము | రాత్రి అనెడి సుందరిముఖము |
| ,, | 1034 | పేరుకొన్నట్టి | పాలమీగడ మీగడవలె పేరుకొన్న;కొంచెము కరడుకట్టిన. |
| ,, | 1035 | కడలుచు | కదలుకొనుచు; ఉప్పొంగుచు |
| ,, | 1030-40 | ఆకటి పెల్లున ... వేయి చందముల | ఈ పంక్తులలో చకోరముల వెన్నెల ఆహారము వర్ణింపబడ్డది. ఈ అర్థమే యిచ్చు పద్యము అనంతామాత్యుని భోజరాజీయములో కలదు. |
| 123 | 1053 | నడిమంతరమున | నడిమిభాగమున; |
| ,, | 1066-71 | నీ కొంతంబునకును ... పారణసేతు | పంచపక్వ పరమాన్నముల తోడి యీ విందు నీ కుంతము |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | నకు నైవేద్యమగుగాక. నాకుంతము నేటికి ఉపవాసముండి రేపు గురజాలలో శత్రువుల మేదో మాంస రక్తం మిళితమైన భోజనమును ద్వాదశిపారణవలె ఆరగించ గలదు. అనగా రేపు నా కుంతమునకు శత్రువులను బలి యిచ్చెదనని అర్థము. |
| 24 | 107. | పారణ | ద్వాదశి |
| ,, | 1074 | ఉద్దండములు | ఉద్ధత వాక్యములు. |
| ,, | 1078 | పడెయెత్త... మేలు | నీవు ముద్ద ఎత్తవు ఏమి కారణమని బ్రహ్మన ప్రశ్న. |
| ,, | 1087 | ఇచ్చుండి... | ఇంతకు ముందు నేను గురు ప్రసాదము తినలేదు; గొప్ప బ్రహ్మన చేతి ప్రసాదము తిని పవిత్రుడగుటకు ఆశపడు చుండెను. |
| 125 | 1114 | సక్కటి | ధర్మము, న్యాయము, విధానము, ఏర్పాటు. |
| ,, | 1116 | సన్నాడంగ | నన్ను తప్పుపట్టు |
| ,, | 1119 | భుజముల ముద్రలు పెద్దగా పెట్టి | శంఖ చక్రాది వైష్ణవ ముద్రలు పెట్టి అతనికి బాలగోపాల దాసి అని నూత్న నామకరణము చేసెను. |
| 126 | 1134 | ఉల్లసించినాడని | ఉల్లసిల్లియున్నాడని |
| | 1155 | పరిణమింపుదురు | వృద్ధిపొందుదురు |

| పుట | పంక్తి | పదము | |
| --- | --- | --- | --- |
| 128 | 1207 | మండపడీలు | గుఱ్ఱపువాండ్రు |
| 129 | 1215 | ముయ్యంచుల యుత్తరంబులు | త్రిశూలములు |
| ,, | 1217–8 | తురకరాహుతులు ...రపర్వతోర | ఈ చరిత్రనాటికి తురికజాతి పెరిగి హైందవరాజుల కొలువులో చేరెననుట సందేహాస్పదము. అట్టిపరిస్థితి గ్రంథ రచించిన నాటికి కలిగియుండవచ్చును. గ్రంథకర్త తన సమకాలకవృత్తాంతమును గతకాలమునకు అనువర్తింపచేసెను. |
| 129 132 | 1229–1317 | రాళ్ళపక్షని ...వేగరండు | నాయకురాలు ఆయా ఉత్తమాశ్వములను ఆయా వీరులకు పేరుపేరున సమ్మని యాజ్ఞాపించుట యిందు పేర్కొనబడినది. రాళ్ళపక్షి – ఇదిఒక గుర్రము పేరు. ఇట్లే మిగిలిన గుఱ్ఱములపేర్లును పోల్చుకొనదగును. |
| 129 | 1234 | జవాళము | జీవసాచము |
| 130 | 1255 | పెద్రాజుముల్కు | ఫెరోజ్ ముల్క్ కావచ్చు. తురకమతము పుచ్చుకొన్న ఒక పెద్రాజు పూర్వనామము ఉంచుకొనబోలు. |
| 131 | 1285 | హంకారము | అహంకారము |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 133 | 1330 | పోరాసుగల | మైత్రిగల చోటును పిడిచిపో తగనివాడు |
| 134 | 1378 | గరిడి | కోళ్ళుపోరెడిబరి (Arena) |
| ,, | ,, | తమకమ్ము | మంచశ్రేణి (Gallery) |
| ,, | 1380 | ఓజు | వడ్రంగము కమ్మరము మొద లగు పనులుచేసెడి బత్తుడు |
| 135 | 1402 | వెన్నెల బయలు | ఖాళీస్థలము (Open Space) |
| ,, | 1410 | వెట్టయై తోచెడి పథముకాకుండ | ధూపముల వల్ల కలిగెడి వేడి తగలకుండునట్లు |
| 136 | 1415 | తమకుల చేదృష్టి తాకకయుండ | చూచవలెనని తమకముచెందే వారి దృష్టి దోషము తగుల కుండునట్లు |
| ,, | 1421 | ఒరుగులు | ఒరిగి కూర్చుండతగిన దిండ్లు |
| ,, | 1430 | ఉడుగర | బహుమానము |
| ,, | 1434 | సోడుముట్టంగ | బ్రహ్మరంధ్రమున. కెక్కగా (దీనినే వాడుకలో "నసాళము అంటగా" అందురు) ఘాటైన పరిమళమన్నమాట) |
| 137 | 1445 | ముద్రికలు | ఉంగరములు |
| 138 | 1482-83 | | నవరసముల పేర్లు |
| ,, | 1484 | పక్కట్ల నెరిగి | ధర్మముల నెరిగి |
| 140 | 1537 | ప్రేగుగా | బరువుగా |
| ,, | 1539 | చొల్లెంబు | జడతో. చుట్టిన చుట్టు |
| ,, | 1547 | తామ్రచూడము | కోడి |
| 141 | 1554 | కరువ | కొండ |
| ,, | 1557 | ఈరాజ్యమీయెడ... | చిట్టిమల్లుని గెలుపోటముల మీద పల్నాటి రాజ్యస్థితి ఆధారపడి యున్నది గనుక |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 141 | 1561 | నల్లమల్లుడు | గుడిబాలవాని కోడి |
| ,, | 1570–90 | | కోడిపోరు వర్ణనము ఇంత స్వాభావికముగ, ఇంత స్పష్టముగ ఇంతసరితముగ వర్ణించిన కవి తెలుగువాఙ్మయమున ఇంకొకడు లేడు; |
| 143 | 1615 | కరిపుంజు | నల్లమల్లుడు |
| ,, | 1624 | అర్థనారి | ఈ శబ్దము కొన్నిచోట్ల బ్రహ్మనాయునికే కాక, ఇచ్చట కోడికి కూడ విశేషణముగా వాడబడినది |
| ,, | 1629 | జూటము | శిఖ |
| 144 | 1649 | నాయురాలుఇచ్చి. | బ్రహ్మనాయునిచేత మూరు పందెమునకు ఒప్పించి పంపి, చింతాక్రాంతుడైయున్న నలగామునితో నాయకురాలిట్లనుచున్నది. |
| 145 | 1687 | అక్రియలందు | అకార్యములందు |
| 146 | 1691 | కట్టుబోతులు | అభిచారక్రియలు చేసెడి మాంత్రికులు. |
| ,, | 1700 | మమ్మువలసినవారు | మాకు కావలసినవారు |
| 147 | 1725 | జీవంబుగలవాని చెప్పంగనేల | ప్రాణుల సంగతిచెప్పనేల ? |
| ,, | 1728 | కర్త | ముఖ్యుడు; అధినేత |
| ,, | 1740 | దృష్టంబు | నిదర్శనము; దృష్టాంతము |
| 149 | 1778 | చిత్తముతెరగు | మనోభిప్రాయము |
| ,, | 1795 | గెంటెడునట్లుగా | చలించిపడునటుగా |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 150 | 1810—11 | ఈమరి ... వారము | ఇక మారుపందెము లేదనుట. |
| ,, | 1823 | మానిసిపేడ | మనుష్యుడనువా డెవడువచ్చి నను; నాయకురాలి మనుష్యులు తమగముసీలలూడ దీసి పడగొట్టెదరని గ్రహించి కన్నమ వారిని అటనుండి తరిమివేసెను. |
| 151 | 1852 | మెరిమెరి | సందేహము; అలుకు |
| 153 | 1890 | తోరణకట్టుకో | తోరణకట్టుకొనుము; తోరణ కట్టుకొనుట అనగా నెలకొనుట, పాదుకొనుట అని నిఘంటుకారులు చెప్పుదురు. కాని ఇచ్చట గృహప్రవేశమునకు ఇంటికి తోరణము కట్టుకొన్నట్లుగా మాచెర్లపురప్రవేశమునకు తోరణకట్టుకొనుటకు దొరలను పంపుమనెడి అర్థము సమంజసముగా కన్పడుచున్నది. |
| ,, | 19 6 | కలపసగంప | కలహాశీల |
| 154 | 1918 | వాలిమర్దనుడు | బ్రహ్మన, |
| ,, | 1932 | పడుచుమాటలకు | ప్రౌఢవయస్కుడు కానివాని మాటలకు; చిన్నవాని మాటలకు ; |
| 154 | 1938—39 | బ్రహ్మనాయుడు ... | రాచపట్టులలో అనగా రాజకుమారులలో. "రాజకుమారులెవరును బ్రహ్మనకు బాసపత్రములు పంపలేము, నేనే |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | పంపితిని. స్త్రీబుద్ధి వినువాడు చెడును తథ్యమని వదరుచుంటివి. ఆడుదిపంపిన బాసపత్రమున కంగీకరించి బ్రహ్మాన్న కోడిపందెమునకు దిగెను. ఇది మా దోషము కాదు" అని నాగమ్మ గోప్ప మాటలను ఖండించుచున్నది. |
| 155 | 1946 | మందె మేలంబున | చుల్కనగా; లేని చనవుతో |
| ,, | 1955 | సుగుడజుమీ | తిరిగిపోను సుమీ |
| 156 | 1978 | సంగడించిన | దగ్గరకు వచ్చిన |
| ,, | 1984 | సబళము | ఈటె |
| 157 | 1994 | బొమ్మలు | కనుబొమలు |
| ,, | 1998 | కరకులు | కఠినమాటలు; పరుష వాక్కులు |
| ,, | 2011 | మన్నియ | ప్రభునాజ్ఞ; సెలవు |
| 158 | 2040 | అభిమానములమీద నానలుపెడిచి | వారివారి అభిమాన వస్తువుల మీద (లేదా) పౌరుష కార్యములమీద ఆనపెట్టి |
| 158 | 2044–2051 | చందురువంకలు–etc. | ఇవి బాణముల పేర్లు |
| 161 | 2119 | తన పేరువాడ | సవాల్‌గా తన పేరు చెప్పుకొని |
| 163 | 2171 | కన్నెకయ్యము | ప్రథమ యుద్ధము; (Maiden Fight) |
| 164 | 2206 | కనుమూయకుండె | ప్రాణము విడువకుండెను. |
| ,, | 2211 | గోప్ప చిక్కదుకదా | శత్రువులకు గోవన్న పట్టుబడలేదుకదా |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 165 | 2224 | ప్రేటూరు శునకలు | ఒక్క ప్రేటుకు ఆరు ముక్క లగునట్లుగా |
| ,, | 2242 | అచ్చలముగొనుచు | ఆగ్రహపడుచు |
| 166 | 2250 | పెట్టిడ | పెట్టుఇడ; ఒక దెబ్బ వేయగా |
| 167 | 2299 | ససరాలకొమ్ములు | వెండ్రుకల కుచ్చులు కట్టిన ఎద్దుల కొమ్ములు |
| 168 | 2324 | ఒడ్డుకొనుచు | ఎదిరి దెబ్బతగలకుండ డాలు మొదలైనవి అడ్డుపెట్టుకొనుచు |
| ,, | 2335 | వాని చేనున్న | మావటివాని చేతిలోనున్న |
| 169 | 2358 | ఏకాంగవీరుడు | అసహాయశూరుడు |
| ,, | 2364 | మానంబుదిగవెట్టి | అభిమానము దిగద్రావి |
| 171 | 2400 | నాగమవలన | నాగమదేస |
| ,, | 2412 | పసుధారినాగు | వసుధకు శత్రువైన నాగమ్మ; లోకకంటకురాలు. |
| ,, | 2418 | తలచీరవిడగా | తలపాగ విడిపోగా; |
| 174 | 2485–86 | ఆదితెలియక | మూలముతెలియక; |
| 177 | 2575 | పుట్టి | పడవ |
| ,, | 2583 | వాసంతమాడించి | వసంత మాడించి; ఓలలాడించి |
| ,, | 2593 | దిగ్దైవతములార | పది దిశలనుండెడి దేవతలారా! |
| ,, | 2596 | పింగంబుపెట్టింతుము | మండపారాధన చేయింతుము |
| 178 | 2602 | అఖండములో | అఖండదీపములు |
| ,, | 2604 | కుంభము | అన్నపురాశి |
| ,, | 2608 | కలయర్థమెల్ల | కాగల కార్యమెల్ల |
| ,, | 2621–22 | నెత్తురు గుడికట్టి etc. | ప్రళయసూచనగా గగనమున ఎఱ్ఱనిగుడికట్టి వేరొక సూర్యుడు ఉదయించెను. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 181 | 2678 | దారమ్మ | గోపన్న తల్లి. |
| ,, | 2682 | నిన్ను విత్తులుదాచు చందమున | పంటలో సారవంతమైన ధాన్యము తీసి మరుసటిపంటకై, విత్తనములకై దాచినట్లుగా మన వీరులలో నిన్ను మేటినిగా ఏరి నీ జీవితము అల్పములకై వ్యర్థపరచరాదని నిన్ను కోడి పందెమునకు రావలదంటిని. |
| 183 | 2753 | తమలంబు నుమియుచు | నమలుచున్న విడియమును ఉమియుచు |
| 189 | 3 | కోపితుల సమ్మతిపరచి | శత్రువులమీద కోపించినవారినిసమాధానపరచి |
| ,, | 8 | భట్టును పంపకమున్నె | పురమును వెడలి బ్రాండని భట్టుచే కబురు పంపకమున్నె |
| 192 | 72 | కట్టడిలేదు | నియతిలేదు |
| ,, | 78 | తన వృత్తాంతమెల్ల | ఈవృత్తాంతమంతయు ముందు కథలో పేర్కొనబడినది. |
| ,, | 94 | నేరమి | దోషము. |
| 194 | 129 | ఇక్కడితలపోతలు | మీ యీ ఊహాలు |
| 195 | 172 | నిర్ముక్తి | పాపవిమోచనము |
| 200 | 19 | వీసుల పల్నేడు | ఇతడు అడవి చెంచుల నాయకుడు |
| ,, | 20 | అర్థవీడు | అతని నివాస స్థలము |
| 201 | 30 | కాలరి | కాలిబంటు |
| 202 | 49 | తానెంత మోచెనో తగని కార్యంబు | ఆకార్యభారము ఎంత మోపై ఉండెనో. తగని కార్యము |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | అనగా ప్రతికూల కార్యము; అపాయము (Imminent danger) |
| 202 | 63 | పాడూళ్ళు మనకిచ్చి | ఆ, యా గ్రామముల వారు బ్రహ్మనాయునితోడిదే బ్రతుకని అతనితో వలసకు లేచి పోగా ప్రజలు లేని ఊళ్ళు పాడూళ్ళయ్యెను |
| ,, | 67–68 | మలిదేవరాజులును ...మగిడించవలెను | వలసపోయినను బ్రహ్మన్న గురజాలరాజ్యమునకు చేరువనే ఉన్నాడు; ఆసన్నరాజు ఈతిబాధలలో ఒకడు కనుక అతనివల్ల మనకు కీడుగలుగకుండ, అటనుండి తరిమివేయవలయును. |
| 203 | 84 | మాతండ్రి దాసినేని... | వీథులపలెనేని పూర్వవిరోధమునకు ఇది కారణము. |
| 204 | 111 | సొమ్ములు | పశువులు; ప్రాచీనకాలములో గోవులే సంపదగా భావించెడివారు. అందుచేతనే గోధనమనే శబ్దము పుట్టినది. |
| ,, | 116 | పన్నెండు నామముల్ | ద్వాదశోర్ధ్వ పుండ్రములు |
| 205 | 137 | అమృతపడి | స్వాములు స్వయంపాకముచేసికొనుటకు బియ్యము, పప్పు మున్నగు సంభారము |
| ,, | 153 | అతి భీతినొంది | ఆమె మాటలనుబట్టి తమ్ము గురించినదని భయపడిరి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 205 | 156 | పని విని | సెలవు పుచ్చుకొని |
| 207 | 204 | గుమ్మెటల్ | ఒక విధమగు కుంభవాద్యము |
| ,, | 206 | దామెనల్ | పలుపులు; త్రాళ్లు |
| 209 | 247 | కాలందెలు | కాలికి వేసికొన్న బిరుదు టందెలు; (c. f.) అందెవేసిన చెయ్యి |
| ,, | 248 | పదునుచురియలు | వాడిచురకత్తులు |
| ,, | 250 | గరిడిలో | సాముగరిడిలో |
| 210 | 272 | చల్లని తల్లి యోచంద్రిక | చంద్రిక, లేత మామిడి, లేతోట మున్నగునవి ఆవుల ముద్దుపేర్లు. వారు గోలక్ష్ములను అంతఃపురస్త్రీలనుకంటె ఎక్కువ ఆదర ప్రేమలతో చూచెడివారనుటకు ఈ పేర్లే నిదర్శనము |
| 210 | 287 | పట్టర్లు | ఒకఅడవిజాతిప్రజ |
| 213 | 366 | మగపాడి | పౌరుషము |
| 214 | 370 | సురభులు | ఆవులు |
| ,, | ,, | అవగుణము | అంటుజాడ్యము |
| ,, | 380 | చెరగుట | మాయుట |
| 221 | 21 | పరమేశుభంగి | మహావిష్ణువవలె |
| ,, | 24 | పిన్నన్న | బ్రహ్మాన్న; ఈయన అన్న పెద్దన్న కనుక ఈయన పిన్నన్న. |
| ,, | 28–29 | హనుమంతుడు ... ...నిర్జించునట్లు | హనుమంతుడు సముద్రమును దాటునపుడు అడ్డగించిన సింహికను చండాడినట్లు |
| 221 | 32 | మమ్మొ | మాపాలిసొత్తు |

| పు ౦ | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 2 7 | 67 | అయ్యోధ్యరాజు | పాలమాచాపురినుండి వచ్చిన ఈ హైహయరాజవంశమునకు పురాతనమూలస్థానము అయోధ్యాపట్టణము. ఆ అభిజనస్థానము పేరుమీద వీరు తమ్ము అయోధ్యరాజులమని చెప్పుకొనెడివారు; ఇట్లే ఆంధ్రదేశములో కొన్ని భూబాగములను పరిపాలించిన చోళరాజులు తమ మూలపురుషుడైన కరికాలచోళుడు ఒరయూరు రాజధానిగా చోళమండలమును పరిపాలించుట బట్టి తాము ఒరయూరి రాజులమని చెప్పికొనెడివారు. (c. f.) నన్నెచోడుని కుమారసంభవము. |
| | 74–75 | నాయకులె. హత్తుక యున్నారు | పాండవులు అడవులకుపోగా రాజులందరును దుర్యోధనుని ఇట్లే హత్తుకొని యుండిరి. |
| 23 | 90 | నీపూట | నీవు పూనినభారము. |
| ,, | 94 | అది ఒకడెసాధించి | అమరలోకమును తానొక్కడే సాధించి. |
| ,, | 104–105 | పరగంగ ... మనిన | నేను తోడు అసపడను; ఐనను ఎవరెవరిని తోడితుపో తెల్పుము. |

| పుట | పంక్తి | పదము | |
| --- | --- | --- | --- |
| 224 | 129–132 | పేరును ... రాజు | ఇవి రాయబారమప్పుడు ధర్మ రాజు శ్రీకృష్ణునితో ఆడిన మాటలవలె నున్నవి. |
| 225 | 137–38 | నీళ్ళ ... మేలు | ఇవి బంధుత్వమును విడరా దని చెప్పు సామెతలు. |
| ,, | 151 | కలసిన | తిరిగివచ్చి తన వారితో కలసిన |
| ,, | 149–163 | అలనాడు ... కనిన | రాజమాతయైన ప్రజ్జలదేవికి బ్రహ్మనయెడగల భక్తికి ఈ పంక్తులు నిదర్శనము. ఆమె అతనికి సోదరివంటిది; |
| 227 | 210 | సాధించువేళ చెప్పుమా | నీవు కొట్టి జయింపదలచు కొన్నది ఏవేళలోనో చెప్పుము |
| 228 | 221 | ఆర్చినగాని | ఆర్చినట్లైన (ఆర్చుట అనగా ఆర్పివేయుట. సర్వనాశనము చేయుట) |
| 227–228 | 215–240 | వినవయ్య ... విజయ సమాన | వేగుజామున సూర్యోదయ వేళ అపరసంధ్యవేళ నిద్ర వేళ నిషిద్ధములని తల్లి ఉపదేశము |
| 228–229 | 241–250 | బ్రాహ్మల ... లోకముల | అవధ్యులైన బ్రాహ్మణులనుభక్తు లను, భట్టులను, దాసుళ్లను జంగములను తొలగిపొండని ప్రేమతో హెచ్చరించి పంపి వైచి క్షాత్రకర్మకు అర్హులైన తక్కినవీరులకు తన రాక |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | ఎరుగచాటించి వ్యవధి ఇచ్చి వారు సంసిద్ధులైన పిమ్మట ఏడుగడియలుప్రొద్దెక్కినవేళ కోట ముట్టుడింపుమని తల్లి ఉపదేశము |
| 230 | 289–93 | ఆపురవీథులచూచి | మలిదేవాదులు వలసపోయిన తరువాత ఊరు పాడుపడినది |
| 233 | 355 | మాతల్లి | గౌరవార్థముగా మా అమ్మ (రాజమాత) అనెడి అర్థమే గాని, ఇచ్చట తల్లిఅనగా జనని అను అర్థములేదు. |
| 234 | 406 | పనివిందు నా స్వామి పట్ణమ్ముదాక | స్వామీ! గురజాల పట్ణము దాక పోయివచ్చెదను సెలవిమ్ము |
| 235 | 414 | కొమ్ముపైనున్నట్టి కొర్తి వీరుండు | కొమ్ముపైనున్నవాడు సజీవుడైనకొర్తివీరుడో, లేక, వాని భూతమో, ఊహించుట కష్టము. సజీవుడనుట నమ్మరానిది. |
| 235–236 | 433–446 | పెద్దల ... వేశ్యలకిత్తు | ఈ పంక్తులలో చెప్పబడిన వన్నియు కొర్తివీరుని అతతాయి పనులు |
| 236 | 457 | సొక్కులవిబూది | మీద చల్లినంతనే మైకము క్రమ్మించెడి మచ్చుమందు |
| 237 | 485 | ఒప్పమి | కీడు |
| 238 | 496 | పోటుమాటలు | డాబు మాటలు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 238 | 514 | నవబ్రహ్మల పేరనటియించు నతని | నవబ్రహ్మలే బ్రహ్మనాయుడుగా అవతరించిలీలామానుష నటన చేయుచున్నారు అని భావము |
| 239 | 543-544 | పేరుల ... నీవు | కారెమపూడివీరులలో వానికి కూడ ఒకభాగమున్నదని |
| 240 | 564 | పొడిచి | చేతివ్రేళ్ళతో పొడిచి |
| .. | 568 | బోనికావడి | బోనము అనగా భోజనము. అన్నము తీసికొని వెళ్ళెడి కావడి; ఇక్కడ దేవుని గుడిలో నైవేద్యము వండి పెట్టుటకు వలసిన భోజన సామగ్రి తీసికొని వెళ్ళెడి కావడి. |
| 241 | 576-578 | నాయుడు .. పోవలదు | నా పాలిదైవము ఈశ్వరునికి బలిగా నిన్ను తెచ్చెరా అని నిన్ను కత్తితో వ్రేయగలడు. |
| .. | 590 | దిడ్డితీయింపుడీ | గవని ప్రక్కనుండు చిన్ని వాకిలి. ఆవాకిట కావలి పరున్న భటులచే దానిని తీయించుకొని పూజారి, దూరమున నున్న గుడికి పోవలెను. |
| 242 | 624 | అంగనాల్ బిందె | దేవునికి అభ్యంగనము (అభిషేకము) చేయించుటకు నీరు తెచ్చెడి బిందె కావచ్చు. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | లేదా రెండు వైపుల పట్టు కొనుటకు గొళ్లెములు అమర్చిన బిందెకావచ్చు. రెండవ అర్థమున అంకెనాల్ బిందె అని సవరించుకొనవచ్చు. |
| 242 | 628 | కూపంబు | ఇక్కడ, దిగుడుబావి అని అర్థము (లేదా) కోనేరు. |
| 243 | 638–40 | కన్నడ ... నంబొ | వీరందరును శైవకథలలో చెప్పబడిన పూర్వపు శివ భక్తులు. |
| 248 | 799 | గురజాలగంగో | గురజాల గ్రామదేవత |
| 250 | 833 | నాయురాల్ మాటలు | నాయురాలిమాటలు |
| ,, | 848 | ఒరిగిరి | కదలిపోయిరి |
| 252 | 895 | వెళ్లిరమ్మ | వెడలిరమ్మ |
| 253 | 928 | చెల్లాడిపోయిరి | చెదరిపోయిరి |
| 259 | 3 | వింతవేడుక | అపూర్వమైన ఆనందము |
| 260 | 28 | మరియాద | కట్టుడి |
| 261–63 | 98–112 | వినవయ్య ... మనకు | అభిమన్యుని వివాహానంతరమున పాండవులును వారి బంధువులును కలిసి చేసిన రాయబారపు టాలోచనలను ఈప్రసంగములుతలపించును. |
| 263 | 108–110 | అదిగాక – ఆప్పుడందరకు | అలరాజు, నలగామరాజు కూతురు పేరమ్మను పెండ్లాడుట ఎప్పుడు జరిగెనో ఈ గ్రంథమున చెప్పబడలేదు. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 263 | 135–36 | నీ కుమారుని..నమ్ము | నా కొడుకు బాలచంద్రుడు నీ యందు వినయము కలవాడు. అతనిని నీ కుమారునకు మారుగా నీవద్ద నుంచెదను. నీ కొడుకునకు ఏదైన ఆపదయగునేని, ఇతడే నీ కుమారుడగును |
| 264 | 140 | చెలియలి కొకమాట | నీ సోదరియైన నాభార్యకు (ఇదికూడ, ఆ ప్రతవల్ల కలుపుకొన్న వరసయే) |
| ,, | 146 | అడ్డతెరపట్టించి | ఎంత ఆప్తతయున్నను రాచపడతులు ఎదుటపడరు కనుక అడ్డతెర పట్టించి మాట్లాడుట ఆచారము. |
| 265 | 185 | నీసుతుకపరాధమైన | నీ కుమారునకు హానికలిగిన |
| | 189 | భూములు తెచ్చెడి పుణ్యము | సంధికుదిర్చి రాజ్యభాగము వచ్చునట్లు చేయుట మహా పుణ్యము, |
| 268 | 257 | దిండుతిరుగుచువచ్చి | సంతోషముతో గిరగిర తిరుగుచువచ్చి |
| 271 | 347 | ముగ్గురుసుంకర్లు | మీ మున్నూరు గజములకు మాముగ్గురు సుంకర్లు సమము. |
| 272 | 369 | చేకూర్చి | హసగించి |
| | 381–83 | మధ్యవర్తుల.. నేరమెంచకుము | మధ్యవర్తులకు అణకువ వలయును అనెడి ఒక లోక మర్యాద కలదు. దానిని నేను |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| | | | అతిక్రమించి కోపగించితిని. నేరముపట్టకుము. |
| 274 | 438 | వానిచేనిచ్చి | వానిచేతికిచ్చి |
| 275 | 455 | నీ యుద్యోగమేమి | ఇప్పుడు ఏమి నౌకరిలో ఉన్నావు |
| 276 | 492 | కాలపక్వంబు | కాలపరిపాకము |
| 277 | 498 | మర్యాదకలదు | గౌరవముకలదు |
| 278 | 525 | కలయంగనార్చి | పూర్తిగా ఆర్పివేసి |
| ,, | 534 | నీదు అక్క | నీదు సోదరి; నాభార్య; ఇది ఆప్తత. |
| ,, | 538–39 | నెమ్మదిగా ... నవ్వేళ | కొలువులోనున్న రాజును చురచుర చూచుచునే అంతఃపురములోనికి వెళ్ళెను. |
| 279 | 560 | కవకవ నవ్వి | ఇది క్రోధ దుఃఖహాసము. |
| ,, | 563 | మోహపాశంబు | ప్రేమబంధము. |
| 282 | 644 | మన మేలువార్త | మన ఈ అశుభవార్త; (వ్యతిరేకాలంకారము) |
| ,, | 653 | సంతసపు పల్కు లేమియు లేవు | నీ నోట ఒక్క సంతోషవాక్యమైనను రాదు. |
| 283 | 673 | పువువలెనొరగె | పూవులు వాసనచూచి పూవువలె ఒరగుట ఇచ్చటి స్వారస్యము. |
| ,, | 692 | ప్రమథులు | శివభక్తులు; (అలరాజు శైవుడు) |
| 285 | 750 | సురళించి | పరలోక రక్షగా నివాళించి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 286 | 756-57 | ఘనసేను పాన్పుపై పవళించి | మునుపు ఆ రాజు శయ్యపై అనురాగముతో సవళించినట్లు. |
| ,, | 761 | సంధింప | ముట్టింపగా, |
| 295 | 60 | బాలమల్దేవు | మలిదేవుని కుమారుడు, బిరుదురాజు |
| ,, | 76 | పట్టభద్రులు ముగురు | రాజకుమారులు (అన్న దమ్ములు ముగ్గురును) |
| 296 | 92 | కొత్తైగాండ్లు | వేగువాండ్రు. వారు సమ యమువచ్చినపుడు వేగుకు బోయెదరు కాని ఇప్పుడు బండ్లుత్రోలుచున్నారు. |
| ,, | 93 | పదెవాగితేజీలు | జీను మొదలైన సవరణలు వేసిన గుఱ్ఱములు |
| 298 | 163 | జాతవేదుని | అగ్నిహోత్రుని |
| 300 | 211 | రణరంగపట్టపు రాజువై | యుద్ధభూమికినీవు పట్టాభి షిక్తుడవై |
| ,, | 221 | కుంభము | అన్నపురాశి |
| 301 | 226 | పోతుతోగాపుజెల్లించి | పెద్దఎనుబోతును బలియిచ్చి |
| 301 | 238 | అందెల బసవన్న etc. | మందపోతులో ఆవుల ముద్దు పేర్లవలె ఇవి ఎద్దుల ముద్దు పేర్లు. |
| 302 | 260 | పహెచెప్పుకొనుచు | గుణగణనమును చేయుచు |
| ,, | 271 | పైబారదివిచి | దిగదుడిచి |
| 303 | 278 | కంకణమ్ములు కట్టి | చేతులకు యుద్ధదీక్షాకంక ణములు కట్టి |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 303 | 301 | తోడికోడంౘ్రుడును తోడియేరాంౘ్రుడు | ఈ రెండు పదములకు ఒకే అర్థము; ఏలపునరుక్తముగా ప్రయోగించెనో తెలియదు |
| 304 | 307 | కుంటెనకత్తెలు | దూతికలు |
| 305 | 332 | పొలికలనిలో | యుద్ధభూమిలో |
| ,, | 336 | గుజ్జరి కడియములు | ఘూర్జర దేశీయులు ధరించెడి చేతి కడియములు |
| ,, | 341 | ఎంౙెరకండ్లు | రక్తరేఖలుగల కండ్లు; ఎర్రని జీరలుగల కండ్లు; (అదృష్టమునకు, పౌరుషమునకు చిహ్నములు) |
| ,, | 352 | ఎరుకలసాని | అచ్చటి భూతములకు అధినేత్రియైన శక్తి |
| 306 | 365 | మేరుకైవడి నిల్వ | మేరుపర్వతమువలె ధృతిచెడక నిలబడి యుండగా |
| ,, | ,, | మెచ్చిభూతములు | భూతములుగాని, క్రూరజంతువులుగాని నరుని ముందు బెదరించిచూచి, అతడు ధృతిగలవాడని గ్రహించినపుడు మెచ్చుకొనును |
| 307 | 395–96 | తెప్పలినాయుడు పెమ్మసాని, | కన్నమ తల్లిదండ్రులు |
| 308 | 432 | రుద్రవసుమతి | రుద్రభూమి |
| ,, | 433–441 | కూడని... కొర్వులును | పూర్వమచట జరిగిన యుద్ధ సంహార పరిశిష్ట పదార్థములు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 309 | 462 | శ్రీ వీరతిరుపతి చేయన లెనంచు | విష్ణు క్షేత్రము. ఈ వీరుల పేరుమీద కార్యమపురినివిష్ణు క్షేత్రముచేయవలెననుచు; |
| ,, | 463 | పదిలులై | నిశ్చలులై |
| 310 | 466-67 | పుట్టింప ... పాల లోచనుని | బ్రహ్మ పుట్టింప, విష్ణు దేవుడు రక్షింప, శివుడు పాలియింప; |
| ,, | 481 | సంకుని | శంఖమున |
| 311 | 503 | ఏకార్ణవంబుగా | సప్త సముద్రములు ఏకమగు నట్లుగా; |
| ,, | 504 | పునుక | పుఱ్ఱె; కపాలము |
| 312 | 530 | జలధిసోముడు | సోముడనే ఈ రాజు జలధిలో ఒక ద్వీపమునకు రాజు కాబోలు. ఇతడు ధూర్జటి అను పేరుగల అతని శత్రువుతో పోరాడి మడిసి యుండును. |
| 312 | 542 | శోధించితివి | పాపక్షాళనము చేసితివి; పావనము చేసితివి. |
| 313 | 561 | కలనికి కర్త్రియై ఘనమైన శక్తి | సంగరాధిష్ఠాన దేవత;(వెనుక చెప్పిన ఎరుకలసాని మాత్రము కాదు.) |
| 313 | 570 | ద్విజములుప్పొంగ | పక్షులు ఆనందము చెందగా: తెల్లవారు నప్పటి మొదటి ఆనందము పిట్టలదే. |
| 315 | 631 | సర్పాఖ్యతటిని | నాగులేరు; |
| ,, | 632 | ఘనగంగ .. మడుగు | గంగధార అనుమడుగు; నాగు లేటినీరువచ్చి కలసిన మడుగు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 316 | 636 | నిలిపిరి ... తోడ | తమ పేర తామే మహేశుము నకు ముందు లింగప్రతిష్ఠలు చేసికొనిరి. |
| ,, | 643 | కుధరారి | ఇంద్రుడు; పర్వతములకు శత్రువు |
| 317 | 690 | తగటు కూసంబులు | పాముకూసమువంటి సన్నని జరీబట్టలు |
| 318 | 702 | నడకట్టు | నడుము బిగువునకై కట్టు కొనెడిపటకా (Belt) |
| ,, | 705 | పావాలు | పావకోళ్ళు |
| ,, | 706 | కటికవారలు | రాజుముందరనిలిచి, "పరాకు అవధారు" అని హెచ్చరించెడి చోపుదారులు |
| ,, | 708 | వేత్రహస్తులు | వెండిబెత్తము పట్టుకొని రాజులముందర బరాబరి చేయుచు నడచువారు; |
| 319 | 727 | గణకసమూహంబు | లెక్కలను వ్రాయువారు (Accountants) |
| ,, | 728 | కనుపెట్టి యుండ్రి | రాజుమీద చూపు పెట్టి యుండిరి. |
| ,, | 739 | ఇగిరించునట్లు | చిగిరించునట్లు |
| 320 | 741 | నాటకజనుల్ | నాట్యపాత్రలు; అభినయ పాత్రలు. |
| ,, | 755 | వర్ణించిచూడ | నాట్యకత్తె అందమును సభ వారు తమలోతాము వర్ణించు కొనుచు చూచుచుండగా |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 320 | 768 | కైముడె కట్నముల్ | కైమోడ్పునమస్కారములు; అవియే కట్నముగాసభవారికి సమర్పించి; నాట్యకర్త తొలుతచేసెడి సభా నమస్కారమును ఈ విధముగా రూపించినాడు. |
| 321 | 793–95 | మాచెర్ల ... చేయ | మాచెర్లచెన్నునిమీాద సంస్కృతాంధ్ర భాషలలో వ్రాయబడిన పదముల అభినయము. |
| ,, | 800 | భట్టును | రాయబారి భట్టును |
| 322 | 819 | గతమైనచోటు | నశించిన చోటు |
| ,, | 820 | శ్రీశైల భూమిలో | శ్రీశైల సీమలో |
| 323 | 838–854 | పాడౌను ... అధికమైయుండు | యుద్ధమువలని కీడు వర్ణింపబడినది. ఇందలి అర్థము ఆనాడెంత సత్యమో ఈనాడును అంతియె సత్యము. |
| ,, | 841 | బండారము | కోశాగారము |
| ,, | 842 | రాణువ | సేన |
| ,, | ,, | రహి | ఉత్సాహము |
| ,, | 843 | చేజీతగాండ్రు | కైజీతగాండ్రు; రాజసేవకులలో కొందరు వృత్తులు పుచ్చుకొని బ్రతికెడువారును, కొందరు రొక్కము పుచ్చుకొనెడివారు నుందురు. కైజీతగాండ్రు ఈరొక్కపు జీతగాండ్రు. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 323 | 850–52 | శారద ... మరాళంబులు | కీర్తిని తెల్లనిదని వర్ణించుట కవిసమయము. కర త్నాల మేఘము, శంఖము, నురుగు, పాదరసము, వెన్నెల, స్ఫటికపు రాతికొండ, హంసలు – ఇవి తెలుపురంగు కలవి గనుక పోలికకు గైకొనెను. |
| 324 | 868 | ఉభయవాదులవారు | ఉభయపక్షములవారు |
| ,, | 881 | పూర్వకార్యముల పుట్టుక మరచి | గడిచిన కార్యముల మొదటి కారణమును ఎరుగక |
| ,, | 884–90 | అనరాదు ... యేలుకొమ్మనుము | ఈవాక్యములలో నలగాముని భావమిది: "నేను వారి భాగము వారికిచ్చినను వారు దానిని దక్కించుకొనలేరు. ఏమన, వారికి ప్రజలలో పలుకుబడిలేదు. సేనయు లేదు. చేతనైనచో నేను భూమినిచ్చితినే అనుకొని, ఏలుకొమ్మనుము చూతము" సవాలుగా పలికిన ఈ వింత పలుకులకు భావము తెలియక నాయకురాలు, రాజు నిజముగానే, భూమినిచ్చుచున్నాడేమో అనుకొని అతనిని తన దారికి త్రిప్పుకొనుటకు మంతనము సాగించెను. |
| 325 | 901 | ఘనవిచారము | ఉత్తమమైన ఆలోచన |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 325 | 904–5 | సిరి ... నీతికాదు | రాజులు సంపద పంచుకొన వచ్చునుకాని అధికారము పంచుకొన కూడదు. |
| ,, | 917–18 | కూడిగుంపైనను చింతక్రిందికి లేరు | వారందరు గుమిగూడినను గున్నచింతచెట్టు వైశాల్యము పట్టుకు చాలరు. |
| 326 | 919 | మూకంత ... లేదు | వారి మూకంతయు ఒకవరి మడి మూలపట్టుకు రాదు. |
| ,, | 927 | ఉత్తలము | ఆవేగము; నలగాముని మాటలలో వ్యక్తమైన దంతయు ఆవేగమే. |
| ,, | 930–33 | సంధి కేతెంచిన ...హీనవర్తనుడ | ఇంత కఠినముగా పలుకుట రాయబారికిగల చనవువలన; ఉన్న సత్యమును సందేశ వాక్యములనుపలుకు టకురాయబారికి అధికారముకలదు. అతడు అప్పట్ల అవధ్యుడు. |
| 327 | 954 | చెడనాడ | దూషింప |
| ,, | 963–64 | చిరునక్క ... సాగించినట్లు | గుంటనక్కమదించి చీదరగొని చత్రాతిమీద తలపడునట్లు; ఇట్టిదే గొఱ్ఱెపోతు కొండను డీకొనునట్లు అనుసామెత. |
| ,, | 968 | స్వాతి కొక్కెరలు | ఇవి స్వాతికార్తెలో గుంపులు గుంపులుగా వచ్చును; ఈ కార్తె శరదృతువులోనిది. |
| ,, | 968 | సొళ్ళము | డేగ |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 327 | 976 | నీదునాగమ్మ | ఈప్రయోగము సం భిప్రాయము |
| 328 | 985 | దయచేసినాడు | దయచూపినాడు; దైవము నీయెడల కలదు–బ్రతికిపోతివి. |
| ,, | 996 | కట్నము లిచ్చి | ఎంతపరుష వాక్యము లాడు కొన్నను రాయబారిని మర్యాద చేసి పంపుట సంప్రదాయము |
| ,, | 1005 | లగ్గలుపట్టుట | త్రాళ్ళ నిచ్చెనలుగా వేసికొని ఎగబ్రాకుట; (To scale the walls) |
| 329 | 1015–19 | పంక్తుల నన్నంబు ... వెల్లరకిపుడు | బంట్లు, చిన్నచిన్న దొరలు, రాజుతో పంక్తిభోజనము చేసెడి రాజబంధువులు, రొక్కము జీతముగా పుచ్చుకొనెడివారు, మాన్యము లనుభవించెడివారు, గ్రామములనుభవించెడివారు, అవసరము వచ్చినపుడు తాత్కాలికముగా బత్తెము లిచ్చి ప్రోగుచేయబడినవారు. |
| ,, | 1019 | ఎలగోలుప్రజలు | మ్రుక్కడిమూక (Hirelings) |
| ,, | 1029 | గద్దనలు | బెదరింపులు |
| 330 | 1050 | చులకనికోల | తేలికైన కఱ్ఱ |
| ,, | 1051 | తమకాన | ఉద్రేకముతో |
| ,, | 1054 | ఆ ధారిద్ర్యయుతులు | ఆ దరిద్రులు |
| 331 | 1065 | మనసుకుగాదు | తలచుటకైనను అర్హముకాదు |
| ,, | 1069 | భక్షణలేదు | తిండిలేదు. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 331 | 1075–76 | ప్రతిమలచేసె | నాయుడు బొమ్మలనాడించి నట్లు వారిచే ఈ నాటకమా డించుచున్నాడు. |
| 332 | 1094–1103 | బ్రహ్మనాయుని ... చెన్నునియాన | నలగాముడు మనుజేశులకు వ్రాసినలేఖలలో మొదట భేదోపాయమును తుదిని దానోపాయమును గర్భితము లై యున్నవి. |
| ,, | 1104 | బాసపత్రములు | ప్రమాణ పత్రములు; శ్రీగిరీశుని ఆనగా, చెన్నుని ఆనగా మనము ఏకమై ఈ భూముల నేలుకొందమనుట యిందలి ప్రమాణము. |
| 333 | 1120–22 | అరవ ... మనుజేశులకును | ఈ పేర్ల పట్టిక సమయసిద్ధమైన ఆచారమును బట్టి వ్రాయబడెను. ఇందు చారిత్రక సత్యము లేదు. |
| ,, | 1130–1137 | సవతి ... భూమేలవలెను. | కాముడు గెలిచినచో కప్పములు చెల్లించ నక్కరలేదనెడి ఆశయే, వారిని ప్రేరేపించినది. సాధారణముగా స్వార్థపరత్వములేని యుద్ధసహాయ ముండదు. |
| 336 | 1204 | వజ్రాంగులు | కవచములు |
| ,, | 1205 | బొమ్మిడికము | ఎత్తైనకుళ్ళాయి (Helmet) |
| ,, | 1214 | బరువులుదేమ | బరువులు తెచ్చుటకు |
| 337 | 1235 | కర్మములు | కరణీయములు |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| 337 | 1247 | కంథలు | బొంతలు |
| 338 | 1251 | చౌడోలు. | అంబారి |
| ,, | 1266 | తపనీయవలయముల్ | బంగారు కడియాలు; ఏనుగు దంతమునకు బంగరుపొన్నులు తొడుగుదురు. |
| ,, | 1271 | శృంగారము | అలంకారము |
| ,, | 1275 | కుంభి | ఏనుగు |
| 339 | 1306 | సందుగానివ్వక | ఎడమీయక |
| 340 | 1321 | ఏకాధిపతివౌచు | ఏకచ్ఛత్రాధి పతివగుచు |
| ,, | 1328 | బహుజాగ్రదాత్మ | మిక్కిలి మేలుకొని యుండు బుద్ధితో (Alert-minded) |
| 341 | 1336 | ఆడుపాపలు | నాట్యకత్తెలు |
| 342 | 1376 | శక్తి... దెలుప | ప్రజలకు తమ అభిప్రాయము చెప్పు అవకాశమున్నది; కాని వారి పలుకుబడి పరిమితము. |
| ,, | 1385 | వలసలు దీయంగ వలదు మీకు | మీరు గ్రామములు విడిచి పోవలదు. |
| 344 | 1424-25 | గురియైనట్టి చేరువ కాండ్రు | ఆదర్శప్రాయులైన సన్నిహితులు |
| ,, | 1436 | కార్యఖడ్గంబులు | ఆలోచనలు; యుద్ధము. |
| 345 | 1442 | జవనకంఖాణముల్ | వేగముగల గుఱ్ఱములు. |
| 345 | 1459 | నేతైనబంట్లు | నిగ్గుదేరినభటులు |
| 346 | 1475 | పదివేలపతియైన | వెయ్యిసైన్యమునకు అధిపతి; ఆ రాజు ఇంత ధనము కలవాడని ఇన్ని ఫౌజులకు అధిపతియని చెప్పుట పరిపాటి; (C. F.) నవలక్ష కళింగాధిపుడు. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 1480 | గట్టుభూములు | పర్వత ప్రాంతములు; పీఠ భూములు; (High-lands) |
| ,, | 1487–88 | ఎనుబదిమీంట ఎనిమిదివేలు | 88 వేలు |
| ,, | 1496 | ఇరవులుచేసె | బసలు ఏర్పాటు చేసెను |
| 347 | 1513 | దారిద్ర్యమన్నది దండులో లేదు | ఈ రహస్యము సార్వజనీనము, సార్వకాలికము |
| ,, | 1515 | వేలంబు | శిబిరము; సేనలు విడిసిన చోటు |
| 348 | 1543 | బలభద్రరఘుపతి | కొమ్మరాజునకు ధనుర్విద్యాచార్యుడు |
| ,, | 1550 | దొనవెళ్ళదిగిచి | అమ్ములపొదినుండి పైకితీసి |
| 349 | 1562 | కంబంబుగాచె | కంబమునుగ్రుచ్చుకొని ఆవలకు దూసికొని పోయెను. నాల్గుప్రక్కల పగ్గములతో బిగించి యొంటిస్తంభముపై డేరాల నెత్తుచుండెడివారు; కనుక బాణముతగిలి కంబము పడి గుడారము కూలిపోయినది. |
| ,, | 1569 | కోల్పోయి చేపట్టు | చేతిపట్టుతప్పి |
| ,, | 1579 | కార్తాంతికులు | జ్యోతిష్కులు |
| 357 | 9 | దయతోడ నిచ్చి | గెలిచిన పందెపు సొమ్ములను స్నేహితుల కిచ్చి. |
| ,, | 13 | నా యాత్మ సుతులారా | ఆమె, తన కొడుకుతోపాటు అతని మిత్రులనుకూడ సుతుల వలె చూచెను. |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 14 | పద్మనాభుని | బ్రహ్మనియొక్క |
| 358 | 30 | కుటిలజంతుల | క్రూరమృగములను;పూర్వకాలమున,క్రూరజంతువులను ఒంటొంటితో పోరించి, వాటితో మల్లురను పోరించి వినోదించుట రాజుల వేడుకలలో ఒకటి. |
| ,, | 49 | వెరచెయు వెరవసి | ఆమె, ఆ మాటయందలి అపాయ మెరుగును. |
| 359 | 61 | పుట్టరా... పుణ్యాంగనలకు | వారు, నావంటి పుత్రులుగల వారుకారా? |
| ,, | 63 | పాప మనుభూతముగును | ఆ పాపము వారే అనుభవింతురు. |
| | 65 | పెట్టనితావుల ... దాచెదవు | పిల్లి పెట్టినచోటున పెట్టకుండ తన పిల్లలను దాచునట్లు, నన్ను దాచెదవు. (గండుపిల్లి బారిపడకుండ, పిల్లి, తన కూనలను ఏడు చోటుల దాచునట.) |
| 360 | 88 | ఓజ | బత్తుడు: లోహకారుడు |
| ,, | 89 | బొంగరంబులు కొన్ని | సాధారణమైన బొంగరములు. |
| ,, | 93 | గండుభీమన | ఐతమ్మతండ్రి. |
| ,, | 96 | గండుకన్నమ | ఐతమ్మ సోదరుడు |
| ,, | 98 | చెనటి బొంగరములు | విలువలేని బొంగరములు. చిలిపి బొంగరములు (Silly top) |

| పుట | పంక్తి | పదము | |
|---|---|---|---|
| ,, | 101 | పెద్దలతీరు | కుల సంప్రదాయము |
| 362 | 130 | ఎరుకచేమించి | జ్ఞానముకల్గి |
| ,, | 132–35 | పొంది ... అమరుచు నుండు | భోగానుభవము, క్రమముగా తృప్తికి, వెక్కసమునకు, రోతకు, వైరాగ్యమునకు కారణమగును. |
| ,, | 142 | నిర్వాణమందిక యగును | మోక్షము చేతికి అందును. |
| 363 | 160 | నా ముద్దుసుతకు | నా ముద్దు సుతునకు |
| ,, | 163 | తాం నీయననెను | నే నీయననెను |
| ,, | 165 | మొట్టడి వేసితి | పట్టుపట్టితివి; |
| ,, | 168 | అతివను | కన్యను |
| ,, | 178 | ఊడిగీలు | నౌకరులు |
| , | 182 | తూర్పారనెత్తి | తూర్పారబట్టి; (తూరనెత్తి, పొల్లుపోవుటకై ధాన్యాదులనుగాలికెగురబోయునట్లు.) |
| ,, | 185 | అధికమౌతూమొకటి | మామూలు కొలత కంటె ఎక్కువ కొలత పట్టెడి ఒక తూము; (ఇక్కడ తూము అనగా మానికవంటి కొల్త సాధనము) |
| 364 | 187–188 | కళ్ళ ... కోరుచును | పంటను నూర్చి ఎత్తిన తర్వాత, కళ్ళము అడుగున నున్న తాలుతప్ప గింజలను పాలేరునకు వదలి పెట్టుట ఆచారము; కళ్ళవడుగుఅతని భాగము; అదికూడా తనకే కావలెనని మా అన్నకోరెను. |

